శ్రీ

# వివేకానంద జీవిత చరిత్ర


రచయిత:

చిరంతనానందస్వామి

(పూర్వాశ్రమమున మాధవచైతన్య బ్రహ్మచారి)



1944







శ్రీ రామకృష్ణ మఠము

మైలాపూరు, మద్రాసు

మద్రాసు శ్రీ రామకృష్ణమఠాధ్యక్షునిచే
ప్రకటింపబడినది.
మూడవ కూర్పు
1944
సర్వస్వామ్యసంకలితము

ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారిచే (1945, '46-వ సం॥) ఉభయభాషా ప్రవీణా ప్రాథమికపరీక్షలకును, అన్నామలై విశ్వ విద్యాలయమువారిచే 'ఇన్టర్ మీడియేట్'నకు (1945, '46-వ సం॥ పరీక్షలకు)ను, మద్రాసు విశ్వ విద్యాలయమువారిచే 'ఇన్టర్ మీడియేట్'నకు (వరుసగా 1944,'46,'47-వ సం॥ పరీక్షలకు)ను ఉపపాఠ్యగ్రంథముగా నియమింపబడినది.

వెల రూ. 2-4-0

చెన్నపురి,
'వావిళ్ల' ముద్రాక్షరశాలయందు
ముద్రింపబడినది.
7—x x—44

# తొలినుడి

వివేకానందజీవితము వ్రాయుటకు మఱియొక వివేకానందుడు కావలయును. ఏలన, "వివేకానందు డేమి యొనర్చెనో మఱియొక వివేకానందు డుండిన గ్రహించియుండెడివాడు..." అని మహాసమాధి నొందుటకుముందు స్వామియే తనలో తా ననుకొనుచుండ ప్రేమానందు డను సోదరశిష్యుడు వినియుండెను. తన సందేశమునుగూర్చి స్వామి యిారీతినే మఱియొకప్పుడు, "ఈశరీర మేమైన నేమి? జనులకు పదునైదు వందల సంవత్సరముల పర్యంతము ఆచరించుటకు వలయు సందేశము నొసగియున్నాను" అని వచించెను.

భారతదేశభక్తులలో వివేకానందస్వామినిగూర్చి యెఱుగనివారుండరు. భారతదేశభక్తులకే కాక, భారతవర్షపునర్నిర్మాణకర్తలకెల్లరకును స్వామి మార్గదర్శకుడు. "నాదేశమున నొక కుక్కయైనను పస్తుపడియున్నంతవఱకు దాని కాహారమిడి రక్షించుటయే నాపరమధర్మము, ఇదియే నామతము; తద్భిన్నమంతయు అధర్మము, కృత్రిమధర్మము." "...సమస్తజీవస్వరూపుని, అద్వితీయుని,...విశేషము...నా యార్తనారాయణుని, నాదీననారాయణుని, సమస్తదేశీయుల కెల్ల పేదయగు నా భారతనారాయణుని,—నాయిష్టదేవత నర్చించుటకై ఎన్ని జన్మములైన నెత్తెదనుగాక, ఎన్నివేలబాధలనైన ననుభవింతునుగాక" యని ప్రకటించి, అన్నదాన విద్యాదాన జ్ఞానదానములచే నేడఖండదేశసేవనేకాక, ప్రపంచసేవను సల్పుచున్న శ్రీరామకృష్ణమఠ సేవాసంఘములను స్థాపించిన దేశభక్తాగ్రగణ్యుడు, విశ్వమానవప్రేమపూరితుడు వివేకానందస్వామి.

జ్ఞాన కర్మ భక్తి యోగములకు స్వామి సంపూర్ణసమన్వయ స్వరూపుడు, ద్వైతాద్వైతవిశిష్టాద్వైతాదిసిద్ధాంతములకు అపూర్వసమరసమూర్తి, ప్రాచ్యపాశ్చాత్యవిజ్ఞానవాహినులకు సముద్రుడు. అఖిలప్రపంచమతమహాసభా వేదికపై సనాతన ధర్మవిజయధ్వజస్థాపన మొనర్చి, పశ్చిమఖండమున దనమహోప న్యాసవిజయ యాత్రానంతరము మాతృదేశమునకు విచ్చేసి నంతనే ఆసేతుహిమాచలము భారతీయులు స్వామి కొసగిన యఖండగౌరవాన్వితస్వాగతములే యిందులకు దార్కాణము. వేయేల, వివేకానందునివ్యక్తిత్వము అనన్యసామాన్యము, ఆతనిపాండితి సర్వతోముఖము. కానిచో, "ఈమహనీయుని యెదుట మన విశ్వవిద్యాలయపండితోత్తములు కేవలము పసి బాలురు!" అని పాశ్చాత్యమేధానిధులు కీర్తించియుందురా? "అఖిలప్రపంచమతమహాసభలో వివేకానందుడు అగ్రగణ్యుడ నుట నిస్సంశయము," "ఆతడు ఈశ్వరప్రేరిత మహావక్త" (He is an orator by Divine Right) "వేదాంతిశిరోభూష ణము" (The Paragon of Vedantins) "హైందవఝంఝా మారుతము" (The Hindu Cyclone) అని యీవిధముగా ప్రకటించియుందురా? వివేకానందునివ్యక్తిత్వమునుగూర్చియు మూర్తిమత్త్వమునుగూర్చియు వ్రాసినచో ఈయుపోద్ఘాతమే ప్రత్యేక మొక గ్రంథమగును. 'జగ మెఱిగిన బ్రాహ్మణునకు జంధెమేల' యనునట్లు నిజముగా వివేకానందస్వామిజీవితము నకు ఉపోద్ఘాతము అనావశ్యకము: ఐనను నారచనమునకు గొంతవఱకు ఆవశ్యకము కావచ్చును.

స్వామిజీవిత సందేశములనుగూర్చి దేశదేశాంతరము

లలో అనేక సద్గ్రంథములు వెలసియున్నవి. * అందు ముఖ్యముగా స్వామి ప్రాచ్యపాశ్చాత్యశిష్యులచే బ్రకటింపబడిన పూర్వగ్రంథములను ప్రస్తుతగ్రంథములను బరిశీలించి, స్వామి జీవితచరిత్రను సుబోధమగుశైలిలో సమగ్రముగా బ్రదర్శింపవలయునను నభిలాషతో ఈగ్రంథమును వ్రాసియున్నాడను.† దివ్యావేశజనకములగు స్వామిప్రవచనములు చాలవఱకిందు పొందుపఱుపబడినవి. విశేషము, స్వామిబాల్యజీవితమును ఈ గ్రంథము ప్రస్తుతాంగ్లగ్రంథములకంటెను విపులముగా దెలుపును. చాలవఱకు వ్రాతప్రతిని జదువగా విని ప్రశస్తమగు కొన్ని విషయములను దెలిపిన రావుసాహేబు కందుకూరి మల్లికార్జునము (రిటైర్డ్ డెప్యూటీ కలెక్టర్) గారికి నాకృతజ్ఞతాభివందనములు.

ఆంధ్రలోకము ఈ గ్రంథము నాదరించుగాక!

శ్రీ రామకృష్ణమఠము
చెన్నపురి
10-11-'39

గ్రంథకర్త

---

* కాకినాడలోని పిఠాపురమురాజావారి కళాశాలలో అధ్యాపకులును నామిత్రులును సహపాఠులు నగు శ్రీ ఖులుసు వేంకటేశ్వర్లు (ఎమ్. ఏ.) గారిచే మధురగంభీరశైలిలో విరచితమగు శ్రీవివేకానందస్వామి జీవితము స్వామిచరిత్రలో నాకు పరిచయము గలిగించి, శ్రీరామకృష్ణమఠమున జేరు భాగ్యము నందుటకు సాధన భూతమైనది.

† ఇందలి ముఖ్యసంఘటనములను గొన్నిటిని స్వామి సోదరశిష్యులును కొంతకాలము శ్రీరామకృష్ణమఠసేవాసంఘాధ్యక్షులును మద్గురువర్యులును కీర్తిశేషులునగు శ్రీవిజ్ఞానానందస్వాములవారివలనను స్వామిప్రియశిష్యులును ప్రస్తుతము శ్రీరామకృష్ణమఠసేవాసంఘాధ్యక్షులునగు శ్రీవిరజానంద స్వాములవారివలనను వినియున్నాను.

## మలికూర్పు

ఈ మలికూర్పున ముఖ్యసంఘటనములను బలపఱుచు మఱి కొన్ని విజ్ఞాపికలు (పుటలదిగువను) జేర్పబడినవి. కాగిత ముల వెల పెరుగుటచే పటములను తగ్గింపవలసివచ్చినది. ఆంధ్ర, అన్నామలై, మద్రాసు విశ్వవిద్యాలయములవారు ఈ గ్రంథ మును విద్యార్థులకు పాఠ్యగ్రంథముగా నియమించినందులకు వారికి కృతజ్ఞులము. ఆంధ్రభాషాయోషకు నూతనాలంకార మని నుడువుచు పండితోత్తము లనేకు లీపొత్తముపై శుభాశం తలను జల్లియుండుట ముదావహము.

శ్రీ రామకృష్ణమఠము
చెన్నపురి
28-10-'42

ప్రకాశకులును
గ్రంథకర్తయు

## మూడవకూర్పు

ఇందు మఱికొన్ని పాదదీపికలను (Foot Notes) చేర్చుటయే కాక, గ్రంథమును పరిశోధించి పరిష్కరించియున్నాము. కాగితములవెల విశేషముగా పెరుగుటచే చిన్నయక్కరముల నుపయోగింపవలసి వచ్చినది; వెలయు కొంచెము హెచ్చింప వలసి వచ్చినది. ఈగ్రంథముద్రణవిషయమున మాకు సహాయ భూతులై, సకాలమున చక్కగా ముద్రించియిచ్చిన శ్రీ 'వావిళ్ల' ముద్రణాలయమువారికి కృతజ్ఞులము.

శ్రీ రామకృష్ణమఠము
చెన్నపురి
జూన్ '44

గ్రంథకర్త

# విషయసూచిక

# వి ష య సూ చి క

# విషయసూచిక

# పండితాభిప్రాయములు

ఈ గ్రంథము దివ్యముగా వ్రాయబడినది. విషయము ఉత్కృష్టముగను విపులముగను—సవివరమయ్యును—మనోరంజకముగను ఉన్నది. పద్దెములల్లుటకంటెను కష్టతరమని చెప్పదగు గద్యరచనమున ఈ గ్రంథకర్తకు మంచినైపుణ్యము కలదు. రచనావిధానమున చక్కనిమార్పులను జేయుచు ఈయన తనశైలిని పోషించును. ఔచిత్యముట్టిపడు మాటలను సమాసములను జాతీయములను ఏర్చికూర్చును. ఈయనశైలి వాగాడంబరపూర్వక సంస్కృత పదభూయిష్ఠము కాదు, అట్లని వాక్పాటవము కుంటువడిన నిస్సారమగు తెలుగు కాదు.

ఈయనరచనను మనఃపూర్వకముగా నభినందించుచు ఈగ్రంథము ప్రతిగృహమునను భాండాగారమునను వెల యునని నమ్ముచున్నాను. మనవచనరచయితలలో మేలు బంతు లనదగువారియం దీగ్రంథకర్త యొకడై తేజరిల్లును.

శ్రీవివేకానంద లేఖావళిని, ఈవివేకానందజీవితచరిత్ర రీతినే శ్రీరామ కృష్ణపరమహంస జీవితమును ఈయన తెనిగించినచో సంతసింతును. శ్రీమాధవ చైతన్యుని (శ్రీచిరంతనానందస్వామి) వంటి ప్రతిభాశాలియు దిట్టయు నగు రచయిత మనకు లభించెగదా యను గర్వసంతోషములు నన్నిట్లు వ్రాయబురి కొల్పుచున్నవి.... శ్రీరామకృష్ణ వివేకానందగ్రంథావళిని శ్రీమాధవచైతన్య బ్రహ్మచారి యనువదించునెడల మనవాఙ్మయమున కెంతయు నుత్తేజవంతము లగు పాత్తములు లభించును....

(సం.) కట్టమంచి రామలింగారెడ్డి.

...శ్రీ...బ్రహ్మచారిగారు శ్రీ...స్వామి...జీవితచరిత్రను...రచి యించి తెలుఁగువారికి, మఱియూ సాహిత్యమునకు మహోపకారమొనరించిరి....

(సం.) శ్రీ విక్రమదేవవర్మ.

...ఆంధ్రదేశమున...విద్యార్థులు...తప్పక యీగ్రంథమును జదువ వలయునని నాయభిప్రాయము....అమూల్యమైన యీగ్రంథ మాంధ్రసారస్వత మునకు నూతనాలంకారమని చెప్పుట సత్యమేకాని అతిశయోక్తికాదు.

(సం.) చిలకమర్తి లక్ష్మీనరసింహము.

...ఈగ్రంథము తెలుఁగువారియింటింటను ఇలువేల్పుగా నుండదగినది.

(సం.) వేలూరి శివరామశాస్త్రి.

...శ్రీ బ్రహ్మచారిగారు తమ తపోమహిమచేతనే యీగ్రంథము నిట్లు రచించియున్నారని నానమ్మకము....

(సం.) శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

...ఇందలి రచనానైపుణ్యాదులకు మిక్కిలిగా నానందించితిని....

(సం.) చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి.

...రచనారీతి దివ్యసుందరము...శ్రీ వివేకానందస్వామివారి యసమానవాగ్వైభవమును వంచినుడికారపుటొడుపుతో శ్రీ చిరంతనానందులు తెలుగున ప్రదర్శించిరి. వివేకానందుల వాఙ్మయమూర్తికి వీరి తెలుగుచేత యలంకృతి....

(సం.) వేటూరి ప్రభాకరశాస్త్రి.

...ఇందలిభాష సలక్షణము, సులభతమము, అత్యంతమృదుమధుర పదభూయిష్ఠము.

(సం.) జనమంచి శేషాద్రిశర్మ — త్రిలిఙ్గ.

...శ్రీ వివేకానందుని విశిష్టజీవితము...లలితమధురసాహిత్యభాషలో నిరూపించిన మీ కావ్య...శక్తికి నమోవాకములు.

(సం.) శ్రీ మాధవరాయ శర్మ.

...శ్రీ వివేకానందజీవితచరిత్రమును...చదివి అమందానందము నందితిని. మీరచనావైదగ్ధ్యము స్తుత్యము. పాఠకుని వశీకరించుకొను ఒకానొక యవ్యక్తమధురమంత్రశక్తి ప్రతిపదమున, ప్రతిసమాసమున నాకు గోచరించినది....

(సం.) జి. జాషువ.

...ఆంధ్రసారస్వతమున కీగ్రంథము నూతనాలంకారము....

(సం.) కొత్ర శ్యామల కామశాస్త్రి.

మీగ్రంథము నెంతయో సంతసముతో జదివితిని....

(సం.) ఎస్. రాధాకృష్ణన్.

...గొప్పసారస్వతము....

(సం.) జటావల్లభుల పురుషోత్తము.

...ఇందు రసవంతముకాని యొక్కపొల్లుమాటకూడ లేదు....ఆంధ్ర సాహిత్సేవ యొనర్చుచున్న ప్రతివిశ్వవిద్యాలయమును యువజను లీదివ్యచరితమును జదువ నవకాశమును గల్పించి తనబాధ్యతను నిర్వహించుగాక !

(సం.) వెదురుమూడి కృష్ణరావు.

(ప్రభుత్వమువారి ప్రధానాంధ్రానువాదకులు)

...ఈగ్రంథరాజమునందలి భాషాశైలి మృదుమధురము....ఈగ్రంథమును జదువునపుడు హృదయ మానందతుందిలమగుచుండును....కనుగొనలనుండి యానందాశ్రువులు రాలుచుండును. హస్తమున నున్నపుస్తకము పట్టువీడి యొడిలోఁబడుచుండును....ఈగ్రంథరాజము ప్రత్యాంధ్రకుటుంబమునందును స్త్రీపురుషులచేఁ దప్పక పఠింపఁబడవలయునని మాయభిలాష.

(సం.) కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి, (సం.) కా. సుబ్బయ్యశాస్త్రి.

—ఆంధ్రసాహిత్యపరిషత్ పత్రిక.

...ఎంతో తపస్సానరించి వీ రీపుస్తకమును రచించిరని గ్రంథమును పరీక్షించినపుడు తెల్లమగును....పాఠశాలలలో జదువు విద్యార్థులకేని నిక్కముగ పఠనీయగ్రంథముగానుండఁదగినది. భావమును వలచు శైలితో గ్రంథమొప్పుచు సర్వాంగసుందరమైయున్నది....

(సం.) జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి.—భారతి.

...ఈగ్రంథము చరిత్రరచనములో నొకవిశిష్టతను గల్పించుచున్నది. నిర్దుష్టమైన రచన—ధారాళమైనశైలి—మధురమంజులములగు భావములు—గలిగి చదువుట కెంతయో ఉత్సాహము పుట్టించుచున్నది.

(సం.) మ. సత్యనారాయణశాస్త్రి —ఆంధ్రి.

...చారిత్రికరచనములలో నిది ప్రధానగణ్యమై యలరారుచున్నది. ...ఇందలివిషయ మెంత మహత్తరమైనదో, రచనమును అంతటి మహత్తరమై యొప్పుచున్నది.

(సం.) నార్ల వేంకటేశ్వరరావు—ఇన్డియన్ ఎక్స్ప్రెస్

ఇంకను ఇట్టి ప్రశంస లనేకములు కలవు.

ఓమ్

నమో భగవతే శ్రీరామకృష్ణాయ

# శ్రీ వివేకానంద జీవిత చరిత్ర

## మొదటి ప్రకరణము

## వంశ చరిత్ర

దుర్లభమగు మానవశరీరమును దాల్చి శాశ్వతానంద ప్రదమగు మోక్షమును బొందుటకై సాధన యొనర్పనివాని జీవితము నిరర్థకము. వేదశాస్త్రము లిట్లు చాటుచున్నను, తాపత్రయమను సంసారసాగరతరంగనిరంతరఘోషచే లోకులు వినజాలరు. విషయసుఖములందలి వ్యామోహముచే ఆత్మజ్ఞానసాధనలందు వారికి అభిరుచి కలుగజాలదు. అజ్ఞానాంధకారజీవన మభ్యాసమగుటచే పరమాత్మజ్యోతిని దర్శింప జాలరు. ఇక వీరు తరించు టెట్లు? నిత్యానిత్యవస్తు వివేకముచే సర్వసంగపరిత్యాగ మొనర్చి, సత్యసందర్శనైకవాంఛచే బ్రహ్మచర్యవ్రతము దాల్చి, సంసారసాగరమునుండి తాము తరించుటయేకాక పరులను తరింపజేయుటకై తమ జీవితసర్వస్వములను సమర్పించునట్టి భగవదంశసంభూతులగు మహాత్ములు సర్వజనులకును మార్గదర్శకులై వెలయుచుందురు. శ్రీవివేకానందస్వామి యిట్టిమహనీయులలో ప్రధానగణ్యుడు. వేదవేదాంతసందేశామృతము నొసగి ప్రాచ్యపాశ్చాత్యప్రపంచములను బునరుజ్జీవింపజేసిన యీమహనీయుని లోకోత్తర చరిత్రము సర్వజనపఠనీయము కదా!

కలకత్తాలోని సిమ్లాయనుపేటయం దీతనివంశీయు లనేకశతాబ్దములుగ సిరిసంపదలతో తులతూగుచు దాతృత్వమునకే కాక పాండిత్యమునకును, శక్తి

సామర్థ్యములకును గూడ ప్రఖ్యాతివడసియుండిరి. వీరు కాయస్థక్షత్రియులు. ఈవంశమునకు దత్తవంశ మని పేరు. మన కథానాయకుడగు వివేకానందునకు వివేకానందసామ్రాజ్యము నొసగిన సుగుణసంపత్తి యెట్లు చేకూరెనో గ్రహించుట కాతని పూర్వవంశీయుల చరిత్ర మనకు దోడ్పడును. సంస్కృత పారసీకభాషలయం దసమానపాండిత్యము గడించి, న్యాయశాస్త్రపారంగతుడై సాంసారికజీవితౌన్నత్యము కరతలామలకమయ్యును విడనాడివైచి, యిరువదియైదేండ్లు నిండకమునుపే సర్వసంగపరిత్యాగ మొనర్చిన దుర్గాచరణదత్తు ఈతని పితామహుడు. దుర్గాచరణునకు విశ్వనాథు డనుపుత్త్రు డుండెను. విశ్వనాథజనని విశ్వనాథసమేతయై కాశీవిశ్వనాథుని సందర్శింప గోరి తీర్థయాత్రకు వెడలెను. పొగబండ్లులేని యాకాలమున నామె నావపై బ్రయాణము చేయుచుండ మీది కెక్కి యాటలాడుకొనుచున్న విశ్వనాథుడు కాలు జారి గంగా ప్రవాహములో బడెను. ప్రాణభీతిని పుత్త్రప్రేమకు బలియొసగి, తల్లి తత్క్షణమే అగాధజలములందు దుమికి, పుత్త్రుని గట్టిగా బట్టుకొనెను. మాతృప్రేమ యెంత యగాధమో కదా! తోడనే నావికులు వారిని రక్షించిరి.

దుర్గాచరణునిధర్మపత్ని కాశీక్షేత్రమును జేరి వివిధదేవాలయములను దర్శించుచుండెను. ఒకనా డామె విశ్వనాథాలయమునకు బోవుచు కాలు జారి పడి స్మృతి గోల్పోయెను. చెంతనున్న యొక సన్న్యాసి అవ్వన నేతెంచి యామెను లేవదీసెను. తనకు సాయ మొనర్చిన పరివ్రాజకుడు తన భర్తయగు దుర్గాచరణుడే యని గ్రహించిన యామె యాశ్చర్యానందముల నెవరు వర్ణింపగలరు? ఇరువుర హృదయములందును భావతరంగములు పొంగి పొరలెను. "అహా! మాయ! మహామాయ!!" యనుచు యతిపుంగవు డదృశ్యుడయ్యెను! ఆమెయు తనయాత్రలకై మరలెను.

విశ్వనాథుడు పెరిగి పెద్దవాడై పారసీకాంగ్లభాషలందును న్యాయశాస్త్రమునందును ప్రావీణ్యము గడించి వంశానుగతమగు న్యాయవాదవృత్తి నవలంబించెను. అచిరకాలముననే న్యాయశాస్త్రమునం దాతని పేరు నలు

దిక్కులందును వ్యాపించెను. విశ్వనాథుని భోగభాగ్యవైభవములచే దత్త వంశము ప్రభువంశమని పేరుగాంచెను. మఱుసటిదినమునుగూర్చి తలపక అడిగినవారి కెల్ల దానధర్మము లొనర్చు మహాదాత విశ్వనాథుడు. పంక్తిని పదుగురు లేనిదే యాత డెన్నడును భుజించి యెఱుగడు. దరిద్రులందును దీను లందును విశ్వనాథుని ప్రేమము వర్ణనాతీతము. వారాతని తమపాలిటి దేవుడని భావించువారు. అల్పులందును అనర్హులందును గూడ తాను జూపుచుండిన యాదరణమునకై కుమారుడగు నరేంద్రు డొకప్పుడు తన్ను ఆక్షేపింప, కారుణ్యమూర్తియై యాతడిట్లు వచించెను: "నాయనా! మానవజీవితమహా ఘోరయాతనలు నీ కేమి తెలియును? త్రాగుటచే క్షణకాలమైనను తమ దుఃస్థితిని మఱవ జూతు రీనిర్భాగ్యులు. ఈదీనులపై జాలి నొందుటయా నా మహాపరాధము?" ఏమి దీనజనవాత్సల్యము! ఇట్టి కారుణ్యపయోనిధిపుత్రుడై జన్మించిన వివేకానందుడు దరిద్రనారాయణసేవకై తనజీవితమును ధారపోసి నచో నం దాశ్చర్య మేమున్నది?

బిడ్డలకు సత్ప్రవర్తనము గఱపుటలో విశ్వనాథుడు కడు నేర్పరి. కుమారుడగు నరేంద్రు డొకప్పుడు తల్లిని తిరస్కరించినందులకై యాతని దండింపక, "నరేంద్రబాబు నేదినమున తల్లి నిట్లు నిందించెను:——" అని బాలు డాడిన పరుషవాక్యముల నాతని గదిగోడమీద వ్రాసెను. నరేంద్రు డాగదిలో ప్రవేశింప బోవునపు డెల్ల తన వాక్పారుష్యము కట్టెదుట కాన్పించుచుండు టచే వెంటనే పశ్చాత్తాపము జెందెను.

విశ్వనాథుని భార్యయగు భువనేశ్వరీదేవి విశ్వనాథునకు దగిన సహ ధర్మచారిణి. నిత్యము రామాయణమహాభారతములను పారాయణ మొనర్చుచు వానిలోని విశేషభాగములను కంఠస్థమొనర్చుకొని యామె రామాయణ మహా భారతసారమును నరేంద్రున కుగ్గుబాలతో బోసెను. నరేంద్రుని దేశభక్తా గ్రగణ్యుడగు జాతీయవీరు నొనర్చిన దాతని మాతృబోధామృతమే యని చెప్పనొప్పును.

*

## రెండవ ప్రకరణము

## వివేకానంద జననము

సద్గుణరాశి యగు భువనేశ్వరీదేవి పరమేశ్వరవరప్రసాదమున దనకు పుత్రుడు లభింపవలయునని పూజలొనర్చుచుండెను. వంశాచారము ననుసరించి బంధుగురాలగు నొక వృద్ధవనితచే కాశిలో వీరేశ్వరశివున కామె ప్రార్థనాన్వైవేద్యముల నర్పింపజేసెను. ఇట్లు శివపాదారవిందార్పితహృదయయై కాలము గడపుచు నొకనా డామె యొక దివ్యస్వప్నమును గాంచెను:—లోకమంతయుం ప్రశాంతిమయమై నిశ్శబ్దముగా నుండెను. భువనేశ్వరీదేవి పరమేశ్వరపాదారవిందములను దాకిన సమయ మిదే యని తెలుపుచు కైలాస లోకమున ఘంట మ్రోగెను. పరమేశ్వరుడు తనదివ్యధ్యానమునుండి వెలువడి పుత్రస్వరూపమున నామెకు బ్రత్యక్ష మయ్యెను. నిద్రనుండి యామె మేల్కాంచెను. తాను గాంచిన దివ్యదర్శనము మిథ్యాభూతమగు స్వప్నమా? కాదు. అది యథార్థసందర్శనము.

సర్వేశ్వరా! జగద్రక్షకా! భక్తజనాభీష్టమును సహస్రవిధముల సఫల మొనర్చువాడవు నీవే కదా!

భువనేశ్వరీమాతకు పుత్రు డుదయించెను. నాడు 1863-వ జనవరి 12-వ తేదీ. ఆదినము సర్వజనానందకరమగు మకరసంక్రాంతి. నా డుద యించిన బాలుడు సనాతన ధర్మమహాసాగరము నుప్పొంగజేయుటకై, వేదాంత మతప్రకాశమును ప్రాచ్యపాశ్చాత్యఖండములం దంతటను వ్యాపింపజేయుటకై ఈశ్వరాంశసంభూతుడై యుదయించిన బాలచంద్రుడని యెఱుగకయే భారత జనసహస్రము ఆపర్వదినమున నమందానందసాగరమున నోలలాడెను!

ఆబాలుడు దినదినప్రవర్ధమాను డగుచుండెను. వీరేశ్వరాంశసంభూతు డగుటచే భువనేశ్వరీదేవి యభీష్టము ననుసరించి యాతనికి వీరేశ్వరుడని పేరిడిరి. వీరేశ్వరుడే పిమ్మట 'నరేంద్రుడు'* అని నామాంతరము నొందెను. ఆతనిని 'నరేన్' అనియు 'బీలే' యనియు ముద్దుపేరులతో బిలుచుచుండిరి.

* జన్మించిన రాశినిబట్టియు భువనేశ్వరీదేవి యభీష్టము ననుసరించియు ఈతని కిడబడిన నామము 'వీరేశ్వరుడు'; నామకరణసమయమున ఈతడు పొందిన నామము 'నరేంద్రుడు.'

## మూడవ ప్రకరణము

## నరేంద్రుని బాల్యము

నరేంద్రుడు అల్లరి బిడ్డడు. పోరు పెట్టినయెడల ఆతని నెవ్వరును ఊరడింప జాలకుండిరి. "తిన్నగా నుండనియెడల శివుడు నిన్ను కైలాసమునకు రానీయ"డని బెదరించుచు బాలనరేంద్రుని భువనేశ్వరీమాత చలినీటిధార క్రింద గూర్చుండబెట్టును. నరేంద్రుని శాంతింపజేయుట కిది యామె కని పట్టిన మార్గము! మఱియు నట్టిసమయములందు శివనామము నాతని చెవిలో నుచ్చరించినను ఊరట చెందును. ఎట్లైనను భువనేశ్వరీదేవి విసువుజెంది, "పుత్రునికోసము శివుని బ్రార్థించితిని. కాని శివుడు తన భూతగణములలో నొకనిని నాకొసగినా"డని వచించును! బాలనరేంద్రుని యూరడించుట కిరువురు దాదులుండినను సాధ్యము కాకుండెడిది.

నరేంద్రునకు బైరాగు లనిన ముచ్చట. బైరాగి కనబడినంతనే నరేంద్రుడు పరమానందభరితు డగును. ఒకనాడొక బైరాగి, 'నారాయణ హరి! నారాయణ హరి! భవతి భిక్షాం దేహి' యని విశ్వనాథుని యింటిగుమ్మముకడ నిలుచుండెను. నూతనవస్త్రాలంకృతుడై ముద్దు లొలుకుచుండిన బాలు డది చూచి వెంటనే తనయొద్దనున్నరుమాలు దీసి బైరాగికి అర్పించెను. సర్వసంగ పరిత్యాగసాగరమున సంగమించున దిట్టి త్యాగవాహినియే కదా. బైరాగి యావస్త్రమును కన్నుల కద్దుకొని, "జయ పరమేశ్వర!" యని వెడలిపోయెను. "రుమాలు ఏమైన"దని భువనేశ్వరి గద్దింప, "బైరాగి యాచించెను: ఇచ్చి వేసితి"నని బాలుడు సమాధానము చెప్పెను. నాటనుండియు బైరాగి కనబడినంతనే నరేంద్రుని గదిలోబెట్టి తాళము వేయుచుండెడివారు. నరేంద్రుని త్యాగవాహిని కది యొక యాటంకమా! చేతికి దొరకిన వస్తువుల నాతడు సాధుబైరాగులకొఱకై కిటికీలగుండ అవలకు ద్రోసి యానందించును.

బాల్యచేష్టలచే నరేంద్రుడు తన సోదరీమణులను విసివించును. అతడు పెట్టు బాధలను పడజాలక వా రాతని పట్టి కొట్టుటకై తఱుమగా నాత డపరిశుద్ధప్రదేశములలోనికి బోయి నిర్భయుడై, "రమ్ము, ఈసారి రమ్ము" అని వెక్కిరించుచుండెడివాడు. ఇంటియావుతో నాత డాటలాడును. మఱియు బెంపుడుపావురములు, నెమలి, మేక, కోతి మొదలగు జంతువులుకూడ నరేంద్రుని బాల్యస్నేహితులే. తమ గుఱ్ఱపుబండి తోలువా డాతని ముఖ్యస్నేహితుడు. కుచ్చుతలపాగ జుట్టుకొని, కొఱడాకఱ్ఱను జేపట్టి, యున్నతాసనమున గూర్చుండి రెండుగుఱ్ఱములబండిని తోలువానిని జూచి యాత డానందపడుచుండును. "ఇదియే నాకోర్కె" యని వచించును! నిజమే. ధర్మదండమును జేపట్టి, జ్ఞానశిఖరము నధిరోహించి, గుర్వాజ్ఞను తలదాల్చి, మానవసహస్రతురంగశకటములను నడపిన నరేంద్రు డట్లు కోరుట న్యాయ్యమే కదా!

బిడ్డల విద్యాభ్యాసము తల్లి యొద్దనే ప్రారంభమగును. వంగీయగుణితమును అంగ్లపదములను నరేంద్రుడు తల్లియొద్దనే నేర్చెను. తల్లి చెప్పు రామాయణమహాభారత కథల నమితాసక్తితో వినువాడు. బాల్యముననే భక్తిబీజము అతని హృదయమున నాటుకొనెను. శ్రీరామచంద్రుని దివ్యచరిత్రము తన్నాకర్షింప నాతడు సీతారామవిగ్రహములను గొని పూవులతో బూజింపసాగెను. మేడమీదనున్న గదిలో సీతారాములను నిల్పి, పూలతో నలంకరించి, యొకనా డాతడు తలుపులు బిగించి, విగ్రహములయెదుట గూర్చుండి ధ్యానింప నారంభించెను. తల్లిదండ్రు లంతట తమ ముద్దుబిడ్డనికొఱకై వీథులన్నియు దిరిగి యెందును గానక తుదకు మేడమీదనున్న గది మూయబడి యుండుట గాంచి తలుపు గ్రుద్దిరి;—పలుక లేదు. గట్టిగా నఱచిరి;—బదులు లేదు. అంత వారు భీతిచెంది తలుపు పగులగొట్టి లోనికి బ్రవేశించిరి. నరేంద్రుడు నిశ్చలధ్యాననిమగ్నుడై యుండెను!

పాలు కాఱు పసిబిడ్డ డేమి! నిశ్చలధ్యాననిమగ్నత యేమి! ఇదియే కదా అనేకజన్మసముపార్జితతపఃఫలము!

ఎవ్వరో పెండ్లి యనర్థహేతువని నిరసించుచు సంసారయాతనలు దుర్భరములని వచించుట నరేంద్రుడు విని భయకంపితు డయ్యెను. "పెండ్లియే యిన్ని బాధలకును మూలమైన, దేవు డెందుకు పెండ్లియాడవలయును?" అని వితర్కించుకొని, సీతారాముల విగ్రహముల నావల బాఱవైచి యాతావున శివుని బ్రతిష్ఠించెను. మదనాంతకుడగు శివుని వైరాగ్య మాతని నాకర్షించి యుండనోపును.

బంగరుపూలతో గూడిన యెఱ్ఱని పట్టురుమాలు మొలకు జుట్టుకొని, చిందులు ద్రొక్కుచు, "నేను శివుడను, చూడు అమ్మా! నేను శివుడను" అని నరేంద్రుడు తల్లితో వచించుచు. శివప్రసాదమున దనకు లభించిన వీరేశ్వరుని యా ముద్దుపల్కులు వినునప్పు డామె యానందము నెవరు వర్ణింపగలరు? ధ్యానమువలన శిరోజములు జడలు కట్టి శివుని జటాజూటమువలె నుండునని నరేంద్రున కింటిలోనివారు జెప్పిరి. ఇక నాతడు పద్మాసనమున గూర్చుండి, కండ్లు మూసికొని ధ్యానింప నారంభించును. కొంతసే పైనంతనే తల జడలు కట్టెనో లేదో యని తడవి చూచుకొనును. జడలు కట్టమి మఱల ధ్యానించి, "యెంతసేపైనను శిరోజము లెదుగనే లేదే!" యని విచారించును. అంత తల్లి భువనేశ్వరి యాతని నోదార్చును. మఱియొకప్పు డాతడు, "అమ్మా! తిన్నగా నున్న పక్షమున శివుడు నన్ను మఱల కైలాసమునకు రానిచ్చునా?" యని యడుగ, "అభ్యంతర మేమి?" అని వచించి, యంతలో దుర్గాచరణుని వృత్తాంతమును స్మరించి, "తాతగారివలెనే యితడు కూడ సన్న్యసించును గాబోలును" అని భీతి చెందును. తల్లులు తల్లులే కదా!

బాల్యమునుండియు నిట్లు భగవచ్చింతాపరాయణుడగు నరేంద్రునకు రామాయణశ్రవణ మనిన పరమానందము. ఇరుగుపొరుగున నెక్కడ రామాయణపఠనము జరిగినను నరేంద్రు డక్కడ నుండవలసినదే. హనుమంతు డరటితోటలలో నివసించునని విని, యొక రేయి యాత డింటికిబోవుట మాని, దగ్గఱనున్న యరటితోట కరిగి హనుమత్సందర్శనమునకై చాలసే పందు వెదక

సాగెను. తుదకు విఫలమనోరథుడై యింటికి వచ్చిన బాలుని వృత్తాంతమును విని, "బీలే! రామకార్యార్థియై యాత డెచటికో వెడలియుండును. మఱి యొకప్పుడు కానవచ్చును లెమ్ము" అని తల్లిదండ్రులు బాలు నోదార్చిరి.

నరేంద్రుని నిద్రావిధాన మత్యద్భుతము. కండ్లు మూతలు పడినంతనే భ్రూమధ్యమున నొక దివ్యజ్యోతి వివిధకాంతులతో బ్రత్యక్షమై విజృంభింప నారంభించును. నరేంద్రు డాకాంతిపుంజమున మునిగి బాహ్యస్మృతి వీడును, నిత్యము ఇదియే యాతని నిద్రావిధానము. నరేంద్రునకు శ్రీరామకృష్ణసందర్శనము లభించిన పిమ్మట, "నిద్రపోవునపుడు నీ కేదైనను జ్యోతి కానవచ్చునా తండ్రీ!" అని యాతడు ప్రశ్నించి, నరేంద్రుని సమాధానమును విని, "ఈతడు ధ్యానసిద్ధు"డని వచించెను.

ధ్యానము నరేంద్రునకు బాల్యక్రీడ. తోడిబాలురతో నాత డొక నాడు ధ్యానముద్రలో గూర్చుండియుండ పెద్ద త్రాచుబా మొకటి వారి యెదుట బ్రాక సాగెను. బాలు రది చూచి భయకంపితులై నరేంద్రుని లెమ్మని కేకలిడుచు పాఱిపోయిరి. పరమేశ్వరధ్యాననిమగ్నుడగు నరేంద్రునకు బాలుర కేకలు ఎట్లు వినబడును? అతడు కదల లేదు. పాము కొంతసేపటికి వెనుకకు మఱలెను. నరేంద్రుని తల్లిదండ్రులు "పామును జూచి నీవేల పాఱి పోలే"దని ప్రశ్నింప, "పామో, గీమో, నాకాగొడవయే తెలియలేదు. ధ్యానములో నా కప్పు డెంత హాయిగా నుండెనో!" యని వచించెను.

విద్యావాచస్పతియైన నరేంద్రునకు ఆఱవయేట విద్యారంభము జరుపబడెను. పురోహితుడు సమంత్రకముగా నరేంద్రుని సరస్వతీదేవి కొప్పగించి, బాలుని కుడిచేతితో నొకమసిబొగ్గు పట్టించి, నేలమీద కఖాలు వ్రాయించెను. పిమ్మట నరేంద్రుడు దారమునకు గట్టబడిన రెల్లు కలము మొలనుండి వ్రేలాడుచుండ, చిన్నచాపను చంకక్రింద బెట్టుకొని, నూతన వస్త్రాలంకృతుడై పాఠశాలకు బయలుదేఱెను. కొంతకాలమైనంతనే అచ్చట దుష్టబాలక సహవాసమువుటచే తల్లిదండ్రు లాతని కింటియొద్ద ప్రత్యేకోపాధ్యాయుని నియమిం

చిరి. తోడిబాలు రింకను గుణితములతో బెనగులాడుచుండ నరేంద్రుడు చదువు టయు, వ్రాయుటయుం జక్కగా నేర్చెను. సంస్కృతవ్యాకరణమగు ముగ్ధబోధ వ్యాకరణమును రామాయణమహాభారతములం దనేకభాగములును నరేంద్రున కేడవయేటనే కంఠస్థములు. రామాయణగాన మొనర్చు గాయకులు కొంద ఱొకప్పుడు తమ యింటికి రాగా, బాలనరేంద్రుడు వారి కథనమునందలి తప్పు లను దిద్ది వారి కాశ్చర్యము గొల్పెను.

నరేంద్రు డేకసంథాగ్రాహి. గురుసమక్షమున బాలు రందఱిలో నాతడు కండ్లు మూసికొని నిశ్చలుడై కూర్చుండువాడు. ఈవిచిత్రప్రక్రియ జూచి గురు డాగ్రహపరవశుడై యొకప్పుడు, "ఏల యీమాంద్యము" అని నరేంద్రుని చేతులు పట్టుకొని విదిలించి, "పాఠము నొప్పగింపుము" అనెను. గంటక్రింద జరిగిన పాఠమును నరేంద్రుడు 'తు, చ' తప్పకుండ నొప్ప గించుట చూచి యాగ్రహపరవశుడగు నాత డాశ్చర్యనిమగ్ను డయ్యెను.

రాత్రి నరేంద్రుడు బంధువగు నొక ముదుసలితాతయొద్ద పరుండెడి వాడు. అతడు సంస్కృతభాషాపారంగతుడు. ప్రతిదిన మాత డమర శ్లోకములను బాలునకు జెప్పి యమరకోశమును జాలవఱ కాతనిచే గంఠస్థము చేయించెను. సంస్కృతభాషాపేటిక యనదగు నమరకోశ మాతని కిట్లు బాల్యముననే వశమై యుండుటచే నరేంద్రుడు కాలక్రమమున సంస్కృతవిద్యాప్రవీణుడు కాగల్గెను. సమస్తభాషలలో సంస్కృతము అతి ప్రాచీనమైనది. భారతజాతీయ జీవనమను దివ్యవాహిని ప్రాచీనకాలమునుండి నేటివఱకును నిరాఘాటముగా ప్రవహించుచుండుటకు వేదశాస్త్రములను సంస్కృతభాషామృతవర్ష ధారలే యాధారములై యున్నవి. భారతీయవిజ్ఞాన మును బునరుజ్జీవింపజేయుటకు సంస్కృతభాషావ్యాప్తియే పరమసాధనము.

నరేంద్రుని భావోన్నత్యము బాల్యముననే ప్రతిఫలింప నారంభిం చెను. 1869-వ సంవత్సరమున నరేంద్రుని పినతాత కాళీప్రసాదదత్తు అవసానసమయమున కుటుంబమును సమీపమునకు బిలిచి, భగవత్కథాశ్రవ

ణము జేయగోరి, బిడ్డలను మహాభారతము చదువుడనెను. కాని యెవ్వరును సాహసింపరైరి. నరేంద్రు డంతట మహాభారతమును విప్పి, భక్తిజ్ఞానము లను పక్షములతో జీవు డాత్మైక్యభావమున కెట్లెగురునో సూచించెడు గరుడుని యూర్ధ్వగమనఘట్టమును శ్రవణానందకరముగాజదివెను. కాళీప్రసాదు డంతట నరేంద్రుని జేరబిలిచి, "నీకు మహోన్నతభావిదశ కల" దని వచించెను.

## బాల్యక్రీడలు

ప్రతిభావంతుడు పలువుర నాకర్షించుట సహజము కదా. వక్తలకు వక్తృపంచాస్యమై, పండితులకు విద్యావాచస్పతియై, ఆచార్యులకు అపర శంకరాచార్యుడై, ప్రజానాయకోత్తముడై ఖ్యాతి వహించిన భావివివేకా నందుడు బాల్యమున బాలబృందమునకు నాయకు డగు టాశ్చర్యము కానేరదు. నరేంద్రుడు నరేంద్రుడే యని తలపించుచు తోడి బాలురచే ఎల్లప్పుడును పరివేష్టితుడై యుండువాడు. నరేంద్రుడు తమనాయకుడని తోడి బాలురు గర్వించువారు.

మకరసంక్రాంతిదినమున నరేంద్రుడు తోడిబాలురను వెంటబెట్టుకొని గంగాభవానికి పూజలొనరించుటకై తండ్రి నడిగి పలసిన పైకమును వస్తువులను దీసికొని బయలుదేఱెను. ఉత్సాహచిహ్నములగు పతాకలను ధరించి, భజన చేయుచు, బాలు రందఱును బారులు తీరి నరేంద్రుని వెనుక నడచుచు, నది యొద్ద కేగి గంగామాతను పూవులతో పూజించిన నాటి యాదృశ్య మెంత మనోహరమో కదా!

ఆటలలో నరేంద్రుడే నాయకుడు. 'రాజసభ' యను నాటలో తోడి బాలురు సేనాధిపతులుగను, సామంతులుగను నుండ నరేంద్రుడు నరేంద్ర పదవి నలంకరించును. 'రాజాధిరాజా! ధర్మపరిపాలకా!' యని సంబోధించుచు నొకరి వెనుక నొక రాతనికి పాదాక్రాంతు లగుచుందురు. అరాజకత్వము నెంతమాత్రమును సహింపక రాజకీవితో నాతడు వారల క్షేమసమాచారముల నరయుచు న్యాయపరిపాలన మొనర్చును.

గోళీలతో నాడుట, దుముకుట, కుస్తీపట్టుట మొదలగు నాట లనిన నరేంద్రున కమితోత్సాహము. తోడి బాలురు తమ తగవులను దీర్చుటకై నరేంద్రుని మధ్యవర్తిగా నెన్నుకొనువారు. పోరాటము లనిన నాతని కసహ్యము. యుద్ధసన్నద్ధులగు నుభయపక్షముల మధ్య బాలనరేంద్రుడు ప్రేమ మూర్తియై నిల్చి వారిని శాంతింపజేయువాడు.

నరేంద్రు నిజనకుడు న్యాయవాది యగుటచే వ్యాజ్యెములనిమిత్తము అనేకు లాతని యింటికి వచ్చుచుండెడివారు. అప్పటిమర్యాద ననుసరించి ఆయావర్ణములవారికి ప్రత్యేకమగు 'హుక్కాలు' అమర్పబడుచుండెడివి. ఒక మహమ్మదీయుడు మాత్ర మొక మూల గూర్చుండి, 'అల్లావహో అక్బర్' అని హుక్కా పట్టుచుండువాడు. అంతలో బాలనరేంద్రుడు వారి మధ్య దుమికి జాతిమతవిపక్షతలను తెగద్రెంపి, ప్రతివ్యక్తి హుక్కా నొకసారి పీల్చుచుండెడివాడు. మహమ్మదీయుడు తన్నెక్కువగా బుజ్జగించుటచే గాబో లును నరేంద్రుని కాతడనిన నమితప్రీతి! అతని మామా యని పిలుచును. ఇంతలో తండ్రియగు విశ్వనాథుడు వచ్చి తన్నుమందలింప, "జాతిభేదములను మీఱిన నేమగునో చూచుచుంటిని" అని బదులుచెప్పును. విశ్వనాథుడు చేయునది లేక పక్కున నవ్వును!

ఆమహమ్మదీయుడు తాను పంజాబునుండి ఆఫ్గనిస్థానమున కొండలమీద విశేషప్రయాసతో జేయు దీర్ఘయాత్రలను మనోరంజకముగా ముచ్చటించుట నరేంద్రుడువిని, "మామా! నన్నుకూడ నీతో దీసికొని వెడలవా?" యని యడుగ, "ఇంకొక యంగుళము పెరిగిన వెనుక"నని యాతడు బదులు చెప్పుచుండును. ఆమహమ్మదీయుడు నరేంద్రునకు మిఠాయిలను బెట్టుచుండుట చూచి పూర్వా చారపరాయణు లలుచుచుండెడివారు. కాని విశ్వనాథుడు మాత్ర మది విరుద్ధ ముగా భావింపలేదు. అట్టి సందర్భములలో చిఱునగవే యాతని సమాధానము.

బాల్యచేష్టలలో నరేంద్రుని యుద్రేక మపరిమితము. తోడిబాలురతో నొకప్పు డాతడు పెనగులాడుచు పూజామందిరపు మెట్లమీదినుండి కాలుజారి

క్రిందపడెను. తలతాలికి తగిలి గాయ మయ్యెను. దానిచే గలిగిన మచ్చ కుడి
కంటి పైభాగమున జన్మాంతమువఱకు నుండెను. నరేంద్రుని గురుడైన శ్రీరామ
కృష్ణుడాదెబ్బనుగూర్చి, "నరేంద్రుని శక్తిసామర్థ్యము లా ప్రమాదమువలన
కొంతవఱకు నిరోధింపబడకయే పోయినచో నాతనివలన లోక మల్లలాడి
పోవును" అని వచించెను. నరేంద్రుడు లోకమును కంపింపజేయ లేదు, కాని
లోకోద్ధారకు డయ్యెను।

# నాల్గవ ప్రకరణము

## ప్రారంభవిద్యాభ్యాసము : గుణవికాసము

దినదినప్రవర్ధమానుడగు నరేంద్ర బాలచంద్రుని కల్యాణగుణ ప్రకాశమును దినదినప్రవర్ధమానము కాకుండునా? ప్రేమానురాగములకు నిలయమగు వినిర్మలహృదయమును శాస్త్రకళాకౌశలమునకు తావలమగు ధీశక్తియు ధైర్యసాహసములకు ఆకరమగు నచంచలాత్మవిశ్వాసమును బాల్యముననే నరేంద్రునియందు వికసింప నారంభించెను. రూపలావణ్యమునకు దోడగు నిట్టిసుగుణసంపదచే విరాజిల్లుచుండిన యాత డెల్లరకును ప్రేమపాత్రుడై యుండు టబ్బురము కానేరదు. నరేంద్రు డనినచో నిరుగుపొరుగువారల కపరిమితానందము—ఉత్సాహము. కన్నసుతునివలె వా రాతనియందు గారాబమును జూపువారు. నరేంద్రుడు వారలను వావివరుసలతో బిలుచును. స్త్రీల నాతడు 'అక్కా' యని సంబోధించును.

అన్నిటికంటెను మించిన దాతని బుద్ధివైభవము. 1870-వ సంవత్సరమున నరేంద్రుడు తన యేడవయేట ఈశ్వరచంద్రవిద్యాసాగరుని పాఠశాలలో మొదటితరగతియందు బ్రవేశించెను. ఆతని యసాధారణధీవైభవము ఉపాధ్యాయులకును తోడిబాలురకును వెంటనే గోచరించెను. కాని పట్టుమని పది నిముసములైనను నరేంద్రుడు తనయుపాధ్యాయుని సమక్షమున గూర్చుండెడివాడు కాడు. పాఠశాలను తన క్రీడారంగముగా పరిగణించును. పాఠములు జరుగుసమయమున గూడ తన స్నేహితులను రామాయణ మహాభారతకథలతోడనో, తన చమత్కారములతోడనో వినోదింపజేయుచుండును. అట్లు వినోదించుచుండగా నుపాధ్యాయు డొకప్పుడు, "నే నేమి బోధించుచుంటినో మరల చెప్పుడు" అని హఠాత్తుగా వారల నడిగెను. తోడిబాలురు నిశ్చేష్టులై యుండ నరేంద్రుడు ఉపాధ్యాయుని ప్రశ్నలన్నిటికిని సరియగు సమాధానము

లించిన వెనుక వారు శాంతించిరి. ఇట్లే మఱియొక యుపాధ్యాయుండు నరేంద్రుని భూగోళశాస్త్రమున బ్రశ్నించి, యాతడు తప్పెనని తలచి కఠినముగా గొట్టెను. కాని తరువాత తానే పొరపడితినని గ్రహించి గురువు క్షమాపణ వేడికొనెను. ఈసంఘటనములను నరేంద్రుని తల్లి భువనేశ్వరీదేవి విని, "తండ్రీ! నీయందు దోషము లేనిచో నీ కేమి భయము? ఏకట్టును నిప్పుండునో ఆ కట్టియే కాలును. నిశ్చయముగా నీకు న్యాయ్యమని తోచుదానిని వారిబ్రష్టా దులు అడ్డు వచ్చినను ఆచరించుట మానకు" మని,

శా. "నీతిప్రౌఢవిహారులైన నిపుణుల్ నిందింపనీ, మెచ్చనీ,
ఖ్యాతిం జెందిన సంపదల్ నిలువనీ, గాఢంబుగా సాగనీ,
ఘాతం బప్పుడ పొందనీ నియతిమై గానీ యుగాంతంబునన్
నీతిశ్లాఘ్యపథంబు దప్పరు గదా, నిత్యంబు ధీరోత్తముల్"

అని యుద్బోధించెను. నరేంద్రునిజీవితమను మహావృక్షము ఎన్ని ఘోరయాత నామారుతములనైనను నిర్భయముగా నెదిర్చి నిలువగలుగుటకు భువనేశ్వరీ మాత యొసంగిన బోధామృతమే మూలాధారము. "నా మానసికాభ్యుదయమునకు మాతల్లియే హేతుభూతురాలు" అని నరేంద్రుడు వివేకానందుడై వచించియున్నాడు.

మూఢవిశ్వాసమనినను, భయమనినను నరేంద్రునకు పరమాసహ్యము. ఆతడు తన స్నేహితుని పెరటిలో నున్న చంపకవృక్షము నెక్కి కొమ్మలను బట్టుకొని మొగ్గలు వేయుచు వినోదించుచుండెడివాడు. ఆయింటి ముదుసలితాత నరేంద్రు డావృక్షశాఖనూగులాడుచుండుట గాంచి, పూవులు రాలిపోవునని యో, బాలున కపాయము గలుగుననియో భీతిచే "ఆపని మానుము" అని చెప్పెను. ఏలమానవలయు నని నరేంద్రు డడుగ, చెట్టుపై నొక బ్రహ్మరాక్షసి కలదనియు, చెట్టెక్కినవారి కుత్తుకల నది కొఱికివేయుననియు వచించెను. తాతమాటలను తిరస్కరింపక యాతడు వెడలిన వెంటనే నరేంద్రుడు మఱల చెట్టెక్కి యూగులాడ నారంభించెను. నరేంద్రుని మిత్రుడొకడు ముదుసలి మాటలను నమ్మి యాతని నివారింప బోవ నాతడు, "ఏమి మూర్ఖుడవు నీవు!

ఆముదుసలి చెప్పిన మాటయే నిజమైనచో నాకుత్తుక చాలకాలము క్రిందటనే కొఱుకబడియుండెడిది!" అని బదులుచెప్పెను. మూఢవిశ్వాస మను నంధకారము నకు సూర్యోదయ మనదగు నిట్టి యచంచలాత్మవిశ్వాసమే ప్రపంచమత మహా సభావేదికపై, "ఏ విషయమును గాని గ్రంథములందు వ్రాయబడియున్నంత మాత్రమున నమ్మవలదు! ఎవ్వరోయొక రట్లు వచించిరనియు విశ్వసింపకుడు! యథార్థమును స్వయముగా గ్రహింపుడు! అదియే జ్ఞానము!" అని వివేకా నందుని ఘోషింపజేసినది.

ఈ బాల్యమిత్రుని తండ్రికి నరేంద్రునియం దమితప్రేమ. ఒకనా డాతడు చెట్టుకొమ్మలనుండి వ్రేలాడుచున్న నరేంద్రుని దనయింటికి బిలిచి, "ఇంటింటికి దిరిగి యాడుటతో కాలముగడపెదవా? చదువుసంధ్యలు వలదా?" యని మందలించెను. "నే నాడెదను; చదివెదను" అని నరేంద్రుడు వెంటనే సమాధానము చెప్పెను. ఆవృద్ధుడు ఊరకొనక పాఠపుస్తకములను దెప్పించి నరేంద్రుని బ్రశ్నింపసాగెను. అన్నిటికిని 'చకచక' బాలుడు సమాధానము చెప్పుట చూచి యాత డాశ్చర్యభరితుడై, "బాలుడా! నీవు మహాపురుషుడ వయ్యెదవు. భగవంతుడు నిన్ననుగ్రహించుగాత" మని వచించెను.

నరేంద్రుని తార్కికజ్ఞానము చిన్ననాడే వికసింప నారంభించెను. విశ్వ నాథుడు కలకత్తా విడిచి మధ్యపరగణాలలోని రాయపురమున కేగినపుడు ఆతని యింటి కనేకపండితులు వచ్చుచుండెడివారు. నరేంద్రుడు వారి ప్రసం గములను వినుచు, సమయము వచ్చినప్పు డెల్ల తనభావములను వాక్చాతుర్య ముతో వెల్లడించువాడు. కాని యెంత వృద్ధులైనను తనయభిప్రాయములను తూలనాడినచో నాతడు సహింపడు. మానధను లాత్మగౌరవహాని నెట్లు సహింతురు? వంగభాషాప్రవీణుడగు నొకవృద్ధునితో నరేంద్రుడొకనాడు చర్చ లోనికి దిగి, ప్రమాణగ్రంథములనుండియు శాస్త్రములనుండియు శ్లోకములను గురియించుచు నుపన్యసింప నారంభించెను. ఆశ్చర్యచకితుడగు ఆపండితుడు బాల నరేంద్రారవిందముకుళమునందే వివేకానందవికచారవింద సౌరభమునుగ్రహించి, "బాలుడా! నీకీర్తి జగద్వ్యాప్తమగుదినములు వచ్చి తీరును" అనివచించెను.

# ఐదవ ప్రకరణము

## తల్లిదండ్రుల శిక్షణము

పద్మమును, సరోవరమును ఒండొంటిచే ప్రకాశించు రీతిని సత్పుత్రునిచే వంశమును, సద్వంశముచే బుత్రుడును శోభిల్లుచుండును. అట్టిసత్పుత్రుడు నరేంద్రుడైనచో అట్టిసద్వంశము దత్తరాజవంశము. మఱియు నరేంద్రుని సహజసౌశీల్య మాతని జననీజనకుల శిక్షణమున పరిపూర్ణాభివృద్ధిగాంచెను. భువనేశ్వరీమాత యాతని కిట్లుపదేశించెను : "తండ్రీ! ప్రాణభయము కలిగినను అసత్య మాడకుము. నలువురచేతను ఇంత మంచివాడు లేడనిపించుకొనుము. సదుద్దేశములను విడువకుము. పరుల యభిప్రాయములను ఆదరింపుము. ఇతరుల స్వాతంత్ర్యముతో నెన్నడును జోక్యము కలుగజేసికొనకుము. కాని యవసరమైనప్పుడు అఖండధైర్యసాహసములను జూపుము." ఏమి యుపదేశామృతము! సమస్తశాస్త్రసారామృత మిదియే కదా. ఇట్టిమహోపదేశసుధారసము నొసంగి తమబిడ్డల శీలమును బోషించు తల్లు లెవ్వరు? మాతృవాక్యరత్నములను శిరసావహించి నరేంద్రుడు తనజీవితమును జాజ్వల్యమాన మొనర్చెను.

"ఇతరుల స్వాతంత్ర్యము నరికట్టకు"మను మహోపదేశము ననుసరించి నరేంద్రుడు కాలక్రమమున దనయొద్ద కేయేజాతిశిష్యులు వచ్చినను వారివారి స్వభావానుగుణముగా నభివృద్ధి జెందునట్లు హెచ్చరించెనే కాని తనయభిప్రాయములను శిరసావహింపవలయునని విధింపలేదు. స్వాతంత్ర్యనాశకమగు నవీనవిద్యావిధానము నాతడు తీవ్రముగా నిరసించెను. స్వాతంత్ర్యభావములే వివేకానందుడై యాతడు ప్రపంచమున కొసగిన సందేశామృతసాగరమునందలి మహోత్తుంగతరంగములు.

నరేంద్రుడు మాతృభక్తిపరాయణుడు. భువనేశ్వరి నాతడు సాక్షాత్ భువనేశ్వరియని భావించెను. మాతృవాక్యమాతనికి వేదవాక్యము. మాఱువల్కు-

లెన్నడును లేదు. "మాతృదేవత నారాధింపని మానవుడెన్నడును ఉన్నతిపొంద" డని యాతడు వక్కాణించియున్నాడు. సన్న్యసింపవలయునని పరితపించు చున్నను, దారిద్ర్యపీడితమగు కుటుంబమున కనుకూలపరిస్థితులను గల్పించి భువనేశ్వరీమాతను తృప్తిపఱుచువఱకును నరేంద్రు నిల్లువెడలనీయలే దాతని మాతృభక్తి. పశ్చిమదేశదిగ్విజయయాత్రానంతరము మాతృదేశమునకు వచ్చి, యఖండవైభవాన్వితములగు స్వాగతములనడుమ వివేకానందుడు తల్లికి జబ్బుగానున్నదని దివ్యదృష్టిచే గ్రహించి, యామె క్షేమముగా నున్నదని తంతి వార్త వచ్చువఱకును మనశ్శాంతి నందలేదు.

ఇట్లే జనకుడగు విశ్వనాథునియందు నరేంద్రున కమితగౌరవభావము. నరేంద్రుని హృదయవికాసమునకు భువనేశ్వరి హేతుభూతురాలైనచో నాతని నిరుపమానధీవికాసమునకు గారణభూతుడు విశ్వనాథుడు. పుత్రునితో నాత డనేకవిషయములనుగూర్చి చర్చించి బోధించువాడు. కంఠస్థముచేయు టయే జ్ఞానసాధనము కాదనియు, విమర్శనశక్తి నభివృద్ధిపఱుచుకొనుటయే అందులకు ముఖ్యసాధనమనియు నాతడు బోధించెను. హేతువిమర్శచే వివిధ విషయములందలి సామాన్యధర్మములను గ్రహించి వానిని సమన్వయించు శక్తి సామర్థ్యములు నరేంద్రునకు జనకునిమూలముననే అభివృద్ధిగాంచెను.

విశ్వనాథుడు ఉదారహృదయుడు. జాతిమతవివక్షతలకంటె మానుషత్వమే ఔన్నత్యహేతువని యాతడు విశ్వసించెను. ఐనను జాతీయజీవన విధానములను విడువక స్వమతాచారధర్మముల ననుసరింపవలయునని యాతని భావము. నరేంద్రున కిట్టి సద్భావము లన్నియు జనకునిమూలమున బాల్యము వననే అలవడియెను.

## ఆఱవ ప్రకరణము

# బాల్య విశేషములు

ఆడుచు, పాడుచు, తోడిబాలురతో నెకసక్కెము లాడుచు, వినోదించు నరేంద్రుని బాల్యోత్సాహమే ఆతని జీవితగానమునందలి ప్రధాన స్వరము. ఎట్టివిషమపరిస్థితులలోనైన నాతఁ డుత్సాహవంతుడై నిరుపమాన ధైర్యమును బ్రకటించెనే కాని, నిరుత్సాహదైన్యములనునవి చూపి యెఱుగఁడు. ఇట్టి ధైర్యోత్సాహములే నరేంద్రుని వివేకానందపట్టభద్రు నొనర్చినవి.

విద్యాభ్యాసమున నరేంద్రుని చాకచక్య మత్యద్భుతము. పాఠములను జదివి యొప్పగించుట కాతని కొకగంటచాలును. మిగిలినకాల మంతయుం ఆటలకై వినియోగింపబడును. ఎప్పటికప్పుడు నూతనక్రీడలను కనుగొని యానందించుటయే యాతనికోరిక. చిఱుతిండికై తల్లిదండ్రు లిచ్చుపైకము గోళీలకో, బంతులకో, బ్యాట్టులకో వినియోగింపబడును. ఇట్లు సంవత్సరమున తొమ్మిది నెలలు విలాసముగా గడపి పరీక్షలకు ముందే రెండుమూడు నెలలో పాఠములను జదువును. పరీక్షలలో నుత్తీర్ణుడగుట కింతకంటె విశేషకృషి యాతని కనావశ్యకము. ఆంగ్లము, దేశచరిత్ర, సంస్కృతము వీనియన్నిటియందును ఆతడు ప్రావీణ్యము జూపెను. కాని గణితమన్న నాతని కసహ్యము. తండ్రి విశ్వనాథునివలె గణితము నాతడు కోమటివృత్తిగా గణించువాడు.

నరేంద్రుని బుద్ధిబలమునకు దేహబలము దీప్తినొసగ నాత డొకవ్యాయామ మండలిని స్థాపించి యందు నిత్యము వ్యాయామసాధనల నభ్యసింపసాగెను. పిమ్మట మఱియొక వ్యాయామమండలిని జేరి యందు సాము, గరిడి, కుస్తీ మొదలగువిద్యలయం దారితేఱెను. వ్యాయామప్రదర్శనమునం దాత డుత్తమ బహుమానమును బడసెను. చిన్నతనముననే నరేంద్రుడు మల్లయుద్ధమున వెండి సీతాకోకచిలుకను బహుమానముగా బడసియుండెను.

వంటలో ప్రవీణత గడింపవలయునని నరేంద్రుడు తోడిబాలురచే

వంతులు వేయించి, తానును కొంతధనము వ్యయించి, చిత్రవిచిత్రపదార్థము లను జేయుచుండెడివాడు. నరేంద్రుని సంభాషణములవలెనే యాతడొనరించెడు పిండివంటలుకూడ రసవంతములై యుండుటచే బాలు రాతని కొనియాడు చుండెడివారు. ఐనను తీక్ష్ణమగు నాతనివాగ్ధాటివలెనే పిండివంటలును పచ్చి మిరెపకాయలధాటిచే కొంచెము 'చుఱ్ఱు' మనిపించుచుండెడివట!

కార్యనిర్వహణమున నరేంద్రుడు కడుచతురుడు. ఒకప్పు డాతనిమిత్రు లొక యాంగ్లనౌకను జూడగోరి స్థానికోద్యోగునాజ్ఞాపత్రము కావలసియుండుటచే తెమ్మని నరేంద్రుని ప్రోత్సహించిరి. నరేంద్రు డాతని జూచునిమిత్త మరుగగా ద్వారపాలకుడు "వీలులేదు పొమ్ము" అనియెను. అంత నరేంద్రుడు క్షణమాలోచించి, రహస్యముగా వెనుక భాగముననున్న మేడమెట్లెక్కి, యాంగ్లోద్యోగియొద్ద కేగి, తనదరఖాస్తుపై సంతకము చేయించుకొని వచ్చుచుండ ద్వారపాలకుడు, "ఎట్లు లోనికి బోయితి"వని ప్రశ్నించెను. నరేంద్రుడు "నాకు మ్యాజిక్ తెలియు"నని బదులుచెప్పెను!

వాక్చాతుర్యమునకు నరేంద్రుని జెప్పి మఱియొకని జెప్పవలయును. ఒకప్పు డొకక్రైస్తవమత ప్రబోధకుడు విగ్రహారాధనమును నిరసించుచు నుపన్యసించుచుండెను. విద్యావిహీనులగు సామాన్యులును, బాలురును ఉపన్యాసమును వినుచుండిరి. "మీవిగ్రహమును నాచేతికఱ్ఱతో బూజించిన నేమిచేయు"నని సభ్యుల నాతడు ప్రశ్నించెను. అసభ్యమగు నాతనిప్రశ్నకు సమాధానము చెప్పుట కసమర్థులై వా రూరకుండిరి. ఇంతలో కళాశాలామిత్రులతో నరేంద్రు డాదారిని బోవుచు నాగి, "నీదేవుని నేను దూషించినచో నేమి చేయు"నని యా పరమతాచారవిద్వేషణాచార్యుని బ్రశ్నింప నాతడు క్రుద్ధుడై, "నీ మరణానంతరము నరకాగ్నిలో ద్రోయు"నని బదులుచెప్పెను. "నీవు చచ్చినపుడు మావిగ్రహమును నిన్నట్లేచేయు"నని వెంటనే నరేంద్రుడు మాఱుపలికెను. ప్రబోధకుడు స్తబ్ధుడై నిలుచ్ఛక్రుద్ధుడై చుకొని చూడసాగెను. సభ్యులందఱును చప్పటులు గొట్టినవ్విరి.

నరేంద్రుని సౌశీల్య మతిబాల్యముననే ప్రకాశింప నారంభించెను. మిత్రులం దాతని కపరిమితప్రేమము. నరేంద్రునకు దమలో నత్యంతప్రియు డెవ్వడో నిర్ణయించుకొనుటకై బాలురనడుమ తీవ్రవాదములు చెలరేగు చుండెడివి. తోడిబాలురలో నెవ్వని కెట్టియాపద తటస్థించినను తోడ్పడుటకు నరేంద్రుడే ప్రథముడు. 'ఫోర్టువిలియ'మను కోటను జూచుటకై యాత డొక నాడు మిత్రులతో బయలుదేఱెను. త్రోవలో నొకబాలుడు జ్వరము తగిలి బాధపడసాగెను. వానిని జూచి పరిహాసముచేయుచు బాలురందఱును ముందున కరుగుచుండిరి. నరేంద్రుడు వానిని లేవదీసి, బండిమీద నెట్లో యింటికి గొనిపోయి, మఱల వచ్చి మిత్రులను గలిసికొనెను. మఱియొకప్పు డొకయినుప దూలము తనపై బడ స్మృతి గోల్పోయిన యొకనావికునకు నరేంద్రుడు శైత్యోపచారముల నొనర్చి పిమ్మట వైద్యునిచే చికిత్సచేయించి రక్షించెను.

సాహసమున నరేంద్రుడు విక్రమార్కుడు. "చిన్ననాటనుండి నా కట్టి ధైర్యసాహసము లుండుటచేతనే చేతగాసైన లేకుండ ప్రపంచపర్యటనము చేసితి"నని కాలాంతరమున నాతడొక శిష్యునితో జెప్పెను. ఆఱేండ్లప్రాయమున నరేంద్రు డొకనా డొకతీర్థమునకు బోయి, శివవిగ్రహములను గొని, తన మిత్రునితో దిరిగి వచ్చుచుండగా చీకటి పడెను. బాలు రిరువురును వేఱుపడిరి. వేగముగా వచ్చుచున్నయొకగుఱ్ఱపుబండి ధ్వనిని విని వెనుకకు జూచునుగదా, స్నేహితుడు బండిక్రింద పడబోవుచుండెను. నరేంద్రుడు తనక్షేమమును లెక్క చేయక మిత్రుని బట్టి లాగి ప్రాణము కాపాడెను. మఱియొకప్పుడాతడు బిడ్డ నెత్తుకొన్నయొకతల్లి నిట్టియాపదనుండియే రక్షించెను. భువనేశ్వరి పైవృత్తాంతమును విని, యానందాశ్రువులు నేత్రయుగళమునుండి జాలువాఱ, "నాయనా! సర్వదా యిట్లు ధీరుడవై వర్తింతువుగాత" మని దీవించెను.

నరేంద్రుని ధైర్యస్థైర్యములను బ్రకటించు నిట్టి నిదర్శనము లనేకములు కలవు. పదియేండ్లప్రాయమున నొకనాడు జంతుప్రదర్శనవనమును జూచుటకై తోడిబాలురతో గలిసి నావపై బ్రయాణముచేసెను. తిరిగి వచ్చునపుడు

దారిలో నొకబాలుడు జబ్బుచే నావను మలినముచేసెను. పడవవారు బాలురను నావను కడుగుడని నిర్బంధించిరి. "వలసినచో నెక్కువ సొమ్మిచ్చెదము, కాని కడుగము, నావను దరిచేర్పు"డని బాలురు గట్టిగా చెప్పిరి. పల్లెలు నిరాకరించి, "నావను దిగుడు చూతము" అని బాలురను గద్దింప నారంభించిరి. ఆసమయమున నావ యొకప్రక్కకు జేరుచుండెను. నరేంద్రుడు గట్టుమీద నడచుచుండిన యిరువు రాంగ్లసిపాయిలను జూచి, చెంగున పడవనుండి దుమికి, వచ్చియురాని ఆంగ్లమున సిపాయిలతో జెప్పి, వారిని నావయొద్దకు దీసికొని వచ్చెను. తెల్లవారిని జూచినంతనే తమ యార్భటమంతయు తెల్లవాఱ పల్లెవాండ్రు వినయ విధేయతలతో నావనొడ్డుజేర్చి, బాలురను క్షేమముగా దింపిరి. నరేంద్రుని ధైర్యసాహసములను బాలురందఱును కొనియాడిరి.

పదునాలుగేండ్లప్రాయమున నరేంద్రు డొకనా డొకనాటకమును జూచుటకై బంధువులతో వెడలెను. నాటకము జరుగుచుండగా న్యాయస్థానము నుండి యొకడు 'అరెస్టువారంటు'తో వచ్చి నటు నొకని పట్టుకొనబోయెను. అంత, "పొమ్ము, అవలకు బొమ్ము. నాటకమును నిరోధింపక తరువాత రమ్ము" అను గంభీరధ్వని సభామధ్యమునుండి వెలువడి 'అరెస్టు' చేయవచ్చినవానిగుండె లదరజేసెను. అంతవఱకును పిఱికిపందలై యూరకుండిన సభ్యులది విని ధీరులై "పొమ్ము, అవలకు బొమ్ము" అని కేకలుపెట్ట నాతడు భయకంపితుడై వెనుకకు మఱలెను. ఆ సింహగర్జన మొనరించిన దెవ్వరు? "ఆత్మస్వాతంత్ర్యము నరికట్టకుము; అజ్ఞానమునుండి వెలువడు"మని వివేకానందుడై వేదాంతసింహగర్జన మొనరించిన మన నరేంద్రుడే! నాటకాభ్యంతరమును దొలగించిన నరేంద్రు నందఱును శ్లాఘించిరి.

నరేంద్రుని ధీశక్తియో, నిరుపమానము. విశ్వనాథుడు రాయపురమున నుండినకాలమున నరేంద్రుని విద్యాభ్యాసమున కాటంకము కలిగెను. 1879-వ సంవత్సరమున తిరిగి కలకత్తాకు వచ్చినంతనే పాఠశాలలో ప్రవేశించి, మూడేం డ్లభ్యసింపవలసిన పాఠముల నొక్కసంవత్సరముననే నేర్చి, ప్రవేశ

పరీక్షయం దుత్తమవర్గమున నుత్తీర్ణుడై తండ్రివలన గడియారమును బహుమతిగా బడసెను. పరీక్షలో అప్పుడట్టి ఘనతను బొందిన దాత డొక్కడే.

బాల్యమున నరేంద్రుని ప్రతిభాతిశయమును బ్రకటించు విద్యలలో గానమువంటి విద్యను గానము. సంగీత మాత డింట విద్వాంసుడగు నొక ప్రత్యేకోపాధ్యాయునియొద్ద నేర్చెను. మఱియు నొక స్నేహితునింటికి బోయి హార్మోనియము, ఫిడల్ మొదలగు వాద్యములనుగూడ నేర్చికొని గానమున ప్రవీణు డయ్యెను. వీనుల విందుగొల్పు నరేంద్రుని సహజకోమలకంఠస్వరమున కాతని గానకళాకౌశలము వన్నె దెచ్చుటచే కంఠమెత్తి యాతడు గానమొనర్చినంతనే జనులు సమ్మోహితు లగుచుండెడివారు.

# ఏడవ ప్రకరణము

## విశ్వవిద్యాలయ జీవితము

ఆటలతోడను, పాటలతోడను, వింతలతోడను, వినోదములతోడను గూడిన బాల్యదశ ననాయాసముగా గడపిన నరేంద్రునకు బహుబాధ్యతా నిలయమగు యౌవన మంకురించెను. రత్నమునకు సూర్యకాంతివలె నరేంద్రుని సహజసుందరశరీరమునకు యౌవనము నూతనవికాసము నొసగెను. పదునాఱేండ్లప్రాయమున నాతడు ప్రవేశపరీక్షయం దుత్తీర్ణుడై కళాశాలయందు ప్రవేశించెను. పాఠ్యపుస్తకములతో తృప్తి వహింపక నరేంద్రు డనేక ప్రమాణగ్రంథములను జదివి జ్ఞానాభివృద్ధి గాంచెను. పాశ్చాత్యదేశచరిత్రల నాతడు కరతలామలకము గావించుకొనుటయే కాక పాశ్చాత్యతర్క శాస్త్రమునందును తత్త్వశాస్త్రమునందును విశేషప్రావీణ్యము గడించెను. మఱియు నాంగ్లభాషాపారంగతుడై వ్యాసరచనమునందును ఉపన్యాసప్రవచనమునందును విశేషశ్రద్ధ వహించి విద్యార్థులందఱిలో అగ్రగణ్యు డయ్యెను. అద్భుతమగు తన వాగ్ధోరణివలన కళాశాలయందలి చర్చాసంఘమునకు నూతన వికాసము నొసగెను.

పూర్వము స్థానికపాఠశాలలో నుండగనే నరేంద్రుని వక్తృత్వమునకు నిదర్శనములు కలవు. ఉద్యోగపరిసమాప్తియై వెడలు నొకయుపాధ్యాయుని గూర్చి యొకప్పు డొకయభినందనసభ జరుపబడెను. మహావక్త యని పేరు గాంచిన బాబు సురేంద్రనాథబెనర్జీ యాసభ కధ్యక్షుడు. అట్టిఘనుని యెదుట ప్రసంగింప బాలురలో నెవ్వరును సాహసింపరైరి. నరేంద్రుని మాటాడుమని వారు ప్రోత్సహించిరి. అతనికి వారి ప్రోత్సాహము కావలయునా? తటాలున నాతడు సభామధ్యమున నిలిచి, బాలుర కాయుపాధ్యాయునియెడ నెట్టిభక్తి తాత్పర్యములు తనరియుండెనో, అతడు వెడలుటచే బాలురెట్లు కుందు

చుండిరో ముఖ్యగు విషయములనుగూర్చి మనోహరముగా నించుమించు అరగంటసేపు ఉపన్యసించెను. అనంతరము సురేంద్రనాథబెనర్జీ ప్రసంగించుచు నరేంద్రునాదరపూర్వకముగా శ్లాఘించెను. స్వయముగా మహావక్తయై అఖండయశోధురీణుడగు సురేంద్రనాథుడు నరేంద్రుడు వేదాంతమతప్రబోధకుడైన తరుణమున, "భారతవర్షమున వివేకానందుని మించిన వక్తలు లేరు" అని వక్కాణించి యున్నాడు.

అద్భుతమగు నాతనిధారణాశక్తియే కళాశాలయందుగూడ నరేంద్రునకు ఊతగట్టయై నిల్చినది. పరీక్షలకు ముందాత దేరెండుమూడు నెలలో పాఠపుస్తకములను జదువుచు మిగిలిన కాలమంతయు విజ్ఞానాభివృద్ధికై వినియోగించువాడు. గ్రహణశక్తి యాతని ధారణాశక్తికి దోడ్పడ గ్రంథమునక్కడక్కడ చదువుచు నామూలాగ్రముగ జదువకయే అందలిభావములను సంపూర్ణముగ గ్రహింప నాతడు సమర్థుడై యుండెను. మొదటిపంక్తిని చివరపంక్తిని చదివినంతనే పుటయందలి తాత్పర్యమంతయు దనకు విస్పష్టమగుచుండెడిదని యాతడే వచించియున్నాడు. ఇట్టి నిరుపమానమగుధీశక్తి కళాశాలయందలి పండితుల నాకర్షింపకుండునా? కళాశాలాప్రధానోపాధ్యాయుడగు 'హేస్టి' యనునాత డిట్లు వచించియున్నాడు: "నిజముగా నరేంద్రనాథు డద్భుత ప్రతిభాశాలి. ప్రపంచమునం దనేకదేశములందు పర్యటన మొనర్చితిని, కాని జర్మన్ విశ్వవిద్యాలయములందు సైతము తత్త్వశాస్త్రవిద్యార్థులలో నరేంద్రునివంటి ధీసంపన్నుని నేనింతవఱకు జూచినదిలేదు. ప్రపంచ మీతనిప్రతిభను గుర్తించు దినములు వచ్చితీరును." ఆతని వచనములు కోటిగుణితములై ఫలించినవి. ఎవ్వని పాదారవిందములను సేవించి నరేంద్రుడు వివేకానందు డయ్యెనో అట్టి శ్రీరామకృష్ణగురువరేణ్యుని దివ్యానుభవములనుగూర్చి ప్రప్రథమమున నరేంద్రునకు దెల్పిన దీహేస్టిమహాశయుడే.

విమర్శనశక్తి నరేంద్రున కీకాలముననే విశేషాభివృద్ధి నొందసాగెను.

విశ్రాంతిసమయములందు గూడ సహపాఠకులతో నాతడు సర్వవిషయములను గూర్చియు విమర్శించువాడు. అతీంద్రియజ్ఞానదివ్యతేజ మాతని కింకను వశముకాకుండుటచే విమర్శనదీపకాంతిచే ప్రతివిషయమును బరీక్షించువాడు. ఆత్మమోక్షజగత్కల్యాణములకై జన్మించిన యాతని కేదియో అసంతృప్తి, ఏదియో తీవ్రవాంఛ, ఏదియో భరింపరాని మానసికపరివర్తనము, గలుగ నారంభించెను. ఆహారనిద్రాదికములచే గలుగుసౌఖ్యము జీవితపరమావధి కాదని యాతడు బాల్యముననే గ్రహించియుండెను. విషయసుఖము లాతనికి తుచ్ఛములై కనబడెను. ఐన నాత డెల్లప్పుడును ఉత్సాహమునకు నిలయమై ఆవేశ జనకములగు తన సంభాషణలచే సహపాఠకుల నుత్సాహపూరితులను జేయుచుండువాడు. ఆదినములలో నరేంద్రునిగూర్చి యాతని మిత్రు డొక డిట్లు వర్ణించియున్నాడు: "ఆతని వచనములు మా కమృతప్రాయములు; ఆతని కంఠ స్వరము దివ్యగానము. నరేంద్రుని సంభాషణములను విని యానందించుటకై యాతని యెదుట నేదియో యొక విషయమునుగూర్చి ప్రస్తావించుచుండెడి వారము. ఆతనిమృదుమధురవాక్యములును, స్వతంత్రభావములును మమ్ములను సమ్మోహితుల నొనర్చుచుండెడివి. దౌర్బల్య మనిన నరేంద్రునకు అసహ్యము. నెపోలియన్‌చక్రవర్తి ధైర్యసాహసముల నాత డభినందించుచు ప్రజలు నాయకునియెడ జూపవలసిన విధేయతనుగూర్చి మా కుద్బోధించువాడు." ఏమి దివ్యోపదేశవాక్యములు! మఱల భారతదేశ మెన్నటికైనను ఏకసూత్ర బద్ధమై స్వాతంత్ర్యమును బొందవలయు నన్నచో, భారతీయు లెన్నటికైనను ప్రపంచజాతులలో తలయెత్తి జీవింపవలయు నన్నచో, నరేంద్రవాక్యరత్నములను శిరసావహించితీరవలయును.

ఇట్టి ధీరగంభీరవాక్చాతుర్యమునకు వన్నెదెచ్చు వినిర్మలమనోభావములును మనోభావములకు మర్యాద నొసంగునట్టి ప్రేమపూరితప్రవర్తనమును నరేంద్రుని మిత్రు లమితముగా బ్రేమించుటకు ప్రధానహేతువు లయ్యెను. కష్టదశలో నున్నవారిని జూచినచో నాత డెట్లు సాయమొనర్తు

నాయని తల్లడిల్లువాడు. పట్టపరీక్షకు బోవుసమయమున నాతని మిత్రుడొకడు పరీక్షావేతనము మాత్రమే కాక నెలజీతమునుగూడ కట్టకపోవుటచే నాతని పరీక్షకు బంపుటకు వీలులేని స్థితి సంభవించెను. నరేంద్రు డాతని బాధ్యతను తన బాధ్యతగా భావించి, "ఆవిషయము నాకు విడిచిపెట్టుము; నీవు పరీక్షకు జదువుట మానకుము" అని ధైర్యము గొల్పి తాను కళాశాలాకార్యనిర్వాహకు నొక ప్రత్యేకస్థలమున దర్శించి, యెట్లో చెప్పి యొప్పించి, యాతని పరీక్షా ప్రతిబంధమును తొలగించెను.

ఇట్టిపరోపకారములతోడను, ప్రామాణికగ్రంథపఠనముతోడను సంవత్సరమున జాలకాల మాక్రమింపబడుటచే బరీక్షలకు ముందు నరేంద్రుడు ప్రబలయత్నము చేయుచుండెడివాడు. పట్టపరీక్షాసమయమున నాత డహర్నిశము తదేకముగా జదువ నారంభించెను. ఆసమయమున తీవ్రపరిశ్రమచే గల్గు శిరోభారమును తేలికపఱచుటకై చిక్కని తేయాకుపానీయమును ఎప్పుడును దగ్గఱనుంచుకొనువాడట. ఐనను కునుకుపాట్లు వచ్చిన మేల్కొల్పుటకై యొకత్రాటిని కుర్చీకి ముడివెట్టి రెండవకొనను తనకాలికి గట్టుకొనువాడట! సుకుమారు డని నిద్రాదేవి యాతని కరుణించు నపుడెల్ల కాలిత్రాడు చివుక్కున లాగి సరస్వతీదేవిని స్మరింపజేయుచుండెడిది. "విద్యాతురాణాం నసుఖం ననిద్రా" యన వినమే!

# ఎనిమిదవ ప్రకరణము

## మానసిక పరివర్తనము

పుస్తకములలో ఏ మున్నది? భగవత్సాన్నిధ్యమున పాండిత్యమెందులకు? పట్టపరీక్షాదినమున నరేంద్రున కీయభిప్రాయమే కలిగినది. పారమార్థిక భావము లాతని హృదయమున పొంగిపొరలెను. అట్టి భక్తిపారవశ్యమున,

ఉ. "ఈశ్వర! సద్విలాస! పరమేశ్వర! భాస్వర! సత్కృపాకరా!
శాశ్వతరూపదీపక! విశాలజగద్రచనావినోద; లో
కేశ్వర! సాధుపక్షవిమలేక్షణ రక్షణ! దుష్టశిక్షణా!
విశ్వమయాంతరంగ! పరివేష్టితసజ్జన! భక్తపాలకా!"

అని పరమేశ్వరపాదారవిందార్పితమానసుడై కీర్తించుచు సహపాఠకుల గది గుమ్మమునొద్ద నరేంద్రుడు నిల్వబడెను. బ్రహ్మానంద మాతనివదనమున మూర్తీభవించియుండెను. అది ప్రభాతసమయము. బాలు రింకను నిద్రించుచుండిరి. ఆదివ్యగానమును విని మేల్కాంచి వారు తలుపులు తెఱచిరి. పుస్తకహస్తుడై నరేంద్రు డెట్టయెదుట నిలుచుండెను. నాడు పుస్తకమును విప్పలేదు. పరీక్ష కొకేదినము గడువున్నది. ఆదినము గానముతో గడచినది. భగవాను నాత డిట్లు కీర్తింప దొడగెను:

ఉ. "పాడుడు మేఘులార, ఘను బాడుడు పర్వతపంక్తులార, బల్
పాడుము మందమారుతమ, పాడుడు భాస్వరచంద్రతారకల్
పాడుడు, పాడుడీ, మఱల పాడుడు భాస్వరకీర్తిశోభితున్
బాడుడు దివ్యకాంతియుతు బావననాము బరాత్పరున్ హరున్."

"ఓయీ నరేంద్రా! పరీక్షలకు జదువు పూర్తియయినదా?" అని సహపాఠకులు ప్రశ్నింప, "ఆహా!" యని వచించి మఱల బాడనారంభించెను.
"ఏల నీభావిస్థితిని నిర్ణయించుకొని తదనుగుణముగా వర్తింపవు? లోకమున కు సదవకాశము లనేకములు కలవే. వాని నేల పాడుచేసికొనెద"వని

యొకమిత్రుడు పల్కెను. అంత నరేంద్రుడు ప్రాపంచికౌన్నత్యముపై తనకు వాంఛ కలుగకపోలేదనియు, చూడగా నది తృణప్రాయమనియు, సమస్తము నాశవంతమనియు, నశించువిషయములకై ప్రాకులాడుట పిచ్చితనమనియు మహోపన్యాసమిచ్చి, దీర్ఘనిశ్వాసపురస్సరముగా మఱల నిట్లనియెను: "సన్న్యాసజీవనమునుగూర్చి విశేష మాలోచించితిని. కాలు నెదిర్చి నిల్చు నాతని ఘనతయే ఘనత. లోకులరీతి నాతడు నశ్వరభోగములకై ప్రాకులాడక శాశ్వతానందప్రాప్తికై యత్నించును." విద్యార్థులు నిశ్చేష్టులై వినిరి. నరేంద్రుడు నూరకుండగా చిరపరిచితుడగు నింకొక మిత్రుడు వచ్చి, "సన్న్యాసము నిన్ను లోకమునుగూడ చెఱచును" అని పలికెను. చిఱునగవే నరేంద్రుని సమాధానము. అంత నామిత్రుడు మఱల, "ఈతడు దక్షిణేశ్వరములో నొకముసలివానిని గలిసికొనుటయే యింత పుట్టిమునుకకును గారణము. ఆతడెవ్వడో రామకృష్ణుడట! పరమహంసయట! ఎంతసేపు 'జపమో, తపమో' యని దేవులాడుచు తఱచు సమాధిస్థితిని బొందుచుండునట! దేవునిగూర్చిన గొడవయే కాని రెండవవిషయము మాటాడడట! ప్రపంచజ్ఞానహీనుడగు నా సన్న్యాసియే నరేంద్రుని యాశయముల నన్నిటిని నట్టేట గలుపుచున్నాడు" అని పలికి, "నరేంద్రా! నీవు బాగుపడ దలచుకొన్నచో నిక నాతనియొద్దకు బోవలదు" అని హెచ్చరించెను. ఇంతలో జీకటిపడియెను. నరేంద్రునివదనమున గాంభీర్యము మూర్తీభవించెను. ఆత డేదియో దీర్ఘాలోచన చేయసాగెను. "మాటాడవేమి నరేంద్రా!" యని మిత్రుడు పలుకరింప నరేంద్రుడు మృదువచనములతో నిట్లనియెను: "ఓయీ! నీకు తెలియదు. ఆవృద్ధుని యందు—మహనీయుడగు నా శ్రీరామకృష్ణునియందు—నా కెందుచేతనో ప్రీతి జనించినది." ఇట్లు వచించి, యటనుండి లేచి, తనగది కేగి, కొంత సేపు విచారించి, భగవత్సంకీర్తన మొనర్చి పునరానందభరితుడయ్యెను.

పాఠములు చదువుచు మధ్యమధ్య నరేంద్రు డీగదిలోనే ఉత్సాహముతో బాడుచుండువాడు. ఎదుటి యింటిలో నున్న యొక బాలవితంతువు

నరేంద్రునిగదికిటికీయొద్దకు వచ్చి యాతనికి దెలియకుండ గానమును విని యానందించుచుండెడిది. ఒకనా డామె తెంపువహించి నరేంద్రుని గదిసమ్మము నొద్ద కరుదెంచి మోహావిచేష్టితయై నిల్వబడెను. నరేంద్రుడు విస్మితుడై యామెకు సాష్టాంగనమస్కారముచేసి, "తల్లీ! తల్లీ! ఎందులకు నీవు వచ్చితివి? నీవు నాతల్లివి సుమీ!" యని వచించెను. ఆయువతి నరేంద్రునిమనోభావమును గ్రహించి వెనుకకు మఱలెను. మఱునాడే నరేంద్రు డాగదినుండి తనబస మార్చి మఱియెన్న డామెకంటబడలేదు.

అహామద్ ఖాన్, వేణీగుప్తయను సుప్రసిద్ధగాయకులయొద్ద నరేంద్రుడు నాలుగైదేండ్లు శాస్త్రోక్తముగా గానము నభ్యసించి గీతవాద్యములందు ప్రవీణుడయ్యెను. హైందవగానకళనుగూర్చి కాలాంతరమున నాతడు వ్రాసిన విషయము లాతనిగానకళాపాండితిని వేనోళ్ల జాటుచున్నవి. మఱియు నాతడు రచించిన స్తోత్రములును, * కీర్తనములును నేడు జగద్వ్యా

* ఇందుల కొకటిరెండు ఉదాహరణములు :

శ్రీరామకృష్ణస్తోత్రమ్

1. ఆచణ్డాలాప్రతిహతరయో యస్య ప్రేమప్రవాహః
లోకాతీతోఽప్యహహ న జహౌ లోకకల్యాణమార్గమ్।
త్రైలోక్యేఽప్యప్రతిమమహిమా జానకీప్రాణబన్ధో
భక్త్యా జ్ఞానం వృతవరవపుః సీతయా యో హి రామః॥

2. స్తబ్ధీకృత్య ప్రలయకలితం వాహవోత్థం మహాన్తమ్
హిత్వా రాత్రిం ప్రకృతిసహజామన్ధతామిస్రమిశ్రామ్।
గీతం శాన్తం మధురమపి యః సింహనాదం జగర్జ
సోఽయం జాతః ప్రథితపురుషో రామకృష్ణస్త్విదానీమ్॥

3. పీత్వా పీత్వా పరమమమృతం వీతసంసారరాగాః
హిత్వా హిత్వా సకలకలహప్రాపిణీం స్వార్థసిద్ధిమ్।
ధ్యాత్వా ధ్యాత్వా గురువరపదం సర్వకల్యాణరూపమ్
నత్వా నత్వా సకలభువనం పాతుమామన్త్రయామః॥

ప్తమై యలరారు శ్రీరామకృష్ణాశ్రమములలో ప్రార్థనాసమయమున విని యోగింపబడుచున్నవి.

కలాశాలలో నరేంద్రుడు గానమునకు బేరెన్నికగాంచెను. విద్యార్థుల కాతనిగానమన్నచో బ్రాణము. సమయము చిక్కినప్పుడెల్ల వారాతని పాడుమని నిర్బంధించువారు. ఒకసమయమున నుపాధ్యాయుండు వచ్చుటాలస్యముకా నాతడొకగీతము నత్యద్భుతముగా బాడుచుండ నుపాధ్యాయుండు దూరమునుండి విని గాయకు నభినందించెను. ఇట్టినరేంద్రుని గానమాధుర్యముచే బ్రహ్మానందసరోవరమున దేలియాడిన పరమహంస యొకడు కలడు. అతడే శ్రీరామకృష్ణపరమహంస.*

విద్యలలో నరేంద్రుని ప్రతిభాతిశయమును గని, ఇంగ్లాండునకు బోయి ఐ. సి. యస్. పరీక్షకు జదువుటకు జాలినంతకట్నము నిచ్చెదమని వాగ్దానములు చేయుచు నరేంద్రునకు కన్యాదానము చేయుతలంపున విశ్వనాథు నొద్దక నేకులు వచ్చుచుండిరి. విశ్వనాథుడు తనపుత్రుని వివాహమాడుమని నిర్బంధింపసాగెను. కాని నరేంద్రు డిదివఱకే ముక్తికాంతను వరించియుండెను. పుత్రుని ప్రోత్సహింప విశ్వనాథుని ప్రయత్నము లన్నియు విఫలమయ్యెను. భగవత్సందర్శనమునకై నరేంద్రునివాంఛ మఱింత ప్రబలమయ్యెను.

నరేంద్రు డీసమయముననే బ్రాహ్మసమాజమున జేరి తత్కార్యక్రమమున బాల్గొనుచుండెను. భగవంతుడు నిరాకారుడయ్యెను సగుణుడని బ్రాహ్మమతస్థులు భావింతురు. ఐనను విశుద్ధహృదయుడై భక్తుడు ప్రార్థించినచో భగవంతుడు సాకారుడై ప్రత్యక్షమైతీరునని నరేంద్రుడు విశ్వసించెను. భగవత్సాక్షాత్కారమును బొందనిచో జీవితము నిరర్థకమని యాతడు భావించెను.

యౌవనప్రాదుర్భావమునుండియు నరేంద్రునకు నిద్రాసమయమున పరస్పరభిన్నములగు జీవితదృశ్యములు రెండు మనోవీథిని స్పష్టముగా గాన్పించు

* "నాగస్వరముచే పామువలె నరేంద్రునిగానముచే అంతర్యామి ముగ్ధుడగును" అని యాతడు వచించెను.

చుండెను. భార్యాపుత్రులతో, గృహారామములతో, కీర్తిప్రతిష్ఠలతో సకలైశ్వర్య సంపద్విలాసవైభవోపేతమై లౌకికానందమయమగు గృహస్థ జీవనదృశ్యమొకవైపునను, సమస్తము త్యజించి, లభించినది తినుచు, ప్రాప్తించినతావున నిద్రించుచు, పరమేశ్వరైకార్పితమానసుడై, సుఖదుఃఖాద్యతీతుడై, బ్రహ్మానందామృతపానమత్తుడై, శరీరమును మఱచి నిరంతరవినిర్మలస్వేచ్ఛతో సంచరించు పరివ్రాజకుని దివ్యజీవనదృశ్య మొకవైపునను రత్నకాంతులతో చిత్రితములై యాతనికట్టెదుట కాన్పించుచుండెను. దేనిని విసర్జించుట? దేనిని అవలంబించుట? అంతర్ముఖుడైనకొలదియును నరేంద్రునకు సన్న్యాసజీవనదృశ్యము సాంసారికజీవనదృశ్యముకంటె సహస్రగుణాధికసౌందర్య సమన్వితమై గోచరింపసాగెను.

శ్లో. "మేరుసర్షపయో ర్యద్వత్, సూర్యఖద్యోతయో రివ।
సరిత్ సాగరయో ర్యద్వత్, తథా భిక్షుగృహస్థయోః॥"

మేరుపర్వతమునకును ఆవగింజకును, సూర్యునకును మిణుగురుబురువునకును, సముద్రమునకును పిల్లకాలువకును ఎంతటివ్యత్యాసము కలదో సన్న్యాసజీవనమునకును గృహస్థజీవనమునకును అంతటివ్యత్యాసముకలదని యాతనికి దట్టెను. సర్వసంగపరిత్యాగ మొక్కటియే తనకు వరణీయమని యాతడు నిశ్చయించెను.

బ్రాహ్మసమాజము నరేంద్రునకు మనశ్శాంతిని గల్గింపజాలినదికాదు. భగవత్సాక్షాత్కారమే తనకు వాంఛనీయమైయుండ, బ్రాహ్మసమాజమును జేరుటకు ముందు తనయాదర్శ మెంతదూరమున నుండెనో ఇపుడును అంతియే దూరమున నున్నదని యాతడు గ్రహించెను.

గురుజనులలో మహర్షి దేవేంద్రనాథఠాకూ రుత్తమగణ్యుడని విని, మిత్రులతోగూడి నరేంద్రు డాతని సేవకె సందర్శించియుండెను. ఆసమయమున మహర్షి, "ధ్యానమును తీవ్రముగా నొనర్పు"డని వారల కుపదేశించెను.

భగవత్సందర్శనైకవాంఛచే పరితపించుచున్న నరేంద్రుడు మఱల దేవేంద్ర నాథుని సమ్ముఖమున కరిగెను. దేవేంద్రనాథుని గృహద్వారము ఇంచుక మూయబడియుండెను. నరేంద్రుడు తలుపు తెఱచినంతనే ధ్యానస్థితుడగుమహర్షి కన్నులు తెఱచి యెట్టయెదుటనున్న నరేంద్రుని గాంచెను. నరేంద్రుని ముఖమున భగవదావేశము మూర్తీభవించియుండెను. ఆతనికన్నులు దివ్యతేజః పుంజముల నీనుచుండెను. ఆకస్మికమైన నరేంద్రునిరాక మహర్షికి నివ్వెఱపాటు గల్గించెను. మహర్షి తన్ను పలుకరింపకమునుపే, "మహాశయా! తాము దేవుని జూచితిరా?" యని నరేంద్రు డావేశపూరితుడై ప్రశ్నించెను. నరేంద్రుని ప్రశ్నకు దేవేంద్రుడు సమాధానము చెప్పజాలక, "వత్సా! నీవి యోగినేత్రములు" అని వచించి యూరకుండెను. నరేంద్రుడు నిరాశతో వెనుకకు మఱలెను. నిజముగా మహర్షి భగవంతుని దర్శించెనా? 'లే'దని నరేంద్రుని యంతరాత్మ వచించెను.

భగవత్సందర్శనమునకై ఇక నరేంద్రునిపరితాపము ఊహాతీతము. సమస్తవేదములును, సమస్తశాస్త్రములును, సమస్తవిద్యలును భగవంతుని జూపజాలనిచో నిష్ప్రయోజనముగా గన్పట్టెను. భగవంతుడు కలడనినచో ఆతనికి తృప్తిలేదు. తా నాభగవంతుని జూడవలయును; చూచితీరవలయును. ఇదియే యాతనిపరమసంకల్పము. ఈసంకల్పము నెఱవేఱువఱకును నరేంద్రునకు మనశ్శాంతిలేదు. భగవంతు డెచట నున్నాడు? వానిని జూచు టెట్లు? చూపగలవా డెవ్వడు? ఇదియే యాతనిహృదయపరితాపము. ఇట్టిపరితాపముతో దేవేంద్రనాథుని దర్శించి, శాంతిగానక యాతడెందఱో మతాచార్యప్రముఖులను దర్శించెను. కాని "భగవంతుని జూచితి"నని చెప్పినవారెవ్వరును లేరైరి. ఇక నెచటకు బోవుట? అకస్మాత్తుగా నాతనికీ క్రిందివిషయములు జ్ఞప్తికి వచ్చెను:

భక్తుడగు సురేంద్రనాథమిత్రునింటికి శ్రీరామకృష్ణపరమహంస వేంచేసియుండిన సమయమున సంకీర్తన మొనర్చుటకై తా నచటికి వెడలియుండెను. తనగానముచే శ్రీరామకృష్ణుడు బ్రహ్మానందపరవశుడై తనస్థితిగతులను గూర్చి

విచారణసల్పుటయేకాక దక్షిణేశ్వరమునకు రమ్మని తన్నాహ్వానించియుండెను. ఇక నరేంద్రుడచటి కేగి శ్రీరామకృష్ణుని బ్రశ్నింప సంకల్పించెను.

నరేంద్రుని ప్రశ్నకు శ్రీరామకృష్ణు డెట్టిసమాధానము నొసగెనో, శ్రీరామకృష్ణసూర్యకరస్పర్శనమున నాతని హృదయకమల మెట్లు వికసించెనో ముందు చూచెదము.

# తొమ్మిదవ ప్రకరణము

## శ్రీ రామకృష్ణుడు

గతశతాబ్దారంభమున పాశ్చాత్యనాగరికతాతరంగములు భారతదేశము నాక్రమింపసాగెను. పాశ్చాత్యవిజేతలు భారతజాతి యధఃపతితజాతి యనియు, భారతీయులు క్రియాశూన్యులనియు, సనాతనధర్మతత్త్వము లర్థరహితప్రలాపములనియు నిర్ధారణచేయ సమకట్టిరి. భారతజనసామాన్య మాందోళనమొందసాగెను. సనాతనభారతజాతీయజీవనము పాశ్చాత్యనాగరికతాప్రణాళికననుసరించి క్రొత్తమార్గము త్రొక్కవలయుననుభావము దేశమందంతటను వ్యాపించెను. భారతీయులకు పరంపరానుగతమగు ఆవిశుద్ధజీవనవిధానమంతయు, ఆభగవత్సందర్శనైకపరాయణత్వ మంతయు దేశము నాక్రమించిన యనాత్మవాదముచే, ఐహికసుఖాన్వేషణబుద్ధిచే, నిర్మూలన మైపోవుచున్నట్లు కాన్పించెను. భారతజాతీయకయే అంతరించుచున్నట్లు తోచెను. "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే" యనువచనము మిథ్యాభూతమా యని సత్యాన్వేషకులు ఆందోళన మొందసాగిరి.

ఇట్టి సమయమున (1836-వ ఫిబ్రవరి 18-వ తేదీనాడు) వంగదేశమున కామార్పుకూర్ (కామారిపుష్కరము) అను మాఱుమూల గ్రామములో బ్రాహ్మణవంశమున పేదలగుదంపతుల కొకబాలు డుదయించెను. ఆతనికి గదాధరుడని నామకరణ మొనర్చిరి. చిన్ననాటనుండియు గదాధరునిజీవిత మపూర్వమై యుండెను. తా నెట్టి మహాకార్యమును నిర్వహించునిమిత్త మీలోకమున జన్మించెనో యాతడు బాల్యముననే గ్రహించెను. గదాధరుని చిన్నతనముననే తండ్రి చనిపోవ నాతని విద్యాభ్యాసము పండితుడగు సోదరుని యధీన మయ్యెను.

తోడివారందఱును ధనకాంక్షచే విద్యాభ్యాసము చేయుచుండిరని యాతడు గ్రహించెను. పరమార్థముగా వారెంచినది కామకాంచనములుకాని జ్ఞానముకాదు. అట్టిపొట్టకూటిసీచవిద్యలతో దన కెట్టి జోక్యమును వలదని నిశ్చయించెను. ధనసంపాదనకై—కామసంతృప్తికై—విద్య నార్జించుట కాత డంగీకరింపలేదు. *

శా. "ఏవేదంబు పఠించె లూత? భుజగం బేశాస్త్రము ల్వాచెఁ? దా
నేవిద్యాభ్యసనం బొనర్చెఁ గరి? చెంచేమంత్రమూహించె ? బో
ధావిర్భావనిదానముల్ చదువులయ్యా కావు! నీపాదసం
సేవాసక్తియెకాక జంతుతతికిన్ శ్రీకాళహస్తీశ్వరా!"

ఇదియే చదువులయెడ శ్రీరామకృష్ణుని మనోభావము.

గదాధరుని యిరువదవయేట నాతని సోదరులు మరణింప కుటుంబ భారము నాతడు వహింపవలసివచ్చెను. అంత నాతడు రాణిరాసమణియను భక్తురాలు కట్టించిన కాళికాలయములో నర్చకు డయ్యెను. అఖండభక్తితో

* పాఠశాలయందలి నిర్జీవమైన విద్యావిధానము అతని నాకర్షింప జాలకుండు టాశ్చర్యము కానేరదు. ప్రకృతిసౌందర్యరసాస్వాదనము మ్రోల గణితము మున్నగువిద్య లాతని కెంతమాత్రము గణనీయములు కావయ్యెఁ. కాని యాతని ధారణాశక్తియు, అసమానధీవైభవమును లౌకికవిద్యల నాత డభ్యసింపనిలోటును పూర్తిగా దీర్చివైచెను. పండితులచే జరుపబడు పురాణ పఠనములను శాస్త్రవ్యాఖ్యానములను నాతడాలకించి భారతీయవిజ్ఞానఖనులగు భారతభాగవతాది గ్రంథముల సారమును పూర్తిగా గ్రోలెను. బడిచదువు నలక్ష్యము చేయుచుండెనని తనయన్నయు పండితుడునగు రామకుమారు డొకప్పుడు తన్ను మందలింప, "అన్నా! ఈపొట్టకూటిచదువు నా కెందులకు? ఇందులకు బదులు శాశ్వతానందదాయకము, శ్రేయస్కరమునగు తత్త్వజ్ఞాన మును నేనార్జింపగోరుదును" అని సమాధానము చెప్పెను. నిజమే, ఆత్మజ్ఞాన దాయకమగు విద్యయే విద్యకాని మిగిలినదంతయు అవిద్య కదా!

కాళికాదేవి నాతడనుదిన మర్చించును; ప్రార్థించును; జన్మసాఫల్యమును గానమి పరిపరివిధముల తనహృదయపరితాపమును ఆదివ్యమాతకు వెల్లడించును.

జగజ్జననిని ప్రత్యక్షముగా జూడవలయుననను వాంఛ తీవ్రమై జీవిత మాతనికి దుర్భరమయ్యెను. ఆమెరూపమును విడిచి మఱియొకరూపము నాతడు చూడజాలడు. దివ్యమాతనుగూర్చిన ప్రసంగమును విడిచి మఱియొకప్రసంగము నాతడు వినజాలడు. ఇట్లహోరాత్రములు గతించెను. పగలు గడచి సాయంకాల మగుటతోడనే యాతడు మఱింత దుఃఖించుచు, "మఱియొక దినము గతించినది. తల్లీ! నీవు ప్రసన్నవు కాలేదు. ఈయల్పజీవితమునం దింకొకదినము గడచినది. నేనింకను పరమార్థమును గనుగొనసైతినే!" యని విలపించును. తుదకు ఆలయమున సేవచేయుట ఆతనికి అసాధ్యమైపోయెను. ఆలయమును విడిచి, సమీపముననున్న యొకచిట్టడవిలోనికి బోయి యాత దందు తపించెను. ఎప్పుడు సూర్యోదయమైనదో, ఎప్పు డస్తమయమైనదో, ఎట్లు తా నందు జీవించెనో యాత డెఱుగడు. శరీరమునుగూర్చి యాతనికి స్పృహయే లేదు. అద్భుతదివ్యదర్శనము లాతనికి గలుగసాగెను; ఆత్మరహస్యములు వెల్లడి కానారంభించెను. స్వయముగా పరమాత్మయే—యాతడర్చించిన లోకైక జననియే—యాతనికి గురువై తత్త్వోపదేశ మొనర్చెను. మానవగురువు లాతని కడకు తరువాత వచ్చినవారు.

ఆతని యసాధారణప్రవర్తనమును జూచి జను లాతనికి మతిపోయిన దని భావించిరి. బంధువు లాతనికి పెండ్లిచేయుటచే మనఃస్థైర్యము గల్గింపగల మని నిశ్చయించి శారదామణీదేవి యను నైదేండ్లబాలికను దెచ్చి వివాహము చేసిరి. కొంతకాలమైన వెనుక తిరిగి యాతడు కాళికాలయమునకు వచ్చెను. తోడనే యాతడు మఱల తనదివ్యోన్మాదమున మునిగిపోయెను. ఆరాధన మని నంతనే సమస్తము మఱచును. కాళీలగ్నమానసుడై యాతడు దేవి నర్చించుట కమర్పబడిన గంధపుష్పాదులను స్వశిరమున నిడుకొని నిశ్చల సమాధినిమగ్నుడై యొప్పును.

ఆతని ధర్మపత్నియగు శారదాదేవి దినదినప్రవర్ధమానయై తనమగని యాశయములను సంపూర్ణముగా గ్రహించెను. ఆతనికి దగిన సహధర్మచారిణి యగు నామె యాతని ప్రియశిష్యవర్గమున ప్రధానస్థానము వహించి, తన నాథుడే జగన్నాథుడని విశ్వసించి యాతని నర్చింపసాగెను.

ఆత డవలంబించినసాధన లపూర్వములు. అహంకారము నున్మూలిత మొనర్చుకొనుటకై, అత్యంత నిమ్నజాతిజనులతో సముడై సర్వజనసేవకు డగుటకై యాత డాచరించినసాధన లనుపమానములు. బ్రాహ్మణుల కెల్ల బ్రాహ్మణుడైన యాతడు బిచ్చగాండ్రను చండాలురను తినిన తావును శుద్ధమొనర్చుచు వారియుచ్ఛిష్టమును యజ్ఞశేషమని భావించును. ఇంతటితో సరికాదు. మాలిన్యమును తొలగించు సేవకకృత్యములందు వారితో సామ్యము నొందు తలంపున మలినప్రదేశములను సైతము తనశిరోజములతోడనే తుడుచుటకై యాతడు రాత్రివేళ రహస్యముగా నీవలకు వచ్చును. నిరంతరతీవ్రతమసాధనలచే నాతడు తన మనశ్శరీరములను పూర్వము దేవదానవులు సముద్రమును మథించినట్లు మథించివైచెను. తన్మథనమున అమృతత్వ మాతని యధీనమైనది.

ఆత డద్వితీయాదర్శమూర్తి. కామకాంచనముల సంపూర్ణత్యాగమే యాతనిస్వరూపము. కామకాంచనముల స్పృహయే ఆతనియందు లేదు. భార్య నాతడు జగన్మాతృస్వరూపముగా నెంచి, 'అమ్మా' యని సంబోధించుచో, ప్రతికాంతను మాతృభావముతో జూడదగ లైనని వచింపనేల? ఇక నాతని కాంచనజయ మో, అత్యద్భుతము, ధనమును జూచిన, ఆతని హృదయము వణకిపోవును, క్షోభించును. సాధనదశలో నాత డొకచేతితో మంటిముద్దను రెండవచేతితో గనకమును గైకొని, రెంటి ననేకపర్యాయములు తిలకించి, మట్టి కనక మనియు, కనకమే మట్టియనియు వచించి, భేదబుద్ధి నాశన మొనర్చి రెంటిని గంగలో బాఱవైచును. ఎవ్వరైన నాతడు నిద్రించునప్పు డొక నాణెముతో నాతని దాకిన, దుర్భరవేదనచే శరీర మాస్పర్శనుండి ముడుచుకొని

పోవునంతటి తీవ్రతమాభ్యాసమున కాతనినాడులు పాల్పడినవి. ఎట్టి యద్భుత కాంచనవిజయమో కదా !

అహంకారము దగ్ధపటలమై విషయవాంఛ లున్మూలితములై కాలుష్యము కడిగివేయబడిన యాజీవిత మెంత ధన్యమైనదో తలంపుడు !

ఆతడే గురుజను లొసగిననామమున జగత్ప్రసిద్ధుడగు శ్రీరామకృష్ణుడు!

శ్రీరామకృష్ణు డాధ్యాత్మికసాధనలందు నిమగ్నుడై యుండినసమయమున భైరవీబ్రాహ్మణి యనుమహాయోగిని యాతని వెదకికొనుచు వచ్చి, సమస్త తాంత్రికరహస్యముల నాతనికి వెల్లడించెను. పండితసభాసమక్షమున శ్రీరామకృష్ణుడు సాక్షాద్భగవదవతారమూర్తియని శాస్త్రప్రమాణములచే నిరూపించి ముముక్షుజనమహోపకారము గావించిన దీయోగినీమణియే. తరువాత తోతాపురి యను యతీంద్రుని దివ్యోపదేశముచే శ్రీరామకృష్ణునకు సమస్తవేదాంతసారామృతమగు నిర్వికల్పసమాధి కరతలామలక మయ్యెను. భగవత్సాక్షాత్కారమునకై సనాతనధర్మసంప్రదాయములనే కాక క్రైస్తవమహమ్మదీయాద్యన్యమతసాధనలనుగూడ సమగ్రముగా నభ్యసించి యందు త్తీర్ణు డయ్యెను. బ్రహ్మానందతేజము బహువిధముల బ్రకాశితమై సర్వమత సామరస్య మాతనియందు రూపుదాల్చెను. భక్తిజ్ఞానకర్మాదియోగములును, ద్వైతాద్వైతవిశిష్టాద్వైతాదిమతములును శ్రీరామకృష్ణజీవిత మను కుసుమమాలికయందలి వివిధకుసుమములై విలసిల్లెను. అందలి దివ్యసౌరభము దేశమంతటను వ్యాపింప, శ్రీరామకృష్ణవచనామృతమును గ్రోలుటకై ముముక్షుజనసమూహము లరుదెంచెను. గౌరీపండితుడు, పద్మలోచనుడు, వైష్ణవచరణుడు, శశధరతర్కచూడామణి, కేశవచంద్రసేనుడు, ప్రతాపచంద్రమజుందారుడు, విజయకృష్ణగోస్వామి, నాగమహాశయుడు మున్నగు మహనీయు లాయమృతాస్వాదనభాగ్యమును విశేషముగా బడసినవారిలో కొందఱు. మఱియు హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, కవీశ్వరులు, పండితులు, తత్త్వవేత్తలు, స్త్రీలు,

పురుషులు—వారు వీ రననేల, నానావిధవ్యక్తులును* శ్రీరామకృష్ణసందర్శనార్థమై వచ్చిరి.

భగవత్సందర్శనైకాయత్తచిత్తుడై పరితపించుచుండిన నరేంద్రుడును వచ్చెను. రాక మానునా?

తే. "అంబుజోదరుదివ్యపాదారవింద
చింతనామృతపానవిశేషమత్త
చిత్త మేరీతి నితరంబు జేర నేర్చు?
*　　　*　　　*"

అని భక్తాగ్రేసరుడగు ప్రహ్లాదుడు వచింపలేదా? మఱియు శ్రీరామకృష్ణాశ్రమస్థాపనాచార్యుడై సనాతన ధర్మపునఃప్రతిష్ఠాపన మొనర్పవలసియుండిన నరేంద్రుడు శ్రీరామకృష్ణసందర్శన మొనరించుట విధ్యుక్తము కదా.

---

* శ్రీరామకృష్ణుని ప్రధానశిష్యులు:

శ్రీ బ్రహ్మానంద, శారదానంద, యోగానంద, నిరంజనానంద, అద్వైతానంద, రామకృష్ణానంద, త్రిగుణాతీతానంద, ప్రేమానంద, అద్భుతానంద, తురీయానంద, సుబోధానంద, శివానంద, అఖండానంద, విజ్ఞానానంద, అభేదానందస్వాములు.

శ్రీ నాగమహాశయుడు, గిరీశచంద్రఘోషు, మహేంద్రనాథగుప్త.

అఘోరమణీదేవి, యోగినీమాయి, గోలప్‌మాయి, గౌరీమాయి.

# పదియవ ప్రకరణము

## గురుచరణ సాన్నిధ్యము

పారమార్థికాశయములతో, మహోత్తమతపశ్చర్యలతో, ఆత్మసందర్శన శక్తిసామర్థ్యములతో గూడిన ప్రాచీనభారతజాతీయజీవనగంగా ప్రవాహమే శ్రీరామకృష్ణుడు. నూతనజాతీయాదర్శములతో, ప్రకృతిశాస్త్ర విజ్ఞానప్రదర్శనములతో, ఆత్మవిషయకసంశయాత్మకభావములతో గూడిన నవీనభారతజాతీయజీవనయమునా ప్రవాహమే నరేంద్రుడు. నరేంద్ర శ్రీ రామకృష్ణుల సమావేశమువలన నవీనప్రాచీనాదర్శముల నద్భుతరీతిని సమన్వ యించునట్టి భారత పునరుజ్జీవనదివ్యవాహిని బయల్వెడలెను. సర్వసంగపరిత్యాగ మును లోకసంగ్రహకర్మాచరణముతో వియ్యమొందజేయుటకై, పాశ్చాత్యుల తీవ్రకార్యదక్షతను భారతీయుల ప్రశాంతియుతాత్మధ్యానదీక్షతో మేళ వించుటకై, సనాతనధర్మపునఃప్రతిష్ఠాపనవిధానముల నన్వేషించుటకై యా దివ్యవాహినియే వివేకానందస్వరూపమును దాల్చెను.

శ్రీరామకృష్ణుని సందర్శింపనెంచిన నరేంద్రు నాతని చుట్టమగు రామ దత్తుడు, "బిలే! పరమార్థమే నీకు వలసినపక్షమున బ్రాహ్మసమాజాదికములకు బోవనేల? దక్షిణేశ్వరములోని శ్రీరామకృష్ణపరమహంసుని కడ కరుగుము" అని ప్రోత్సహించియుండెను. నిమిషమైనను నరేంద్రు డిక నిలువజాలక వాయువేగమున బోయి శ్రీరామకృష్ణపాదారవిందములకడ వ్రాలెను. చంద్రో దయసమయమున సముద్రమువలె నరేంద్రుని జూచినంతనే తన హృదయ ముప్పొంగ శ్రీరామకృష్ణు డాతని నెట్లాదరించెనో తెలియుటకు నరేంద్రుని వచనములే మనకు నిదర్శనములు. అతని వచనములను వినుడు: "...ఆసమయ మున శ్రీరామకృష్ణుడు నన్ను గూర్చుండ నియమించి సంకీర్తన మొనరింపుమని కోరెను. నే నంతట కొన్ని కీర్తనలను బాడితిని. అనంతర మాత డకస్మాత్తుగా

లేచి నాచేయి పట్టుకొని నన్నేకాంత ప్రదేశమునకు దీసికొనిపోయెను. అచట నా కేదియో ఉపదేశ మొనర్చునని తలచితిని. కాని నాయాశ్చర్య మేమని చెప్పుదును? ఆనందపారవశ్యమున బాష్పబిందువులు నేత్రయుగళమునుండి జాలువాఱ, 'ఎంతకాలమునకు వచ్చితివోయి తండ్రీ! ఇంతవఱ కెట్లు నిర్దాక్షిణ్యము వహించితివోయి!' అని యాతడు వివశుడై వచించెను. భావాతిశయ మించుక శాంతించినంతనే మఱల నాతడు, 'నాయనా! చాలకాలము నీకోసము వేచియుంటిని. ప్రాపంచికజనుల తుచ్ఛప్రసంగములను వినుటచే నాచెవులు చిల్లులుపడినవి. ఆహా! నాయాత్మానుభవమునుగూర్చి యొక రసజ్ఞునితో ముచ్చటించుట కెంతగా పరితపించితినోయి! ఇక నీతో బ్రసంగించి నాతాపమును చల్లార్చుకొందును' అని ముదితాంతరంగుడై వచించెను. మఱుక్షణ మాతడు బద్ధాంజలియై నాయెదుట నిలిచి, "ప్రభూ! నీవు నరుడను సనాతనఋషివని—మానవకోటిబాధలను బాపుటకై యవతరించిన నారాయణుడవని—నే నెఱుగుదును" అని పలుకసాగెను!...అనంతర మాతడు కొన్ని మధురపదార్థములను నాచే దినిపించి, 'మఱల ఒంటరిగా, శీఘ్రముగా రావలయును సుమీ!' యని నన్నొడంబఱచి పంపెను."

ఏమహావాంఛచే తాను శ్రీరామకృష్ణుని సందర్శించెనో అట్టిభగవత్సందర్శనైకవాంఛఫలననే నరేంద్రు డాతని సిట్టిప్రేమపాశములచే బంధించివైచెను. ఇవ్విషయమై శ్రీరామకృష్ణుని వచనములను వినుడు:

"ఆసమయమున నరేంద్రునకు బాహ్యప్రపంచమును గూర్చిన స్పృహయే లేనట్లు కాన్పించినది. అతని విశాలనేత్రము లంతరవలోకనాయత్తమైన చిత్తమును విస్పష్టముగా దెలుపుచుండెను. లౌకికచింతానిమగ్నమైన కలకత్తానగరమునుండి యట్టి యాత్మనిరతుడు వచ్చుట నాకాశ్చర్యముగా దోచినది. నా కోరిక ననుసరించి నరేంద్రు డొనర్చిన సంకీర్తనమున,

"మన్ చలో నిజ నికేతనే,

సంసార విదేశే విదేశీర్ వేషే భ్రమ కెనో అకారణే..."

(మనసా ! స్వస్థానమునకు వెడలుదము రమ్ము; విదేశమగు నీసంసారమున పరుడవై ఏల పరిభ్రమించెదవు ?)
అను నాతని గానవాహిని నన్ను బ్రహ్మానందసాగరమునకు గొనిపోయి యందోలలాడించినది. ఆతనిసంకీర్తనమును విని సమాధినిమగ్నుడ నైతిని.

"పిమ్మట నరేంద్రుడు సెలవు తీసికొని వెడలెను. కాని మరల నరేంద్రుని జూచుటకై నేను పడిన పరితాప మింతింతని చెప్పజాలను. తడిబట్టను పిండునట్లు ఆవ్యాకులత నాహృదయమును పిండివైచినది ! దుర్భరవిచారమునకు లోనై పుష్పవనములో నొకమూలకరిగి, "ఓ నరేంద్రా ! నా వద్దకు రమ్ము ! నిన్ను జూడనియెడల నే నెట్లు జీవింపగలను ?" అని యెలుగెత్తి విలపించితిని. ఇట్లొకదినమా, రెండుదినములా ? ఆఱునెల లట్లు గడచినవి. నరేంద్రునితో నితరబాలురును వచ్చినను నాప్రాణములకు ప్రాణమై నన్నాకర్షించినవ్యక్తి నరేంద్రు డొక్కడే."

శ్రీరామకృష్ణుడు తన సాన్నిధ్యమున నుండిన భక్తబృందముతో నరేంద్రు నుద్దేశించి యిట్లు వచించెను: "చూడుడు ! సరస్వతీజ్యోతి యాతని ముఖమున నెట్లు దేదీప్యమానమై వెలుగుచున్నదో !" నరేంద్రుని మూర్తిమత్త్వమును గాంచి వారు సమ్మోహితు లైరి. అంత శ్రీరామకృష్ణుడు నరేంద్రు నిట్లు ప్రశ్నించెను: "తండ్రీ ! నిద్రింపబోవునపుడు నీ కేదైనను జ్యోతి కానవచ్చునా ?" నరేంద్రుడు "ఔను" అని చెప్పినంతనే, "ఆహా! ఇది యథార్థము. ఈతడు ధ్యానసిద్ధుడు—జన్మముతోడనే ధ్యానమున బరిపక్వస్థితిని గాంచిన సిద్ధుడు" అని పలికెను.

శ్రీరామకృష్ణుని చేష్టలును, ఆతని విచిత్రవచనములును నరేంద్రునకు బోధపడలేదు. "నిజముగా ఈత డొక దివ్యపురుషుడా ? కాక యొక పిచ్చివాడా !" అని యాత డాందోళన మొందసాగెను. ఈవిషయమునే తలచి నరేంద్రు డిట్లు వచించువాడు: "నే నాతని సావధానుడనై పరిశీలించితిని. ఆతని వచనములందుగాని వర్తనమందుగాని నా కేదియుం విరుద్ధముగా దోప

లేదు. విశేషము, ఆతని పారమార్థిక ప్రసంగములను సమాధిస్థితులను బట్టి చూడ ఆతడు నిజమైన విరాగివలె కాన్పించెను. శ్రీరామకృష్ణుని వచనములకును జీవితమునకును అద్భుతమగు సామరస్య మున్నదని గ్రహించితిని. ఆతని మాటలు అతిసరళములై బాలునివచనమువలె నుండుటచే 'ఇతడేనా, పరమ హంస?' యని శంకించుచు మెల్లగా నాతని సమీపించి, 'మహాశయా! తాము దేవుని జూచితిరా?' యను నాయెప్పటి ప్రశ్నను వైచితిని. తోడనే ఔను. నిన్ను జూచుచున్నట్లే భగవంతుని జూచుచున్నాను. ఇంతకంటె వేయిరెట్లు ఎక్కువ విస్పష్టముగా జూచుచున్నాను. భగవత్సాక్షాత్కార మును పొందవచ్చును. నే నిప్పుడు ని న్నెట్లు చూచుచున్నానో అట్లే మనము భగవంతుని జూడవచ్చును. నీతో నే నెట్లు సంభాషించుచున్నానో అట్లే మనము భగవంతునితో సంభాషింపవచ్చును. కాని భగవంతునికోసము పరిత పించువా రెవ్వరు? పుత్రసంతానము లేదనియో, కలిమి కలుగలేదనియో కన్నీరు కాలువలు కట్టునట్లు విలపింతురు. కాని భగవంతునికోసము విల పించువా రెవ్వరు? నిజముగా పరితపించినయెడల భగవంతుడు ప్రత్యక్షమై తీరును' అను వాక్యరత్నము లాతని వదనమునుండి వెలువడి నామనఃఫలకమున శాశ్వతముగా ముద్రితములైనవి. ప్రత్యక్షముగా తాను దేవుని జూచితినని వచించిన ధీరుని కనుగొనుటకు అదియే నాకు మొదటిసారి. సాక్షాత్కారమే, స్వానుభవమే, మతమనియు, ఇంద్రియగోచరములగు శబ్దాదులకంటె విస్పష్ట ముగా పరతత్త్వమును దర్శింపగలమనియు నిస్సంశయముగా బల్కిన ధైర్య శాలిని జూచుట కదియే నాకు మొదటిసారి. ఇవ్విషయముల నాతడు సామాన్యబోధకులవలె గాక స్వాత్మానుభవపూర్వకముగా బలికెనని నమ్మకతీరి నది కాదు. కాని యాతని వచనములకును నన్నాదరించుపట్టున నాతని విచిత్రచర్యలకును సామరస్యము నాకు అగపడలేదు. అందుచే నాతడు పిచ్చి వాడని నిశ్చయించుకొంటిని. ఐన నాతని వైరాగ్యమో, అత్యద్భుతము! ఈతడు పిచ్చివాడే యగుగాక. కాని యిట్టి మహోన్నతవైరాగ్యసంపద

యెందఱదృష్టవంతుల కబ్బును? నిజముగా నీతనికి పిచ్చియెత్తినదనుకొన్నను మహనీయుల కెల్ల మహనీయుం డీతడు. యథార్థమైన మహర్షి. ప్రపంచ మీతని పాదసేవ యొనర్పవలయుననుట కీయొక్క కారణము చాలును!' పర స్పరవిరుద్ధములగు నిట్టిభావములతో శ్రీరామకృష్ణునకు పాదాభివందనమాచ రించి సెలవుగైకొని మఱలితిని."

శ్రీరామకృష్ణు డొక పిచ్చివాడని నరేంద్రుడు భావించినను ఆతని సాన్నిధ్యమున తానెద్దియో అపూర్వానందము, ఏదియో అనిర్వచనీయ సౌఖ్యము, ననుభవించియుండెను. తాను పాడినంతనే యాతడు బ్రహ్మానంద పరవశుడగుట, దేహస్మృతిని వీడుట, మఱల స్మృతి కలుగుట, ఆతని యనన్య సామాన్యవిశుద్ధజీవనవిధానము, సరళాతి సరళము లగు నాతని సంభాషణ ములు, శిష్యబృంద మాతని దేవుని రీతి నర్చించు విధానము—ఇవన్నియుం నరేంద్రునకు దిగ్భ్రమకలుగ జేసినవి. ఆతనికి వానితత్త్వము బోధపడలేదు. కాని శ్రీరామకృష్ణునిపై దన కెంతటి మహోన్నతగౌరవభావము కలిగినను, వెంటనే నరేంద్రు డాతని దన గురువుగా నంగీకరింపలేదు. ఆతని సముఖము నకు మఱల వచ్చెదనని వాగ్దానమొనరించినను తన నిత్యకృత్యములతో కాల క్షేపము చేయసాగెను. అటు లొకనెలరైన వెనుక శ్రీరామకృష్ణసముఖమునకు పాదచారియై బయలుదేఱెను. నరేంద్రుని జూచినంతనే శ్రీరామకృష్ణు డపరిమితానందభరితుడై అత్యంతప్రీతిపూర్వకముగా నాతని దనపాన్పుపై గూర్చుండజేసెను. ఉత్తరక్షణముననే యాత డఖండావేశపరవశుడై నరేంద్రు నిపై దృష్టి నిగిడ్చి తనలో తా నేదియో గొణుగుకొనుచు మెల్లగా నాతని సమీపించెను. ఆసమయమున జరిగిన మహాసంఘటనమునుగూర్చి నరేంద్రుని వచనములనే యుదాహరించు టుచితము: "వెనుకటివలెనే యీత డేదియో విచిత్రచర్య నొనర్చును గాబోలు ననుకొంటిని. ఱెప్పపాటుకాలములో ఆతడు తన కుడిపాదమును నాశరీరముపై నుంచెను. తోడనే నా కొక యపూర్వాను భవము కలుగ నారంభించెను. కండ్లు తెఱచుకొని చూచుచుండగనే యా

మందిరము సమస్తవస్తుసహితముగా గిఱ్ఱున దిరుగ నారంభించి క్షణములో అదృశ్యమైనది. నాతో బాటు చరాచరప్రపంచ మంతయు సర్వవ్యాప్తమగు మహాశూన్యమున లయించిపోవుచున్నట్లు తోచెను. అట్టి ఘోరభయంకరస్థితిలో నావ్యక్తిత్వమే నశించిపోవుచున్నట్లు కాన్పింప, నే నిక మృత్యుముఖమున బడుచుంటినని తలచి, 'నన్ను మీ రేమి చేయుచుంటిరి? నా కింట తల్లిదండ్రు లున్నా'రని వివశుడనై పల్కితిని.* అత డట్టహాసమొనర్చి మెల్లగా నా హృదయమును నిమురుచు నిట్లు నుడివెను: 'మంచిది. ఇప్పటికిది చాలును. సర్వము సకాలమున సంప్రాప్తమగును లెమ్ము.' అత్యాశ్చర్యము! ఆత డిట్లు పల్కిన మఱుక్షణమే నావిచిత్రానుభవ మదృశ్యమైనది. మందిరాంతరమందును వెలుపలను సమస్తము మఱల యథాప్రకారముగ గాన్పించెను. మఱల నే నెప్పటి నరేంద్రుడనే యని గ్రహించితిని."

"ఇది యంతయు ఇంద్రజాలమా, యథార్థమా?" యని నరేంద్రు డాశ్చర్యచకితుడై వితర్కింపసాగెను. శ్రీరామకృష్ణు డాతని కొక మహాసమస్యగా దోచెను. "ఏమైనను మఱల నాతని సమ్మోహనవిద్యకు వశ్యుడను గారా"దని నరేంద్రుడు నిశ్చయించుకొనెను. శీఘ్రముగా మఱల వచ్చెదనని వాగ్దానమొనరించిన వెనుక శ్రీరామకృష్ణు డాతనికి సెల వొసంగెను.

---

* ఇవ్విషయమునే స్మరించుచు శ్రీరామకృష్ణు డొకప్పు డిట్లు నరేంద్రుని పరిహసించెను: "ఒకప్పుడొకడు చనిపోయి దయ్యమయ్యెను. ఆదయ్యము ఎవరైనను తోడు దొరకుదురాయని పరితపించుచుండెను. ఎవరైనను చనిపోయిరని విననంతనే అత్రముతో అచటికి వెడలుచుండెడిది, కాని తన దురదృష్టవశమున—విశేషము అవ్యక్తిపూర్వపుణ్యవశమున—ఆజీవుడు ముక్తుడగుట సంభవించుటచే ప్రతిపర్యాయము నిరాశతో వెనుకకు మఱలుచుండెడిది. నాస్థితియు ఇట్లేయున్నది. నిన్ను చూచినంతనే నాకొకమిత్రుడు దొరకెనని మురిసితిని కాని నీవో, 'నా కింట తల్లిదండ్రులున్నారు' అంటివి! ఆకథలోని దయ్యమువలె నేను ఏకాకినై యున్నాను."

అచిరకాలముననే నరేంద్రుడు మఱల శ్రీరామకృష్ణుని సందర్శించెను. శ్రీరామకృష్ణుడాతని చెంతనున్న పుష్పవనమునకు గొనిపోయి, కొంతసే పందు విహరించి, మఱల నరేంద్రునితో దన మందిరమున కరుదెంచెను. వెంటనే యాతడు సమాధినిమగ్నుడై నరేంద్రుని స్పృశించెను. శ్రీరామకృష్ణ సద్భక్తి ప్రభావ మను సూర్యరశ్మిచే నరేంద్రుని నిశ్చయమను మంచు కరగిపోవ బరిపూర్ణముగా నాతడు బాహ్యస్మృతిరహితు డయ్యెను. కొంతసేపైన వెనుక స్మృతి కలుగ చూచుసరికి శ్రీరామకృష్ణుడు తన హృదయమును మెల్లగా నిమురుచుండెను.

శ్రీరామకృష్ణు డాసమయమున నరేంద్రునిగూర్చి గ్రహించిన యద్భుతవిషయము లనేకములు గలవు. ఇవ్విషయమునే తలచి యాత డిట్లు వచించెను : "ఆస్థితిలో నరేంద్రు ననేక ప్రశ్న లడిగితిని. ఆతని పూర్వజన్మ వృత్తాంతమునుగూర్చియు ఈలోకమున నాతని మహోద్యమమునుగూర్చియు ఆయుఃపరిమితిగూర్చియు బ్రశ్నింప నాతడు అంతర్ముఖుడై నాప్రశ్నల కన్నిటికిని సదుత్తరముల నొసగెను. ఆతనిగూర్చి నాకిదివఱకే కలిగిన యభిప్రాయము లాసమాధానములచే మఱింత బలపడినవి. అవి యన్నియు పరమరహస్యములు. కాని, యాతడు ధ్యానసిద్ధుడనియు, ఆత్మద్రష్టయగు మహర్షియనియు, నిజస్వరూపమును గ్రహించిన మఱుక్షణముననే యోగమార్గమున శరీరత్యాగ మొనర్చుననియు గ్రహించితిని."

నరేంద్రుడు తన్ను సందర్శించుటకు పూర్వమే శ్రీరామకృష్ణుడు దివ్యదృష్టిచే నాతనిగూర్చి గ్రహించిన విషయము లత్యాశ్చర్యకరములు. నరేంద్రుని జననమునకు పూర్వ మొకనాడు గగనమండలమున కాశీక్షేత్రమువైపు నుండి కాళీఘట్టము (కలకత్తా) వైపునకు దివ్యతేజము మెఱసినట్లు గాంచెను. తోడనే యాతడు, "నాప్రార్థన సఫలమైనది, నాప్రియబాలకుడు నావద్దకు వచ్చితీరును" అని ఆనందపరవశుడై వచించెను. సమాధిస్థితుడై యుండ మఱి యొకప్పుడు శ్రీరామకృష్ణునిచిత్తము తారామండలమును దాటి దివ్యతేజఃపథ

మున విహరింప సాగెను. అందు గాన్పించిన దేవతాస్వరూపముల నతిక్రమించి నిరామయమగు లోకమున నాతడు సప్తర్షులను సందర్శించెను. అంత తేజో మండలమున నొకభాగము దేవతాశిశురూపము దాల్చెను. తోడనే యాశిశువు సప్తర్షులలో నొకనిని తన చిన్నిముద్దుచేతులతో ఆలింగనమొనర్చుకొని మధుర స్వరమున నాతని బలుకరించుచు సమాధినిష్ఠమగు నాతనిచిత్తమును బహిర్ముఖ మొనర్చుటకై యత్నింపసాగెను. ఆదివ్యస్పర్శచే నాత డతీంద్రియావస్థనుండి వెలువడి యర్ధనిమీలితలోచనుడై ప్రేమతరంగములను బాలునిపై బ్రసరింప జేయ బాలు డమందానందపరవశుడై, "నేను క్రిందికి బోయెదను. నీవును నాతో రావలయును సుమీ" యని వచించెను. ప్రేమపూరితమగు మహర్షి చూడ్కులే యందుల కాతని యంగీకారమును సూచింప, క్షణములో దివ్య తేజఃకిరణరూపమును దాల్చి యాతని మనశ్శరీరాంశము భూమండలమున నవతరించుచున్నట్లు శ్రీరామకృష్ణునకు గోచరించెను. "ఆమహర్షియే నరేంద్రు" డని శ్రీరామకృష్ణుడు నరేంద్రుని జూచినంతనే గుర్తించెను. * మఱియు నాత డిట్లు వచించెను: "ఆదివ్యతేజమును అంతను భరించుటకు ప్రపంచము నకు శక్తి చాలదు. లోకమున నేటిలోపములను దీర్చుటకాకిరణ మొక్కటియే చాలును; తచ్ఛక్తివలన మహాద్భుతములు జరుగగలవు."

శ్రీరామకృష్ణుని పాదస్పర్శవలన తన కపూర్వదివ్యానుభవము కలిగిన దాది నరేంద్రుని మనోభావ మాతనియెడ సంపూర్ణముగా మాఱిపోవ నారం భించెను. శ్రీరామకృష్ణుడు పిచ్చివాడు కాడనియు, అహంకార మమకార పాశబద్ధులై, కామకాంచననిర్మితసంసారమున దగుల్కొని లోక మను నున్మత్తశరణాలయమున వసించు మదోన్మత్త ప్రమత్తజనసహస్రములమధ్య మున ఆతడొక్కడే సుస్థిరమతి యనియు, ధీరాగ్రేసరు డనియు నరేంద్రుడు గ్రహింపసాగెను. ఐనను ప్రథమసమావేశమున శ్రీరామకృష్ణుడు తన్ను గూర్చి

---

* తానే యాదివ్యబాలకుడనని మఱియొకప్పుడు శ్రీరామకృష్ణుడు తెలిపియున్నాడు.

వచించిన వాక్యములు నరేంద్రున కింకను భ్రాంతిగా అవగతముకాలేదు. బంగారమును గీటుఱాతిపై బరీక్షించు చందమున శ్రీరామకృష్ణుని దివ్యానుభవ వర్తనముల నాతడు తన తీవ్రవిమర్శనశక్తిచే బరిశోధించిననే కాని తా నాతని శిష్యాగ్రగణ్యుడై యొనర్పవలయు మహాకార్యమును చక్కగా గ్రహింపలేదు.

పారమార్థికవిషయములందు నరేంద్రు డింకను ప్రచలితమానసుడే. కాని, స్వానుభవమే యాతనికి పరమగురువు. ఏవిషయమునుగాని యెవ్వడో యొకమహాపురుషుడు వచించినంతమాత్రమున, ఏదియో యొకగ్రంథమున లిఖింపబడినంతమాత్రమున, విశ్వసించు టాతని స్వభావమునకు విరుద్ధము. పరమార్థము విషయమై యాత డెంతటి పరితాపము నైనను మనఃపూర్వకముగా వరించును. సత్యాన్వేషణబద్ధకంకణుడై యాత డెట్టి ఘోరమానసికయాతనల నెదిర్చి నిల్చెనో యెవ్వ రూహింపగలరు ?

సత్యాన్వేషణసంగ్రామమున నె ట్లెన్ని మానసికయాతనలు నరేంద్రు డనుభవించెనో శ్రీరామకృష్ణుడు నట్లే అనిర్వాచ్యయాతనల నన్నిటిని అనుభవించెను. మన శ్శరీరము లను దివ్యలోహములను సాధనాగ్నిజ్వాలలందు గాల్చి తితిక్ష యను దాకటిపై గొట్టి నిర్మించిన దివ్యాభరణము శ్రీరామకృష్ణుని జీవితము. కావున నరేంద్రు డెంతటి సంశయాందోళితమానసుడైనను తీవ్రజిజ్ఞాసచే తుదకు సంపూర్ణవిజయము గాంచి వేదాంతకేసరియై వెలువడునని గ్రహించు టాశ్చర్యము కానేరదు.

## పదునొకండవ ప్రకరణము

# గురుశిష్యులు

శ్రీరామకృష్ణపాదసాన్నిధ్యమున నరేంద్రుని జీవితము అపూర్వదివ్యభావములతో, అద్వితీయాదర్శములతో, అఖండాత్మానుభూతితో విరాజిల్లిన పారమార్థికజీవన ప్రపంచమని చెప్పనొప్పును. శ్రీరామకృష్ణనరేంద్రుల గురుశిష్యసంబంధము అత్యద్భుతము. అన్యోన్యమగు వారల ప్రేమతాత్పర్యములనుపమానములు. రామకృష్ణవివేకానందు లొకేశరీరమున నెలకొనియుండు మనఃప్రాణములనియు, జీవాత్మలనియు భావింపనగును. శ్రీరామకృష్ణవివేకానంద శిష్యబృంద మిట్లే భావించును.

ఏపుణ్యానిమేషమున నరేంద్రుడు, "మహాశయా! తాము దేవుని జూచితిరా?" యని శ్రీరామకృష్ణుని ప్రశ్నించెనో ఆతరుణముననే యాతని పారమార్థికజీవనకల్పతరువు పుష్పింప నారంభించెను. శ్రీరామకృష్ణునఖండాధ్యాత్మికశక్తి నరేంద్రునియందు ప్రవేశించిన సమయమున నయ్యది సంపూర్ణ వికాసము గాంచెను. గురుసందేశమును నరేంద్రుడు ప్రాచ్యపాశ్చాత్యఖండములందంతటను వ్యాప్తియొనర్చి, సనాతనధర్మోద్ధరణము గావించినప్పు డయ్యది ఫలోన్ముఖమై విలసిల్ల నారంభించెను.

భగవత్సాక్షాత్కారమహాభాగ్యమును బడసినగురుజను లాదివ్యసంపద నెన్నడును తా మొక్కరే యనుభవింపనొల్లరు; అర్హులగువారల కద్దానిని లభింపజేయుంటకై ఆతురపడుచుందురు. శ్రీరామకృష్ణుడు నరేంద్రు నమితముగా ప్రేమించుట కిదియే ముఖ్యకారణము. నరేంద్రు డెందుచేతనైన గొన్ని దినములవఱకు రాకున్నచో శ్రీరామకృష్ణుడు కాళీమాత దనకు గాన్పింపని సమయమున నెట్లు తల్లడిల్లెనో అట్లు తల్లడిల్లువాడు. నరేంద్రుడు రాకుండుటచే నాతడు కాళికాదేవిని సమీపించి, "తల్లీ! జగజ్జననీ! అతని జూడనిచో

నేను జీవింపజాలను. కరుణించి యాతని రప్పింపుము" అని ప్రార్థించిన సమ
యము లనేకములు కలవు. "వృద్ధుడనగు నే నొక బాలునికొఱ కిట్లు పరిత
పించుట జూచి జను లేమనుకొందురో! ఏమనుకొనిన నేమి? ఈ పరితాపమును
నేను భరింపజాలను" అని యాత డట్టివేళల దనయొద్దనున్న భక్తజనులతో
వచించును. కాళీదేవియనుగ్రహముననో యనునట్టు లాసమయముననే
నరేంద్రు డరుదెంచును. శ్రీరామకృష్ణు డాతని జూచినంతనే ఆనందపార
వశ్యమున సమాధిస్థితిని జెంద నితరశిష్యు లది చూచి యబ్బురపడుచుండు
వారు. "నరేంద్రునిపై నీతని కింతటి పక్షపాత మేల ?" యనియు గొందఱు
తలంపక పోలేదు. ఏమైన నేమి ? ఆదినములలో శ్రీరామకృష్ణు డప్రయత్న
ముగా నరేంద్ర నామమును జపించెను; ఆతనికొఱకే తపించెను. ఆకసముకంటె
నున్నతమును, సాగరముకంటె నగాధమును నగు మాతృప్రేమను మించిన శ్రీ
రామకృష్ణుని ప్రేమతత్త్వము నరేంద్రునకు దురూహ మయ్యెను.

శ్రీరామకృష్ణుని మృదులబాలహృదయమును, భగవద్భక్తిపారవశ్య
మును నరేంద్రుని ముగ్ధుని గావించినచో, తన శిష్యునచంచలాత్మవిశ్వాసమును
దైవసందర్శనైకదీక్షయు నాతని నరేంద్రునియెడ ప్రేమపాశబద్ధునిగా నొన
ర్చెను. కాని శ్రీరామకృష్ణుని విశుద్ధప్రేమమును మోహముగా నెంచి నరేంద్రు
డొకప్పు డిట్లు విమర్శించెను: "ప్రతినిమేషము మీరు నన్నేల తలచెదరు ?
అట్లు భావించిన నిక నేనే మీరగుదురు. పూర్వము జడభరతుడు తన లేడి
పిల్లనుగూర్చి మోహపాశబద్ధుడై తదేకధ్యానముతో ప్రాణములు విడిచి మఱు
జన్మమున లేడియై పుట్టెను. మీకును అట్టిగతియే కలుగును." ఈపలుకులచే
తన ముగ్ధహృదయము కలతనొంద నాతడు, "నిజమే నీవు చెప్పినది. నిన్ను
విడువజాలకుండుటచే నాగతి యేమగునో కదా!" యని వచించి సంతప్తుడై
కాళికాలయమున కేగెను. కొలదినిముసము లైనంతనే మందహాసవదనార
విందుడై వెలువడి, "నరేన్! చాలు నీ పాండిత్యము. నే నిక నీ మాటలను
నమ్మెద ననుకొంటివా ? నీలో నే నంతరాత్ముడగు నారాయణుని జూచుటచే

నిన్ను ప్రేమించుచుంటినని తల్లి నాకు జెప్పినది. ఇందుల కభ్యంతరము కలిగిన వాడు నీమొగము జూచుటయే దుర్భరమగునని పల్కినది" అని గంభీరముగా వచించి తన ప్రేమమును గూర్చిన యాతనివిమర్శనమును తృణీకరించెను. నరేంద్రుడు తాను చేసిన ప్రతిఘటనములకు లజ్జావనతవదను డయ్యెను. గురు వాక్యములచే ఆతడు సమ్మోహితు డయ్యెను.

విషయము తెల్లమైనది. తమయందును నరేంద్రు నందును గురుదేవునకు గల యఖండానురాగమునకు హేతువు తమయందలి నారాయణాంశమే యని శిష్యులందఱకు వ్యక్తమైనది. శ్రీరామకృష్ణు డిట్లు వచించును: "ఈ బాలురందఱును సాక్షాన్నారాయణస్వరూపులుగా భావింతును. నరేంద్రుని మొదట చూచినపు డాతడు దేహాభిమానరహితుడై కనపట్టెను. నే నాతని హృదయమును తాకినంతనే యాతడు బాహ్యస్మృతి వీడెను. ఆతని జూడ వలయునను నాతీవ్రవాంఛ కిదియే కారణము. ఆతని జూడనిచో నే బరితపింతును" అని మఱల నిట్లు తెల్పును: "సమాధిస్థితినొందినవాని చిత్తము వ్యావహారికదశలో పరమసాత్త్వికుల సంసర్గమున మాత్రమే రమించునట. నాపరితాపమున కిదియే కారణము."

శ్రీరామకృష్ణుడు నరేంద్రుని పారమార్థికప్రతిభాతిశయమును ఇట్లు విస్పష్ట మొనర్చును: "నరేంద్రుడు వేదములలో జెప్పబడిన హోమపక్షివంటి వాడు. అది మహోన్నతస్థానమున నివసించును. దినములకొలది యాపక్షి గ్రుడ్లు క్రిందబడుచు, పతనవేగసంజాతమైన ఉష్ణముచే మార్గమధ్యముననే పిల్లలయి పై కెగిరిపోవును. అట్లే నరేంద్రుడు లోకాతీతలోకమునుండి ప్రభవించి, మాయ తన్ను బంధింపగల్గుటకుముందుగనే మోక్షసౌధమునకు ఱివ్వున నెగిరిపోవ నేర్చినవాడు.

"ఇచ్చటకు వచ్చు ముముక్షువులలో నరేంద్రునకు నరేంద్రుడే సాటి. వీరిలో నొక డష్టదళపద్మమును మఱియొకడు షోడశదళపద్మమును ఐనచో నరేంద్రుడు సహస్రదళపద్మము.

"నరేంద్రుడు సర్వసంపూర్ణ స్వతంత్రుడు. కామరాగముల కాత డధీనుడు కాడు. ఇచటకు వచ్చువారిలో నరేంద్రుని జూచినంతనే నే నఖండధైర్యబలాన్వితుడ నగుదును.

"చూడు డీబాలు డెంత వినమ్రుడో! ఎంత శాంతమూర్తియో! ఈతడు నిత్యసిద్ధుడు, ఆజన్మబ్రహ్మజ్ఞాని. ఇట్టి వా రీశ్వరకోటిలోనివారు, ఆచార్యకోటిలోనివారు. వీరు జగద్గురుత్వము వహించుటకై జన్మించుచుం దురు. వీరు పొందు శిక్షణమంతయు లోకకల్యాణమునకే.

"ఒకమహాలక్షణముచే కేశవచంద్ర సేనుడు ప్రఖ్యాతుడైనచో అట్టి లక్షణములు నరేంద్రునందు పదునెనిమిది కలవు. కేశవచంద్రునందును విజయకృష్ణునందును జ్ఞానము దీపమై వెల్గుచుండ నరేంద్రునియం దయ్యది ప్రచండసూర్యబింబమై ప్రజ్వలించుచున్నది." కేశవచంద్ర సేనుని శ్రీరామ కృష్ణు డమితముగా ప్రేమించెను. శ్రీరామకృష్ణ వాక్యామృతసాగరమే కేశవ చంద్ర సేనుని బోధలందు ప్రతి ధ్వనించినది.

తన్ను గూర్చినట్టి శ్రీరామకృష్ణుని సంభాషణలను విని నరేంద్రు డిట్లు వచించువాడు: "మహాశయా! మీ రట్లు పల్కిన జనులు మీకు మతిపోయిన దని భావింతురు. అఖండ యశోధురీణుడగు కేశవచంద్ర సేను డెక్కడ! ముక్కుపచ్చలారని విద్యార్థినగు నే నెక్కడ! మహనీయుండగు విజయకృష్ణ గోస్వామి యెక్కడ! అల్పుడనగు నే నెక్కడ! దయయుంచి న న్నిక వారితో బోల్పకుడు." నరేంద్రుని వినయసంపదను గాంచి, శ్రీరామకృష్ణు డలరి, నెమ్మదిగా నిట్లు వచించును: "ఓయీ, నరేంద్రా! నే నట్లు చెప్పక తప్పదు. ఇవి నామాటలని తలచుచుంటివా? అతల్లి నాకు దెల్పిన విషయము లివి. తల్లి నాతో ఎన్నడును అసత్యము చెప్పదు." నరేంద్రు డింకను ప్రతి ఘటించును.

శ్రీరామకృష్ణుడు నరేంద్రుని ప్రత్యేకభావముతో జూచును. శిష్యు డొనర్పవలయు గురుశుశ్రూష నరేంద్రుడు తన కొనర్చుట కాత డంగీక

రింపలేదు. సాక్షాత్ శివస్వరూపుడగు నరేంద్రుడు తనకు సేవచేయుంట యధర్మముగా దలచి యుండనోపును. "నీయందు శివుడు ఉన్నాడు. నాయందు శక్తి కలదు. ఇవి రెండును ఒక్కటే" అని యాతడు వచించును. సేవ యంతయు చిత్తశుద్ధికొఱకైనచో ఎవ్వని హృదయము ఈవఱకే పరమ పవిత్రమై యున్నదో అట్టివాడు సేవచేయు టెందులకు! ఐనను వినయ మూర్తియగు నరేంద్రుడు సేవచేసెదనని పట్టుపట్టిన, "నీమార్గము వే"అని శ్రీరామకృష్ణుడు నివారించును! నరేంద్రు నెవ్వరైనను ఇంచుక నిర సించినచో, "శివనిందాపాపమున గొడిగట్టుకొనకు"మని వారించుచు శ్రీరామ కృష్ణు డిట్లు వచించును: "నరేంద్రుని చర్యల నెవ్వరును విమర్శింపకుందురు గాక! అతని గుణస్వభావములను పూర్తిగా గ్రహింప నెవరి తరము?" ఎవ్వరో యొకప్పుడు నరేంద్రుడు దుష్టజనసహవాసమున చెడిపోవుచుండె నని పలుక నాత డావేశపూరితుడై యిట్లు వచించెను: "అబద్ధ మది. నరేంద్రు డెన్నడును దుర్వృత్తులకు లోను గాడని తల్లి నాకు జెప్పినది. అతనిగూర్చి నీ వధికప్రసంగము చేసిన నే నిక నీమొగము చూడబోవను!"

ఈవిధముగా శ్రీరామకృష్ణుడు శిష్యులలో నరేంద్రుని ప్రత్యేక దృష్టితో జూచువాడు. ఆహారవిహారాదులలో ఇతర శిష్యుల కెన్ని నియ మము లేర్పఱచినను నరేంద్రున కట్టి నిర్బంధము లేవియు లేవు. "నరేంద్రుడు నిత్యసిద్ధుడు; ధ్యానసిద్ధుడు. జాజ్వల్యమానమగు నాతని జ్ఞానాగ్ని దహింప జాలని యపరిశుద్ధాహారమే లేదు. గోమాంసమును తిని జీవించుగాక; నరేంద్రున కీషన్మాత్రమును దోషము కలుగదు" అని వచించును. ఎవ్వరైనను మధురాహారములను దన కర్పింప వచ్చినచో, వారి స్వభావోద్దేశములు నిష్క ళంకములని తోచిననే కాని శ్రీరామకృష్ణుడు స్వయముగా వానిని గ్రహించు వాడు కాడు; శిష్యులును ముట్టుటకు వీలులేదు. కాని నరేంద్రుడు భుజింప వచ్చును. నరేంద్రుడు రానిచో నాతని యింటికి బంపును. ఒకప్పు డన్న విక్రయశాలలో భుజించి, "నేడు నిషిద్ధాహారమును దింటి"నని నరేంద్రుడు

వచింప గురుదేవు డిట్లు వక్కాణించెను: "దాన నీకు దోషము లేశమును లేదు. ఎవ్వడు గోమాంసము తినియుం దన మనసును భగవదాయత్త మొన ర్చునో వాని కది పరమపవిత్రమగు హవిష్యాన్నము. విషయలోలు డగువాడు భుజించిన హవిష్యాన్నమో, గోమాంసముతో సమానము. నీవు నిషిద్ధాహార మును దిన్నను బాధలేదు. కాని, (ఇతర శిష్యులను జూపుచు) వీరిలో ఎవ్వ డట్లు చేసినను వాని స్పర్శనైనను నేను భరింపజాలను."

శ్రీరామకృష్ణుని వచనము లమోఘములు కదా! నరేంద్రుడు వివేకా నందుడై పశ్చిమఖండమున వేదాంతమతవ్యాప్తి గావించుచుండిన సమయమున అసహనముచే గొందఱు క్రైస్తవమతప్రచారకు లాతని యాహారపానీయము లనుగూర్చి దుష్ప్రచారములు చేయ నారంభించిరి. అప్పుడు శ్రీరామకృష్ణుని శిష్యు లిట్లు గురువాక్యములను స్మరించి సమాధానము నొందిరి: "పశ్చిమఖండ మున ఆయతివరేణ్యుడు తన సందేశము నొసగుచు నొక నవీనాచారము నుల్లం ఘించె నన్నంతమాత్రమున మునిగిపోయినదేమి? ఆతని విశుద్ధజీవితాగ్నిజ్వాల కెట్లు కళంకము వాటిల్లును? సర్వసంపూర్ణ స్వతంత్రు డగు యతీశ్వరుడు కదా యాతడు!"

బ్రాహ్మసమాజసభ్యు డగు నరేంద్రు డాదినములలో విగ్రహారాధన మును తీవ్రముగా నిరసించువాడు. తన సోదరశిష్యుడగు రాఖల్ (బ్రహ్మా నందస్వామి) కాళికాలయమున విగ్రహములకు మ్రొక్కుచుండుట గాంచి, "ఏమి యవివేకము!" అని నిరసించెను. శ్రీరామకృష్ణు డది విని నరేంద్రు నిట్లు మందలించెను: "నాయనా! సగుణారాధకు నాతని మనసు కలవరపెట్ట కుము. మొట్టమొదటనే ప్రతిమానవుడు నిర్గుణబ్రహ్మసాక్షాత్కారమును బొందజాలడు." కాని నరేంద్రునకు మనస్సమాధానము కలుగలేదు. ఇవ్విష యమై యాత డదేపనిగా శ్రీరామకృష్ణునితో దర్కింప నారంభింపగా ఆతడు ప్రాణము విసివి, "నా దివ్యమాత నంగీకరింపనున్న నీ విచ్చటకు రానేల? పొమ్ము" అనియెను. "ఇచటకు వచ్చినంతమాత్రముననే నేను మీ కాళీ

మాతృసిద్ధాంతము నంగీకరింపవలయును కాబోలును!" అని నరేంద్రుడు నిర్భయుడై వచించెను. అంత శ్రీరామకృష్ణుడు, "నరేన్! తొందరపడకుము. నాజగన్మాతను స్మరించి నీవు విలపించు దినములు వచ్చితీరును" అని వచించెను.* ప్రత్యక్షరమును గురువాక్యము లెట్లు యథార్థము లయ్యెనో, నరేంద్రుడు వివేకానందుడై విగ్రహారాధనము నెట్లు సమర్థించెనో ముందు చూచెదము.

నరేంద్రున కద్వైతవేదాంతరహస్యముల నుపదేశించుటయే ప్రథమమునుండియు శ్రీరామకృష్ణుని ముఖ్యోద్దేశము. కాని బ్రాహ్మసమాజవాసనలు బలీయములై యుండుటచే నరేంద్రునకు జీవబ్రహ్మైక్యసిద్ధాంతము దురూహ మయ్యెను. అద్వైతాశ్రమస్థాపనాచార్యుడైన నరేంద్రున కాదినములలో అద్వైతవాదము 'తలకు రోకలి చుట్టు మన్న' ట్లుండెడిది! ఒక

* గురుశిష్యసంవాదవిషయములలో మఱియొక ముఖ్యవిషయము రాధాకృష్ణలీల. రాధ కల్పితవ్యక్తియనియు ఒకవేళ వాస్తవవ్యక్తియై యుండినను శ్రీకృష్ణునితో ఆమెబాంధవ్యము నింద్యమనియు నరేంద్రుడు భావించి శ్రీరామకృష్ణునితో వాదింపసాగెను. కాదని తా నెంత బోధించినను శిష్యునకు నమ్మకము కలుగమి తుదనొకనాడు ఆత డిట్లు వచించెను: "నాయనా! వినుము. రాధ కల్పితవ్యక్తియనియు, ఈ యుపాఖ్యానము ఏభక్తుడో కల్పించినదనియు మాటవరుసకు అంగీకరించినను కృష్ణపరమాత్మనుగూర్చిన యామె పరితాపమును గోపికలపరితాపమును నీవేల లక్షింపరాదు? బాహ్యవృత్తాంతమును బట్టుకొని యేల ప్రాకులాడెదవు? ఇది యంతయు నీవు మానవచరిత్రగా దోచినను గోపికలపరితాపమును వారల సాక్షాత్కారమును నీవు దివ్యములని గ్రహింపక తప్పదు." నరేంద్రుడు వివేకానందుడై కాలాంతరమున తన భక్తియోగోపన్యాసములలో గురూపదేశమును స్మరించుచు నిట్లు వక్కాణించి యున్నాడు: "బృందావనగోపికలు శ్రీకృష్ణు నెట్లు ప్రేమించిరో, ఆధన్యురాండ్రు ఎటు లాతనివేణుగానమును వినినంతనే సమస్తము మఱచి—సంసారమును, సంసారబంధములను, సుఖదుఃఖములను, విధులను సమస్తము మఱచి—కృష్ణుని గలిసికొనుటకై యిలు వీడి పరుగెత్తిరో మానవభాష వర్ణింపజాలదు."

ప్పుడు నరేంద్రుడు తన మిత్రునితో, "ఈకూజా బ్రహ్మము, ఈబల్ల బ్రహ్మము, మనముకూడ బ్రహ్మమే! ఎంతటి యవివేకము, అక్రమము, అస్వాభావికము!!—" అని యేమేమో పలుకుచుండ శ్రీరామకృష్ణు డాతని సమీపించి, "బాలుడా! ఏ మనుచుంటివి?" అని నవ్వుచు నాతని స్పృశించి సమాధినిమగ్ను డయ్యెను.

ఇక నరేంద్రుని మనఃస్థితి యేమైనది? చరాచరప్రపంచమం దంతటను బ్రహ్మము దక్క రెండవవస్తువేదియు గాన్పింపకుండుటచే నాతడు ఆశ్చర్యచకితు డయ్యెను! భుజించుటకు గూర్చుండుసరికి భోజ్యపదార్థములు, భోజనపాత్రము, భోజనమిడు తల్లి, భోక్తయగు తాను, సమస్తము బ్రహ్మమై గోచరింప నరేంద్రుడు నిశ్చేష్టు డగును. అతని గాంచి, 'తిన వేమి నరేంద్రా!' యని తల్లి వచింప నాత డదేపనిగా తిననారంభించును! ఈమనఃస్థితి యించుక మాఱినంతనే ప్రపంచ మాతని కొక స్వప్నముగా గాన్పింపసాగెను. ఇనుపకంచెలను గాంచి యవి స్వప్నకల్పితమో యథార్థమో గ్రహించుటకై తలతో వానిని ఢీకొనును. ఇట్లనేకదినములు గడచెను. తుదకు అద్వైతసిద్ధాంతము నరేంద్రుని మనఃఫలకమున ముద్రితమై నిల్చెను. అద్వైతతత్త్వ మాతనికి ప్రత్యక్షగోచర మయ్యెను. శ్రీరామకృష్ణునియందు నరేంద్రుని భక్తి తాత్పర్యములు సహస్రగుణాధికములై యొప్పెను.

తన దివ్యానుభవములను విమర్శనప్రదీపకాంతిచే బరిశోధింపుడని శ్రీరామకృష్ణుడు శిష్యుల కిట్లు వచించును: "వర్తకులు రూప్యములు మ్రోగించి నాణెముచేసినట్లు నన్ను బరీక్షింపుడు. పరిపూర్ణముగా బరీక్షించిననే కాని నామాట లంగీకరింపకుడు." ఈమాటలు జ్ఞప్తిలో నుంచుకొని నరేంద్రుడు గురుదేవుని బరీక్షింప సమకట్టెను. శ్రీరామకృష్ణుడు శిష్యసమేతుడై యొకనాడు కలకత్తాకు వెడలెను. ఇక నాతని గదిలో నెవ్వరును లేరు. నరేంద్రుడంత నొక వెండినాణెమును శ్రీరామకృష్ణుని పాన్పుమడతలలో బెట్టెను. శ్రీ రామకృష్ణుడు కలకత్తానుండి వచ్చి పాన్పుపై గూర్చుండెను. తోడనే

యాతని శరీరము మంటలెత్త నారంభించెను; వణకిపోసాగెను. తటాలున నాతడు పాన్పు దిగెను. కారణ మెవ్వరికిని దెలియదు. నరేంద్రుడు మాటాడక చూచుచుండెను. వెంటనే శిష్యు డొకడు పురు గేదైన నున్న దేమోయని పాన్పు తీసి దులుపగా కంగున వెండినాణెము క్రిందబడెను. "ఇది యిచ్చటి కెట్లు వచ్చిన"దని శ్రీరామకృష్ణుడు ప్రశ్నించుచుండ నరేంద్రుడు మెల్లగా బయటికి వెడలెను. నరేంద్రుని ముఖలక్షణములను గాంచి, సంగతి గ్రహించి, శిష్యుడు తన్ను బరీక్షించినందులకై శ్రీరామకృష్ణుడు సంతసించెను. అద్భుతమగు నాతని కాంచనజయమును గాంచి శిష్యులు నిశ్చేష్టులైరి. సాధనదశయం దాతడు అంతఃకరణము నేకాక కర్మేంద్రియములను సహితము నివృత్తివశ మొనర్చుటచే కాంచనాదిలోహములయందునికి గ్రహించి వణకిపోవునట్టి యద్భుతస్థితి వాని కబ్బెను. జితేంద్రియత్వమున కింతకంటె పరమావధి యెద్ది?

సత్యాన్వేషణమున శ్రీరామకృష్ణుడు తన మానసమును చెఱకుగడ్డను గానుగలో వైచి పిండునట్లు పిండివిడిచెను. బ్రహ్మానందరస మాతనికి బుష్కలముగా లభించినది. నిర్వికల్పసమాధి కరతలామలక మైనది. "మీస్థితి సామాన్య మానసికస్థితి. నామనస్సు సర్వదా సమాధిస్థితి కున్ముఖమై యుండును. వ్యావహారికస్థితికి వచ్చుటకై నేను ప్రబలయత్నముచేయవలయును" అని శ్రీరామకృష్ణుడు వచించును. పుష్పములను గ్రహించి శివార్చన మొనర్పబోవునంతలో సమాధినిమగ్నుడు కా నవి చేతినుండి జారి భూదేవి నలంకరించును. కాళికాదేవి నర్చించుట కమర్పబడిన గంధపుష్పాదులను స్వశిరమున నిడుకొని నిశ్చల సమాధినిమగ్నుడై యొప్పును.

ఇట్టి శ్రీరామకృష్ణుని జితేంద్రియత్వమును కాంచనజయమును కన్నులార గాంచి నరేంద్రుడు వివశుడయ్యెను.

పరిపూర్ణముగా పరీక్షించిననేకాని శ్రీరామకృష్ణు డెవ్వరిని శిష్యులుగా నంగీకరించువాడు కాడు. కఠినపరీక్షలకు దాళినిదే నరేంద్రు డాతని శిష్యుడు

కాలేదు. నరేంద్రుని శరీరమును బరిశోధించి శ్రీరామకృష్ణు డిట్లు వచించెను: "నీశరీరలక్షణములు మంచివే. కాని నిద్రించునపుడు నీయూపిరి కొంచెము భారముగా నుండును. దీర్ఘాయుర్దాయమున కిది లక్షణము కాదని యోగులు వచింతురు." మఱియొకప్పు డిట్లు పలికెను: "నీవు శుష్కవేదాంతివి కావు. గాఢమగు భక్తియు ప్రదీప్తమగుజ్ఞానమును నీయందు సమ్మేళన మొంది యున్నవని నీకన్నులు తెలుపుచున్నవి."

శ్రీరామకృష్ణు డొకప్పుడు నరేంద్రు నతికఠినముగా బరీక్షించెను. నరేంద్రుని జూచినచో శ్రీరామకృష్ణు డెట్లానందపరవశుడగునో చూచియుంటిమి గదా. ఆతని గాంచినంతమాత్రముననే శ్రీరామకృష్ణుడు సమాధిస్థితిని జెందిన సమయము లనేకములు కలవు. అట్టి నరేంద్రుడు వచ్చినచో నాత డిక పలుకరింపడయ్యెను. కన్నెత్తియైనను జూడకుండెను. మఱియు పెడమొగము పెట్టును. అనేకసమయము లిట్లు గడచినవి. కాని గురుదేవునియెడ నరేంద్రుని మనోభావ మించుకైనను మాఱలేదు. యథాప్రకారము నరేంద్రు డాతని సందర్శించుచునేయుండెను. శ్రీరామకృష్ణు డది గని సంతసించి, ప్రేమమీఱ తుద కొకనాడు ఇట్లు ప్రశ్నించెను: "వత్సా! నరేంద్రా! నోరు విప్పి నీతోనే నొక్కమాటయైనను పలుకకున్నను నీ విచ్చటకు వచ్చుచునే యుంటివే. కారణ మేమి?" నరేంద్రు డిట్లు బదులుచెప్పెను: "మహాశయా! మీవచనములను వినుటకే నే నిచ్చటకు వత్తు ననుకొనుచుంటిరా? మీయందలి గాఢానురక్తిచే మిమ్ములను జూచుటకై దక్షిణేశ్వరమునకు వచ్చెదను." శ్రీరామకృష్ణుడు ప్రహర్షానందభరితుడై నరేంద్రు నభినందించెను.

మఱియొకప్పుడు శ్రీరామకృష్ణుడు నరేంద్రుని జేరబిలిచి, "ఘోర తప మొనర్చి నే నార్జించిన దివ్యశక్తులను తల్లియాజ్ఞను గొని నీ కొసగదలచుచున్నాను. ఏ మనియెద" వనియెను. నరేంద్రుడు తన కవి భగవత్సాక్షాత్కారమున కక్కఱకు వచ్చునా యని ప్రశ్నింప, "అందులకు వినియోగింపవు. కాని సాక్షాత్కారము నొందిన పిమ్మట భగవత్కార్యముల నొనర్చు

టకై వినియోగించు”ననియెను. “అటులైన నాకు వలదు. ముందు నన్ను భగవత్సాక్షాత్కారము పొందనిండు. తదనంతరము నా కాశక్తు లవసరమో కాదో నిర్ణయించుకొనవచ్చును. ఇప్పుడే వానిని గ్రహించిన నాపరమావధిని మఱతునేమో ! స్వార్థముకొఱకు వినియోగించి దురవస్థల పాలగుదునేమో ! నాకు వలదు” అనియెను. శ్రీరామకృష్ణుడు నరేంద్రుని బరీక్షించియుండ వచ్చును. ఏమైనను, నరేంద్రు డట్లు దివ్యశక్తులను నిరాకరింపగల్గినందులకై శ్రీరామకృష్ణు డపరిమితానందభరితు డయ్యెను.

ఆగురుశిష్యసంబంధమును వర్ణింప నెవరి తరము? శ్రీరామకృష్ణునుపదేశకరములవలన నరేంద్రుని హృదయకమల మెట్లు వికసించెనో యెవరు చిత్రింపగలరు? తన గురుదేవుని పాదసాన్నిధ్యమున నరేంద్రు డెట్టి స్వాతంత్ర్యము ననుభవించెనో, ఎట్టి పావనానందామృతోత్తుంగతరంగముల నోలలాడెనో, యెవరు వర్ణింపగలరు? అయ్యది నరేంద్రునితో శ్రీరామకృష్ణసన్నిధిని గూర్చుండువెడ గొంతవఱకు మనకు సాధ్యమగు నేమో. భగవత్సాక్షాత్కారభాగ్యము నందిన గురుశిష్యుల యన్యోన్యప్రేమానురాగములను దెలియుటెంత కష్టసాధ్యమో గదా !

## పండ్రెండవ ప్రకరణము

# నరేంద్రుని ధీవికాసము : మూర్తిమత్త్వము

అహంకారనిర్మూలనమున కనుకూలింపని విద్య కేవలము అవిద్య. ఆత్మసందర్శనమునకు దోడ్పడని జ్ఞానము అజ్ఞానము. ఆధునికకళాశాలలలోని విద్యావిధానము ఆత్మవిద్య నప్రధానముగా పరిగణించుటచే కళావిహీన మన దగియున్నది. శాస్త్రములను జదివినంతనే, కళలను నేర్చినంతనే, మనుజుడు విద్వాంసుడు కానేరడు. ఎవ్వ డహంకారరహితుడో, ఎవ్వ డాత్మజ్ఞుడో, వాడే విద్వాంసుడు. అట్టివానికి పాండిత్య మెందులకు? శ్రీరామకృష్ణున కేమి పాండిత్యమున్నదని విద్యావాచస్పతియగు నరేంద్రు డాతని నాశ్రయించెను? ధర్మ మనునది—పరవిద్య యనునది—గ్రంథములతోడను సిద్ధాంతములతోడను గూడినవిషయము కానేరదు. భగవద్దర్శనమే ధర్మము. ఆత్మజ్ఞానమే వేదాంతము. తద్వ్యతిరేక మంతయు అధర్మము, మిట్టవేదాంతము.

నవీనవిశ్వవిద్యాలయముననే నరేంద్రుడు విద్య నభ్యసించినను సనాతన విద్యావిధానమును విడువలేదు. పుష్పమునకు సుగంధమురీతిని సహజమగు నాతని పారమార్థిక ప్రవృత్తికి తల్లిదండ్రులొసగిన సుశిక్షణమును, శిక్షణము నినుమడించు సద్విద్యయు, విద్యకు వన్నె దెచ్చు శ్రీరామకృష్ణసాన్నిధ్యమును దోడ్పడ నాతని ప్రతిభ శారదపూర్ణిమాచంద్రునివలె ప్రకాశింప నారంభించెను.

ధీవికాసమున నరేంద్రు డద్వితీయుండు. బాల్యముననే ముగ్ధబోధ వ్యాకరణ మాతనికి గంఠస్థము. పదునేడవయేట సంస్కృతశ్లోకములను ధారాళముగా వ్రాయు సాహిత్య మాతని కలవడియెను. మాతృభాషలో నాతడు వ్రాసినగ్రంథములు నవీనవంగవాఙ్మయనిర్మాతలలో నాతనికి బ్రధానస్థానము నొసగుచున్నవి.

కళాశాలలో నరేంద్రుడు తత్త్వశాస్త్రము నభిమానశాస్త్రముగా స్వీకరించి పాశ్చాత్యతత్త్వజ్ఞుల గ్రంథములను తీవ్రముగా జదువ నారంభించెను. స్పెన్సర్, కాంట్, షోపెన్‌హోయర్, జాన్ స్టూఅర్టు మిల్, అగస్టు కాన్టు, అరిస్టాటిల్ మున్నగువారి తత్త్వశాస్త్రములను సమగ్రముగా జదివెను. తన వేదాంతకాంతిని పాశ్చాత్యవిజ్ఞానఫలకమున బ్రతిఫలింపజేసి పాశ్చాత్యులను పాశ్చాత్యమానసపుత్రులను సులభముగా నరికట్టుటకు సమర్థుడయ్యెను.

నరేంద్రునిమానసము కొంతవఱకు పాశ్చాత్యతత్త్వశాస్త్రపుదళుకుబెళుకులచే నాకర్షింపబడినను, అత డెన్నడును వ్యామోహితుడు కాలేదు. విశేషము, సనాతన వేదాంతవ్యాఖ్యానముల నాధునికదృష్టితో జదివి ప్రాచ్యపాశ్చాత్య తత్త్వశాస్త్రములకు గల తారతమ్యమును బరిశీలింపసాగెను. కాని సనాతన ధర్మసిద్ధాంతములను నరేంద్రుడు శిరసావహించుటకు ముఖ్యకారణ మాతని తార్కికప్రతిభాతిశయము కాదనియు, శ్రీరామకృష్ణపాదకమలసాన్నిధ్యమే యనియు జెప్పవలసియున్నది.

వేదాంతమునకు బిమ్మట దేశచరిత్రలు నరేంద్రుని ధీశక్తి నాకర్షించినవి. మహాపురుషుల జీవితాశయములచే వివిధదేశములలో—వివిధపరిస్థితులలో—మానవసంఘము లెట్లెట్లు పరిణామమును చెందెనో యాతడు పరికించెను. రోమక సామ్రాజ్యచరిత్ర నాతడు ప్రత్యేకశ్రద్ధతో పఠించెను. వివేకానందుడై రోమునగరమున కేగినపుడు ప్రాచీనరోమక ప్రజాస్వామికప్రభుత్వత్వముల వైభవమును తత్పతనహేతువులను కన్నులకు గట్టినట్లు వర్ణించి పాశ్చాత్యుల కాశ్చర్యము గొల్పెను.

ఆత్మవిశ్వాసబలమే నెపోలియనును మహావీరుని గావించెనని నరేంద్రుని విశ్వాసము. ఆత్మవిశ్వాసమే నరేంద్రుని జీవితరహస్యము, వివేకానందుడై ప్రపంచమున కాతడొసగిన సందేశామృతసాగరమునందలి మహోత్తుంగతరంగము. దౌర్బల్యమనిన నరేంద్రునకు పరమాసహ్యము.

వేదాంతము నరేంద్రునకు కిరీటమైనచో కవిత్వ మాతని కంఠాభరణము.

'వర్డ్సువర్తు' పాశ్చాత్యకవీంద్రుడని నరేంద్రు డాతని గీతముల ననేకము కంఠస్థముచేసెను. కవిత్వవేదాంతాదిశాస్త్రములును కళలును పరమార్థము ననేకవిధములుగా ప్రదర్శించుచున్నవని యాతడు భావించెను; జ్ఞానాగ్నిని ప్రజ్వలింపజేయుటే వాని ప్రయోజనమని విశ్వసించెను.

విద్యాభ్యాసమున నరేంద్రు డెంత నిమగ్నుడైనను, ఎంతటితీవ్రకృషి సల్పినను ఆతని జీవితసారభమగు బాల్యోల్లాసము మాత్ర మెన్నడును వీడలేదు. కథలు చెప్పుచు, హాస్యములు కల్పించుచు కళాశాలలో ఆత డానందమున కాటపట్టయి యుండెడివాడు. ఆటలలో, పాటలలో, భజనలలో, ప్రార్థనలలో—నరేంద్రుడే నాయకుడు. యువకులలో నేసంఘము వెలువడినను, ఏసమాజము బయల్వెడలినను, అందు నరేంద్రుడు లేనిచో జనుల కేదియో వెలితిగా గాన్పించుచుండెడిది.

నరేంద్రుని వ్యక్తిత్వము అనన్యసామాన్యము. షోడశకళాప్రపూర్ణచంద్రబింబసదృశము. కొంటెతనమున బాలకుడై, గానమున కోవిదుడై, ప్రజ్ఞావిశేషమున పండితుడై, జీవితాదర్శదర్శనమున వినిర్మలవేదాంతియై, సకలగుణాభిరాముడై నరేంద్రుడు విలసిల్లెను.

ఏమైనను బంధవిమోచనమే నరేంద్రుని యభీష్టము. సన్న్యసింపవలయునను తీవ్రవాంఛయే యాతని హృదయమున గొట్టుకొనుచుండినది.* న్యాయశాస్త్రవిద్యార్థియై 'బి. ఎల్.' పరీక్షకు పోబోవుచు నరేంద్రుడు తన మిత్రునితో "బంధవిమోచనమే నాకు వాంఛనీయము. పరీక్షయు గిరీక్షయు నాకు వలదు" అని వచించుటాశ్చర్యముకానేరదు.

---

* ఈసమయమున నరేంద్రునిమనఃస్థితినిగూర్చి యాతనిసహాపాఠకుడగు డాక్టరు ప్రజేంద్రనాథసీలు ఇట్లు వ్రాసియున్నాడు: "...సారహీనములగు చదువులనిన నరేంద్రునకు తలనొప్పి, పుస్తకములనుండి జ్ఞానమును గ్రహింపజూచుటకంటె సజీవమగు తత్త్వానుసంధానముచే, స్వానుభవముచే, దానిని బడయజూచుటే ఆతనియభీష్టముగా నాకు దోచెను....ఇంద్రియసుఖములును యౌవనవికారములును ఆతనికి రోతగా గన్పట్టెను...."

సంశయధూమ మణగినంతనే దేదీప్యమానమై వెల్గు జ్ఞానతేజమును గను గొనుటకై నరేంద్రుడు పరితపించసాగెను. ప్రపంచము శూన్యమై, దుఃఖభూయిష్ఠమై, యాతనికి గన్పట్టెను. సంశయసాగరమున బడి యాత డెట్టి మానసికయాతనల ననుభవింపవలసివచ్చెనో యెవరు వర్ణింపగలరు? ఐనను, అజ్ఞేయవాదము, నాస్తికవాదము మున్నగు ప్రచండతరంగముల నెదిర్చి నిలువగలుగుటకు పరమేశ్వర ధ్యానాశ్రయమే ప్రబలకారణము. శ్రీరామకృష్ణుని వచనములను స్మరించి ధ్యానస్థితుడై యాతడు మనశ్శాంతిని బడయుచుండెడివాడు. "హృదయపూర్వకమగు ప్రార్థనను పరమేశ్వరు డాలకించును. నన్ను నీ వెట్లు ప్రత్యక్షముగా జూచుచుంటివో భగవంతు నంతకంటె వేయిరెట్లు విస్పష్టముగా జూడవచ్చును. నాతో నీవెట్లు సంభాషించుచుంటివో భగవంతునితో అంతకంటె వేయిరె ట్లెక్కుడనోన్యముగా సంభాషింపవచ్చును. భగవద్వచనములను వినవచ్చును. భగవంతుని స్పృశింపవచ్చును." మఱియు, "భగవత్స్వరూపములను విశ్వసింపక అయ్యవి మనఃకల్పితములని విసర్జింతువుగాక. కాని జగన్నియామక హేతువగు నాద్యంతరహిత వస్తు వొండు కలదని నమ్మెదవా? ఐనచో నిట్లు ప్రార్థింపుము: 'ఓ పరాత్పరా! నిన్ను నే నెఱుగను. నన్ననుగ్రహించి నీ యథార్థతత్త్వమును నాకు వెల్లడింపుము.' మనఃపూర్వకముగా బ్రార్థించినచో భగవంతుడు నీ ప్రార్థన నాలకించితీరును" అను శ్రీరామకృష్ణవాక్యరత్నములు నరేంద్రు నుత్సాహపూరితు నొనర్చినవి. "జగన్నియామకుడగు పరమేశ్వరు డొకడు కలడని మన ధీశక్తి యించుక సూచించునే కాని 'ఇదమిత్థ'మని నిర్ణయింపజాల"దను 'హామిల్టన్' మహాశయుని వచనములను నరేంద్రుడు విశ్వసించెను. 'యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ' అనికదా వేదము లుద్ఘోషించుచున్నవి! పరమేశ్వరు డవాఙ్మానసగోచరుడు. చర్చాతర్కము లంతమొందిననే కాని పరవిద్యా ప్రారంభము కానేరదు. నరేంద్రుడు తఱచుగా ఈ వచనముల నుదాహరించుచుండువాడు.

గానము, ధ్యానము, గ్రంథపఠనము—ఇవియే నరేంద్రుని మానసము నాక్రమించినవి. ఇంటి నందఱును నిద్రించినవెనుక నాతడు ధ్యానస్థితు డగును. బాహ్యప్రపంచమును మఱచి అనిర్వాచ్యానందముతో నాత డిట్లు గంటలు గడపును. ఇట్టి సమయముననే యాత డొకప్పుడు బుద్ధదేవుని దర్శించెను.

శ్రీరామకృష్ణసాన్నిధ్యప్రభావమున నరేంద్రుని మానసికాధ్యాత్మికశక్తు లఖండాభివృద్ధి గాంచెను; ఆతని మూర్తి తేజోవంతమై సర్వజనవశీకరణసమర్థమై యొప్పెను. సింహగంభీరాకృతితో నాతడు నడచునప్పుడు ప్రత్యవయవమునుండియు విలాసము ఉఱకలిడుచుండును. ఒకప్పు డించుక మందగమనముతోడను మఱియొకప్పు డొకించుక శీఘ్రగమనముతోడను మహోన్నతాశయపూరితుడై సంచరించుపట్టున నాతనిమూర్తి దర్శనీయమై విరాజిల్లుచుండెడిది.

నవయౌవనసంశోభితుడగు నరేంద్రుని శరీర మెక్కుడు పొడుగు నెక్కుడు పొట్టియు గాక సమానోన్నత్యముగల్గి శోభిల్లుచుండెను. దేహదార్ఢ్యశ్రీ మాతనియందు మూర్తీభవించెను. విశాలమగు నాతని వక్షఃస్థలమును ఉన్నతమగు లలాటమును ఆతని హృదయవైశాల్యభావోన్నత్యములను ప్రకటించుచుండెను. అన్నిటికంటెను మనోహరమై లోకము నాకర్షించిన వాతని నేత్రకమలములు. వానిని గాంచి శ్రీరామకృష్ణు డాతని కమలాక్షుడని బిలుచువాడు. అవి యోగి నేత్రములు. అంతరవలోకనాయత్తచిత్తము నయ్యవి విస్ఫురత్ కాంతులతో బ్రదర్శించును. ఆతడు సంభాషించునప్పుడు శ్రోతలకు బ్రపంచమున నాతడు తక్క వేఱెద్దియు గన్పట్టదు. ఆతని వచనములు సమ్మోహనాస్త్రములయ్యును జ్ఞానదానమందు వెల్లివిరియుచుండును.

ఇక నాతని మందహాసవదనారవిందమో, బాల్యోల్లాసము అందు తాండవించుచుండును. ఇట్టి మూర్తిమత్త్వముచే కొందఱి కాతడు దీర్ఘదర్శివలెను మఱికొందఱకు విలాసప్రియునివలెను గాన్పించును. కాని సర్వజనులకును నరేంద్రు డున్నతవంశసంజాతుడని యాతని జూచినంతనే స్ఫురించును. ఆతని నవ్వు మనఃపూర్వకమై దయారసము నొలికించుచుండును.

కాని నరేంద్రుడు తీవ్రదృష్టితో జూచినచో నాతని వదనము మిత్రులకు సైతము భయము కలుగజేయును. కోపము వచ్చినచో ఆతడు కాలరుద్రుడే. ఐనను తోడిశిష్యు లాతని పసిబాలునిరీతిని భావించుచు, అట్టి సమయములందు సైత మమితానురాగము జూపుచుండెడువారు. చర్చించునపుడావేశపూరితు డైనచో ఆతని ముఖమును కన్నులును ప్రచండమై ప్రజ్వలించును. ఆలోచనానిమగ్ను డైనచో ఆతని నెవ్వరును సమీపింపజాలరు. ఐనను సంగరహితత్వ మాతనియందు ప్రత్యక్షమై గోచరించును. నిజముగా నాతని ప్రతిభాతిశయ మపూర్వము. సమయోచితములగు భావములను ప్రదర్శించుమూర్తిమత్త్వ మాతని సొత్తై యొప్పినది. ఆతని నిస్తులనిరాడంబరత్వమును ఆతని ప్రేమపూరితప్రవర్తనమును అన్నిటికంటెను మించిన యాతని సంగరహిత దృక్కులును అట్టి మూర్తిమత్త్వ మను దివ్యాభరణమునందలి యమూల్యరత్నములు.

శ్రీరామకృష్ణునిమూలమున నరేంద్రుని ప్రతిభాతిశయమును,హృదయవికాసమును అద్భుతమగురీతిని సమన్వయ మొందెను. స్వభావముచే నరేంద్రుడు వేదాంతి. శ్రీరామకృష్ణు డాతని భక్తునిగా నొనర్చెను. మనోహరమగు నాతని కల్యాణమయస్వరూపసంపద భక్తునియొద్దనేకాని కాన్పింపదని శ్రీరామకృష్ణు డిట్లు వచించును: "జ్ఞానులకు తమచు స్వరూపవైభవ ముండదు. భక్తునిస్వరూపమో, నేత్రపర్వము చేయుచుండును." ఏమైనను నరేంద్రుని వచనములే ఆతని యథార్థస్వభావమును మనకు వెల్లడించును. వివేకానందుడై యొకశిష్యున కాత డిట్లు తెల్పియున్నాడు: "బాహ్యమునకు గురుదేవుడు భక్తాగ్రేసరుడు; అంతర్యమున జ్ఞానమూర్తి. నేనో, బాహ్యమునకు ఎంతయు జ్ఞానిని. కాని నాహృదయము భక్తిమయము."

## పదుమూడవ ప్రకరణము

# నరేంద్రుని కష్టదశ

సదుపదేశామృతవర్ష ధారలచే శిష్యుని పారమార్థిక చిత్తవృత్తిని బెంపొంద జేయువాడే సద్గురువు. గురూపదిష్టమార్గమున సాధన యొనర్చినచో శీఘ్రకాలముననే ఫలించును. అట్టి సద్గురువరేణ్యుడగు శ్రీరామకృష్ణుని సందర్శింప సమయము చిక్కినప్పుడెల్ల నరేంద్రు డేగుచుండెడివాడు. నరేంద్రు డెందుచేనైన గొన్నిదినములవఱకును దక్షిణేశ్వరమునకు రానిచో శ్రీరామకృష్ణుడే యాతనియొద్ద కరుగును. జననీజనకులును బందుగులును నిర్బంధించుటచే తన ప్రియశిష్యుడు సంసారబంధమున జిక్కుకొనునేమో యని శ్రీరామకృష్ణునిభయము. అస్ఖలితబ్రహ్మచర్యవ్రతము నవలంబింపుమని నరేంద్రున కాత డిట్లుపదేశించును: "పండ్రెండేండ్లు బ్రహ్మచర్యము నవలంబించినచో సూక్ష్మగ్రహణశక్తి వికసించును. అపుడు మనోబుద్ధ్యతీతమగు సూక్ష్మవిషయములను గ్రహింపగల్గుదుము. అట్టి విశుద్ధవిజ్ఞానముచేతనే భగవత్సాక్షాత్కారమును బడయవచ్చును." శ్రీరామకృష్ణు డిట్లుపదేశించుట విని నరేంద్రుని తల్లిదండ్రులు కలవరపడుచుండెడివారు.

1884-వ సంవత్సరమున నరేంద్రుడు పట్టపరీక్ష (బి. ఎ.) కేగిన పిమ్మట నాతని శోకమహావిపత్తు తటస్థించెను. పరీక్షాఫలితము లింకను వెలువడలేదు. బారానగరమున నరేంద్రుడు తన మిత్రునింటిలో గాన మొనర్చుచు మహానందమున నోలలాడుచుండెను. హృద్రోగముచే తండ్రి విశ్వనాథుడు మరణించె ననువార్తను దెలుపుటకై నరేంద్రు నింటినుండి యొకడు వచ్చెను. పిడుగుపంటి యావార్తను విని నరేంద్రుడు నిశ్చేష్టు డయ్యెను. 'ఇది నిజమేనా?' యని కలవరపడుచు వెంటనే యింటికి మఱలెను. శ్మశానమునకు గొనిపోవుటకు సిద్ధముగానున్న తండ్రి శవముచుట్టును తల్లి, తోబుట్టువులును బోరన

విలపించుచుండిరి. అందఱును నరేంద్రునికోసము ఎదురుచూచుచుండిరి. జ్యేష్ఠ పుత్త్రు డగుటచే నాతడే కర్మాధికారి. 'హరి బోల్, హరి బోల్' అను నారాయణస్మరణముతో బంధుజనులు విశ్వనాథుని శరీరమును శ్మశానమునకు గొని పోయిరి. నరేంద్రుడు దిగ్భ్రాంతు డయ్యెను. తండ్రి చనిపోయెనా? తన్నాత డెంత ప్రేమించెను! నరేంద్రుడు ఎదుట జూచెను. అది రుద్రభూమి. ఆతని కన్నీరు కాల్వలై ప్రవహింపసాగెను. కాష్ఠములతో జితి పేర్పబడియెను. శవము నందుంచిరి. ఇతరులు తన్ననుసరింప నరేంద్రుడు అగ్ని ముట్టించెను. అంతయు జ్వాలామయ మయ్యెను. ఆజ్వాలల నవలోకించి, "ఈ తగులబడు నది శరీరము. నశించుటయే దీని స్వభావము" అని నరేంద్రుడు భావించెను. దగ్ధశేషము నాతడు గంగార్పణ మొనర్చెను.

నరేంద్రునకు కష్టదినములు సంప్రాప్తమైనవి. భోగభాగ్యములతో పుట్టి పెరిగిన యాతడు ఘోరదారిద్ర్యము నెదుర్కొనవలసివచ్చెను. విధి యెవ్వరికైన నసుల్లంఘనీయము కదా! దారిద్ర్య మాతనికి భయంకరమై కన్పట్టెను. విశ్వనాథుడు సంపాదించిన సిరిసంపద లాతనితోడనే పోయినవి. నలువురు తోబుట్టువులు,—అందొకడు పసిబిడ్డడు—తల్లి—ఇందఱతోగూడిన కుటుంబమున కంతకును ఇక తానే పోషకుడు, తండ్రిఋణదాతలు ధన మిమ్మని నరేంద్రుని పీడింప జొచ్చిరి. విశ్వనాథుని యౌదార్యమునకు బాత్రులైన బంధువు లిపు డాతనికుటుంబమునకు శత్రువులైరి. దాయాదులు సమస్తము హరించుటకు సంసిద్ధులైరి.

నరేంద్రు డింకను న్యాయకళాశాలలో జదువుచుండెను. విద్యార్థులలో నాతనికంటె నిర్ధనుడు లేడు. ఎంతదూరము వెడలినను నడచియే పోవల యును. కాలికి జోడుకూడ ఇపు డాతనికి కఱవై పోయెను. ముదుకగుడ్డలే నరేంద్రుని వస్త్రములు. అనేకపర్యాయము లాతడు నిరాహారియై కళాశాల కేగవలసివచ్చెడిది. సుకుమారుడగు నాతని శరీరసౌష్ఠవము క్షుద్బాధచే వీగి పోవజొచ్చెను. మిత్రు లది గని నరేంద్రుని తమయిండ్ల కాహ్వానించువారు.

కాని తమయింట భుజింపు మనినంతనే కుటుంబపుదుఃస్థితి నెంచి వెడలిపోవు చుండెడివాడు. గంపెడాకలితో నింటి కేగి యందఱును మెసవగా మిగిలిన దేమైన నున్నచో దినును: లేకున్న నెచటనో తినివచ్చితినని చెప్పును.

కుటుంబమును దారిద్ర్యబాధనుండి కాపాడుటకై నరేంద్రు డనేక ప్రయత్నములు చేసెను. విద్యాసాగరుని పాఠశాలలో గొంతకాల ముపాధ్యాయు డయ్యెను. ఎంత కష్టించినను గడుపార భుజించుటకు గఱవయ్యెను. కాని యీకష్టపరంపర యను నగ్నిజ్వాలలే నరేంద్రుని జీవితాభరణమునకు వన్నె దెచ్చినవి. అతడీ కష్టదినముల నెన్నడు మఱవలేదు. ప్రపంచమున స్వార్థరహితమగు సానుభూతిని జూపువా రరుదనియు, దరిద్రులకును దీనుల కును లోకమున దావు లేదనియు నాతడు గ్రహింపసాగెను. తన్ను జేపట్టి నచో ధనికురాలగు నొకవనిత యాతని దారిద్ర్యమును రూపుమాపుదునని పలుక నరేంద్రు డా ప్రస్తావమును తృణీకరించెను. ఇట్లే మఱియొకయువతి యాతని వ్యామోహితుని జేయుటకై యత్నింప నాత డిట్లు తన విశుద్ధహృదయమును వెల్లడించెను: "విషయసుఖముల నాశించి నీజీవితము నింతవఱకు గంగపాలు చేసితివి. యమలోకమునకు బోదలచితివా? మృత్యువు నెదుర్కొనుటకై నీ వేమి సాధన లొనర్చితివో యోచింపుము. ఈతుచ్ఛవాంఛను విడిచి భగవంతుని స్మరింపుము."

నరేంద్రు డెట్టికష్టదశలో నున్నను ఈశ్వరవిశ్వాసమును విడువక నిశ్చలభక్తితో నామసంకీర్తనము చేయుచుండెడివాడు. భక్తురాలయ్యును తల్లి భువనేశ్వరీదేవి సంతప్తురాలై యొకనా డిట్లు తీవ్రముగా బల్కెను: "మూర్ఖుడా! చాలు నీప్రార్థనలు. చిన్ననాటనుండియు దేవుడు దేవుడని గొంతు బొంగురుపోవునట్లు అఱచుచుంటివే. ఆదేవుడు నీ కేమి మేలుచేసెనో చెప్పుము చూతము!" నరేంద్రుడు సంశయింపసాగెను. నిజముగా దేవుడు కలడా? ఉన్నచో బ్రపంచమున నింత దుఃఖము, సంక్షోభము రాజ్యమేలుచుండుటకు కారణమేమి? దేవుడు లేడనియు, ఒకవేళ నిజముగానున్నను ప్రార్థనాదిక

ములు వ్యర్థములనియుం లోకమునకు నిరూపింప సమకట్టెను. తోడనే నరేంద్రుడు నాస్తికుడై భ్రష్టుడై పోవుచుండె ననువార్త నలుదిక్కులందును వ్యాపింపసాగెను. ఇవ్విషయము నెవ్వరో శ్రీరామకృష్ణునకు దెలిపిరి. అంత నాత డావేశపూరితుడై యాతనితో, "ఓయీ! మతిహీనుడా! అట్టి ప్రసక్తులు కట్టిపెట్టుము. అ ట్లెన్నడును జరుగదని తల్లి నాకు జెప్పినది. మఱల నిట్టి ప్రలాపము లాడితివా, నే నిక నీమొగము చూడబోవను."

సంశయమేఘము లెంతకాలము సత్యసూర్యుని మఱుగుచేయగలవు? అచిరకాలముననే నరేంద్రుని భగవద్విశ్వాసము నిరాచ్ఛాదితమై వెలువడి యెను. సన్న్యసింపవలయుననను వాంఛ జాజ్వల్యమానమై యాతని హృదయమున భాసించెను. దైవవశమున శ్రీరామకృష్ణుడే యొకనాడు కలకత్తానగరమునకు వచ్చుట తటస్థించెను. నరేంద్రుడు గురుదేవునితో దక్షిణేశ్వరమున కేగెను. శ్రీరామకృష్ణు డంతట సమాధిస్థితు డయ్యెను. అనంతరము నరేంద్రుని స్పృశించి బాష్పపూరితనేత్రుడై యాతడు గానముచేయ దొడగెను. ఆదివ్యగానమున గురుశిష్యుల మనోభావములు ప్రతిఫలించెను. నరేంద్రుని జేరబిలిచి శ్రీరామకృష్ణు డి ట్లుపదేశించెను: "తల్లిసంకల్పమును నెఱవేర్చుటకే నీ వుద్భవించితివని నే నెఱుగుదును. సాంసారికజీవనము నీకు సరిపడదు. ఐనను నేను జీవించియున్నంతవఱకు నాకోసము నీ వింట నుండుము."

గోరుచుట్టుపై రోకటిపోటనునట్లు లీసమయముననే నరేంద్రునింటిపై దాయాదులు 'వారసత్వపుదావా' తెచ్చిరి. గృహపరిస్థితులు రచ్చకెక్కుట దలచి భువనేశ్వరి దుఃఖింపసాగెను. కాని నరేంద్రుడు ధైర్య మవలంబించి వ్యవహారము నెదుర్కొనుటచే తుదకు వ్యాజ్యెము అతని పక్షమైనది. ఐనను దారిద్ర్యబాధమాత్ర మెప్పటివలెనే యుండెను. అట్టి కష్టకాలమున శ్రీరామకృష్ణుడే తనకు దిక్కని యాతడు నిశ్చయించుకొని దక్షిణేశ్వరమునకు బయలుదేఱెను. ఆ తొందఱలో కాలిజోడు పడిపోవుటాత డెఱుగడు. అట్లు వెడలి శ్రీరామకృష్ణుని సందర్శించి, "మహాశయా! తాము కోరినచో భగవదను

గ్రహము తప్పక లభించును. కుటుంబమును ఈదుర్భరదారిద్ర్యమునుండి కాపాడకతప్పదు” అని పట్టుపట్టెను. నరేంద్రుని కుటుంబస్థితి శ్రీరామకృష్ణు డెఱుగును. ఆత డిట్లు వచించెను: “బిడ్డా! నే నట్టి ప్రార్థనలను జేయజాలను. అదిగో కాళికాదేవియాలయము. సృష్టిస్థితిలయకారిణియగు నామెను నీవే ప్రార్థింపుము. తల్లి నీవు కోరినవరము లొసగును.” అపరప్రహ్లాదుడగు నరేంద్రుడు మాత్ర మట్లు ప్రార్థింపగలడా? దేవిని సమీపించినంతనే నరేంద్రుడు తన సంకల్పమును మఱచి, “తల్లీ! వినిర్మలజ్ఞానభక్తివైరాగ్యములను నాకు ప్రసాదింపు” మని ప్రార్థించెను. నరేంద్రుడు వచ్చినంతనే శ్రీరామకృష్ణుడు, “కుటుంబస్థితులను జక్కజేయుమని ప్రార్థించితివా?” యని ప్రశ్నింప, నరేంద్రుడు తెల్లబోయి, జరిగినసంగతిని దెలిపినంతనే, “మఱల నీసారి వెడలి ప్రార్థించి రమ్ము” అని పంపెను. లోకైకమాతను జూచినంతనే నరేంద్రుడు మఱల తన సంకల్పమును మఱచి, “తల్లీ! వినిర్మలభక్తిని నాకు ప్రసాదింపు” మని ప్రార్థించివచ్చెను. శ్రీరామకృష్ణు డది విని మఱల వెడలి ప్రార్థింపుమనియెను. నరేంద్రుడు దేవిని సందర్శించి, “ఏమి! ఎట్టి తుచ్ఛవిషయమునకై తల్లిని ప్రార్థింపవచ్చితిని! ప్రసన్నుడగు భూమండలాధిపతిని కూరగాయలకై అర్థించిన ట్లున్నది! ఎంతటి యవివేకి”నని లజ్జావనతవదనుడై, “తల్లీ! విశుద్ధ భక్తిజ్ఞానములు తక్క వేఱొండు నాకు వలదు. అనుగ్రహింపుము” అని ప్రార్థించెను. ఆలయమునుండి వెలువడి, “ఇది యంతయు శ్రీరామకృష్ణునిలీల” యనిగ్రహించి, గురువర్యుని సమీపించి, “మహాశయా! మీప్రభావమే నన్నిట్లు మఱపించినది. నాప్రార్థన నెఱవేర్పు”డని పట్టుపట్టెను. దయాప్రపూర్ణుడై శ్రీరామకృష్ణు డంతట, “సరి. మీకుటుంబమున కిక నత్యావశ్యకములగు నన్నవస్త్రములకు లోపము కలుగదు” అని యనుగ్రహించెను.

శ్లో. “అనన్యాః చిన్తయన్తో మాం యేజనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్”

అని భక్తజనావళికి భగవానుడు శాశ్వతాభయ ప్రదాన మొసగి యుండడే!

భగవంతునియెడ జగన్మాతృభావము కలుగుటకేమి, విగ్రహారాధన తత్త్వము విస్పష్టమగుటకేమి, నరేంద్రున కిదియే ప్రారంభము. తన ప్రియశిష్యుని యందీపరిణామమునుగాంచి శ్రీరామకృష్ణుడు అపరిమితానందభరితు డయ్యెను.

# పదునాల్గవ ప్రకరణము

## నరేంద్రుని శిష్యత్వము: దక్షిణేశ్వరదివ్యానందదినములు

సమస్తవేదాంతసారమూర్తియగు శ్రీరామకృష్ణుని సన్నిధానమున నుండుటే మహోత్తమతపశ్చర్య, అద్వితీయసాధనసంపద. అట్టి సాన్నిధ్యము లభించినవానికి దేహాభిమానము తనంతట అదియే సమసిపోవును. జితేంద్రియత్వము కరతలామలక మగును. శ్రీరామకృష్ణుని దివ్యభావములను గ్రహింప సామాన్యుల కలవికాదు. సూక్ష్మగ్రాహులగు విశుద్ధవర్తనులకు మాత్రమే అయ్యది సుసాధ్యము. అట్టి సద్గురుచరణసాన్నిధ్యమే సాక్షాత్కారమును బడయుటకు సులభోపాయము.

శ్రీరామకృష్ణుని శిక్షణవిధానము అత్యద్భుతము. ఆటలతో, పాటలతో, వింతలతో, వినోదములతో నాతడు మహోన్నతాధ్యాత్మికవిషయములను శిష్యులకు బోధించును. వారల భావిజీవితౌన్నత్యమును ప్రత్యక్షముగా గాంచి, తద్విషయములను దెలిపి, వారల నుత్సాహపూరితులను జేయును. దైనందిన జీవితచర్యలను బరిశీలించి క్రమవిరహితమగు నెట్టి స్వల్పవిషయమునుగూర్చియైనను సదుపదేశము లొసగును.

నిశ్శబ్దముగా పూలు వికసించి తమ సుగంధమును వెదజల్లు రీతిని, ప్రశాంతముగా చంద్రు డభివృద్ధిజెంది భూమండలమును బ్రకాశింపజేయు పగిది శ్రీరామకృష్ణుడు తన మహోపదేశములచే శిష్యుల మానసములను వికసింపజేసి, దివ్యానుభవము లొసగి ప్రకాశింపజేయసాగెను. అట్టి సద్గురువరేణ్యుని సాన్నిధ్యము లభించిన యాశిష్యు లెంతటి ధన్యులో కదా!

సాధనవిషయమున శ్రీరామకృష్ణుని దివ్యోపదేశముల కొకటి రెండు నిదర్శనములు. ధ్యానసమయమున నరేంద్రుని మానసము సమీపమునందలి యంత్రధ్వనిచే విక్షేపము నొందసాగెను. శ్రీరామకృష్ణున కీసంగతి దెలుప

నాత డాధ్వనిమీదనే మనసు లగ్నముచేయుమని బోధించెను. అట్లు లాచరింపగనే నరేంద్రున కావిఘ్నము తొలగెను. మఱియొకసమయమున ధ్యానకాలమున దనకు పూర్ణ శరీరవిస్మృతి కలుగకున్నదని తెలుప శ్రీరామకృష్ణుడాతని నొసట గోటితో నొక్కిపట్టి తదనుభవముమీదనే మానసము లగ్నము చేయుమని నియమించెను. అట్లు లొనర్చి నరేంద్రుడు నిశ్చలసమాధినిమగ్నుడయ్యెను.

ప్రశాంతమగు పంచవటీవనప్రదేశమున శిష్యుల ధ్యానసాధనలు శ్రీరామకృష్ణునిసాన్నిధ్యమున నిట్లు నిర్విఘ్నముగా సాగుచుండెను. ఇక వారల బాల్యోత్సాహమో, అపరిమితము. ఆవనమందలి చెట్లెక్కుచు, కొమ్మలను బట్టుకొని యూగులాడుచు, వనభోజనముల నారగించుచు వారనుభవించిన యానందము వర్ణనాతీతము.

జన్మముచే గాకుండినను జీవితముచే బ్రాహ్మణోత్తముడగు నరేంద్రుడు స్వహస్తములతో వండిన యాహారములను పూర్వాచారపరాయణుడు, సదాచారసంపన్నుడు నగు శ్రీరామకృష్ణుడు ప్రీతితో భుజించును. "నరేంద్రా! నీవంటి పవిత్రహృదయుడు వండినపదార్థములను దినుటచే నాకు దోషము లేశమును లేదు సుమీ" యని వచించును. ఆభూసురేంద్రున కానరేంద్రుడంతటి ప్రీతిపాత్రుడు.

సత్యాన్వేషణమున నరేంద్రుని మానసికాధ్యాత్మికశక్తులను గాంచి శ్రీరామకృష్ణు డలరి, "చూడుడు! నరేంద్రు డెట్టి వివేకసముద్రుడో! సాక్షాన్మహామాయ సహిత మాతనికి పదిబారలదూరమున నిలువవలసినదే. తల్లి యాతని కొసగిన వైభవమే ఆమె నిట్లు బంధించివైచును" అని వచించి యిట్లు ప్రార్థించును: "తల్లీ! నీమాయను గొంచెము నరేంద్రునిపై గప్పుము. లేకున్న నాతడు ధ్యాననిమగ్నుడై, ఆత్మారాముడై, ప్రపంచముమాటయే మఱచును. లోకసంగ్రహకర్మాచరణ మసాధ్యమైపోవును."

శ్రీరామకృష్ణుని బోధనవిధానము అత్యద్భుతము. శిష్యులతో నాత

డెన్నడును తర్కించువాడుకాడు. ఒక్క కీర్తనచే, మాటచే, కటాక్షముచే, నాతడు బోధించును. "ఆత్మసాక్షాత్కారమే మానవుని పరమావధి. ఆత్మానంద ప్రపూర్ణమగు హృదయమున వాదోపవాదములకు తావులేదు. జ్ఞానోదయ మైనంతనే సంశయాంధకారము పటాపంచలగును." ఇదియే శ్రీరామకృష్ణుని బోధన.

"భగవంతుడు సగుణుడా? నిర్గుణుడా? అవతారములు సత్యములా? కల్పితములా?" అని శ్రీరామకృష్ణ శిష్యబృందమునడుమ తీవ్రవాదములు చెలరేగినవి. అందు తర్కసింహమగు నరేంద్రుని కంఠరవము విస్పష్టముగా విన వచ్చుచుండెను. అది ప్రాతఃకాలము. శిష్యహృదయముల నావరించిన సంశయా వళిరీతినే దక్షిణేశ్వరవనప్రదేశమం దెల్లెడలను దట్టమగుమం చావరించియుం డెను. ఎట్టిహిమమైన నెంతకాల ముండును? సూర్యోదయమగువఱకే కదా. జ్ఞానసూర్యుడగు శ్రీరామకృష్ణు డప్పుడే ధ్యానసాగరమునుండి వెలువడి శిష్య మానసములపై తన దివ్యోపదేశకిరణములను బఱపినంతనే ఆసంశయహిమ మంతరించిపోయెను. శ్రీరామకృష్ణు డిట్లు గాన మొనర్చెను.

"మన్ కి తత్త్వ కరో తారె, జన ఉన్మత్త ఆధారఘరె

* * * * *

షడదర్శనె నపాయ్‌దర్శన్, ఆగమ నిగమ తంత్ర సారె
సెయె భక్తి రసెర రసిక, సదానందె విరాజ్ కరె పురె."

(మనసా! నీప్రయత్నములచే సర్వేశ్వరుని గనజాలవు సుమీ! చీకటింటిలో దడవాడు మతిహీనుని యత్నములవంటివి నీయత్నములు. షడ్దర్శనములు, తంత్రములు, వేదములుసైతము సర్వేశ్వరుని జూపజాలవు. హృదయాంతర్జ్యోతియు, సదానందమూర్తియు నగు నాతడు భక్తిరసప్రియుడు.)

ఆదివ్యగానామృతమును గ్రోలి శిష్యులు నిశ్చేష్టులైరి. వారి సంశయ కాష్ఠము లాగానవాహినియందు బడి కొట్టుకొనిపోయినవి. ఆత్మానుభవముతో హృదయమును నింపుటే యాతని బోధన; అదియే యాతనివిధానము. భగవం

తునిగూర్చి వాదముచేయుట వెఱ్ఱితనమనియు, భగవద్దర్శనమే ధర్మోద్దేశ్య మనియు శ్రీరామకృష్ణుని నిశ్చయము. కామకాంచన జయము, హృదయ సారల్యము—యివియే పరమార్థమును బొందుట కుపాయములని యాత దుద్ఘోషించును. సాధనసంపద లేనిచో నెంతటి తర్కశాస్త్రప్రావీణ్యమైనను, ఎంతటి శేముషీ ప్రభావమైనను నిరర్థకమని యాతడు వక్కాణించును. పండిత బ్రువుల నాతడు గ్రద్దలతో బోల్చును. ఆకసము నంటున ట్లవి యెగురు చున్నను, వాని దృష్టిమాత్రము క్రుళ్లి కంపుకొట్టుచు క్రిందనున్న శవముల మీదనే నిల్చియుండునట్లు పండితంమన్యులదృష్టి కామకాంచనము లను శవము లపై లగ్నమైయుండునని శ్రీరామకృష్ణుడు వచించును!

కాని శిష్యు లెంతటి తీవ్రవాదములలో దిగినను శ్రీరామకృష్ణుడు మందలింపడు. చర్చ సత్యకాంక్షాసంజనితమైనచో జ్ఞానోపలబ్ధికి దోడ్పడునని యాతని మతము. ఎవ్వరిశక్తిసామర్థ్యముల ననుసరించి వా రాత్మాభివృద్ధి నొందవలయును. ఐనను ఆవశ్యకమగుచో శ్రీరామకృష్ణుడు కలుగజేసికొనును. నరేంద్రు డొకప్పుడు విశ్వాసము మోక్షసాధనము కాదని నిరసించుచు 'గ్రుడ్డి నమ్మకము'నుగూర్చి చర్చింపసాగెను. అంత శ్రీరామకృష్ణుడు, "నరేన్ ! గ్రుడ్డి నమ్మకమననేమి ? నమ్మకమునకు కన్ను లున్నవా ? నమ్మక మనునదే గ్రుడ్డిది. నమ్మకమనికాని జ్ఞానమనికాని చెప్పుము. గ్రుడ్డినమ్మకమను టర్థరహిత"మని వచించెను. సమస్తతత్త్వశాస్త్రములును, సమస్తవిజ్ఞానమును అనుభవలేశముతో బోల్చిచూచినచో గ్రుడ్డినమ్మకమేయని శ్రీరామకృష్ణు నభిప్రాయము. ఈవిధ ముగా విద్యావాచస్పతియగు నరేంద్రుడు నిరక్షరాస్యుడగు శ్రీరామకృష్ణుని ముందు మూగవాడై యూరకుండెను.

మఱియొకప్పుడు శిష్యులు, "శాస్త్రములు సత్యములా? వేదములు పౌరుషేయములా? అపౌరుషేయములా? భగవంతు డనగానేమి?" అని తీవ్రముగా చర్చింపసాగిరి. నరేంద్రుడే అందు ప్రధానవక్త. శ్రీరామకృష్ణుడు వారి వాదోపవాదముల నన్నిటిని విని, చిఱునవ్వు నవ్వి, యటనుండి మెల్లగా

ఆలయముప్రక్కనున్న పడవరేవు వైపున కేగి నిల్చెను. శిష్యులును వాదములకు స్వస్తిచెప్పి గురు ననుసరించిరి. అట నొకవైపు కుక్కలు కొన్ని కాట్లాడుచు మొఱుగుచున్నవి. రెండవవైపు మఱికొన్ని ప్రవాహమునుండి కొట్టుకొనివచ్చిన యొకకళేబరమును బట్టుకొని కిక్కుఱుమనక భక్షించుచున్నవి. శ్రీరామకృష్ణుడు శిష్యులను జూచి, శ్వానములవంక వ్రేలు జూపి, నర్మగర్భముగా నవ్వెను. వాగ్వాదములకును, తత్త్వసందర్శనమునకును గల తారతమ్యమును గ్రహించి శిష్యులు లజ్జావనతవదనులై నిల్చిరి. ఇదియే శ్రీరామకృష్ణుని బోధనవిధానము.

జిజ్ఞాసకు పరమావధి తత్త్వదర్శనము. అదియే మనవిధి. అందుల కెంతయో కాలము తీవ్రసాధన చేయవలయును. శ్రీరామకృష్ణుని బోధనలలో నున్న ఘనత యంతయు నాతని సాధనానుభవములలో, పవిత్రవర్తనములో నిమిడి యున్నది. శ్రీరామకృష్ణుని దివ్యజీవనప్రభావమే ఆతని యుపదేశసౌరభము. విశ్వమానవసౌభ్రాత్రము నాతడు బోధించినచో తా నట్లు జీవించిచూపెను. ఒక్కసాంఘికాచారమునైన నాతడు నిరసించి యెఱుగడు. వర్ణాశ్రమధర్మములకు విరుద్ధముగా నాతడు బోధింపలేదు. బ్రాహ్మణుల కెల్ల బ్రాహ్మణుడైన యాతడు జాత్యౌన్నత్యము, కులనైచ్యము—వీనిని మఱచుటకై అత్యంతనిమ్న జాతిజనులు సైతము చేయనొప్పని సేవకకృత్యములను మనఃపూర్వకముగా నొనర్చెను. ఆత డట్టి వినమ్రుడు, విశుద్ధహృదయుడు, విశ్వాతీతప్రేమపూరితుడు. నరేంద్రున కట్టిమహనీయుని పాదపద్మసేవాభాగ్యము లభించుటచేతనే లోకకల్యాణహేతుభూతములగు శ్రీరామకృష్ణమఠసేవాసంఘములను కాలక్రమమున ప్రాక్పశ్చిమఖండములం దంతటను నెలకొల్పగల్గెను.

లోకులయెడ తా నవలంబింపవలసిన దృక్పథమునుగూర్చి నరేంద్రునకు శ్రీరామకృష్ణు డిట్లు బోధించెను: "నాయనా! వినుము. లౌకికులు భగవద్భక్తులనుగూర్చి వాగునపుడు భక్తులెట్లు వర్తింతురో తెలియునా? వెంటబడి పర్వెత్తి మొఱుగు కుక్కలను గమనింపక రాజమార్గమున నడచు గజేంద్రము

రీతిని వర్తింతురు. ఆగజేంద్ర మాకుక్కలయఱపులను లక్షింపక తనమార్గమున తాను పోవును. నరేంద్రా! లోకులు నీచాటున నిన్ను దూషించిన, వారిని గూర్చి నీ వెట్లు తలతువు?" నరేంద్రుడు వెంటనే యిట్లు బదులుచెప్పెను: "మొఱుగుచున్న కుక్కలగుంపుగా నెంచెదను." శ్రీరామకృష్ణుడు మందహాస మొనర్చి యిట్లు దిద్దెను: "వలదు, వలదు; నీ వంతవఱకు బోనక్కఱలేదు. వారిని లక్షింపకుము. కాని, ప్రతివ్యక్తిని నీవు నారాయణ స్వరూపునిగా దలపుము. భగవంతుడు సర్వాంతర్యామి; అనేక వ్యక్తులలో అనేకవిధములుగా నటించుచుండును. ఒకడు యోగినారాయణుడైనచో మఱియొకడు క్రూర నారాయణుడు కావచ్చును!"

గురువాక్యములను నరేంద్రు డాచరణలో బెట్టెను. వివేకానందుడై, పశ్చిమఖండమున దిగ్విజయోపేతుడై వేదాంత ప్రచారము గావించుచుండి నపుడు క్రైస్తవప్రచారకులు కొందఱసహనముచే దన్ను దూషింప నాతడు క్షమాపూర్ణుడై వారిని దీవించెను. అజ్ఞాననారాయణుడై భగవంతుడు వారి యందు మాత్రము లేడా?

మఱియొకప్పుడు క్షుద్రదేవతారాధనమును వామాచారములతో గూడిన కొన్నిసంప్రదాయములను నరేంద్రు డావేశపూరితుడై ఖండించు చుండుట చూచి శ్రీరామకృష్ణుడు ప్రేమపూరితుడై యిట్లు బోధించెను: "నరేంద్రా! ప్రతిగృహమునకును ఒకదొడ్డిగుమ్మము కూడ నుండును. ఇచ్చ వచ్చినవా రాగుమ్మమునుండి లోని కేల ప్రవేశింపరాదు? కాని సింహ ద్వారమునుండి ప్రవేశించుటే శ్రేష్ఠమను విషయమున మాత్రము నీతో నే నేకీభవింతును." ఇట్టి యుదారభావములే నరేంద్రుని గుణవాక్యబద్ధు నొనర్చినవి.

భగవత్సాక్షాత్కారమునుగూర్చినట్టి ప్రశ్నలకు శ్రీరామకృష్ణు డిట్లు సమాధానమొసగును: "భగవంతుని నీయిచ్చవచ్చినరూపమున బ్రార్థింపుము; చీమ చిటుకుమన్న నాతనికి దెలియును." భగవంతుని గనుగొను టెట్లు?

"కామకాంచనజయమే అందులకు ఉపాయము." శ్రద్ధ, సహనము, చిత్త శుద్ధి—యివిలేనిచో సత్యాన్వేషణము నిష్ప్రయోజనమని యాతడు వక్కాణించును. తానొనర్చిన సాధనలలో బదునాఱవవంతు నెఱవేర్చినచో తరించుట నిస్సంశయమని నరేంద్రాదిశిష్యుల కాతడు బోధించెను. భగవంతుడు సగుణుడా? నిర్గుణుడా? "సగుణు డాతడే; నిర్గుణుడు నాతడే: మఱియుం నాతడు సగుణనిర్గుణాతీతుడు. భక్తుని యభీష్టము ననుసరించి భగవంతుడు సాక్షాత్కరించును. దేవాలయమే దేవాలయమని భావింపరాదు. దేవుడు సర్వాంతర్యామి; సర్వలోకాతీతుడు." విగ్రహారాధనము చేయదగునా? శ్రీరామకృష్ణు డిట్టిప్రశ్నలను చొప్పదంటుప్రశ్నలని వచించును. "ఏవిధముగా నారాధించినను సరియే. తీవ్రపరితాప మొక్కటియే భగవద్దర్శనమున కావశ్యకము." ఇదియే యాతనిబోధన.

శ్రీరామకృష్ణు డొకప్పుడు చైతన్యదేవునిబోధనలనుగూర్చి ప్రసంగించుచు, భగవన్నామమునందు రుచి, సర్వజీవకారుణ్యము, భాగవతసేవ యను నీమూడును ప్రధానములని వచించెను. ఈధర్మతత్త్వములను విపులీకరించుచు జీవకారుణ్యమనుపదము నుచ్చరించినంతనే సమాధినిమగ్ను డయ్యెను. మఱల కొంచెము స్మృతి వచ్చినంతనే తనలో తాను ఇట్లనుకొనసాగెను: "జీవకారుణ్యమట! జీవకారుణ్యము! ఓయీ మూర్ఖుడా! నేలపై బ్రాకు నీచక్రిమితుల్యుడవగు నీవా, జీవకారుణ్యము జూపువాడవు? ఒరులయెడ కారుణ్యము జూపుటకు నీ వేపాటివాడవు? **ప్రతిజీవియు సాక్షాద్భగవత్స్వరూపమని గ్రహించి చేయవలసినది జీవసేవ. జీవకారుణ్య మనునది మూర్ఖప్రలాపము."** శ్రీరామకృష్ణుని హృదయాంతరాళమునుండి వెలువడిన యీవచనములను శిష్యులందఱు నాలకించినను, అందలి గంభీరార్థమును సంపూర్ణముగా గ్రహింపగల్గినది నరేంద్రు డొక్కడే. అత డిట్లు వచించెను: "ఆహా! గురుదేవు డీవచనములచే భక్తిజ్ఞానముల నెంతచక్కగా

సమన్వయించెనో చూడుము! *ప్రతిమానవుని భగవత్స్వరూపునిగా గ్రహించి యెవ్వడు మానవసేవ చేయునో వానికి మోక్షము కరతలామలకము. భగవదను గ్రహ మున్నచో నే నీమహత్తరసత్యమును బాహాటముగా ప్రపంచమునకు జాటు సుదినము వచ్చితీరును."

సనాతనధర్మతత్త్వమే శ్రీరామకృష్ణుడు. సజీవాకృతిని దాల్చిన దివ్యత్వమే ఆతనివ్యక్తిత్వము.† పరిపూర్ణతాప్రాప్తిసాధనములగు వివిధోపాసనా వాహినులావిజ్ఞానసాగరమున లీనమైనవి. బ్రహ్మానందతేజము బహువిధములుగా ప్రకాశితమై శ్రీరామకృష్ణుని దివ్యజీవితమున సామరస్య దేవాలయమును నిర్మించియున్నది.‡ తన దివ్యజీవితముచే నాత డెట్లు సనాతనధర్మమును పునరుజ్జీవితమొనర్చెనో నరేంద్రునకు విస్పష్టము కాజొచ్చెను. సనాతనధర్మము

* "భక్తిని వీడి, హృదయమును శుష్కింపజేసికొని, ప్రేమానురాగములను మంట గలిపి, సంఘమునకు వెలియై మనిననే కాని జ్ఞానము లభింపదని సామాన్యముగా లోకులభావన. ఆత్మసాధన కంతరాయము లనెడి దుర్భావమున సోదరమానవులయెడలను జీవకోటియెడలను ఇట్లు ద్వేషభావమును వహించి సాధకుడు పెడత్రోవ త్రొక్కుచుండును. కాని శ్రీరామకృష్ణుడు తనదివ్యభావమున బల్కిన యీమహోపదేశ వాక్కులవలన సంఘమును వీడి యతులును తాపసులును నొనర్చు తత్త్వజ్ఞానసాధన యింటనుండియే మానవుడొనర్పవచ్చునని నేడు నాకు విశదమైనది;—వేదాంతము నిత్యకృత్యములందనుష్ఠానమున జూపదగునని నేడు నాకు విశదమైనది. మానవుడు ఏయాశ్రమముననున్నను ఏవృత్తి నవలంబించుచున్నను సమస్తజీవకోటియు సాక్షాద్భగవత్స్వరూపమేయని గ్రహించుగాక. భగవంతుడు జగదంతర్యామి, మఱియు జగదధీశుడు....ఇట్టి బ్రహ్మజ్ఞానము లభించుచో మానవునకు అహంభావమునకు తావెక్కడిది? **మానవసేవయే మాధవసేవ....**"

† శ్రీరామకృష్ణునిగూర్చి గాంధిమహాత్ముడు ప్రకటించిన యభిప్రాయము.

‡ శ్రీరామకృష్ణునిగూర్చి రవీంద్రనాథఠాకూర్ అభిప్రాయము.

మూఢవిశ్వాసముల కాటపట్టనియుం శ్రీరామకృష్ణు డొక పిచ్చివాడనియుం ప్రారంభమున నాతడు భావించెను. కాని, "స్పర్శమాత్రముననే తనలో దివ్యశక్తి నుద్దీపింపజేయగల్గిన యాతడు వెఱ్ఱివాడని భావించు టెంతటివెఱ్ఱియో! అట్టి యద్భుతశక్తి నాతని కొసగిన సనాతనధర్మము మూఢవిశ్వాసనిలయ మనుకొను టెంతటి మూఢవిశ్వాసమో కదా!" యని నరేంద్రుడు తలంపసాగెను. తత్త్వశాస్త్రాధార ముండినను, చైతన్యవిరహితమగు బ్రాహ్మసమాజము అట్టి సనాతనధర్మము నెదుట నిలువజాలదనియు వ్యక్తిగతముగా జూచిన నందలిసభ్యు లెంతటి పారమార్థికాశయపూరితులైనను బ్రాహ్మసమాజము విశేషముగా సంఘసంస్కరణోద్యమ మనియుం నరేంద్రునకు దోచెను. మఱియుం బ్రాహ్మసమాజనాయకోత్తముడగు కేశవచంద్రసేనుడు శ్రీరామకృష్ణపాదసన్నిధానమున గూర్చుండి సాక్షాత్ గురుభక్తితో, దైవభక్తితో, నాతని నర్చింపలేదా?

ఆదినములలో అనేక బ్రాహ్మసమాజసభ్యులతోగూడి నరేంద్రుడును తీవ్రధ్యానసాధనలచే కృశించి క్రుంగిపోవుదు నేమోయని భయపడసాగెను. శ్రీరామకృష్ణు డది గ్రహించి, "నరేంద్రా! భగవంతు డమృతసాగరము. నీవొక మక్షిక వనుకొనుము. అపు డట్టి యమృతభాండమునందలి యమృతము నెట్లు గ్రోలెదవు?" అని ప్రశ్నింప నరేంద్రుడు, "అంచుపై వ్రాలి త్రాగుదు" ననియెను. శ్రీరామకృష్ణుడు మందహాస మొనర్చి యిట్లు వచించెను: "నరేన్! ఇది సచ్చిదానందసాగరము. మరణభీతి కిందు తా వెక్కడిది? అమృతసాగరమగు భగవంతునిపై నమితభక్తి వలదనువా రవివేకులు. కావున భగవత్సాగరమున నిమగ్నుడవు కమ్ము." గురువాక్యరత్నములను నరేంద్రుడు శిరసావహించెను.

ఈసమయమున సమాధినిమగ్నుడై శరీరవిస్మృతి జెందుటే నరేంద్రు నభిలాష. తోడివారగు మనోమోహన నిత్యగోపాలాదులు భగవన్నామస్మరణముచే బాహ్యస్మృతి రహితులై నేలపై బడిపోవు టాతడు చూచియుండెను. తా నట్టి దివ్యానుభవము బొందజాలనిగదా యని పరితపించి, శ్రీరామకృష్ణు

నకు దెలుప నాత డిట్లు వచించెను: "కలతనొందకు. తండ్రీ! అది యొక విశేషమా? చెఱువులో ఏనుగు చొరబడినపక్షమున చెఱు వంతయును అల్ల కల్లోలమగును. అదియే గంగాప్రవాహమున బ్రవేశించెనా, అయ్యది కలగ బాఱదు. ఈశ్వరానురక్తి యను మహాశక్తి యీచిన్నచిన్నదొరువులలోనికి వచ్చినంతనే అవి కలగిపోవును. కాని నీవో, గంగానదివంటివాడవు."

నరేంద్రు డెట్టి త్యాగమూర్తియో, ఎట్టి పవిత్రతాగ్నిజ్వాలయో, తెలుపుటకు తార్కాణము లనేకములు కలవు. ధనికులగుమిత్రులు కొంద ఱొకనా డాతని తమ యుద్యానమునకు 'షికారు' రమ్మని యాహ్వానించిరి. నరేంద్రు డంగీకరించెను. అంత నొకగుఱ్ఱపుబండి నెక్కి యుద్యానమున కేగి యంద ఱేకమై కొంతసేపు పాడి నరేంద్రునిచే పాడించిరి. నరేంద్రు డలసెను. అత డొకగదిలో పరుండి విశ్రాంతిగొనవచ్చునని వారు చెప్పిరి. నరేంద్రు డచటి కేగినంతనే యొకభోగకాంత యెదుటికి వచ్చి నిలిచెను. ఆమె తనజీవితవిషయ ములనుగూర్చి ముచ్చటించి తరువాత తనసహజతుచ్ఛవాంఛను దెల్పెను. నరేం ద్రుడు వెంటనే శ్రీరామకృష్ణుని స్మరించి, భక్తిపూరితుడై మెఱుపుదీగవలె లేచి, "నేను పోవలయును. క్షమింపుము. నిన్ను దేవుడు రక్షించుగాక! మనో దౌర్బల్యముచే నీవిట్టి నీచజీవితమును గడపుచుంటివని గ్రహించినయెడల పరి శుద్ధురాలవగు దినము వచ్చితీరును" అని చెప్పి వెడలిపోయెను. దిగ్భ్రాంతయై యాభోగకాంత నరేంద్రునిమిత్రులతో నిట్లు పల్కెను: "ఆహా! నన్నెంత మాయచేసితిరి! సాధుపుంగవుని మోహితునిజేయుటకా నన్నంపినది?"

ఒకవైపున కష్టనిలయమగు దారిద్ర్యమును మఱియొకవైపున శ్రీరామ కృష్ణసాన్నిధ్యమును నరేంద్రునిశీలమును తేజోమయమొనర్చెను. నరేంద్రునకు భోగభాగ్యము లబ్బినచో నిశ్చయముగా ఆతనిజీవితము వేఱువిధముగా నుండెడిదనియు ఆత డేమహారాజనీతినిపుణుడో, న్యాయవాదియో, ఏమహా వక్తయో లేక సంఘసంస్కర్తయో యైయుండెడివాడనియు శ్రీరామకృష్ణుడు వచించెను. అద్వితీయసానుభూతిని బీదలయెడ నరేంద్రున కొసగిన దాతని

దారిద్ర్యము. శ్రీరామకృష్ణ జీవితరహస్యమును గ్రహించి, తన ధీవికాసమును పారమార్థికాశయములతో మేళవించి, నరేంద్రుడు తపోధ్యానముల నూతగా గొని మోక్షమార్గమున చరింపసాగెను.

నరేంద్రునిపై శ్రీరామకృష్ణుని ప్రేమ మత్యద్భుతము. పితృమరణానంతరము నరేంద్రుని కష్టదశను గాంచి శ్రీరామకృష్ణు డొక భక్తునితో, "ఇట్టి కష్టకాలమున నరేంద్రునిమిత్తు లాతనికి దోడ్పడుట మంచిది" అని పలికెను. మానధనుడగు నరేంద్రు డది విని యాభక్తుడు వెడలినంతనే, "మహాశయా! ఆవిషయ మాతనితో జెప్ప టెందుల" కని యభిమానపూరితుడై వచించెను. శ్రీరామకృష్ణు డట్లు శిష్యునిమనసు నొచ్చినందులకై కన్నీరు విడుచుచు నిట్లు వచించెను: "తండ్రీ! నరేంద్రా! నీకొఱకే పనిచేయుటకైనను సంసిద్ధుడనని గ్రహింపుము. వలసినచో నీకోసము ఇంటింటికి దిఱిగి బిచ్చమెత్తెదను!" నరేంద్రుడు నిశ్చేష్టుడయ్యెను. ఇదియే కదా యథార్థమైన ప్రేమ, నిష్కపటమైనప్రేమ, స్వార్థరహితమైనప్రేమ. ఇవ్విషయమును దలచియే నరేంద్రుడు మఱియొకప్పు డిట్లు వచించెను: "అగాధమగుప్రేమచే నన్నాతడు తన దాసునిగా జేసివైచెను."

నరేంద్రునిబంధువు లాతనివివాహయత్నము చేయుచుండిరని విని శ్రీరామకృష్ణు డెట్లు భీతిల్లెనో చూచియుంటిమికదా! నరేంద్రుడు సంసారబంధమున జిక్కుకొనకుండుటకై గురుదేవుడు కాళికాదేవికి సాష్టాంగవందనమొనర్చి, "తల్లీ! ఈయత్నముల నన్నిటిని భగ్నమొనర్పుము. నరేంద్రుడు సంసారనిమగ్నుడు కాకుండ రక్షింపుము" అని ప్రార్థించినసమయము లనేకములు కలవు. కాని, నరేంద్రు నాత డెంత ప్రేమించినను ప్రమాదముచేనైన నరేంద్రు డొకించుక దుష్టజనసహవాసముచేసినచో శ్రీరామకృష్ణు డాతని కఠినముగా మందలించును. అణుమాత్రమైనను మానసమున దుష్టసంకల్పలేశమున కాత డెడమిచ్చినచో తత్‌క్షణమే శ్రీరామకృష్ణుడు కనుగొని వారించును. సంశయాస్పదమగు నడివడిగలవానితో నరేంద్రు డించుక సహ

వాసముచేసి వచ్చినేని తన కాతనిమొగము చూచుటయే దుర్భరమగునని వచించును. మఱియు నిట్లు ప్రకటించును : "అపవిత్రహృదయునకు భగవద్భక్తి యలవడుట కల్ల. సాంసారికునకు సంగరహితత్వ మబ్బుట దుస్సాధ్యము. అతడు తనభార్యకు దాసుడు, ధనమునకు దాసుడు, యజమానునకు దాసుడు. అట్టివానికి భగవంతునిగూర్చి చింతించుట కవకాశ మెక్కడిది?"

శ్రీరామకృష్ణసద్గురుచరణసహవాసము నరేంద్రునకు లభించిన దాటేండ్లు. ప్రశాంతిదాయకమగుబోధనలతో, జ్ఞానసంగ్రహణదీక్షతో, దివ్యానుభవములతో విరాజిల్లిన యీసమయమును నరేంద్రుడు తనజీవితమున నఖండానందప్రదమగుమహోత్తమదశగా భావించెను. కామాదిశత్రువర్గమును వివేకవైరాగ్యములచే జయించి, ధ్యానధారణాద్యుపాయములచే ఆత్మసామ్రాజ్యమున కధిపతియై తా నార్జించిన తత్త్వజ్ఞాననిధికి శ్రీరామకృష్ణుడు నరేంద్రుని 'వారసుని'గా నొనర్చెను. ఇక నాసామ్రాజ్యమునకు నరేంద్రుడే యువరాజు. విషయవాంఛాప్రాబల్యమున లౌకికాశయమయమగు పశ్చిమ ఖండమును జయించి, ఆత్మసామ్రాజ్యమును దేశదేశాంతరములందు వ్యాపింప జేసి, ధర్మసముద్ధరణ మొనర్చుటకై నరేంద్రుడిక నడుముకట్టుకొనవలయును. శ్రీరామకృష్ణుడాధ్యాత్మికసాగరమున మునిగి కనుగొనిన దివ్యానుభవరత్నరాసులను నరేంద్రుడిక ప్రపంచమునకు అందజేయవలయును. ఆత్మారాముడగు శ్రీరామకృష్ణుని దివ్యానుభూతుల నిక నరేంద్రుడు లోకమునకు చాటవలయును.

శ్రీరామకృష్ణునివ్యక్తిత్వమును బోధనలను కలరూపున గ్రహింపగల్గిన శిష్యులలో నరేంద్రుడు అగ్రగణ్యుడు. శ్రీరామకృష్ణు డవతారపురుషుడా, కాదా యను విషయము నాతడు ప్రధానముగా పరిగణింపలేదు. అవతారవాదము నటుంచి, సమస్తవాదాతీతము శ్రీరామకృష్ణుని జీవిత మని యాతడు విశ్వసించెను. సత్యాన్వేషకులకందఱకును శ్రీరామకృష్ణుడు మార్గదర్శియనియు తత్త్వజ్ఞానసాధనల కాతనిజీవితము సాగరమనియు నరేంద్రుడు విశ్వసించెను.

శంకరాచార్యునఖండధీశక్తియు చైతన్యప్రభుని వినిర్మలప్రేమమును బుద్ధదేవుని సర్వజీవకారుణ్యమును ఏకమై సనాతనధర్మసముద్ధరణార్థము శ్రీరామకృష్ణు డయ్యెనని నరేంద్రునకు దోచెను.

ఈసమయముననే శ్రీరామకృష్ణునకు కంఠములో వ్రణము బయలుదేఱెను. కలకత్తాలో నున్న వైద్యులసాయము సులభసాధ్య మగుటకై దక్షిణేశ్వరమునుండి బసపురమునకు మార్చిరి. నరేంద్రునినాయకత్వమున శిష్యకోటి గురుదేవునకు సేవచేయుటకై తమ జీవితసర్వస్వములను సమర్పింప సంసిద్ధులైరి. శ్రీశారదాదేవి దక్షిణేశ్వరమునుండివచ్చి వంటచేయుచుండెను. సుప్రసిద్ధవైద్యుడగు మహేంద్రలాల్ సర్కారు చికిత్సచేయనారంభించెను. అయ్యది ప్రబలమైన వ్రణ మగుటచే శ్రీరామకృష్ణుడు విశేషము మాటాడరాదనియు శిష్యులాతని దఱచు సమాధిస్థితిని బొందకుండునట్లు చూచుచుండవలయుననియు వైద్యులు నియమించిరి. కాని పద్మసుగంధవ్యాప్తి నెవ్వ రరికట్టగలరు? గంగాప్రవాహవేగము నెవ్వరాపగలరు? శ్రీరామకృష్ణుని హృదయకమలము దివ్యజ్ఞానసుగంధసంభరితమై యున్నది. ఆతని యుపదేశము లమృతవాహినులు. పరమార్థపిపాసచే అరుదెంచు జను లాయమృతాస్వాదన మొనర్చి తృప్తినొందవలదా? బుద్ధుని గనుడు! తన నిర్వాణసమయమున నెట్టిబాధనందుచున్నను ఆతడు బోధించుట మానలేదే! మాటాడుట ప్రాణాపాయకరమని వైద్యు లెంత చెప్పినను, తన కెంత ప్రయాసకరమైనను శ్రీరామకృష్ణుడు బోధించుట మానలేదు. భవరోగవైద్యుడగు నాతనివాక్యామృతమును గ్రోలి సమ్మోహితులై వైద్యశేఖరులును చాలసేపు అచటనే నిలిచిపోవుచుండెడివారు.

అతిశ్రద్ధాభక్తులతో శ్రీరామకృష్ణునకు చికిత్స చేయుచుండిన మహేంద్రలాలు నరేంద్రుని జూచి యాతనిసంభాషణములను విని పరమానందభరితుడై తనయింటికి విందున కాహ్వానించెను. మఱియొకప్పుడు నరేంద్రుని గానమును విని యానందాతిశయమున నాతని గౌగలించుకొని దీవించెను. మఱియు, "మహనీయులగు నిట్టిబాలు రిచ్చటికి జ్ఞానార్థులై వచ్చుట నాకపరి

మితానందదాయక"మని శ్రీరామకృష్ణునితో వచింప నాత డిట్లు పలికెను: "అద్వైతగోస్వామి ప్రార్థనాప్రాబల్యముచే గౌరాంగప్రభు డవతరించెనట. అట్లే యిచ్చట (అనగా తనయాగమము నుద్దేశించి) మీకు గోచరించున దంతయు నాతని (నరేంద్రనాథుని) మూలముననే సంభవమైనది."

శ్రీరామకృష్ణసద్గురువరేణ్యుని సాన్నిధ్యము శిష్యుల భగవద్భక్తి విశ్వాసముల నినుమడించుచుండెను. అఖండయశోధురంధరులగు విజయకృష్ణ గోస్వామి, గిరీశచంద్రఘోషు మున్నగువారు శ్రీరామకృష్ణు డవతారపురుషు డని ప్రకటించుట విని శిష్యులు గొంద ఱాతనిమహిమములను కనుగొనుటకై నిరీక్షించుచుండిరి. నామసంకీర్తన మనినంతనే వణకిపోవుట, నేలపైబడి దొర లుట, మూర్ఛనొందుట మున్నగునవి సామాన్యము లయ్యెను. ఈధోరణి యంతయు ప్రమాద జనితమని, వికృతాకార మని, గ్రహించి నరేంద్రుడు వారల నిట్లు మందలించెను: "భావావేశము విషయవాంఛలను దగ్ధమొనర్చి భగవద్దర్శనైకవాంఛను ప్రజ్వలింపజేయజాలనిచో, తదనుగుణమగు శీలపరి వర్తనమును గల్గింపనిచో, నిష్ప్రయోజనమని గ్రహింపుడు. ఇట్టి వికృతావేశ ములవలన గలుగు శరీరకంపము, అశ్రుబిందువులు, క్షణికసమాధి మున్నగున వన్నియు నిజముగా మూర్ఛారోగసంబంధములు. దృఢప్రయత్నముచే వీనిని నిరోధింపవలయును. ప్రయత్నము విఫలమయ్యెనా, బలకరమగు నాహారమును దినవలయును. లేనిచో వైద్యునితో నాలోచింపదగును. కారణ మేమన, నిజముగా మీ రివి తెచ్చిపెట్టుకొనుచున్న లక్షణములు. ప్రబలాధ్యాత్మిక శక్తిసంపన్నులగువారిలో నెచ్చటనో కోటికొకనియం దివి యథార్థములై యుండవచ్చును. అపు డవి యెట్టినిరోధమునైనను ఎదిర్చి సుస్థిరములై నిలువ గలవు. కాని, పామరులగుజను లిది గ్రహింపక, యిట్టిబాహ్యలక్షణములను గనినంతనే "ఆహా! ఏమి దివ్యభక్తియో!" యని సంభ్రమించుచుందురు. ఇంద్రియనిగ్రహపూర్వకమగు భక్తివైరాగ్యములకు బదులు, ప్రయత్నపూర్వ కముగా నిట్టి యావేశములను దెచ్చిపెట్టుకొని, నాడీదౌర్బల్యముచే భజనాది

కము లనినంతనే ఉద్రిక్తులగుచుందురు. ఈవెఱ్ఱికి విధి విరామములు లేని యెడల మహోపద్రవము సంభవించును. ముక్తిమార్గ మవలంబించువారిలో నూటికి డెబ్బదిమంది కపటసన్న్యాసులుగనో, కృత్రిమయోగులుగనో, డాంబిక భక్తులుగనో పరిణమించుచుందురు. పాతికమందికి గమ్యస్థానము పిచ్చి యాసుపత్రి. ఇక మిగిలిన యైదుగురకును తత్త్వజ్ఞానము లభించినచో వారు మహాదృష్టవంతులని భావింపనగును. కావున మెలకువ గలిగి వర్తింపుడు."

నరేంద్రునభిప్రాయము సత్యసమ్మతమని శీఘ్రకాలముననే ఋజు వయ్యెను. అట్టి భావోద్రిక్తులలో గొంద ఱింటియొద్ద ప్రయత్నపూర్వకముగా ఆవేశముల నలవఱచుకొనుచుండిరనియు మిగిలినవారిపట్ల కేవల మవి యను కరణములనియుఁ దెల్లమైనది. బలకరమగు నధికాహారమువలనను ఆత్మనిగ్ర హామువలనను చాలమంది కవి తొలగెను. సామాన్యపద్ధతులకు లొంగనిచో నరేంద్రు డట్టివారిని తన వాగ్బాణములకు గుఱిచేయువాడు. దౌర్బల్యమనిన నరేంద్రునకు ఎప్పుడును పరమాసహ్యము. భక్తివైరాగ్యజనకమగు తన సంకీర్తనముచే తోడిశిష్యులకు అతడు యథార్థసన్న్యాసాదర్శములను దెలిపి త్యాగాగ్నిని రగుల్కొల్పెను. కామకాంచనవిజయమునకై శ్రీరామకృష్ణు డెట్టి మహోన్నతసాధనల నొనర్చెనో, నిశ్చేష్టులగునట్లు వర్ణించి గురుదేవుని జీవితౌన్నత్యమును వారలకు విస్పష్టముగా బ్రదర్శించెను. శ్రీరామకృష్ణుని భక్త్యావేశము వివేకముపై నాధారపడియున్నదనియుఁ వారాతని ననుకరించు ప్రయత్నమున నట్టి వివేకమును విసర్జింపరాదనియు హెచ్చరించెను.

పారమార్థికసాధనలందును తోడిశిష్యుల శీలనిర్మాణమునందును నరేం ద్రుడు దినదినాభివృద్ధిజెందుచుండ, శ్రీరామకృష్ణునివ్యాధి నానాటికి ప్రబల మగుచుండెను. ఔషధములు నిరుపయోగము లైనవి. ఐనను ఆరోగ్యమున కను కూలించునను కారణమున కాశీపురవనమం దొకయింటి కద్దెకు దీసికొని 1885-వ సంవత్సరమున గురుదేవునిబస నచటికి మార్చిరి. రమ్యమై, ప్రశాంత మగు నావనప్రదేశమున శ్రీరామకృష్ణునకు గొంతవిశ్రాంతి చేకూరెను.

## పదునైదవ ప్రకరణము

# శ్రీ రా మ కృ ష్ణ ని ర్యా ణ ము

కాశీపురవనప్రవేశము శ్రీరామకృష్ణలీలాప్రదర్శనమునందలి అంతిమాంక ప్రారంభము. తన దివ్యోపదేశమకరందమును ముముక్షుజనసహస్రముల కొసగిన యా మందార మిక ముకుళించుకొనిపోవుసమయ మాసన్నమైనది. శ్రీరామకృష్ణు డపరిమితబాధ నందుచున్నను, లోకమున దనమహోద్యమమును గొనసాగించు నరేంద్రాదియువకబృందమును జూచి సంతృప్తుడై కాలము గడపుచుండెను. తన కార్యమును నిర్వహించుటకై శిష్యులను సమర్థులను జేయుటొక్కటే ఆతని కిక మిగిలియున్న మహాకార్యము. మరణశయ్యయందుండియు ఆతడు సాగించుచుండిన మహోద్యమ మిదియే. అట్టి గురువరేణ్యుని సేవించుటే భగవదారాధనమని నమ్మి, శిష్యు లేకరీతిని నిద్రాహారములను మాని సేవ చేయుచుండిరి.

దినములు గడచినకొలది శ్రీరామకృష్ణునివ్యాధి ప్రబలమగుచుండెను. ఆతనిశరీర మిక సంపూర్ణశిథిలత నొందుటకు దినములు లెక్కకు మిగిలినవి. కాని యాతనివదన మఖండజ్ఞానప్రదీప్తమై, ప్రశాంతినిలయమై భాసించుచుండెను.

ఈ సమయమున నరేంద్రునియం దాధ్యాత్మికశక్తి మూర్తీభవించెను. ఒకనాడు గిరీశచంద్రు డాతని దనతో ధ్యానింప నొకవృక్షముక్రిందికి దీసికొనివెడలెను. వా రంత ధ్యానముద్రలో గూర్చుండిరి. అచ్చట దోమలబాధ చెప్ప నలవి కాకుండెను. ధ్యాన మసాధ్య మగుటచే గిరీశచంద్రుడు కన్నులు విప్పి నరేంద్రుని జూచెను. నరేంద్రునిశరీరము నీలాంబరముచే గప్పబడినట్లు గణనాతీతమశకసంతతిచే గప్పబడియుం నాతడు నిశ్చలధ్యాననిమగ్నుడై యుండుట జూచి గిరీశచంద్రు డాశ్చర్యచకితు డయ్యెను. ఇట్టిది కదా బాహ్యవిస్మృతి!

శ్రీరామకృష్ణునకు దనయాధ్యాత్మికపుత్రులనదగు శిష్యు లందఱిలో నరేంద్రునియం దపరిమితవిశ్వాసము. తాను లోకమును వీడినచో వారలకు దిక్కెవ్వరని తలచి నరేంద్రు డుండెనుకదా యని ధైర్యము తెచ్చుకొనును.

నరేంద్రు డొకనాడు శ్రీరామకృష్ణుని సమీపించి, "మహాశయా! నాకు నిర్వికల్పసమాధి నెప్పు డొసగెదరు? మూడునాలుగుదినములపర్యంత మొకేరీతిని నిర్వికల్పసమాధి నిమగ్నుడ నగుటయే నాయభీష్టము; ఆహారము కొఱకు మాత్రమే అందుండి వెలువడియెదను" అని పలికెను. అంత శ్రీరామ కృష్ణు డిట్లు సమాధాన మొసగెను: "వెఱ్ఱివాడా! అంతకంటె నుత్తమమైనస్థితి కలదని గ్రహింపుము. 'చరాచరప్రపంచ మీవే పరాత్పరా!' యని నీవు పాడుచుందువే. సరి, మీకుటుంబమునకు గొంత జీవనాధారము కల్పించి రమ్ము. సమాధికంటెను ఉత్తమమైనస్థితి నప్పుడు పొందెదవు లెమ్ము."

నరేంద్రునికోరిక విపరీతమైనట్టిదని భావింపరాదు. సచ్చిదానందసాగర నిమగ్ను లగుటయే కదా సాధకులయభీష్టము! ముముక్షువుల కింతకంటె మహోన్నతాశయము లేదు. సమాధిస్థితియే పారమార్థికసాధన లన్నిటికిని పరమావధి; పరిసమాప్తి. కాని నరేంద్రు డింతకంటె నుత్తమమైన పురుషార్థమును సాధించుటకై జన్మించెను. తాను తరించుటయే కాక పరులను తరింపజేయుటే అతని జీవితోద్దేశ్యము. నరేంద్రజీవితసామ్రాజ్యమున ముముక్షుజనసహస్రములు పరమానందము నందవలయును. అనతికాలముననే స్వకీయముక్తి నాతడు తృణప్రాయముగా భావించు టాశ్చర్యము కానేరదు. నామరూపాతీతమగు నిర్గుణావస్థయందు మాత్రమే కాక జగద్రూపమగు సగుణావస్థయందు సహిత మాతడు బ్రహ్మసాక్షాత్కారమును బడయవలయును. భక్తిజ్ఞానము లాతనిజీవితమున సమన్వయ మొందవలయును. ఇదియే శ్రీరామకృష్ణునభిలాష.

మఱియొక సమయమున శ్రీరామకృష్ణుడు నరేంద్రుని జేరబిలిచి, "ఇంకను కళాశాలలో ఎందుచే జదువవు?" అని ప్రశ్నింప, నరేంద్రు డావేశపూరితుడై యిట్లు వచించెను: "మహాశయా! ఇంతవఱకు చట నేర్చినదంతయు

శాశ్వతముగా మఱచునట్లు చేయగల్గిన యౌషధ మేమైన నున్నచో దెలుపుడు. మనఃపూర్వకముగా సేవింతును." నరేంద్రు డీసమయమున ప్రతి రాత్రియు బంచవటి కేగి మహాతప మొనర్చుచుండెను. లోకమున దనమహోద్యమమును గొనసాగించు బాలశిష్యబృందమునకు నరేంద్రుని నాయకు నొనర్చుటకై శ్రీరామకృష్ణు డీ ట్లాతని సంసిద్ధుని జేయసాగెను. నరేంద్రు నొక నాడు తన ప్రక్కకు బిలిచి యిట్లు వచించెను: "చూడు, నరేన్ ! ఈబాలురందఱును నీచేతిలో విడుచుచున్నాను. నేను గతించినను వీరు పారమార్థిక సాధనలను విడువకుండునట్లు చూడు. మఱల వీరు ఇండ్లకు బోరాదు సుమీ !"*

భావిసన్న్యాసజీవితమునకు సంసిద్ధులనొనర్చుటకై శ్రీరామకృష్ణుడు బాలశిష్యుల నొకనాడు, "ఇంటింటికి దిరిగి బిచ్చమెత్తుకొని రండు" అని యాజ్ఞాపించెను. వారును సంశయింపక వెంటనే హరినామస్మరణ మొనర్చుచు నరిగి, బియ్యము తెచ్చి వండి గురుదేవున కర్పించిరి. ఆత డొక కణము గైకొని "ఇది పరమపవిత్ర" మని వచించుచు భుజించెను. శీఘ్రకాలముననే యాబాలురు సర్వసంగపరిత్యాగ మొనర్చి, కాషాయవస్త్రధారులై భిక్షాటనము చేయుచు, సత్యాన్వేషణ మొనర్తురని శ్రీరామకృష్ణునకు స్పష్టముగా దెలియును.

ఆదర్శమూర్తియై తమ కిట్లు మార్గదర్శకుడగు శ్రీరామకృష్ణునియెడ శిష్యుల భక్తివిశ్వాసము లపారము కాజొచ్చెను. హితుడు, సన్నిహితుడు, తత్త్వజ్ఞుడు, గురుడు—సర్వము తమకు శ్రీరామకృష్ణుడే యని నరేంద్రుడు విశ్వసించెను. అట్టి గురుదేవుని యస్వస్థత యాతని కమితపరితాపహేతువైనచో ఆశ్చర్య మేమి? మహాపండితుడగు శశధరతర్కచూడామణి యొకనాడు శ్రీ రామకృష్ణుని సందర్శించి, "మహాశయా! సంకల్పమాత్రముననే మీవంటిసిద్ధ పురుషు లెట్టి వ్యాధినైనను నివారించుకొనగలరని శాస్త్రములు చెప్పుచున్నవి.

* తనయిష్టమంత్రమగు రామమంత్రము గురుదేవు డీ సమయముననే నరేంద్రున కుపదేశించెను.

కావున మీమనోబలముచే వ్యాధి కెందులకు నివారించుకొనరాదు?" అని ప్రశ్నించెను. శ్రీరామకృష్ణుడు వెంటనే యిట్లు వచించెను: "నీవు మహావిద్వాంసుడవే. ఐనను ఇట్టి యవివేకప్రస్తావము చేయుచున్నావు. భగవదర్పితమగు నామనసును మఱల నీతుచ్ఛకళేబరముపైకి మఱల్చు టెట్లు?" పండితుడు స్తబ్ధుడై యూరకుండెను. అతడు వెడలిన వెనుక నరేంద్రుడును మఱికొందఱు శిష్యులును తమకొఱకైనను వ్యాధిని మాన్పుకొనుడని గురుదేవుని ప్రార్థించిరి. అంతయుం తల్లిసంకల్పమని యాత డెంతప్రతిఘటించినను నరేంద్రుడు వినకుండుటచే తుదకు వారలయభీష్టమును తల్లికి నివేదింప నంగీకరించెను. కొంతసేపైన వెనుక శ్రీరామకృష్ణుడు నరేంద్రునితో నిట్లు వచించెను: "నరేంద్రా! వినుము. నే నామెతో జెప్పితిని. కంఠమును జూపి, 'వ్రణబాధవలన నే నేమియుం దినజాలనైతిననియుం గొంచెము తినునట్లను గ్రహింపు' మనియుం కోరితిని. అంత నామె, 'ఎందులకు? అందఱముఖములమూలమునను నీవు భుజించుటలేదా?' అనియెను. లజ్జచే నే నిక మాటాడలేదు."

గురువచనములను విని నరేంద్రుడు నిశ్చేష్టుడయ్యెను. 'ఆహా! ఏమి శరీరవిస్మృతి! ఏమి యద్వైతతత్త్వానుభవము!' తనగురుదేవుని యపరోక్షానుభూతి నిరుపమానమని నరేంద్రుడు నాడు గ్రహించెను.

ధ్యానము నరేంద్రునకు సుస్థిరాభ్యాస మగుచుండెను. దివ్యశక్తులు కలుగనారంభించెను. స్పర్శమాత్రముననే తన దివ్యానుభూతి నొరులకు బ్రసాదించుటకు సమర్థుడయ్యెను. నరేంద్రు డొకనాడు, "ధ్యానస్థితుడనై యుండగా నన్ను స్పృశింపుము" అని సోదరశిష్యుడగు కాళీప్రసాదచంద్రుని (అభేదానందస్వామి)తో జెప్పెను. కాళీప్రసాదు డట్లొనర్చినంతనే విద్యుద్యంత్రమును దాకినచో శరీరమెట్లు కంపించునో అట్లే మహాద్భుతరీతిని అతని శరీరము కంపించెను. పిమ్మట నాతడు ధ్యానస్థితుడై సంపూర్ణముగా బాహ్యస్మృతిరహితుడయ్యెను. ఇదియంతయు నరేంద్రుని స్పర్శయొక్క ప్రభావమని శిష్యులు గ్రహించిరి. శ్రీరామకృష్ణు డీవృత్తాంతమును దివ్యదృష్టిచే

గ్రహించి నరేంద్రు నిట్లు మందలించెను : "నరేన్! తగినంత సముపార్జించుటకు ముందుగనే నీశక్తినిట్లు వ్యయించుచుంటివే!... చాలకాలమునుండి యొక ప్రత్యేకమార్గము నవలంబించుచున్న యాబాలుని దృక్పథమును మఱల్చితివి. దానివలన నాతని కెంతహాని చేసితివో గ్రహించితివా? కానిమ్ము. ఇక నెన్నడు నిట్లు చేయకుము. ఏమైనను ఆబాలు డదృష్టవంతుడు." నరేంద్రుడు నిశ్చేష్టుడై వినెను. గురువాక్యములను తలదాల్చి యాతడు మాఱుపలుకలేదు.

ఒకనాటి కొకనాడు శ్రీరామకృష్ణునివ్యాధి ప్రబలమగుచుండెను. కాని యాతనివదన మెప్పటివలెనే దివ్యోల్లాససంశోభితమై యుండెను. ఒకనాడాతడు తల్లి పిల్లలను బుజ్జగించు రీతిని రాఖలు (బ్రహ్మానందస్వామి)ని, నరేంద్రుని బుజ్జగించుచు, మహేంద్రు డనుభక్తునితో నిట్లు వచించెను : "నాయమాయకత్వమును విద్యావిహీనతను జూచి, జనులు నన్ను వశపఱచుకొని దుర్లభమగు దివ్యానుభవములను బొందకుండుటకై తల్లి నన్నీలోకమునుండి కైకొనిపోవును. పారమార్థికసాధన లీసంఘమున నెంతయో వెనుకబడియున్నవి సుమీ." మఱల తనప్రియశిష్యులతో నిట్లు వచించెను : "శరీరమున్నంతవఱకు బాధపడుట తప్పదు. అందుచే ఒక్కొక్కసమయమున నేను మఱల జన్మింపనవసరము లేకుండెడుమని కోరుచుందును. ఐనను శరీరము దివ్యానందసంధాయకము. తనభక్తులకోసము భగవంతు డవతరించుచుండును." అంత నరేంద్రు ననురాగపూర్వకముగా నవలోకించి, తత్త్వజ్ఞానమునుగూర్చియు సాక్షాత్కారమైనవెనుక మానవునిస్థితినిగూర్చియు కొంతసేపు ముచ్చటించెను. "త్యాగావశ్యకతనుగూర్చి నేను చెప్పునపుడు కొందఱు చిఱచిఱలాడుచుందురు" అని నరేంద్రుడు పలుక, శ్రీరామకృష్ణుడు ఆతని కిట్లు చెవిలో చెప్పెను : "ఎవ్వరైనను త్యాగముచేసితీరవలయును. (తన యవయవములను జూపుచు) ఒకటి మఱియొకదానిక్రింద నుంచబడినదనుకొనుము. క్రిందిదానిని తీయవలసినపక్షమున మీదనున్నదానిని తొలగింపవా? దీనిని తొలగింపనిచే దానిని పొందగలవా?" "సంసారమును బరిత్యజింపవలయునా?" యని

నరేంద్రుడడుగ, "అంతయు బ్రహ్మమయమని కనుగొనినవానికి కుటుంబాదిక ములగు నన్యవిషయము లెట్లు కానవచ్చును?" అని మఱల "సర్వము ఇందుం డియే వెలువడెనని నాకిప్పుడు కన్పట్టుచున్నది. తెలిసినదా, నరేన్!" అని ప్రశ్నించెను. "సమస్తసృష్టిజాతమును తమయందుండియే ఉద్భవించినది" అని నరేంద్రుడు పలుక శ్రీరామకృష్ణుడు మందహాసమొనర్చి, "చూచితిరా! ఆతని కర్థమైనది!" అని ప్రకటించెను.

ఒకప్పుడు శిష్యులందఱును బుద్ధదేవుని దివ్యసందేశమునుగూర్చి చర్చింప సాగిరి. ప్రధానవక్త నరేంద్రుడే. "ఈ నాశరీర మిచ్చటనే యెండిపోవుగాక. ఇందలియెముకలు, మాంసము శిథిలతనొందుగాక. ఏయనంతజ్యోతిర్దర్శన మతి కష్టసాధ్యమో ఆయనంతజ్యోతిర్దర్శనము లభింపనిదే యుగసహస్రములైనను ఈశరీర మీయాసనమునుండి చలింపరాదు"*అను బుద్ధభగవానునిశపథము నాతడు నిశ్చలధైర్యమూర్తియై వచించెను. అంత తోడిశిష్యు లావేశపరవశులై తత్త్వాన్వేషణమున బుద్ధునివలెనే తమశరీరములైనను త్యజింప నిశ్చయించు కొనిరి. నరేంద్రు డంత తారకు (శివానందస్వామి)ని, కాళీప్రసాదుని దీసికొని రహస్యముగా బుద్ధగయ కేగెను. అచట మూడునాలుగుదినములు మహో న్నతధ్యానమున గడపి తిరిగి వారు కాశీపురవనమున కరుదెంచిరి. శిష్యులను జూచి సంతసించి, శ్రీరామకృష్ణుడు బుద్ధునితత్త్వమునుగూర్చి నరేంద్రుని ప్రశ్నించెను. బుద్ధు డవాఙ్మానసగోచరమగు తన దివ్యానుభూతి యిట్టిదని ప్రక టింపమి జను లాతని నాస్తికుడని చెప్పెదరని నరేంద్రుడు వచింప శ్రీరామ కృష్ణు డది యథార్థమని వక్కాణించెను.

శ్రీరామకృష్ణునిజీవితమం దిక మిగిలిన దినములు శిష్యులకు చిరస్మర ణీయమైనట్టిదినములు. ఒకనాడు పెద్దగోపాలుడు (అద్వైతానందస్వామి)

---

* "ఇహాసనే శుష్యతు మే శరీరం, త్వగస్థిమాంసం విలయం చ యాతు, అప్రాప్యబోధిం బహుజన్మదుర్లభాం, నైవాసనాత్ కాయమత శ్చలిష్యతే."

అను శిష్యుడు సన్న్యాసులకు బంచిపెట్టుడని కొన్ని కాషాయవస్త్రములను రుద్రాక్షమాలలను శ్రీరామకృష్ణున కర్పించెను. శ్రీరామకృష్ణు డిట్లు పల్కెను : "చూడు. ఈ బాలురు వైరాగ్యప్రపూర్ణులు. వీరిని మించిన సన్న్యాసులీప్రపంచమున నెచ్చటను నీవు గానరారు. ఆకాషాయవస్త్రములను రుద్రాక్షమాలలను ఈబాలురకు బంచిపెట్టు." భావి శ్రీరామకృష్ణమఠప్రదీపకులగు ఆబాలురను బిల్చి గురుదేవుడు వారలకు సన్న్యాసదీక్ష నొసగెను. తమ మనోభీష్టము నెఱవేఱినందులకై శిష్యులు పరమానందభరితులైరి.

అనేకజన్మార్జితతపఃఫలమగు నిర్వికల్పసమాధి నరేంద్రున కీసమయము ననే సిద్ధించినది. సచ్చిదానందసాగరమున దేలియాడవలయునని నరేంద్రుడు పరితపించుచుండెను. అందులకై శ్రీరామకృష్ణు ననేకపర్యాయములు ప్రార్థించెను.

ధ్యానస్థితుడైయుండ నరేంద్రు డొకనాడు ఆకస్మికముగా తనశిరస్సునకు వెనుకభాగమున నొక దివ్యజ్యోతిని గాంచెను. అయ్యది క్రమముగా విజృంభింపసాగెను. నరేంద్రు డాకాంతిపుంజమున మునిగెను. అపుడాతని మనఃస్థితి యెట్టిదో వర్ణింప నెవరితరము? నరేంద్రుడు ధ్యానించుచుండినగదిలో పెద్దగోపాలుడు తక్క వేఱెవ్వరును లేరు. అచట ప్రశాంతి రాజ్యమేలుచుండెను. అంత నకస్మాత్తుగా, "అన్నా! గోపాలా! గోపాలా! నాశరీరమేమైనది?" యను నరేంద్రుని కంఠధ్వని విని గోపాలుడు, "నరేన్! ఏమది? ఇది నీశరీరముకాదా?" యని పల్కెను. నరేంద్రుని శరీరము బిఱ్ఱబిగిసికొనిపోయియుండెను. గోపాలుడు భయభ్రాంతుడై శ్రీరామకృష్ణునికడ కరుగుసరికి ప్రశాంతముగా నాత డిట్లు పల్కెను : "అతని గొంతసేపు అట్లుండనిండు. అందులకై నన్నాతడు చాలకాలము వేధించియున్నాడు."

జాముర్రాత్రి యగువఱకు నరేంద్రుడు నిర్వికల్పసమాధిస్థితిలో నుండెను. అంత క్రమముగా బాహ్యస్మృతి కలుగనారంభించెను. శిష్యు లాతని పరివేష్టించియుండిరి. శాంతిసాగరోత్తుంగతరంగముల నోలలాడినట్టు లాతనికి గోచ

రింపసాగెను. ఆతనివదన మనిర్వాచ్యానందమును వెలిగ్రక్కుచుండెను. బ్రహ్మ మొక్కటియే సమస్తసమన్వయసూత్రమని నరేంద్రుడు స్పష్టముగా గ్రహించి యున్నాడు. శ్రీరామకృష్ణునికడకేగినంతనే నరేంద్రునినేత్రముల నవలోకించి యాతడిట్లు పలికెను: "తల్లి నీకిప్పుడు సర్వము జూపినదికదా! ధనము పెట్టెలో బెట్టి తాళమువేయునట్లు నీయీ దివ్యానుభవము తాళమువేయ బడును. ఆతాళపుచెవి నాచేతిలో నుండును. నీవు చేయవలయు కార్యము గలదు. నాకార్యము నెఱవేర్చినవెనుక ఈధనపేటిక మఱల తెఱవబడును. ఇప్పటివలెనే అపుడు నీకు సమస్తము తెలియగలదు. కొంతకాలమువఱకు శరీర విషయమున జాగరూకుడవై యుండుము. ఆహార విషయమునను మిత్రుల విషయమునను అత్యంతవిచక్షణతో మెలగుము." మఱియు శిష్యులతో నిట్లు పల్కెను: "నరేంద్రు డిచ్ఛామరణము నొందగలడు. తా నెవరో గ్రహించిన మఱుక్షణ మాతడు శరీరమున నిలువనొల్లడు. తన మానసికాధ్యాత్మికశక్తులచే నరేంద్రుడు లోకము నట్టూతలూగించునట్టి సమయము రాగలదు! ఈ దివ్యానుభవ మాతనికి మఱుగుపడి యుండునట్లు చేయుమని తల్లిని ప్రార్థించి తిని. ఆతనివలన జరుగవలసిన కార్యము చాల గలదు. కాని యీ తెర చాల పలుచనిదగుటచే తలచినంతనే భేదించుకొని నరేంద్రుడు విముక్తుడు కాగ లడు." గురువాక్యము లెట్లు యథార్థములయ్యెనో ముందు మనకు విశదము కాగలదు.

శ్రీరామకృష్ణనిర్యాణసమయ మాసన్నమైనది. ముముక్షుజనమార్గదర్శక మైన యాదివ్యజీవనప్రదీపము మినుకుమినుకు మనుచుండెను. అమితబాధ నొందుచు శ్రీరామకృష్ణుడు నరేంద్రుని జేరబిలిచి, "ఇతరులకు నరేంద్రుడు బోధించును" అని యొక కాగితముపై వ్రాసియిచ్చెను. సంశయచిత్తుడై నరేంద్రుడు, "నేనట్లు చేయ" ననియెను. "నీవు చేసితీరుదు" వని శ్రీరామ కృష్ణుడు మాఱువల్కెను. మఱియొకసమయమున, "నాయోగసిద్ధు లన్నియుం గొలదికాలములో నీమూలమున వ్యక్తము కాగలవు" అని వచించెను.

అంత్యదినములు సమీపించుచున్నవని యెఱిగి శ్రీరామకృష్ణుడు విశేషముగా శిష్యుల కాధ్యాత్మికబోధ చేయుచుండెను. ప్రధానశిష్యుడగు నరేంద్రునియెడ ప్రత్యేకశ్రద్ధవహించి, ప్రతిదిన మాతని దనయొద్దకు బిలిచి, ముందు తాను శిష్యుల నెట్లైక్యసూత్రబద్ధులను గావింపవలెనో, సన్న్యాస జీవితమునకు వలయు శక్తిసామర్థ్యముల నెట్లలవడజేయవలయునో, వారల నెట్లు ప్రేమించి యాదరింపవలెనో—ఇట్టి విషయములను ఏకాంతముగా దినమునకు రెండుమూడుగంటలసేపు బోధించుచుండెను.

శ్రీరామకృష్ణునిమహాసమాధి కిక మూడునాలుగు దినములు మాత్రమే మిగిలియున్నవి. నరేంద్రు నాతడు తనయొద్దకు బిలిచి, తదేకదృష్టితో నాతని జూచుచు ధ్యాననిమగ్ను డయ్యెను. తోడనే విద్యుత్ప్రసారమువలె ఏదియో యొకసూక్ష్మశక్తి తరంగము తనలో బ్రవేశించుచున్నట్లు నరేంద్రునకు గోచరించెను. పిమ్మట నరేంద్రుడు బాహ్యస్మృతి రహితు డయ్యెను. స్మృతి వచ్చిన వెనుక నాతడు గురుదేవుని నేత్రములనుండి బాష్పధారలు ప్రవహించుచుండుట గాంచి, యాశ్చర్యచకితుడై కారణమరయ నాత డిట్లు పలికెను: "నరేంద్రా! నేడు నాసర్వస్వము నీకు ధారపోసి నేనాధ్యాత్మికసంపద్విహీనుడనై పకీరునైతిని. నే నొసగినశక్తిచే లోకమున నీవు ఘనకార్యము లొనర్పగలవు. ఆనంతరము మఱల స్వస్థితి నొందెదవు." అమానుషప్రయత్నముచే అనేకసంవత్సరములు ఘోరతప మొనర్చి తనగురుదేవు డార్జించిన యఖండశక్తి, అనిర్వచనీయప్రతిభ, ఆధ్యాత్మికసంపద్వైభవము, నరేంద్రున కిట్లప్రయత్నముగా లభించినది. ఎవ్వరైన నొకపుష్పము నిచ్చునట్లు, కానుక నొసగునట్లు, శ్రీరామకృష్ణుడు తన సర్వస్వమును లోకకల్యాణమునకై నరేంద్రుని యధీనము గావించెను. త్యాగమున కింతకంటె పరమావధి యెద్ది ?

శ్రీరామకృష్ణునిమహాసమాధి కిక రెండుదినములు మిగిలియున్నవి. చంద్రుని బరివేష్టించియుండు నక్షత్రములవలె శిష్యులాతని చుట్టువారుకొనియుండిరి. తటాలున నరేంద్రుని కీయభిప్రాయము తోచినది: "ఈయన అనేక

పర్యాయములు తాను అవతారమూర్తినని చెప్పియున్నాడు. శరీరబాధచే, మరణయాతనచే, దుర్భరమగు నీస్థితిలోఁగూడ తాను అవతారమూర్తినే యని చెప్పినచో నమ్మెదను!" తత్క్షణమే శ్రీరామకృష్ణుఁడాతనివైపు దిరిగి, తన యావచ్ఛక్తిని వినియోగించి స్పష్టముగా నిట్లుపలికెను: "తండ్రీ! నీ కింకను సంశయము తీరలేదా? వినుము. **ఎవ్వఁడు రాముఁడో, ఎవ్వఁడు కృష్ణుఁడో, ఆతఁడే యీ శరీరమున రామకృష్ణుఁడు. కాని నీ వేదాంతప్రకారము గాదు సుమీ!"** శ్రీరామకృష్ణుఁడు సాక్షాద్భగవదవతారమూర్తి యనుట కనేక నిదర్శనములను కన్నులారగాంచియు, క్షణకాలమైనను, సంశయించినందులకై నరేంద్రుఁడు లజ్జావనతవదను డయ్యెను.

అంత్యదినములు రెండును శిష్యుల కతిదుఃఖకరమైనవి. లోకమున దామిక తెన్నుగానక తండ్రిలేనిబిడ్డలమైపోవుదుమనువిచారము వారికి దుర్భరమయ్యెను. శ్రీరామకృష్ణు డపరిమితమగు శారీరబాధల నొందుచున్నను, నరేంద్రుని జేరబిలిచి తన యంత్యోపదేశము నొసఁగెను. పిమ్మట ముమ్మారు కాళిని స్మరించి, శ్రావణకృష్ణ పాడ్యమీ భానువారము రాత్రి యించుమించుగా ఒంటిగంటకు (1886-వ సంవత్సరము ఆగస్టు పదునాఱవ తేదీని) శ్రీరామకృష్ణు డఖండసచ్చిదానందమయమగు పరబ్రహ్మైక్యము నొందెను.*

కాశీపురోద్యానభవనము దుఃఖనిలయ మయ్యెను. దిక్కులేనివారివలె, తండ్రిలేని బిడ్డలవలె, దీనులై శిష్యులు విలపింపసాగిరి. అఖండానురాగపూరితములగు నాతనిపలుకులు వినుయోగ మిక లేకపోయెనే! బ్రహ్మానందభాసురములగు ఆదివ్యనేత్రము లిక కడసారి మూతపడిపోయినవి! ముముక్షు జనసహస్రములకు జ్ఞానదానమొనర్చిన యానోరు మృత్యుబద్ధమైనదే! ఇక వారలకు దిక్కెవ్వరు ? ఇక నరేంద్రుని మనసార ప్రేమించి మహోపదేశము లొసగు వారెవ్వరు ?

---

* శ్రీరామకృష్ణపరమహంస జననము, ఫాల్గున శుక్ల ద్వితీయా బుధవారము (18-2-1836).

శ్రీరామకృష్ణుడు పండుకొనిన మంచమును బయటికి గొనివచ్చి, శిష్యు లాతనిశరీరమును కాషాయాంబరములచే గప్పి, పుష్పచందనములచే నలంక రించిరి. భజనచేయుచు, గురుదేవునిభౌతికశరీరమును సమీపముననున్న బారా నగరమందలి శ్మశానమునకు గొంపోయిరి. ఒకరివెనుక నొకరందఱును గురుదేవుని శరీరమును తమభుజములపై వహించిరి. గురుభక్తులందఱును వచ్చి సాష్టాంగ వందనములు సల్పిరి. పిమ్మట సుగంధద్రవ్యములతోడను ఆజ్యముతోడను శ్రీ రామకృష్ణుని భౌతిక దేహము దహింపబడియెను.

నిజముగా శ్రీరామకృష్ణుడు మరణించెనా? ఆత్మజ్ఞానస్వరూపుడై, అమృతత్వము నొందిన యాతడు మరణించుటెట్లు? ఎవ్వనిపవిత్రజీవితము, ఎవ్వనిపవిత్రమూర్తిమత్త్వము, ఎవ్వనిపవిత్రనామము సమస్తశాస్త్రార్థ సంగ్రహామై, ముముక్షుజనమార్గదర్శకమై, విశ్వకల్యాణహేతుభూతమై విల సిల్లుచున్నదో అట్టి శ్రీరామకృష్ణుడు భౌతికశరీరమును జాలించినంతమాత్రమున మరణించెననజెల్లునా? శరీరమున నున్నను, లేకున్నను శ్రీరామకృష్ణుడు తమ యంతరాత్మ కాడా? ఇట్టి భావపరంపరలచే శిష్యులపరితాప ముపశమింప నపూర్వమగు ప్రశాంతి భాసించెను.

దగ్ధశేషము నొకపాత్రమునం దుంచిరి. 'జయ! శ్రీరామకృష్ణ గురు దేవ!' యని ఘోషించుచు సోదరశిష్యగణముతో గూడి నరేంద్రుడు కాశీ పురోద్యానభవనమునకు మఱలెను.

## పదునాఱవ ప్రకరణము

# బారానగరమఠము

సాక్షాత్కారమే పరమావధిగా నిడుకొని, సర్వసంగపరిత్యాగచిహ్నములగు కాషాయాంబరముల దాల్చి, యొండొరులయెడ మాతృప్రేమను మించిన ప్రేమతో మెలగుచు, నరేంద్రుని నాయకత్వమున శిష్యులు కాశీపురవనమునుండి సమీపమునసున్న బారా (వరాహ) నగరమునకేగి, యట తపోధ్యానాదికములతో కాలము గడపుచుండిరి. బారానగరమున శిథిలమగు నొక యింటిని స్వల్పమగు నద్దెకు దీసికొని, శ్రీరామకృష్ణుని యస్థిసంచయమును ఛాయాపటమును అందొకచోట స్థాపించి, పూజాసంకీర్తనము లొనర్చుచుండిరి. నేడు జగద్వ్యాప్తమై యలరారు శ్రీరామకృష్ణమఠసేవాశ్రమములకు ఈబారానగరమఠమే బీజము.

ప్రారంభమున శ్రీరామకృష్ణునియస్థుల నొక రాగిపాత్రమునందుంచి, కాశీపురవనగృహమున నాతడు నివసించినతావున శిష్యులు భద్రపఱిచి పూజించుచుండిరి. కాని, రామచంద్రదత్తు అను నొక గృహస్థశిష్యుని నాయకత్వమున కొందఱు గృహస్థశిష్యులు గంగాతీరమున గురుచిహ్నములను స్థాపింతుమని సన్న్యాసశిష్యులతో నొడంబడిక చేసికొనియుండిరి. బాలశిష్యులు తమ గురుస్మారకముల నిచ్చివేయుట కంగీకరింపకుండుటచే నిరుతెగలమధ్య తీవ్రవాదములు చెలరేగినవి. ఈవిషమపరిస్థితులను పరికించి నరేంద్రుడు ఇట్లు పలికెను : "సోదరులారా ! న్యాయ్యమార్గము నవలంబింపుడు. శ్రీరామకృష్ణుని శిష్యు లాతని యస్థులకై కొట్లాడి రను దుర్యశమునకు పాల్పడకుడు. గురుస్మారకములను వారినే తీసికొననిండు ! గురూపదేశముల ననుసరించి మనము ఆదర్శప్రాయులమై జీవింతముగాక ! గురూపదిష్టమార్గమున జీవింపగల్గినచో కేవల మాతని యస్థులను పూజించుటకంటె మహత్తరకార్యము నొనర్చిన వార

మగుదుము.” నరేంద్రుని ధీరగంభీరవాక్యములను విని శిష్యు లంగీకరించిరి. కాని గురుచిహ్నములను గృహస్థశిష్యుల కిచ్చివేయుటకై నియమింపబడినదిన మున నరేంద్రుడు, “నిజముగా గురుదేవుని చిహ్నములన్నియు వారియధీనము కారాదు. భస్మముమాత్రము వారికొసగుదము” అని తలచి, సోదరులను జూచి, “పాత్రమును దీసికొనిరండు” అనెను. అంతట వారు పెద్దవగునస్థులను దీసి భద్రపఱిచి గురుప్రసాదమగు నం దత్యల్పభాగమును నోటవైచుకొనిరి. తత్ఫలితముగా నాటిరాత్రి వారల కత్యుత్తమమగు ధ్యానస్థితి లభించెను. గృహస్థ శిష్యు లేమి జరిగెనో యెఱుగక, పాత్రమును గ్రహించి, గంగానదికి తూర్పు దిక్కున కొలదిమైళ్లదూరమున నున్న కాకురుగాచి యను గ్రామమున స్థాపించిరి. కాలక్రమమున యోగోద్యానమను నాపవిత్రస్థలమున నొక శ్రీరామకృష్ణాలయము నిర్మితమైనది.

ఇట్లు నరేంద్రుని నాయకత్వమున 1886-వ సంవత్సరముమొదలు 1892-వ సంవత్సరమువఱకు మఠము బారానగరముననే యుండి, మఱల దక్షిణేశ్వరసమీపమున నున్న ‘ఆలంబజారు’ నకు మార్పబడి, యట 1897-వ సంవత్సరమువఱకు నుండెను. తరువాత గంగానది యొడ్డుననున్న నీలాంబర ముఖర్జీవనములోనికి మార్పబడియెను. అచటినుండి బేలూరులో వివేకానంద స్వామిచే నార్జింపబడిన పుణ్యస్థలమున శ్రీరామకృష్ణమఠము నేడు సుప్రతిష్ఠితమై యలరారుచున్నది. నరేంద్రుడే తనశిరమున గురుదేవుని యస్థులు గల పాత్రమును వహించి, బేలూరుమఠమున స్థాపించుచు బాష్పపూరితనేత్రుడై యిట్లు పలికెను: “గురుదేవుని నేనిచట నుంచెదను. శాశ్వతముగా నాత డిచట నుండును.” ‘నన్ను నీవెచటనుంచిన నచటనే సంతుష్టుడనై యుందు’ నను గురు వాక్యములను స్మరించి యాత డశ్రువులు విడిచెను.

బారానగరమఠమున ధ్యానసంకీర్తనలు, తత్త్వశాస్త్రపఠనము—ఇవియే శిష్యులదృక్పథము నాక్రమించెను. ‘కాంట్, హెగెల్, మిల్, స్పెన్సర్’ మున్నగు పాశ్చాత్యతత్త్వజ్ఞులసిద్ధాంతములను శిష్యులు చర్చించిరి. సమస్త

శాస్త్రములను శోధించిరి. దేవుని యునికినిగూర్చి ప్రసంగము వెలువడినచో నరేంద్రుడు సయుక్తికముగా దేవుడులేడని నిరూపించును; మఱల నాత డప్రతిహతమగు యుక్తులతో భగవంతుడొక్కడే సత్యమని ఋజువుచేయును. సన్న్యాసులతో వాదించుటకై అప్పుడప్పుడు క్రైస్తవమతప్రచారకులు మఠమునకు వచ్చువారు. అడుగడుగునను నరేంద్రుడు వారిని నిరుత్తరులను జేసి, యనంతరము జీససుమహాశయు నౌన్నత్యమును వారలకు ప్రకటించువాడు.

ధ్యానసంకీర్తనాదులతో శిష్యులు కృష్ణాష్టమి, మహాశివరాత్రి మున్నగు పర్వదినముల నన్నిటిని యథోక్తముగా జరుపువారు. నరేంద్రుడు రచించిన శివసంకీర్తనతో మహాశివరాత్రివ్రతమారంభించి, వా రుపవాసముతోడను పూజలతోడను ప్రార్థనలతోడను దినమంతయు దివ్యావేశపూరితులై గడపిరి. భస్మధారులై, కరతాళధ్వనులతో, "హర! హర! మహాదేవ! శంభో!" యని యుచ్చైస్స్వరమున నిరంతరసంకీర్తనమొనర్చుచు నాడు వారొనర్చిన నృత్యమెంతయు దర్శనీయమై విరాజిల్లెను. ఉదయపుగడియలలో వారు సమస్తదేశములందలి భగవదవతారమూర్తులను స్మరించి హవిస్సులను వ్రేల్చుచు హోమ మాచరించిరి.

బాలసన్న్యాసులను వారిబంధుగులును పెద్దలును 'మఱలి రండు' అని నిర్బంధింపసాగిరి. కాని, గుర్వాజ్ఞను బాలింప గంకణముకట్టుకొనిన యాయతివతంసులయెడ వారలసామదానభేదదండోపాయములన్నియు నిష్ఫలములైనవి. చేయునదిలేక వారిట్లు వచించువారు: "నరేంద్రుడే యింత పుట్టిమునుకకును కారణము. నిక్షేపములాగున మాబాలు రిండ్లకు వచ్చి చదువుకొనుచుండగా ఈనంగనాచిమూలమున అంతయు తలక్రిందైనది!"

బారానగరమఠమున బాలసన్న్యాసు లొనర్చిన మహోత్తమతపశ్చర్యలనుగూర్చి నరేంద్రుని వచనములు వినదగినవి. ఆత డిట్లు పలికెను: "ఆసమయమున మఱుసటిదినమునుగూర్చి మేమెన్నడును స్మరించియెఱుగము. అయాచితముగా భగవంతుడేమి ప్రాప్తింపజేయునో అదియే మాకాహారము. అనేక

దినములు నిరాహారులమై గడపితిమి. అన్నముండినచో ఉప్పు లేకుండెడిది. ఉడుకబెట్టిన దొండయాకులు, ఉప్పు, అన్నము—నెలలకొలది ఇవియే మాకాహారము! నిరంతరతపోధ్యానాదికములచే భగవదావేశపూరితులమై, బాహ్యస్మృతిరహితులమై గడపిన యాపుణ్యదినముల నేమని స్మరింతును! బ్రాహ్మముహూర్తమున లేచి, కాలకృత్యముల దీర్చికొని, పూజామందిరమున జపమారంభించినచో ఒక్కొక్కప్పుడు సాయంకాలమగుచుండెడిది. అంతవఱకు శశి (రామకృష్ణానందస్వామి) మాభోజనమునకై కనిపెట్టుకొనియుండువాడు. ఆవశ్యకమగుచో బలవంతముగా మ మ్మాతడు ధ్యానస్థితినుండి యీవలకు లాగుచుండెడివాడు! జగత్తుండెనో లేదో అప్పుడెవరికి లక్ష్యము!"

ఇవ్విషయమునుగూర్చియే కాలక్రమమున స్వామిశిష్యుడై నశరచ్చంద్రగుప్తుడు (సదానందుడు) ఇట్లు వ్రాసెను: "ఆదినములలో స్వామిజీ విరామమనునదిలేక ఇరువదినాలుగు గంటలును ఒక్కపట్టున కార్యనిమగ్నుడై యుండిన ధీరుడు. ఆతని కార్యదీక్షను జూచినచో శరీరము కంపించును. వేకువజామున లేచి, "లెండు, నామామృతము గ్రోలుడు!" అని గానమొనర్చుచు తోడివారలను మేల్కొల్పును. సోదరశిష్యసమేతుడై యాతడు అర్ధరాత్రమైన వెనుకగూడ మఠముపైభాగమున గూర్చుండి సంకీర్తనమొనర్చుచుండును. ఇరుగుపొరుగు వార లనేకవిధముల నిరోధింపజూచిరి. కాని వారియత్నములు నిష్ఫలములయ్యెను. 'సీతారామ' 'రాధాకృష్ణ' నామములను స్వామిజీ తన జగన్మోహనకంఠమున నుచ్చరించుచు సంకీర్తనము నడపును. అఖండసాధనలతో ఆదినములన్నియు నిముసములై గడచినవి. అపుడు విశ్రాంతియే లేదు. ఇతరులు వచ్చి వెడలిరి. పండితులు వాదోపవాదములొనర్చిరి. కాని స్వామి మాత్రము తీవ్రకార్యశూరుడై వర్తించెను."

ఈసమయమున తమతో వాదింపవచ్చిన యొక గృహస్థునితో నరేంద్రుడు వైరాగ్యజ్వాలయై యిట్లు పల్కెను: "ఒకవేళ భగవంతుని జూడ జాలకున్నను, తుచ్ఛసాంసారికజీవితమునకు మఱలుదుమనుకొనుచుంటివా? అట్టి

దుర్గతి మాకు వలదు.” మఱియొకప్పు డిట్లు వచించెను: “నాదివ్యానుభవముల వలని ఫలమేమి? స్వర్ణతేజోమయాక్షరములలో మంత్రమును దర్శించితిని. కాళికాదిదేవతాస్వరూపసాక్షాత్కారము నందితిని. కాని, శాంతి కలుగలేదు. ఆహా! శాంతి యెట్లు లభించునోకదా! నాకేదియు రుచించుటలేదు. భగవంతుడనువాడు లేనట్లు తోచుచున్నది. బ్రహ్మసాక్షాత్కారము లభింపనిచో ప్రాయోపవేశ మొనర్తును.”* ఇట్లు మహావైరాగ్యప్రపూర్ణుడు, భగవదేకాయత్త చిత్తుడునగు నరేంద్రుని మహాతపఃఫలమే శ్రీరామకృష్ణమఠసంస్థ; శ్రీరామకృష్ణసేవాసంఘము.

---

* ఈసమయమున నరేంద్రునిగూర్చి యొకభక్తుడు తనదినచర్యాగ్రంథమున నిట్లు లిఖించియున్నాడు: “నేడు నరేంద్రుడు నూతన కాషాయ వస్త్రమును దాల్చి, ఆహా! ఏమి దివ్యతేజోమూర్తియై విరాజిల్లుచున్నాడు! బ్రహ్మజ్ఞానముచే జాజ్వల్యమానమయ్యును భగవద్భక్తిచే ప్రకాంతమైన యాతని వదనము భాసించుచున్నది! భగవదితరచింత లేని యాబాలసన్న్యాసు లెంతటి ధన్యులోకదా!”

## పదునేడవ ప్రకరణము

## పరివ్రాజకదశ : ఉత్తరదేశతీర్థయాత్రలు

బారానగరమఠమున తపశ్చర్యలతో కాలము గడపుచు నరేంద్రుడును సోదరశిష్యులును ఒకప్పుడు విరజాహోమమొనర్చి సమంత్రకముగ సన్న్యాసదీక్షను దాల్చిరి. ఆసమయమున వారు నూతననామధేయములను ధరించిరి. కాని నరేంద్రుడుమాత్ర మెట్టిశాశ్వతనామమును దాల్పలేదు. తన పరివ్రాజకదినములలో జనులు తన్ను గుర్తింపకుండుటకై ఆత డనేక పర్యాయములు పేరు మార్చుకొనుచువచ్చెను. అమెరికాఖండమున కేగుటకు ముం దాతడు ఖేత్రీమహారాజుకోరికననుసరించి జగత్ప్రసిద్ధమగు వివేకానంద నామమును ధరించెను.

ప్రారంభమునుండియు శిష్యులలో పరివ్రాజకజీవితేచ్ఛ ప్రబలమగుచుండెను. అనేకులు గురుదేవుని నిర్యాణానంతరము మాతృదేవితో బృందావనమున కేగిరి. ఇట్లే మఱికొందఱు హిమాలయపర్వతారణ్యములకును నదీతీరములకును పుణ్యక్షేత్రములకును పయనమైరి.

నరేంద్రుడు సోదరశిష్యబృందము తన్ను బంధించు బంగారుసంకెలయని భావించెను. సర్వసంగపరిత్యాగమున కాటపట్టగు పరివ్రాజకజీవనమును గడపుచు నూతనదివ్యానుభవములను బొందుటయే యాతని పరమసంకల్పము. మఱియుం దోడిశిష్యబృందము స్వశక్తిపై నిలువవలయునని యాతని యభిప్రాయము. ఇట్టి సంకల్పములతో నాత డాసేతుహిమాచలము పర్యటన మొనర్చెను.

పరివ్రాజకయాత్రలో మొట్టమొదట నరేంద్రుడు దర్శించిన పుణ్యక్షేత్రము కాశీనగరము. పుణ్యక్షేత్రములకెల్ల పుణ్యక్షేత్రము, యుగయుగములనుండియు సనాతనధర్మసామ్రాజ్య కేంద్రస్థానము, వేదవేదాంతసమస్త

విద్యానిలయము, యతీశ్వరకోటినివాసము, సాక్షాద్విశ్వేశ్వరావాసమునైన కాశీనగరమును జేరి యాతడమందానందసాగరమున దేలియాడెను. దివ్యగంగాస్నాతుడై, విశ్వేశ్వరాదిదేవతాసందర్శనమొనర్చి, భక్తజనావళులతో, "హర! మహాదేవ! శంభో! రక్షకా!" యని ప్రార్థనలు సల్పుచు దివ్యావేశ పారవశ్యమును జెందుచుండెను.

నరేంద్రు డొకనాడు దుర్గాలయమునుండి వచ్చుచుండ, కోతులగుంపొకటి యాతని వెంటాడెను. నరేంద్రుడు భయపడి పర్వెత్తనారంభించెను. "పాఱిపోకుము, పశువునెదుర్కొనుము!" అని యొకవృద్ధసన్న్యాసియొక్క కంఠరవము విననయ్యెను. ఆమాటలు విని నరేంద్రుడు ధైర్యమూర్తియై నిలువబడెను. మర్కటసమూహము వెనుకకు మఱలెను. ఈ విషయమును దలచియే, అమెరికాలో నుపన్యసించుచు, "ప్రకృతి నెదుర్కొనుడు! అజ్ఞానము నెదుర్కొనుడు! మాయాభూతము నెదుర్కొనుడు! వెనుకంజవేయకుడు!" అని వివేకానందుడై ఘోషించియున్నాడు.

కాశీనగరమున నరేంద్రు డనేకపండితులను దర్శించెను. పండితభూదేవముఖోపాధ్యాయునితో ననేక విషయములనుగూర్చి చర్చింప నాతడు, "ఆశ్చర్యము! ఇంతపిన్నవయసున నిట్టియనుభవము, పాండిత్యము నెన్నడు కనలేదు. ఈతడు మహాపురుషుడగుట నిశ్చయము" అని వచించెను. అనంతరము నరేంద్రుడు నిరంతరధ్యాననిమగ్నుడగు త్రైలింగస్వామిని దర్శించెను. పిమ్మట భాస్కరానందస్వామిని దర్శింప నాతడు, "సంపూర్ణముగా కామకాంచన జయము గావించిన వారెవ్వరును లేరు" అని వాదింపసాగెను. నరేంద్రు డామాట సహింపక, "అట్లనకుడు, అట్టి మహనీయుని పాదసేవ నాకు లభించిన" దని శ్రీరామకృష్ణు నుదాహరించెను. భాస్కరానందుడు నరేంద్రుని వాగ్ధాటిని జూచి దిగ్భ్రాంతుడై, "ఈతని నాల్కపై సరస్వతి తాండవించుచున్నది. ఈతని హృదయము దివ్యతేజోనిలయము" అని వచించి యూరకుండెను.

పిమ్మట నరేంద్రు డయోధ్య కేగి శ్రీమద్రామాయణవైభవము నట ప్రత్య క్షముగా గాంచెను. ఆగ్రా కేగి తాజమహాలును దర్శించి, "అత్యద్భుతమగు నీదివ్యభవనమునం దణుమాత్రమును ప్రశాంతముగా బరిశీలింపవలయునన్న నొక్కదినము పట్టును. నిజముగా దీనినంతను బరిశీలించుట కాఱు నెలలగు" నని వచించెను.

నరేంద్రు డటనుండి బృందావనమునకు పయనమై దారిలో నొక యంత్యజుడు పొగబీల్చుచుండుట చూచి, యలసటచే నొకించుక విశ్రాంతి నొందగోరి, యాతనియొద్ద కేగి చిలుము నొకసారి యిమ్మని కోరెను. అంత్యజు డాశ్చర్యచకితుడై "సామీ! నేను పాకివాడను" అని సంశయముతో బలుక నరేంద్రుడు కొంతదూర మేగి, "సర్వాత్మైక్యభావమును నమ్ముచు, జాతిభేదాదుల నవ్వలద్రోసి సన్న్యసించిన నేను అతడు తాను పాకివాడనని చెప్పినంతనే, అస్పృశ్యతాదోషమున కెరయై, స్వజాత్యహంకారబద్ధుడనై యాతని చిలుము గొట్టము ముట్టుటకు నిరాకరించితినే! తరతరములనుండి వచ్చుచున్న పూర్వా చారమాధ్యమిది" యని తన్ను తాను నిందించుకొని తిరిగి వెడలి, యాతని నడిగి చిలుము పుచ్చుకొని, పొగబీల్చి, బృందావనమున కేగెను.

బృందావనమున రాధాకృష్ణుల లీలాద్భుతములను దలచి నరేంద్రుడు భక్త్యావేశపరవశుడై యటనుండి గోవర్ధనపర్వతమున కేగి, గిరిప్రదక్షిణ మొనర్చుచు, "అయాచితముగా నేమి లభించునో అదియే భుజింతు" నని ప్రతిన దాల్చెను. ఆకలి బాధచే, దీర్ఘయాత్రచే, నెంతయలసినను స్థిరసంకల్పుడై యాత్ర సాగించుచుండెను. మహాత్ముల సంకల్పము లప్రతిహతములు గదా! అట్లు నడచుచుండిన నరేంద్రునకు వెనుకనుండి యెవ్వరో తన్ను పిలుచుచుండి నట్లు విననయ్యెను. "ఇదిగో, మీ కాహారము దెచ్చుచున్నా"నని యానూతన వ్యక్తి నరేంద్రుని సమీపించుచున్నను, నరేంద్రుడు పరమేశ్వరకృపను బరీక్షింప నిశ్చయించుకొని, శక్తికొలది ముందునకు బరుగిడ నారంభించెను. వెనుక నున్న యావ్యక్తియు వేగముగా బరుగెత్తి నరేంద్రు నొకమైలుదూరములో

బట్టుకొని, 'భుజింపు' డని పట్టుపట్టెను. నరేంద్రుడు భుజించినంతనే యా పురుషు డదృశ్యు డయ్యెను. దిక్కులేని యాదుర్గమారణ్యప్రదేశమున తన భక్తు నిట్లు రక్షించిన పరమేశ్వరునికృపావిశేషమును గాంచి నరేంద్రు డశ్రువులు విడిచెను. భక్తునియోగక్షేమములను వహింతునని భగవానుడు ప్రతిజ్ఞ దాల్పలేదా?

అటనుండి నరేంద్రుడు వైష్ణవపుణ్యక్షేత్రమగు రాధాకుండమునకు పయనమయ్యెను. మార్గమధ్యమున నొక కొలను గాంచి, స్నానానంతరము కట్టుకొనుటకు వేఱొకబట్టలేమి, కౌపీనమును దడిపి గట్టుమీద నాఱవఱచి, స్నానముచేసి లేచి చూచుసరికి కౌపీనము కాన్పింపదే! నరేంద్రుడు పైకి చూచెను. కౌపీనము నొక కోతి చేతబట్టుకొని చెట్టుకొమ్మపై గూర్చుండియుం డెను. "సోదరా! నాకౌపీనమును నాకిమ్ము"ని నరేంద్రుడు వేడుకొనెను. కోతి యాతని ప్రార్థన నాలకింపలేదు. అంత నరేంద్రు డభిమానపూరితుడై, నిరశనవ్రత మవలంబించి యరణ్యమధ్యమునకు బోవుచుండెను. వెంటనే వెనుక నుండి యొకపురుషుడు కాషాయవస్త్రములను అన్నపానీయములను గొనివచ్చి, స్వీకరింపుమని ప్రార్థించెను. వానిని గ్రహించిన నరేంద్రుని యానందము నెవరు వర్ణింపగలరు? మఱల వెనుక కేగిచూచుసరికి కౌపీనము యథాస్థానమున బడియుండెను. అద్భుతముగదా, భక్తభగవానుల యన్యోన్యసంబంధము!

పిమ్మట హరిద్వారమునకు బోవుచు, దారిలో నరేంద్రుడు 'హత్రాస్' స్టేషనుకడ నిలువవలసి వచ్చెను. ఆస్టేషనునకధికారి శరచ్చంద్రగుప్తుడను వంగ దేశీయుడు. సుశీలసంపన్నుడగు నాతడు నరేంద్రునిమూర్తిమత్త్వమునుగాంచి యాకృష్టుడై యాతనియొద్దకేగి, "స్వామిజీ! మీ కాకలియగుచున్నదా?" యని యడిగెను. నరేంద్రుడు "ఔను" అని పలుక, శరచ్చంద్రు డాతనికి దివ్యభోజనమును సమకూర్చెను. స్వామినిగూర్చి విని యచటి వంగదేశీయులు తీర్థప్రజవలె స్వామిసందర్శనమునకై రాదొడగిరి.

శరచ్చంద్రు డొకనాడు సాధుపుంగవుని జూచి, "మహాశయా! మీ

వదనము విచారసూచకముగా నుండుటకు హేతువేమి?" అని యడుగ నాత డిట్లు పల్కెను: "నాకొకమహాకార్యభారము కలదు. దీనిని కొనసాగింపవలయు నని మద్గురువర్యులు న న్నాజ్ఞాపించియున్నారు. దేశమున ఆధ్యాత్మిక జీవనమడుగంటినది. దారిద్ర్యదేవత తాండవించుచున్నది. ఇప్పట్టున మాతృదేశ మును పునరుద్ధరింపవలసియున్నది. భారతవర్షము మఱల తత్త్వజ్ఞాన ప్రజ్వలితమై ప్రపంచమును జయింపవలసియున్నది." శరచ్చంద్రు డాదివ్యవాక్కులను విని మహోత్సాహపూరితుడై, "స్వామిజీ! ఇదిగో, మీయాన యెట్టిదైనను పరి పాలింప సంసిద్ధుడ" నని పలికెను. "దండకమండలువులు దాల్చి, భిక్షాపాత్ర గొని, యీ మహాకార్యనిర్వహణార్థము జీవిత మర్పింపగలవా? ఇంటింటికి దిరిగి బిచ్చమెత్తుటకు సంసిద్ధుడవా?" యని స్వామి ప్రశ్నించెను. "ఆహా" యని శరచ్చంద్రుడు ధైర్యముతో బలికి, భిక్షాపాత్రనుగొని స్టేషనులోని సేవకుల కడ యాచించుట కరిగెను.

ఒకనా డుదయమున నరేంద్రుడు డటనుండి వెడలనిశ్చయించుకొనెను. శరచ్చంద్రుడు తన్ను శిష్యునిగా నంగీకరింపుడని నరేంద్రుని ప్రార్థించెను. "నాశిష్యుడ వైనంతనే సర్వము లభించునని తలపకుము! భగవంతు డందఱ యందును గలడని గుర్తించి నీ వేకర్మ మొనర్చినను శ్రేయోదాయకమగును. నే నప్పుడప్పుడు వచ్చి నీతో నుండెదనులెమ్ము" అని నరేంద్రు డెంత ప్రతి ఘటించినను శరచ్చంద్రు డంగీకరింపమి తుదకాతనికి మంత్రోపదేశ మొనర్చెను.

తనయుద్యోగమును మఱియొకని కొప్పగించి శరచ్చంద్రుడు నరేం ద్రునితో హృషీకేశమునకు బయలుదేఱెను. మార్గమధ్యమున తా నాకలిచే, బడలికచే, జ్వరముచే నమిత పీడితుడైనపుడు స్వామి తన్ను, తనప్రాణముల నైనను లక్ష్యింపక యెట్లనేకపర్యాయములు మృత్యుముఖమునుండి రక్షించెనో శరచ్చంద్రు డద్భుతముగా వర్ణించియున్నాడు. కొంతకాలమైన వెనుక శర చ్చంద్రుడు సర్వసంగపరిత్యాగ మొనర్చి సదానందుడై మఠమున దన గురు వర్యుని గూడెను.

నరేంద్రుడు మఱల యాత్రలకై పయనమయ్యెను. వైద్యనాథమను పురమును జేరినంతనే యాతడు మఠమున దనసోదరు డొకడు వ్యాధిపీడితు డగుచుండెనని విని, యాతనికి సేవచేయుటకై, "గురుదేవుని పుత్రులు అత్యంతము నాకర్చనీయులు: వారలను సేవించుటొక్కటే నాకు మిగిలి యున్న కర్మము" అని వెనుకకు మఱలెను. సోదరశిష్యుడు స్వస్థుడైన పిమ్మట పావాహారిబాబాయను ప్రఖ్యాతయోగిపుంగవునిగూర్చి విని, నరేంద్రుడాతని సందర్శింప నేగెను.

పావాహారిబాబా యనునాతడు బాల్యమున న్యాయవ్యాకరణాదిశాస్త్రముల నభ్యసించి, పిమ్మట తత్త్వజ్ఞానార్థియై యోగసాధనల నభ్యసించెను. నదీతీరమున నొక సొరంగము నిర్మించుకొని అహర్నిశమందు తపోధ్యానములతో కాలము గడపుచుండెను. ఆత డత్యల్పాహారి. అందుచేతనే యాతనికి పావాహారి (పవనాహారి) బాబాయను పేరు వచ్చెను. కొన్ని నింబపత్రములో, మిరియపుగింజలో—ఇవియే యాతని ప్రతిదినాహారము. సమస్తకర్మములును భగవదారాధనమని యాతడు విశ్వసించెను. తాను తినకున్నను, స్వయముగా వండి భిక్షువులకును పరివ్రాజకులకును బెట్టుచుండెడివాడు. తుద కొకనా డాతని గుహనుండి దగ్ధశరీరవాసనతో గూడిన పొగలు వచ్చుచుండుట చూచి, యోగి తనశరీరమును భగవానున కాహుతియొనర్చి పరబ్రహ్మైక్యమొందెనని జనులు గ్రహించిరి.

ఇట్టి పావాహారిబాబాను దర్శింపనెంచి నరేంద్రుడు ఘాజీపురమున కేగి, మిత్రుడగు గగనచంద్రునింట బసచేసి, బాబాను దినదినము సందర్శించుచు తీవ్రతపమాచరింప సాగెను. పావాహారిబాబాను తనగురునిగా స్వీకరించి ముఖ్యముగా హఠయోగరహస్యములను నేర్చుటయే యాతని సంకల్పము. కాని యఖండవినయసంపన్నుడగు నాయోగిపుంగవుడు నరేంద్రుని జూచి, "ఈ సేవకున కేమి తెలియును? కొన్నిదినము లిచటనుండి నన్నను గ్రహింపుడు" అని వచించువాడు.

ఈసమయమున సోదరశిష్యుడగు అభేదానందస్వామి హృషీకేశమున మన్నెపుజ్వరముచే బాధపడుచుండెనని విని, సంతప్తుడై తనసాయ మావశ్యకమైనపక్షమున వెంటనే వచ్చెదనని నరేంద్రుడు తంతివార్తనంపెను. మఱియు స్వయముగా తాను నడుమునొప్పిచే బాధపడుచుండెను. ఎట్టివిషమపరిస్థితులలోనైనను ప్రశాంతచిత్తుడై యుండుటయే నరేంద్రుని యాశయము. అందులకు దగిన యోగవిద్యను నేర్చుటకే పావాహారిబాబాయొద్ద కేగియుండెను. కాని, బాబాజీ సులభసాధ్యుడుకాడు. నరేంద్రునికోరిక నాతడు లక్షించునట్లు కనబడలేదు. ఎట్లైనను నరేంద్రు డాతనియొద్ద నుపదేశము నొందవలయునని నిశ్చయించుకొనెను. ఇట్లు కృతనిశ్చయుడైనంతనే శ్రీరామకృష్ణుడు ప్రత్యక్షమై నరేంద్రుని వదనమును గంభీరముగా నవలోకింపసాగెను. గురుదేవుడు తనసంకల్పమును గ్రహించి, యఖండప్రేమపూర్వకములగు దివ్యామోఘవచనములచే దన్ను మందలించుచుండెనని గ్రహించి నరేంద్రుడు కృతజ్ఞతాశ్రుపూరితలోచనుడై, లజ్జావనతవదనుడయ్యెను. బహుదినముల పర్యంతము నరేంద్రు డిట్లు శ్రీరామకృష్ణస్వరూపమును గాంచెను. బహుదినముల పర్యంత మాతడు తన జీవితములో నెన్నడెఱుగని దుర్భరమానసికయాతన ననుభవించెను. వారిరువురమధ్య నాదినములలో నేమి జరిగెనో, ఎట్టియద్భుతములు సంఘటిల్లెనో, నరేంద్రు డెన్నడును వెల్లడింపలేదు. పర్యవసానమున శ్రీరామకృష్ణుడే విజయోపేతుడయ్యెను. నరేంద్రుడు తనసంకల్పమును పరిత్యజించెను. తన యపరాధములను సైరించి, తా నాధ్యాత్మికజన్మ మెత్తినదాది, కన్నతల్లివలె పెంచి, ఘోరసంకటపరిస్థితులలో, మహావ్యామోహసమయములలో, శ్రీరామకృష్ణుడు త న్నెట్లు రక్షించెనో స్వామి వ్రాసినలేఖలు వేనోళ్ల జాటుచున్నవి.

అభేదానందునకు జబ్బుచేసినదని విని, స్వామి కాశీనగరము చేరి, యాతని స్వస్థతకు వలయుపరిస్థితులను గల్పించి, మఱల తీవ్రతప మాచరింప నారంభించెను. ఆసమయమున శ్రీరామకృష్ణుని గృహస్థశిష్యులలో ప్రధాన

గణ్యుడగు బలరామబోసు (వసువు) మరణించెనని విని స్వామి దుఃఖసాగర నిమగ్నుడయ్యెను. అంత మిత్రుడగు ప్రమదాదాసు, "మీరు సన్న్యాసులు కదా! మీ కీవిచారమేల?" యని ప్రశ్నింప, స్వామి, "అయ్యా! సన్న్యాసి యైనంతనే మానవునిహృదయ మింకిపోవు ననుకొనుచుంటిరా? మేము శుష్క-వేదాంతులము కా"మని వచించి భక్తునికుటుంబము నోదార్చుటకై కలకత్తాకు వెడలెను.

పిమ్మట శ్రీరామకృష్ణుని జ్ఞాపకార్థము గంగానదియొడ్డున నొక యాలయము నిర్మించు టావశ్యకమని స్వామి తనమిత్రుడగు ప్రమదాదాసున కిట్లు వ్రాసెను: "శ్రీరామకృష్ణుని సేవకుడను నేను. ఆమహనీయుండు జన్మించి సాధనయొనర్చిన పుణ్యభూమియం దాతని పవిత్రనామమును నిలుపుటకై దోసిడిచేయుంటకైనను సమ్మతింతును. ఆపరమపురుషుని జ్ఞాపకార్థ మాలయమును నిర్మింపలేకుండు టతిశోచనీయము...." ఈమహాసంకల్పమే నేడు కలకత్తా నగరమున దేదీప్యమానమగు శ్రీరామకృష్ణదేవాలయరూపమును* దాల్చినది.

పరివ్రాజకజీవితేచ్ఛ స్వామిహృదయమున ప్రబలము కా నాతడు, "స్పర్శమాత్రమున మానవుని పరివర్తన మొందించునట్టి తత్త్వానుభవము లభించువఱకును మఱలువాడను కాను" అని సోదరసమితితో వచించి, శారదామాతృదేవికడ కేగి యాశీర్వాదము వడసెను.

---

* ఈ యాలయము స్వామి సోదరశిష్యులును మద్గురువర్యులును కీర్తిశేషులు నగు శ్రీవిజ్ఞానానందస్వాములవారి పర్యవేక్షణమున సర్వమతసమన్వయ సూత్రముల నాధారముగా గొని నిర్మితమైనది. ఆలయ నిర్మాణమునకు భక్తి యను అమెరికా దేశీయ నారీమణి యేడులక్షల రూప్యముల నొసగి యున్నది. ఇందలి గర్భాలయమున ఒకటియౌ నరరెట్లు నిలువున చలువరాతితో నిర్మితమగు శ్రీరామకృష్ణ విగ్రహము సమున్నతమగు మంటపముపై నలరారుచుండును. ఈయాలయమందలి శిల్పసౌందర్యము వర్ణనాతీతము.

## పదునెనిమిదవ ప్రకరణము

# హిమాలయ పర్యటనము

స్వామి యిట్లు మహోన్నతాత్మానుభవమునే తన యాత్రలకు పరమావధిగా నిడుకొని యఖండానందునితోఁగూడి పయనమయ్యెను. అట్లు బయలుదేఱి వారిరువురు మొట్టమొదట భాగల్పురముఁజేరి బాబుమన్మథ నాథునింట బసచేసిరి. స్వామిసహజమధురవాక్సంపత్తి, శాస్త్రకళాపాండితి, అద్భుతవైరాగ్యప్రదర్శకతేజోమూర్తి—ఇవియన్నియు తన్ను సమ్మోహితునిగా నొనర్చెనని మన్మథనాథుఁడు వర్ణించియున్నాఁడు.

అఖండానందుని కోరికపై స్వామి యాతనితో వైద్యనాథమును దర్శించి యటనుండి కాశీనగరమున కేగెను. తన మిత్రుఁడగు ప్రమదాదాసునితో వేదవేదాంగములను గూర్చి చర్చించి, యటనుండి వెడలుసమయమున నిట్లు వక్కాణించెను: "మఱల నే నిచటికి వచ్చునపుడు ఫిరంగివలె సంఘముపై బడెదను. అపుడు సంఘము కుక్కవలె నన్ననుసరించును." జ్ఞానోత్తేజకమగు నిజవేదాంతోపన్యాసఝంఝామారుతముచే ప్రపంచము నట్టూాత లూగింపనిదే వివేకానందుఁడు వారణాసిలో మఱల కాలిడలేదు.

అటనుండి బదరికాశ్రమమున కేగుచు, దారిలో నొక వటవృక్షమూలమున గొంతసేపు ధ్యానమొనర్చి, లేచి సోదరు నుద్దేశించి, స్వామి యిట్లు వచించెను: "గంగాధరా! (అఖండానందుని పూర్వనామము) నాజీవితమహాసమస్య కొకదాని కిపుడు సమాధానము నొందితిని. పిండాండమునకును బ్రహ్మాండమునకును గల సామ్యమును ఏకత్వము నద్భుతముగా దర్శించితిని."

ఈ సమయమున తన సోదరి యాత్మహత్య చేసికొనెనను దుఃఖవార్తను విని స్వామి పరితపించెను. కాని సమస్త బంధములను జ్ఞానఖడ్గముచే దెగనఱికి, వెనుకకు మఱలుట కిష్టపడక, కర్ణప్రయాగరుద్రప్రయాగలను దర్శించి శ్రీనగరమును జేరెను.

అటనుండి క్రమముగా హృషీకేశమును జేరి, స్వామి యొక కుటీరమును నిర్మించుకొని, మాధుకరభిక్షచే జీవించుచు తీవ్రతప మాచరింప నుద్యుక్తుడై యుండ, విధివశమున రోగగ్రస్తుడయ్యెను. కాని మఱల స్వస్థుడై మార్గమధ్యమున తన్ను గలిసికొనవచ్చిన బ్రహ్మానంద తురీయానందాది సోదరులతో గూడి సంకీర్తనములతోడను తత్త్వవిచారముతోడను సద్గ్రంథపఠనాదికములతోడను కాలము గడపుచుండెను. ఈసమయముననే స్వామి తన యపార సంస్కృత పాండితి వెల్లివిరియ, సోదరులకు మృచ్ఛకటికా శాకుంతలాదిమహాకావ్యముల నద్భుతరీతిని బోధింపసాగెను.

ఇట్లు స్వామి మీరటులో నుండగా నొకనా డచ్చటి గ్రంథనిలయము నుండి సర్జాన్ లబ్బక్ అను పాశ్చాత్యతత్త్వజ్ఞుడు వ్రాసిన గ్రంథజాలమును దెప్పించి, మఱునాడే తిరిగి యిచ్చివేసెను. అది చూచి భాండాగారపాలకుడు "స్వామీ! గ్రంథములను జదివితిరా?" యని ప్రశ్నింప, "పూర్తిగా జదివితిని. సందేహమున్నచో నీయిచ్చవచ్చినచోట బ్రశ్నింపు"మని స్వామి బదులు చెప్పెను. పిమ్మట నాతని ప్రశ్న లన్నిటికిని స్వామి కంఠస్థముచేసినట్లు బదులు చెప్పుట గాంచి, యఖండానందుడు, "అన్నా! మీకిది యెట్లు సాధ్యమైన" దని యడుగ స్వామి యిట్లు వచించెను: "పుస్తకమందలి ప్రతిపదమును నే నెన్నడు జదువను. చిత్రప్రదర్శనిరీతిని ప్రతివాక్యమును, పరిచ్ఛేదమును ఒకే సారిగా జదివెదను."

అటనుండి సాధుసోదరులు హరిద్వారమున కేగిరి.* కేవల దిగంబరులై సుఖదుఃఖాదుల నెంతమాత్రము లక్షింపక, తపోనిష్ఠాగరిష్ఠులై వరలు సాధు

* అచట పైకి పిచ్చివానివలె నుండిన యొక సాధుపుంగవుని కొందఱు బాలురు ఱాళ్లతో గొట్టుచు వెంబడించుచుండ నాతని మొగమునుండియు మెడ నుండియు నెత్తురు కాఱుచుండుట జూచి స్వామి తా నాతనికి చికిత్స నొనర్చితిననియు నాతడు పక్కున నవ్వుచు, "అంతయు పరమేశ్వరలీల" యని పల్కెననియు దెలిపియున్నాడు.

పుంగవులను దర్శించి, స్వామి యిట్లు విమర్శించి పలికెను: "నిజముగా సన్న్యాసి కీనియమములును యాత్రలును అనావశ్యకములు. ఐనను వానిచే దా నార్జించిన సుకృతము నాతడు ప్రపంచమున కొసగును." ఈ సమయమున స్వామి యేకాంతవాసమందలి యఖండప్రీతిచే, "సోదరశిష్యుల సంబంధము మాయాన్వితము, నాకెట్టి మాయయుం వలదు" అని సోదరులను వెడలిపో నాజ్ఞాపించి, 1891-వ సంవత్సరము జనవరినెలలో ఏకాంతముగా ఢిల్లీకి వెడలెను.

# పందొమ్మిదవ ప్రకరణము

## దక్షిణాభిముఖ యాత్రలు

వివిదిషానందనామమున స్వామి ఢిల్లీనగరమును బ్రవేశించెను. ప్రేమపాశాకృష్టులై సోదరశిష్యు లాతని నెట్లో కలిసికొనిరి. స్వామి యంత, "సోదరులారా! నన్నెవ్వరును వెంబడింపవలదని చెప్పితినిగదా. ఎడారులలో, పర్వతాగ్రములలో, పట్టణములలో నా యంతరాత్మ యెచటికి బ్రేరేచిన నచటికి వెడలెదను. ప్రతిమానవుడును తన మనోవికాసము ననుసరించి గమ్యమును జేర యత్నింపవలయును. నేనిదే ఢిల్లీని విడిచెదను. న న్ననుసరింపరాదు. ఇది నా యాజ్ఞ" యని వచించి, కొన్నిదినములైన వెనుక రాజపుత్రస్థానమునందలి ఆళ్వారునగరమునకు బయనించెను.

1391-వ సంవత్సరము మాఘమాసారంభమున ప్రాతఃకాలమున ఆళ్వారుస్టేషనులో దిగి, రాజమార్గమునుబట్టి పురప్రవేశ మొనర్చి, స్వామి యొకవంగదేశీయుని గాంచి, మాతృభాషలో, "ఇచ్చట సన్న్యాసులుండుటకు దగినదావు కలదా?" యని ప్రశ్నించెను. స్వామియపూర్వముఖవికాసమును గాంచి యాతడు వినమ్రుడై ప్రణామమొనర్చి, బజారునడుమనున్న యొక మేడమీఁదిగదిలోనికి స్వామిని దీసికొనివెడలి, "మహాత్మా! ప్రస్తుత మిచట నుండు"డని వచించి, యచట నున్నతపాఠశాలలో నుపాధ్యాయుఁడగు తన మిత్రునియొద్దకేగి, "మౌల్వీసాహెబు! వంగదేశీయుఁ డొకస్వామి వచ్చియున్నాడు. అట్టిమహాత్ముని నే నెన్నఁడును చూచినదిలేదు. వచ్చి చూడుము" అని వచించెను. అంత నిర్వురును వచ్చి స్వామిని సందర్శించిరి. మౌల్వీసాహెబు స్వామికి సలాముచేసినంతనే స్వామి ప్రేమపూర్వకముగా నాతని తనయొద్ద గూర్చుండబెట్టుకొని మతవిషయములనుగూర్చి ప్రసంగించుచు ఖురానునుగూర్చి యిట్లు నుడివెను: "ఖురానులోనున్న విశేషమిది. పదునొకండు

వందలసంవత్సరములనుండి నేటివఱకు కురాను ఎట్టిమార్పును లేక ఒకేరీతిగా నిలిచియున్నది. అంతెట్టి ప్రక్షిప్తములును కానరావు.'' మాల్వీసాహెబును మిత్రుడును స్వామి ప్రతిభనుగాంచి ముగ్ధులై యటనుండి తమయిండ్ల కేగునపుడు దారిలో గనబడినవారి కెల్ల తాము జూచిన మహాత్మునిగూర్చి చాటిరి. ఇక హిందువులును మహమ్మదీయులును గుంపులుగుంపులుగా వచ్చి స్వామిని సందర్శింపసాగిరి. స్వామి వారితో బ్రసంగించుచు, విద్యాపతి, చండిదాసు, రామప్రసాదు మున్నగు మహాభక్తులకీర్తనములను బాడియు శంకరరామానుజచైతన్యాది మహాపురుషులపరమాదర్శముల బ్రదర్శించియు వేదవేదాంతరహస్యములను బోధించియు శ్రోతలను దివ్యావేశపూరితుల నొనర్చుచుండెను.

స్వామినామ మాళ్వారునగరమున మాఱుమ్రోగెను. ఎచ్చట జూచినను స్వామివర్ణనమే, అతని గోష్ఠియే. తుదకందఱు జనులచ్చట స్వామిని సందర్శించుటకు చోటు చాలమి అళ్వారురాష్ట్రమున నొక ముఖ్యోద్యోగియగు శంభునాథపండితునింటికి స్వామిబస మార్పబడియెను. ఎల్లవేళల దనకొఱకు నిరీక్షించుకొనియుండెడి హిందువులను మహమ్మదీయులను అందఱను స్వామి సమానాదరముతో జూచుచు, వారలప్రశ్నల కన్నిటికిని సదుత్తరము లొసగుచుండెడివాడు.

ఒకడు అప్రస్తుతముగా, "స్వామీ! మీ కులమే"మని ప్రశ్నింప, జనులు తన్ను బ్రాహ్మణుడని భావించుట కవకాశము లుండినను, సన్న్యాసు లట్టి ప్రశ్నలకు సమాధానమొసగుటనావశ్యకమయ్యును, స్వామి వెంటనే, "ఇయ్యది కాయస్థశరీరము" అని వచించెను. మఱియొకడు, "కాషాయవస్త్రము లేల ధరించితిరి?" అని యడుగ, "ఇది భిక్షుకులవేషము గనుక! నేను తెల్లని బట్టలు కట్టిన, బిచ్చగాండ్రు వచ్చి యాచింతురు. స్వయముగా భిక్షుకుడనగు నేను వారల కేమియు నీయజాలనైతినిగదా యని పరితపింపవలసివచ్చును. నేనును భైక్షుకవేషము ధరించునెడల భిక్షుకులెవ్వరును వచ్చి నన్ను యాచింపరుకదా!" యని సహేతుకముగా చమత్కరించెను.

మఱియొకప్పుడు భగవదారాధనమునుగూర్చి ప్రసంగించుచు, ఆనందాశ్రువులు నేత్రకమలములనుండి జాలువాఱ, "తల్లీ ! తల్లీ !" యని పచించి స్వామి ధ్యాననిమగ్నుడయ్యెను. స్వామిభక్త్యావేశమును గాంచి, పులకితాంగులై యర్ధరాత్రమైనను జను లిండ్లకు మఱలువారు కారు. అట్లు సమావేశమైన వారిలో స్వామి కొందఱకు మంత్రోపదేశ మొనర్చెను.

అళ్వారునగరమున స్వామికి గల మిత్రులందఱిలో మాల్వీసాహెబు ముఖ్యుడు. ఒకనాడైన దనయింటికి కాహ్వానించి స్వామికి భిక్ష చేయవలయునని యాతని యభిలాష. స్వామి కెట్టియభ్యంతరము నుండదని గ్రహించియు, 'శంభునాథజీ యంగీకరింప'డని భయమంది, యాతనియొద్దకేగి యిట్లు విన్నవించెను: "బాబాజీకి రేపు మాయింట భిక్ష చేయనను గ్రహింపుడు. ఉపకరణములన్నిటిని బ్రాహ్మణులచే శుద్ధిచేయింతును. బ్రాహ్మణులచేతనే వండించి, బ్రాహ్మణులచేతనే వడ్డింపజేసెదను. ఈయవనుడు, స్వామి భుజించుచుండగా మాత్ర మొకసారి చూచి తృప్తి నొందును." శంభునాథపండితుడు నవ్వి, "స్వామిజీ పకీరు. ముక్తసంగుడు. నీవెట్టియేర్పాటుచేసినను సరియే" యని వచించెను. మాల్వీసాహెబు స్వామికి ఆతిథ్యమొసగి, ధన్యుడనైతినని సంతసించెను. మహమ్మదీయులు అనేకు లిట్లే స్వామికి ఆతిథ్యమొసగిరి.

అళ్వారుమహారాజుదివానగు 'రామచంద్రజీ' స్వామిని గూర్చి విని, పాశ్చాత్యవ్యామోహమున కధీనుడగుచున్న తమ మహారాజు స్వామిసంసర్గముచే బాగుపడునని యోచించి, మహారాజును రప్పించి, స్వామిని సందర్శింపజేసెను. అంత రాజు, "స్వామిజీ మహారాజ్ ! మీరు గొప్పపండితులని వినియుంటిని. ఉద్యోగము చేసినచో వలయునంతధనము ననాయాసముగా నార్జింపవచ్చునే ! ఏల యీ యాచకవృత్తి నాశ్రయించితిరి ?" అని ప్రశ్నించెను. స్వామి వెంటనే, "మహారాజా ! వేటలని, వేడుకలని, సదా పాశ్చాత్య సంసర్గమున నీవు కాలము గడపుచు రాజకార్యముల నేల యలక్ష్యము చేయుచుంటివో ముందు నాకు జెప్పు"మని సాక్షేపముగా నడిగెను. స్వామిసాహస

మును గాంచి సభ్యులు నిశ్చేష్టులైరి. మహారాజు కొంచెము నిదానించి, "ఎందు చేతనో నేను చెప్పజాలను. కాని నాకది యిష్టముగనుక" నని పలికెను. "అయి నచో నేనును నాయభీష్టము ననుసరించియే సన్న్యాసినై చరించుచుంటినని గ్రహింపుము" అని స్వామి ప్రత్యుత్తర మొసగెను !

అనంతరము మహారాజు, చిఱునగవుతో, "బాబాజీమహారాజ్ ! విగ్రహారాధనమున నాకు నమ్మకము లేదు, నాగతియేమగు" ననియెను. స్వామి కొంచెము కుపితుడై, "నాతో హేళనచేయుచుంటివా ?" యని పలుక, "కాదు, స్వామిజీ ! నిజముగా నే నితరులవలె ఱాయి, అప్ప, కఱ్ఱ, మట్టి మొదలగువాని నర్చింపజాలను. దీనివలన జన్మాంతరమున నా కధోగతి కలుగునా?" యని మఱల తర్కించెను. అంత ప్రత్యక్షముగా విగ్రహారాధన మును సమర్థించి, రాజునకు గుణపాఠమును గఱపుటకై స్వామి రాజుఛాయా పటము నొకదానిని దెప్పించి, దివానును బిలిచి, "దీనిమీద నుమ్మివేయుము" అని పలికెను. భయముచే నందఱును గడగడవణక నారంభించిరి. స్వామి మఱల, "దీనిపై నుమియుడు. మీలో నెవ్వరైనను సరియే. ఇదియొక కాగి తపుముక్కయేకదా" యని గంభీరముగా బల్కెను. దివాను నిశ్చేష్టుడయ్యెను. రాజువైపునుండి దివానువైపునకును దివానువైపునుండి రాజువైపునకును భయ భ్రాంతులై సభ్యు లవలోకించిరి. భయాద్భుతములు దన్ను బెనగొన, దివానున కేమియుం దోపక, "స్వామిజీ! నన్ను మీరేమిచేయు మనుచుంటిరి ? ఇది మా మహారాజురూపము గాదా?" యని యెలుగెత్తి యఱచెను. అంత, "కానిమ్ము. కాని, స్వయముగా మహారాజీఛాయాపటమున లేడే! మహారాజుశరీరముగాని, రక్తముగాని, యెముకలుగాని యిందులేవే! ఇది మహారాజువలె మాటాడదే ! కదలదే ! ఐనను మహారాజుపై మీకు గల గౌరవముచే, మహారాజ రూప చ్ఛాయయగు దీనిపై నుమియుట కంగీకరింపకున్నారు. దీనిపై నుమియుట మీరాజు నగౌరవపఱచుటయని మీకు దట్టినది" అని స్వామి రాజువైపునకు దిరిగి, "మహారాజా ! చూచితివా ! ఈపటము నీవు గాకున్నను నీవే యైతివి.

పటము జూచుసరికి వారికి నీ వందు గోచరించుచున్నావు. అందుచే నిన్ను గారవించునట్లే పటమును గారవించుచున్నారు. ఇష్టదేవతావిగ్రహములను పూజించుభక్తులవిషయముకూడ నిట్టిదే. విగ్రహమును జూచుసరికి వారికి తమ యిష్టదేవతాస్వరూపమో, గుణములో గోచరించును. రాళ్లను అప్పలను పూజించుటలేదు, వారు. 'ఓతాయీ! నిన్ను నే బూజింతును. ఓ అప్పా! న న్ననుగ్రహింపుము!' అని ప్రార్థించిన హైందవవ్యక్తిని—ఇన్నిదేశములు తిరిగి తినిగాని—యెచ్చటను గనలేదు. ప్రతివిగ్రహారాధకుడును విగ్రహమూల మున పరమేశ్వరు నారాధించుచున్నాడు. వారివారి మనోభావముల ననుస రించి, పరిజ్ఞానము ననుసరించి, భగవంతుడు వారికి గోచరించును. ఐన నిది నాయభిప్రాయముసుమీ రాజా!" యనుసరికి మహారాజుమంగళసింగు చేతులు జోడించుకొని, "స్వామిజీ! తమయనుగ్రహమువలన విషయము నేడు బోధ పడినది. ఈదీనుని కరుణింపుడు" అని ప్రార్థించెను. అంత స్వామి, "కరుణించు వా డాత డొక్కడే. కరుణాపయోనిధియగు ఆభగవంతుని బ్రార్థింపుము. ని న్నాతడు దయజూచును" అని సభనుండి సెలవుగైకొని వెడలెను.

తరువాత రాజుకోరికపై దివాను స్వామిని దనయింట నుండుమని బతిమాలెను. తన్ను జూడవచ్చు నున్నతోద్యోగులను సామాన్యులను ధనిక లను నిర్ధనులను వారు వీరనక, అందఱను సమానాదరముతో నంగీకరించు నెడల దా నుందునసెను. దివా నందుల కంగీకరించెను. ఈసమయమున స్వామి సంసర్గమున సంపూర్ణముగా తమజీవితమున పరివర్తనమొందినవా రనేకులు గలరు.

ఒకముదుసలి దినదినము వచ్చి, స్వామిని సందర్శించి, యనుగ్రహము నకై యాచించువాడు. కాని, స్వామి తనకొనర్చిన యుపదేశముల ననుసరించి మాత్ర మాత డాచరించువాడు కాడు. ప్రతిపర్యాయము, 'అంతకంటె సులభోపాయమును జెప్పు'డని వచించువాడు. ఒకనా డాముదుసలి వచ్చి మాటాడుసరికి స్వామి మౌనమువహించి, యితరులకుగూడ నుత్తరమీయక

యూరకుండెను. ఆ ట్లర్థయామము గడచెను. కుపితుడై యావృద్ధుడు సణుగు కొనుచు వెడలిపోవుచుండ స్వామి పక్కున నవ్వెను. అంత నొక యువకుడు, "స్వామిజీ! ఆవృద్ధునిపై నింతకాఠిన్యము వహించితి రేల?" యని ప్రశ్నింప, స్వామి ప్రేమపూర్వకముగా నిట్లు వచించెను : "బిడ్డలారా! మీకొఱకు నాజీవితము నర్పింప సంసిద్ధుడనని గ్రహింపుడు. ఏలయన, మీకు నాబోధల ననుసరించుటకు శక్తి కలదు; ఇచ్ఛయును గలదు. కాని యీముదుసలి తనజీవిత మంతయును విషయభోగములకై వెచ్చించి, యిప్పుడు ప్రాపంచికభోగములకు గాని, పారమార్థికసాధనలకుగాని అశక్తుడై, అడిగినదే తడవుగ భగవదనుగ్రహము లభించు ననుకొనుచున్నాడు, పాపము! వలయునది పురుషకారమని గ్రహింపుడు. పురుషకారవిహీనునకు పరమేశ్వరానుగ్రహము లభించుట కల్ల. మహావీరుడగు నర్జునుడు తనపౌరుషమును గోల్పోవనున్న సమయమున శ్రీకృష్ణు డాతని నిస్సంగబుద్ధితో స్వధర్మము ననుష్ఠింపుమని యాదేశించి, నిష్కామకర్మాచరణమువలన చిత్తశుద్ధియు కర్మపరిత్యాగఫలమును భగవదేకార్పితబుద్ధియు సిద్ధించునని యుపదేశించెను. కావున యువకులారా! ధీరులై బలము నార్జింపుడు. దుర్జనుడైనను, బలోపేతుడు నాకు మాన్యుడు. ఏలన, వాడును తన బలముచే దౌర్జన్యమును స్వార్థపరత్వమును విడనాడి, తత్త్వసందర్శనము చేయు దినము వచ్చితీరును."

సమస్తశాస్త్రనిలయమగు సంస్కృతమునుగూర్చి స్వామిబోధనలను విని, ఆళ్వారుయువకు లనేకులు సంస్కృతము నభ్యసింపసాగిరి.*

---

* స్వామి వారల కిట్లు తెల్పెను : "సంస్కృతమును దానితో బాటు పాశ్చాత్యభౌతికశాస్త్రములను నేర్చుకొనుడు. నాయనలారా! దేనినైనను ఉన్నదున్నట్లు తెలిసికొనవలయును, వ్రాయవలయును. పరిశ్రమ చేయుడు, నిర్దుష్టముగను సప్రమాణముగను మనదేశచరిత్రను మీరు వ్రాయగలుగు సమయము రాగలదు. మన భారతదేశచరిత్రలో నేడు ఒకదారియు తెన్నును గోచరించుటలేదు. కాలనిర్ణయమునకు అందు ఆస్పదమే కాన్పింపదు. ఎంతసేపు మనపతనమునుగూర్చియే నొక్క-

స్వామి పరివ్రాజకజీవితాహ్వనము నాలకించి, ఆళ్వారు నగరము నుండి బయలుదేఱి జయపురమున కరిగెను. ఇచ్చటనే స్వామి పరివ్రాజక చ్ఛాయాపటము తీయబడినది.

జయపురమున స్వామి సుప్రసిద్ధుడగు నొకవ్యాకరణ శాస్త్రజ్ఞునియొద్ద పాణిని వ్రాసిన అష్టాధ్యాయి జదువనారంభించెను. మొదటిసూత్రమే పండితుడు మూడుదినములు ప్రయత్నించి బోధింపలేక, "స్వామిజీ! నేను మీకు బోధింపజాల"నని వచించెను. అంత స్వామి సూత్రము నెట్లైనను గ్రహింపవలయునని కృతనిశ్చయుండై, యేకాగ్రచిత్తుడై, స్వల్పకాలముననే గ్రహించి, పండితునకు దెలుప పండితు డాశ్చర్యచకితుడయ్యెను. ఇవ్విషయమును దలచియే స్వామి యొకప్పు డిట్లు వక్కాణించెను: "దృఢసంకల్పము వలన సాధ్యముకాని దేదియు లేదు. దృఢసంకల్పముచే కొండలు పిండిచేయ నగును."

జయపురమునుండి ఆబుపర్వతమున కరిగి స్వామి యచ్చట నొక గుహలో కొంతకాలము తపమొనర్చెను. అటనుండి ఖేత్రీమహారాజును గలిసికొని తన నిరుపమానతత్త్వబోధనప్రావీణ్యముచే మహారాజును వివశుని గావించెను.* స్వామియెడ గల్గిన యఖండభక్తిచే శిష్యుడై మహారాజు స్వామి పాదము లొత్తుచుండెడివాడు.

---

చెప్పెడి ఆంగ్లచరిత్రకారులవలన వ్రాయబడిన మనదేశచరిత్రలు మనకు మనోదౌర్బల్యహేతువులు కాకమానవు.... భారతదేశచరిత్రను భారతీయులే వ్రాయవలయును....జాతీయవిద్యావిధానమునకిదియే పునాది, జాతీయ ప్రబోధమునకు ఇది ప్రభాతము!"

* "తన్ను అణపజాలు పరిస్థితుల నెదిర్చి ప్రాణి పొందు నాత్మవికాసమే జీవనము" అనియు, "అస్థిగతమగు భావములే విద్య" యనియు, "తెలివితోడను అనుభవముతోడను గూడుకొనియుండునదే నియమము" అనియు స్వామి తెలిపియున్నాడు.

స్వామి యచట నారాయణదాసను మహాపండితునియొద్ద మఱల పాతంజలమహాభాష్యము జదువనారంభించెను. తా నూహింపని ప్రశ్నలు వైచుటయు స్వామియే వానికి బదులుచెప్పవలసివచ్చుటయు జూచి, పండితుడు, "స్వామిజీ! ఇక మీకు బోధింపవలసినదేదియు లేదు. నాకు దెలిసిన దంతయుం మీకు కరతలామలకమైనది" అని వచించెను.

స్వదేశాభివృద్ధికై ప్రకృతిశాస్త్రపరిశోధన లావశ్యకమని తత్త్వబోధనమును శాస్త్రవిజ్ఞానముతో మేళవించి స్వామి ఖేత్రీమహారాజునకు బోధించెను.

మహారాజు పుత్రసంతానప్రాప్తికై వరమొసగుడని ప్రార్థింప స్వామి యాశీర్వదించెను.

స్వామి యిట్లు రాజభవనముననే కాలము గడపెనని భావింపరాదు. తఱచు దరిద్రనారాయణులయిండ్ల కరిగి బోధించుచు, మహారాజునెడజూపిన లక్ష్యానురాగములనే సర్వజనులందును జూపువాడు.

అటనుండి స్వామి లింబ్డినగరమున కేగి, యొకమఠమున బసచేసెను. క్షుద్రదేవతోపాసకు లందలిసాధువులు బ్రహ్మచర్యమును విసర్జించి తమసాధనలకు దోడ్పడుమని స్వామిని నిర్బంధింపసాగిరి. ఆదుర్మార్గులు తన్ను హత్యచేసినను బ్రహ్మచర్యవ్రతమును విడువరాదని నిశ్చయించుకొని, స్వామి యటనుండి బయల్పడుమార్గము నన్వేషించుచుండెను. సంకల్పసిద్ధులుగదా మహాత్ములు! ఒకబాలుడు తఱచు వచ్చి స్వామిని సందర్శించువాడు. అత డాసమయమునకు వచ్చినంతనే స్వామి తనపరిస్థితుల నొకచీటిపై వ్రాసి మహారాజునకు వర్తమానమంపెను. వెంటనే మహారాజసైనికులు వచ్చి స్వామిని కాపాడిరి. అటనుండి స్వామి జూనాగడమున కేగి యట దివానున కతిథియై అపరిమితగౌరవము నందెను.

సర్వసంగపరిత్యాగియగు స్వామి యిట్లేల మాటిమాటికి మహారాజులను దివానులను దర్శించుచుండెనని శంకింపవచ్చును. దరిద్రులై, విద్యావిహీ

నులై మానవత్వమును గోల్పోయి, స్వాతంత్ర్యమనున దెఱుగక 'యెవరు దిక్కని యల్లాడుచుండిన సోదరభారతకోటి నుద్ధరించుటే స్వామి నిర్వహింప దలచిన మహాకార్యము. అనేకలక్షలజనులపై నాధిపత్యము గల్గియుండెడు మహారాజులను ధర్మపథానువర్తనులుగ నొనర్పగల్గినచో సత్సంస్కారణములచే, ధార్మిక ప్రతిష్ఠాపనములచే, ఉచితవిద్యావిధానములచే వారు ప్రజాక్షేమంకరులై దేశాభివృద్ధికి దోడ్పడుదురనునాశతో, ఆశయముతో, స్వామి రాజభవనములందు దిరుగాడెను. ఇట్టి యభిప్రాయముచేతనే స్వామి యొకప్పుడు దివ్యశకటారూఢుడై చక్రవర్తులతో రాజోద్యానములందు విహరించును ; మఱి యొకప్పు డేకాంతముగా పాదచారియై, ధూళిధూసరితగాత్రుడై యేదీననారాయణునింటికో పయనించును. నిర్లిప్తులు, నిరంకుశులుగదా సాధుపుంగవులు !

స్వామి యటనుండి భూజనగరమున కరిగి, దివానునకు దేశోద్ధరణమును గూర్చి బోధించి, యటనుండి పోర్బందరున కేగి, వేదముల ననువదించుచుండిన యచ్చటి దివానున కమితసాహాయ్య మొనర్చెను. అచ్చట యాత్రకై ధన సాహాయ్యము కోరివచ్చిన సోదరశిష్యుడగు త్రిగుణాతీతునకు ధనమొసగి తన్ను వెంబడింపవలదని హెచ్చరించెను. దేశ పరిస్థితులను దిలకించుచు, సనాతనధర్మ సముద్ధరణమార్గముల నరయుచు, నేకాంతముగా సంచరించుటయే స్వామి యాశయము.

తనపర్యటనములలో దేశమున నెచ్చట చూచినను స్వామికి గానవచ్చిన దేమి? పూర్వాచారపరాయణుల ఛాందసము, సంస్కర్తల సంకుచితభావములు, ప్రజల పాశ్చాత్యవ్యామోహము—వీనిచే గలుగు పరస్పరకక్షలు, కార్పణ్యములు, కలహములు. భారతజాతీయత నామమాత్రావశిష్టమై, నిర్జీవమై, కళావిహీనమై స్వామికి గన్పట్టెను. ఇట్టిసమయమున భారతీయవిజ్ఞానమును పునరుద్ధరింపవలయునన్నచో, మున్ముందు సనాతనధర్మౌన్నత్యమును పాశ్చాత్యప్రపంచముచే గుర్తింపజేయుట విధాయకమనియు స్వామి యది తన విధియనియు విశ్వసించెను.

పిమ్మట స్వామి పూనానగరమున కేగి, ఖ్యాతివహించిన బాలగంగాధరతిలక్ మహాశయుని కలిథియై యాతనితో ననేక విషయములను గూర్చి ప్రసంగించెను. అటనుండి లింబ్డి, కోల్హాపురమహారాజులను దర్శించి, వారలకు ధర్మదీక్షగల్గించి, దక్షిణదేశమునకు మఱలెను. మైసూరుమహారాజగు చామరాజేంద్ర ఒడయరు, "అట్టిధీవైభవము, అట్టి జగన్మోహనరూపము, అట్టి సర్వతోముఖ పాండిత్యమును, అట్టి పారమార్థిక సంపద్వైభవమును" జూచి సమ్మోహితుడై స్వామి నఖండముగా గారవించెను. అతనిదివా నొకపండితమహాసభ చేసి, స్వామి నాహ్వానింప, స్వామి వేదాంతబోధనమును వక్తృత్వమును గాంచి, పండితులు పరవశులైరి. దివా నమితసంతుష్టుడై స్వామికి వేనవేలు వెలగల బహుమతు లీయజూచెను. కాని సర్వసంగపరిత్యాగచక్రవర్తియగు స్వామి కేమి కావలయును? మేలైన యొకపొగచుట్ట గ్రహించి, స్వామి సంతుష్టాంతరంగు డయ్యెను!

స్వామియభిమత మెట్టిదైనను నెఱవేర్చుటకు సంసిద్ధుడనని మహారాజు వచింప, స్వామి తనమహోద్యమమునుగూర్చి ముచ్చటించెను. వేదాంతమత బోధనార్థము పాశ్చాత్యదేశమున కేగుటకగువ్యయము వెంటనే యొసగ మహారాజు సమ్మతించినను స్వామి కారణాంతరముచే నంగీకరింపలేదు. మహారాజు కోరికపై స్వామి తనదివ్యవాక్కులను గొన్నిటిని 'గ్రామఫోనురికార్డు'న కొసగెను. ఇప్పటికి నయ్యది మహారాజభవనమున గలదు. కాలప్రవాహముచే వాక్యములు మాత్ర మస్పష్టములైపోయినవి. మహారాజు స్వామికి పాదపూజ చేయసమకట్టెను; కాని స్వామి యంగీకరింపలేదు.

అనంతరము కొచ్చిదేశమున కేగి, మహారాజునకు మతబోధ గావించి, యటనుండి రామేశ్వరమును కన్యాకుమారిని దర్శించెను.

సముద్రము నీదికొని వెడలి, కన్యాకుమార్యగ్రమున శిలాతలమ్మున నాసీనుడై స్వామి యావద్భారతదేశమును దేశచరిత్రను స్మరించి, ధ్యాననిమగ్నుడయ్యెను. ఆసమయమున స్వామిహృదయమున పొంగిపొరలిన భావతరంగము

లెట్టివో యెవరు వర్ణింపగలరు? భారతదేశీయుల దుర్భరదారిద్ర్యము, విద్యావిహీనతయుం స్వామికట్టెదుట ప్రత్యక్షము కా నాతడు, "అన్న మో రామచంద్రా!' యని పలవించు నార్తులకు మతబోధ లెందులకు?' అని గురుదేవుడు వచింపలేదా? భారతజనసామాన్యము కేవలపశుప్రాయమై జీవించుటకు కారణ మజ్ఞానము, అక్షరజ్ఞానశూన్యత. తరతరముల నుండి మనము వారిరక్తమాంసములను పీల్చి పిప్పిచేసి, వారి నధఃపాతాళమునకు త్రొక్కివైచితిమి....జనసామాన్యము నుద్ధరింపని మనకు జాతీయత యనునది కలలోనివార్త....కాని యీదోషమును సనాతనధర్మమున కంటగట్టుట తగదు. ఇయ్యది మన దోషము" అని నిశ్చయించెను.

కాని, చేత చిల్లిగవ్వయైనను లేని సన్న్యాసి యేమిచేయగలడు! ఈ భావము తోచినంతనే కొంత నిరాశచెందియుం మఱల దివ్యావేశపూరితుడై ప్రతిపట్టణమునను దీనజనోద్ధరణమున దనకు దోడ్పడు యువకులు పదుగురు దొరకకపోరని నిశ్చయించి, కట్టెదుటనున్న సాగరమును గాంచి యిట్లు భావించెను : "నాహైందవదీననారాయణులకొఱకై సముద్రమును దాటి పశ్చిమఖండమున కేగెదను. అచ్చట నాధీశక్తిచే వలయుధనమార్జించి, మాతృదేశమునకు వచ్చి భారతీయపునరుద్ధరణయత్నమున నిమగ్నుడ నయ్యెదను. కాకున్న తత్ప్రయత్నమున ప్రాణములు విడిచెదను." ఇట్టి మహోన్నతభావోద్వేగముచే బాష్పధార లుబికి ప్రవహింప నఖండదేశభక్తిప్రపూర్ణుడై జగజ్జననిని శ్రీ రామకృష్ణుని ప్రార్థించెను.

కన్యాకుమార్యగ్రమున నిట్లు ధ్యానించి, "స్వజాతి స్వమత స్వవిజ్ఞానాహంకార గ్రస్తమగు పశ్చిమఖండముచే సనాతనధర్మ స్వరూపమగు భారతీయ విజ్ఞానము నర్చింపజేసెదను" అని స్వామి ప్రతిన దాల్చెను.

## ఇరువదవ ప్రకరణము

## పరివ్రాజకజీవిత దివ్యానుభవ విశేషములు

స్వామిపరివ్రాజకజీవిత మద్భుతావహము. అందలి దివ్యానుభవ రత్నములను మఱికొన్నిటిని పరిశీలించు టుచితము. •రాజపుత్రస్థానమున బయనించుచుండగా స్వామికి గల్గినదివ్యానుభవమునుగూర్చి శిష్యు డొక డిట్లు వ్రాసియున్నాడు :

"అది మండు వేసవి ; మట్టమధ్యాహ్నము. క్షుత్పిపాసాపీడితుడై పయనించుచు స్వామి టారీఘాటుస్టేషనులో దిగెను. అచటిసేవకుడు తన్నులోపల గూర్చుండనీయకుండుటచే బయటనే నేలపై స్తంభమున కానుకొని కూర్చుండెను. నేలపై నిప్పులు కురియుచున్నవి. మంచినీటిని గొనుటకైనను స్వామి యొద్ద పైకములేదు. స్వామితో పయనించుచుండిన పరమలోభి యగు నొక వైశ్యు డాతనియెదుట కంబళిపఱచుకొని కూర్చుండి, మధురపదార్థములను దిని, మంచినీటిని గొని త్రావుచు, 'అన్నపానీయములు లేక మాడుటే సన్న్యాసులగతి' యని స్వామిని హేళనచేయనారంభించెను. కుక్కలు మొఱిగినచో ఏనుగున కవమానమా ? స్వామి మాటాడలేదు.

"అంతలో నొకమిఠాయివర్తకుడు దివ్యాహారపదార్థములతోడను మధురపానీయములతోడను చిత్రాసనముతోడను పరుగున నచటి కరుదెంచి, నేలపై నాసనమును బఱచి, పదార్థముల నందుంచి, 'స్వామిజీ ! రండు, భుజింపుడు, అని బతిమాలనారంభించెను. అంత స్వామి, 'మిమ్ము నే జూచినది లేదు. నన్ను జూచి యెవరనుకొనుచున్నారో! పొరపడుచున్న

ట్లున్నారు' అని వారించెను. ఆనూతనపురుషుడు మఱల, 'బాబాజీ! శ్రీరామచంద్రమూర్తి నన్ను నిద్రనుండి లేపి, స్టేష నులోనున్న మిమ్ము జూపి, 'అదిగో, నిన్నటినుండియు అతడు నిరాహారియైయుండుటచే నామనసు తల్లడిల్లుచున్నది. వెంటనే ఆహారపానీయములను సిద్ధమొనర్చి, యాతనికడకు గొనిపొమ్ము!' అని యానతిచ్చినట్లు స్వప్నముగంటిని. నిద్రమేల్కొని, 'స్వప్న మేకదా' యని మఱల పండుకొంటిని. కాని, కరుణాపయోనిధి యగు శ్రీరామచంద్రమూర్తి మఱల నన్ను సమీపించి, నిద్ర నుండి తట్టి లేపుటచే తదాజ్ఞానువర్తినై యీయాహారపదార్థము లను దెచ్చితిని. దయచేసి భుజింపుడు. మీకాకలియగు చుండును' అని విన్నవించెను.

శ్లో. "అనన్యా శ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥"

'ఎవ రితరచింతలులేక నన్నే యుపాసించుచుందురో, నిత్యాభియుక్తు లగు వారియోగక్షేమములను నే వహింతును' అని భగవానుడు భక్తులకు శాశ్వతాభయప్రదాన మొసగియుండడే!

"అట్టి పరమేశ్వరకృపను దలచి కన్నీరువిడుచుచు స్వామి యావణిజునకు దనకృతజ్ఞతను సూచింప, 'నన్నభినందింపకుడు; అంతయు ఆ శ్రీరామచంద్రమూర్తిసంకల్పము' అని యావణి జోత్తముడు వారించుచుండ, మనలోభి వర్తకుడు దిగ్భ్రాం తుడై, నామూర్ఖప్రలాపములకు నన్ను క్షమింపుడు' అని స్వామి పాదములపై వ్రాలి, పాదధూళిని శిరమున దాల్చెను." (క్లుప్తము.)

మఱియొకసమయమున స్వామి క్షేత్రినగరమున నుండగా

మూడుదినము లహర్నిశము తన్ను సందర్శింపవచ్చిన జనులకు బోధలొనర్చుచుండెను. స్వామిభోజనమునుగూర్చి మాత్ర మెవ్వరును తలంపనేలేదు. అంత నొక చర్మకారుడు స్వామి మంచినీరైనను త్రాగలేదని గ్రహించి, యాతని సముఖమున కేగి, "మీరు సాపడకుండుట జూడ నామనస్సు నొచ్చుచున్నది. పంచముడ నగుటచే నేను మీకు భోజనమిడుటకు తగను. అందుకు గావలసిన పరికరములను సమకూర్తును. దయచేసి పుచ్చుకొనుడు" అని ప్రార్థించెను. పంచమునిరూపమున పరమేశ్వరుడే తన్ను పరీక్షింపవచ్చెనని విశ్వసించి, "స్వయముగా నీవు చేసినరొట్టెలను భుజింతును. సంశయింపకుము" అని యెట్లో యాహారిజనుని సమ్మతింప జేసెను. అంత నామహానీయుడు వండితెచ్చిన పదార్థముల నమితప్రీతిపూర్వకముగా భుజించుచు, "సాక్షాద్దేవేంద్రుడు సువర్ణపాత్రమున గొనివచ్చిన యమృత మింత మధురముగా నుండదు" అని స్వామి కృతజ్ఞతాశ్రుపూరితలోచను డయ్యెను. మఱియు, "వేనవేలమంది మహానీయు లిట్టివారు గుడిసెలలో నివసించుచుందురు. వారిని మనము అస్పృశ్యులనియు, అవాచ్యులనియు నిరసించుచుందుమే! ఎట్టి యవివేకము!" అని వగచెను. * స్వామి తనకు ఖేత్రీమహారాజ పరిచయము గల్గినపిమ్మట రాజసాహాయ్యమున ఆ హారిజనుని దారిద్ర్యమును రూపుమాపెను.

దీర్ఘయాత్రచే, ఎండవేడిమిచే, ఆకలిబాధచే నెంతయలసినను, సర్వశక్తినిలయమగుపరమాత్మయే తానని భావించినమఱుక్షణ మద్వితీయశక్తి

---

* మధ్యపరగణాలలో యాత్రచేయుచు స్వామి యొకప్పుడు కొందఱు పాకీవాండ్రతో నివసించెను.

సంపన్నుడై, అఖండధైర్యోత్సాహసమన్వితుడైన సమయములు స్వామి తనపరివ్రాజకజీవితమున ననేకములు గలవని వక్కాణించి యున్నాడు.*

---

* అఖండవైరాగ్యపూర్ణుడై స్వామి యొకప్పుడు ప్రాయోపవేశ మొనర్పదలచి యొకయరణ్యమును ప్రవేశించి నిరాహారియై పగలంతయుం నడచి సాయంకాలమగుసరికి యిక నొక్కయడుగైనను ముందునకు వేయజాలక యొకచెట్టుక్రింద కూలబడియెను. ఇంతలో నొకపెద్దపులి తన వైపునకు వచ్చి యొకింతదూరమున పొంచి యుండుట గాంచి స్వామి, "బ్రహ్మసాక్షాత్కారమునకు నెల్లవుగాని యీపాడుశరీరము ఈపులికైనను ఆహారముగా వినియోగించుగాక !" యని తలపోయసాగెను. అట్లు తలచుచు పులి యేక్షణమున దనపై బడునో యని స్వామి నిశ్చలుడై వేచియుండినను పులి యెందులకోగాని మఱియొక దిశగా పాఱిపోయెను. ఐనను పులి మఱల రావచ్చునని స్వామి యెంత నిరీక్షించినను అది మఱల రాలేదు. పరమేశ్వరసంకల్పమును గూర్చి తలపోయుచు, ఆత్మారాముడై స్వామి యాయేకాంతవనమున ఆరాత్రి గడపి, ప్రభాతమగుసరికి యపూర్వశక్తిసమన్వితుడై వెలువడియెను.

మఱియొకప్పుడు స్వామి మూడుదినములపర్యంతము నిరాహారియై పయనించుచు తుదకు అలసటచే దారిలో కూలబడి స్మృతిగోల్పోయెను. ఎంతయోసేపైనపిమ్మట స్మృతి కలిగెను. చూచుసరికి తన శరీరము వర్షముచే దడిసియుండెను. అంత నూతనశక్తిసమన్వితుడై బయలుదేఱి యొకమఠమున కేగి ప్రేమపూర్వకమగు నాతిథ్యము నొందెను.

## ఇరువదియొకటవ ప్రకరణము

# చెన్నపురము: పశ్చిమఖండయాత్ర

1892-వ సంవత్సరమున స్వామి కన్యాకుమారినుండి బయలుదేఱి, విద్యలకేకాక పూర్వాచారములకును బట్టుగొమ్మయగు చెన్నపురమును జేరెను. స్వామియశశ్చంద్రికలు జగద్వ్యాప్త మగుటకు చెన్నపురప్రవేశమే ప్రారంభము. చెన్నపురముననే స్వామి కనేకయువకులు మనశ్శరీరముల నర్పించి యనుచరులైరి. పశ్చిమఖండయాత్రకు వలయుధనమును స్వామికి సమకూర్చినది చెన్నపురమే.

చెన్నపురమున స్వామి మన్మథనాథభట్టాచార్యునింట బసచేసెను. స్వామి వచ్చెననువార్త పట్టణమందంతటను సూర్యకాంతివలె వ్యాపించెను. ఆకృతిని దాల్చిన దివ్యత్వమగు నాతనిమూర్తిని గాంచి, యాతని వాగమృతధారలను గ్రోలి తృప్తినందుటకై చెన్నపురవాసులు తీర్థప్రజవలె రాసాగిరి.

ఒకనాడొకపండితుడు సంధ్యావందనముచేయుటకు దనకు తీరిక లేదనియు, దాన దప్పేమనియు స్వామిని బ్రశ్నించెను. అందులకు స్వామి, "నిరంతరకర్మకలాపనిమగ్నులై ఊపిరిపీల్చుకొనుటకు తీరికలేని ప్రాచీనమహర్షులకే సంధ్యావందనమాచరింప సమయముండగా మీకు లేదా!" యని మాఱుపలికెను.

పరులకష్టములను జూచినచో స్వామిహృదయము వ్రక్కలైపోవును. ఆకలితీరున ట్లొక్కపూటయైనను తినదిండిలేక తల్లులతో మొలబంటినీటిలో బనిచేయుచున్న పల్లెబిడ్డలను, సాయంకాలము సముద్రపుటొడ్డున దిరుగాడుచు గాంచి, స్వామి కన్నీరు విడుచుచు, "ఓపరాత్పరా! ఈనిర్భాగ్యుల నెందులకు సృజింతువోయి! వారికష్టములను జూచి నే సహింపజాలను. ఎంతకాలమోయి తండ్రీ! ఎంతకాలము!" అని విలపింపసాగెను.

ఒకసమయమున స్వామి తానద్వైతినని ప్రకటించెను. అంతగొందఱు పండితు లేకమై, "నేనే భగవంతుడననుట కర్మసిద్ధాంతమునకు ప్రతికూలము. అట్టివా డధర్మమవలంబించుట కభ్యంతరమేమి?" అని ప్రశ్నించిరి. స్వామి వెంటనే యిట్లు బదులుచెప్పెను: "త్రికరణశుద్ధిగా నేను భగవంతుడనని నమ్మిన పక్షమున అధర్మమునెడ నాకు రోత జనించును: అందులకు బాహ్యనిరోధమనావశ్యకము." పండితులు నిరుత్తరులైరి. బ్రహ్మసాక్షాత్కారమనునది యసంభవమని మఱియొకరధిక్షేపింప, స్వామి, "అవాఙ్మానసగోచరుడగు బ్రహ్మమును నేను ప్రత్యక్షముగా దర్శించితిని" అని తనయపరోక్షానుభూతిని ప్రకటించెను.

నాస్తికుడును, క్రైస్తవకళాశాలలో ప్రకృతిశాస్త్రపండితుడును నగు సింగారవేలుమొదలియారు స్వామితో వాదింపవచ్చి, నిర్జితుడై, తుదకు స్వామికి అత్యంతప్రియశిష్యులలో నొకడుగా మాఱెను. ఇట్లే స్వామిసాంగత్యమున పరివర్తితవర్తనులైనవా రనేకులు గలరు. ఒకయువకుడు, "భగవంతుడన నే"మని స్వామిని బ్రశ్నింప, "(ప్రకృతిశాస్త్రజ్ఞులు వచించు) శక్తియన నేమో చెప్పు"మని స్వామి వాని నాలోచనానిమగ్ను నొనర్చెను. స్వయముగా దృఢగాత్రుడగుస్వామి యువకులకు వేదాంతముకంటె ముందు శరీరదార్ఢ్యమునుగూర్చి బోధించువాడు. ఒకనా డాతడు తన్ను ప్రశ్నింపవచ్చిన యొకయువకుని జూచి, "నాతో కుస్తీ పట్టగలవా?" యని ప్రశ్నించెను. స్వామి శరీరదార్ఢ్యమును గాంచి నివ్వెఱపడి, స్వామినిగూర్చి యాయువకుడు 'పైల్వానుస్వామి'యని వచించెను.

స్వామినిరుపమానరూపమాధుర్యము చెన్నసగరయువకులమానసములను ఆతనియఖండశేముషీవైభవము వారలధీశక్తిని అద్భుతరీతి నాకర్షించెను. పశ్చిమఖండమునకు సనాతనధర్మసందేశమును గొనిపోవుటనుగూర్చి స్వామిసంకల్పమును గ్రహించి, షికాగోమతమహాసభకరుగుడని, యైదువందలరూప్యములను బోగుచేసి వారు స్వామియెదుటనుంచిరి. తల్లియాజ్ఞ కాలేదని స్వామి యాధనమును బీదలకు బంచిపెట్టించెను.

ఈసమయమున హైదరాబాదుపౌరులు స్వామినాహ్వానించిరి. స్వామి యంగీకరించి బయలుదేఱెను. హైదరాబాదుస్టేషనులో దిగుసరికి, ఆస్థానోద్యోగులును పండితులును ప్రఖ్యాతపురుషులును ఐదువందలమంది స్వామికి వైభవాన్వితమగుస్వాగతము నొసగిరి. సభాబు తన్నాహ్వానింప, స్వామివెడలి, మతమునుగూర్చియు మతప్రచారమునుగూర్చియు బ్రసంగించెను. వేదాంత మతప్రచారమునకై పశ్చిమఖండయాత్రకు వలయుధన మొసగుటకు నబాబు తన సంసిద్ధతను దెల్పెను. 'పశ్చిమఖండమునకు నాసందేశ'మను విషయమును గూర్చి వేలకొలదిజనులకు నాటిసాయంకాలము స్వామి మహోపన్యాసమొసగెను. స్వామి మఱల చెన్నగరమునకు విచ్చేసినపుడు వేయిమందికంటె నెక్కుడు జనులు స్టేషనునకు వచ్చి స్వామిని సాగనంపిరి.

పశ్చిమదేశపర్యటనమునుగూర్చి స్వామి యింకను కృతనిశ్చయుండు కాలేదు. తల్లియాదేశమునకై, గురుదేవునసుజ్ఞకై, స్వామి ప్రార్థించెను. శ్రీరామకృష్ణుడు సాగరతీరమునుండి సముద్రమున బ్రవేశించుచు దన్ననుసరింపుమని యాదేశించుచున్నట్లు స్వామి దివ్యదర్శనము గాంచెను. ఇక సంశయమేల? స్వామి ధైర్యోత్సాహసమన్వితుడయ్యెను. మాతృదేవియగు శ్రీశారదాదేవియు స్వామి నాశీర్వదించెను. శిష్యులిక స్వామి పశ్చిమఖండయాత్రకు వలయుసన్నాహము చేయసాగిరి.

ఇంతకుముందు పుత్రవరప్రసాదమునకై ఖేత్రీమహారాజు స్వామిని ప్రార్థించుటనుగూర్చి వినియుంటిమికదా. ఈసమయమున పుత్రప్రాప్తిచే మహానందభరితుడై స్వామిని దోడ్కొనిరమ్మని రాజు తన కార్యదర్శి నంపెను. స్వామి వచ్చినంతనే మహారాజు సాష్టాంగప్రణామ మాచరించి, పుత్రజననోత్సవవైభవాన్వితమగు స్వాగతము నొసగెను.

ఖేత్రీమహారాజు స్వామివిదేశయాత్రకు వలయు సౌకర్యముల నొనగూర్చుటకై తన కార్యదర్శిని స్వామితో బంపెను. పశ్చిమఖండమున కేగుటకు బొంబాయినగరమునుండి యోడపై బయలుదేఱవలయును. ఖేత్రీనగర

మును వీడి, జయపురముమీదుగా స్వామి యచటి కేగుచుండెను. మార్గమధ్యమున రైలుబండిలో స్వామి యొక్క యైరోపాదేశపుటుద్యోగి కొకగుణపాఠమును గఱపవలసి వచ్చెను. ఆతడొక 'టిక్కెట్ కలెక్టరు.' స్వామితో బయనించుచుండిన యొకగౌరవనీయుం డాతడు "ఈమనిషి" అని సూచించుటయే కాక, పొగరుబోతుదనముచే స్వామిని "నీవు, నీవు" అని సంబోధింప నారంభించెను. స్వామి వానికి బుద్ధి వచ్చునట్లు మర్యాద తెలుప నాతడు, "తప్పు చేసినందులకు క్షమింపుడు" అని త్వరితముగా నటనుండి వెడలెను. ఇవ్విషయమునుగూర్చి స్వామి యిట్లు పలికెను :

"యూరోపియనులతో వ్యవహరించునపుడు ముఖ్యముగా మనము గమనింపవలసినది ఆత్మగౌరవము. వ్యక్తుల ననుసరించి మనము వ్యవహరింపకుండుటచే మనలను వారు లోకువజేయుచుందురు. పరులయెదుట మన పరువు మర్యాదలను గాపాడుకోవలయును. లేనియెడల అవమానముపాలు గావలసి వచ్చును."

1893-వ మే 31-వ తేదీని స్వామి బొంబాయినగరమున పౌరులు దన్ను వీడ్కొల్వ, 'పెనిన్సుల'రను యోడపై బయలుదేఱెను. అఖిలప్రపంచ మతమహాసభలో సనాతనధర్మప్రాతినిధ్యము వహించుటకై నవీనప్రాచీనమహర్షుల సందేశమును మహాభక్తుల హృదయమును వేదవేదాంతసారమును సమగ్రముగా గ్రహించిన స్వామికంటె విశేషపాత్రత గన్నవారెవ్వరు? మఱియు శ్రీరామకృష్ణుడే ప్రపంచమతమహాసభయైయుండ నాతని శిష్యాగ్రగణ్యుడగు స్వామికంటె నీమహాకార్యభారమును వహింప సమర్థులెవ్వరు?

అట్లు బయలుదేఱి యోడ చైనాయందలి హాంగుకాంగులో నాగినపుడు స్వామి యొకబౌద్ధమతమును జూడదలచెను. కాని పరదేశీయుల కనుమతిలేదనియుం వెడలినచో హాని కలుగుననియుం నచ్చటి యనువాదకుడు దెల్పగా, స్వామి కుతూహలము మఱింత హెచ్చెను. మతమును జూచితీరవలయునని నిశ్చయించుకొని మఱికొందఱితో స్వామి యావైపున కరుగుసరికి

దండహస్తులై కొందఱు వీరివైపు పరుగెత్తుకొని వచ్చుచుండిరి. తోడివారలు పిక్కబలము చూపిరి. అనువాదకుడును పరుగెత్తబోవుచుండ స్వామి యాతని నాపి, 'హిందూయోగి' యనుటకు చైనాపదములను దెలిసికొని ధైర్యమూర్తి యై నిలువబడి తానొక హైందవయోగినని యుచ్చైస్స్వరమున దెల్పెను. వెంటనే వారు చేతులు జోడించుకొని స్వామికి పాదాక్రాంతులై, "గ్రహ బాధానివారణమునకై కవచముల ననుగ్రహింపు"మని వేడిరి! స్వామి కాగి తపు ముక్కలపై 'ఓమ్' అని వ్రాసియిచ్చెను. అవి వారు కన్నుల కద్దుకొని, స్వామి కాశ్రమము నంతను జూపిరి. హైందవాలయములకును బౌద్ధాలయ ములకును గలపోలికను స్వామి గుర్తించెను.

తరువాత స్వామి జపానుమీదుగా నేగుచు టోకియో, యోకొహామా మున్నగు ముఖ్యపట్టణములను దర్శించి, జపాన్ దేశీయుల పరిశ్రమాభివృద్ధి కచ్చెరువొందెను. నవయుగమున స్వశక్తిచే, నిర్మాణదక్షతచే, ఆత్మవిశ్వాస ముచే, విజృంభించుచుండిన విదేశీయులజాతీయతను గాంచి, భారతీయుల నుద్దే శించి స్వామి తన మదరాసుశిష్యుల కిట్లు వ్రాసియున్నాడు :

"...ప్రస్తుతకాలావశ్యకతను గుర్తింప జపాన్దేశీయులు పరిపూర్ణ ప్రబోధము నొందినట్లు కాన్పించును...సర్వాంగీణమైనవెలయు సైన్యము వారి కిపుడు కలదు....ఇక వారినిప్పు పెట్టె కర్మాగారములో—చూడ సొంపైనవి; తమకు కావలసిన సమస్తము వారు తమదేశములోనే నిర్మించుకొను దీక్ష వహించియున్నారు....అభివృద్ధికై నవయుగాభినివేశము అర్చకులనుగూడ ఆవహించినది. జపాన్దేశమునుగూర్చి నామనసులో నున్నదంతయు ఒక చిన్న లేఖలో వ్రాయజాలను. మనయువకులు పదులు, వందలు, ప్రతిసంవత్సరము జపాన్దేశమును దర్శింపవలెననిమాత్రమే నేను కోరెదను. జపాన్దేశీయులకు భారతదేశము ఇంకను సద్విషయములకన్నిటికిని, ఉన్నతతత్త్వములకన్నిటికిని పీఠస్థలి. ఇక...జీవితమంతయు అర్థరహితప్రసంగములుచేయు పట్టి 'కబుర్ల రాయళ్లు' అగు మీరో,...వచ్చి యీదేశీయులనుజూచి సిగ్గుచే తలవంచు కొనుడు. స్వమతదురభిమానమున మతిహీనులగుమీరు బయటికివచ్చినంతనే

జాతిభ్రష్టత సిద్ధించును మీకు, పాపము! 'ఈయాహారము స్పృశ్యమా, ఆయాహారము స్పృశ్యమా?' యను చర్చలతో శక్తిసామర్థ్యములనన్నిటిని శతాబ్దములనుండి వ్యయించుచు బహుయుగపర్యంతమగు సాంఘికరాక్షస శాసనములచే మానవత్వమనున దడుగంట, కరుడుగట్టిన ఛాందసముచే, మూఢ విశ్వాసములచే, తలదిమ్మెత్త, శతాబ్దములకొలది చదికిలపడియున్న మీరో,— మీస్థితి యెట్లున్నది? ఇక మీరిపుడు చేయుచున్నదేమి?...'పుస్తకం హస్త భూషణమ్' అనునట్లు చేతులలో పుస్తకములతో సముద్రతీరమున విహరించుచు, ఐరోపాధీసంజాతమైన ఏశాస్త్రములనుండియో నాలుగుముక్కలు ముక్కున కంటించుకొని వానినేకరువుపెట్టుచు, యావదాత్మను ముప్పదిరూకల 'గుమస్తాపదప్రాప్తి'పై లేదా, యువభారతదేశమునకు ఆశాపరమావధియనదగు 'లాయరుపదవి'పై లగ్నమొనర్చి—యిక ప్రతివిద్యార్థియు క్షుద్బాధచే అల్లాడు పిల్లలపటాలము ఆహారముకొఱకు 'కావురుబీకురు' మనుచు దనవెంట బడి దేవిరించుచుండ—మీరిపుడు చేయుచున్నదేమి?...మిమ్ములను, మీపుస్తకములను, మీగౌనులను, మీవిశ్వవిద్యాలయ బిరుదములను సమస్తము ముంచి వేయజాలినంత నీరు సముద్రమున లేదా? లెండు, మీపౌరుషమును ప్రకటింపుడు! సదా పురోవృద్ధినరికట్టు పురోహితబ్రువులను మతాచార్యులను లేశమును లక్షింపకుడు. ఏలందురా, వారిమనస్సులు ఇక మాఱవు, వారిహృదయములు వికసింపవు. తరతరములనుండి వచ్చుచున్న మూఢవిశ్వాసములును రాక్షసశాసనములును వారికి కన్నతల్లులు. మతాచార్య కైతవమును కూకటి వ్రేళ్లతో పెల్లగించివేయుండు. లెండు, మీ మానవత్వమును ప్రకటింపుడు! మీకూపములనుండి వెలువడి బాహాటముగా నలువైపులను దిలకింపుడు. ప్రపంచమందలి వివిధజాతు లెట్లు ముందంజవేయుచున్నవో చూడుడు. (సోదర) మానవుని మీరు ప్రేమింతురా? స్వదేశమును మీరు ప్రేమింతురా? ప్రేమించుచో రండు, ఉన్నత పరిస్థితులకై, యోగ్యతరస్థితిగతులకై నడుముగట్టుదము. వెనుకకు జూడకుడు. సన్నిహితులును ప్రియతములును విలపించినను వెనుకకు జూడకుడు. ముందునకేకాని వెనుకకు జూడవలదు.

"భారతమాత వేలకొలదియువకులత్యాగమును గోరుచున్నది. వలయునది అట్టియువకుల మనోబలము, పశుబలముకాదు. పాషాణతుల్యమగు మీ

నాగరికతను—ఆచారములను—సడలింప భగవత్ప్రేరణమున నే ఆంగ్లప్రభుత్వ మిచటికి వచ్చినది. ఇక భారతదేశమున ఆంగ్లేయులకు ఆస్పదమొసగ మొదట తోడ్పడిన జనులను సమకూర్చినది చెన్నగరమే. మీతండ్రి తాతలనిరంకుశాధికారముచే పశుతుల్యముగా జేయబడిన మీదరిద్రసోదరకోటి నుద్ధరించుటకై—నూతనపరిస్థితులను గొనివచ్చుటకై—పేదలయెడ సానుభూతిని—క్షుధార్తులగువారికడుపుమంట చల్లార్ప బట్టెడన్నమును—జనసామాన్యమునకు విద్యను—చేకూర్చుటకై ప్రాణముల నర్పించు త్యాగులను చెన్నగర మిపుడెందఱను సమకూర్పగలదు?

"మఱియొకమాట. వలయునది శాంతము, నిరాడంబరము, అచంచలము నైన కృషి—అంతియేకాని వార్తాపత్రికావంచన కాదు, పేరుప్రతిష్ఠలకై ఉబలాటము కాదు,—ఈసంగతి సదా జ్ఞప్తిలో నుంచుకొనుడు."

# ఇరువదిరెండవ ప్రకరణము

## అమెరికాలో స్వామి ప్రారంభదశ

జపానునుండి కొలదిదినములలో స్వామి గమ్యస్థానమగు షికాగోమహా నగరమును జేరెను. షికాగోనగరమున నొక భోజనశాలలో బసజేసి, మఱునాడచటి ప్రపంచవస్తుప్రదర్శనమును చూచుట కేగెను. ఆపాశ్చాత్య నాగరికతాసౌధమునందలి మహాద్భుతదృశ్యములను నిర్మాణకౌశలమును సంప ద్వైభవమును గాంచి స్వామి ముగ్ధుడయ్యెను. ప్రదర్శనమును జూడవచ్చిన జనులతో షికాగోనగరము నిండిపోయినది. కాని యాజనసాగరమున స్వామి కొకమిత్రుడైనను, పరిచితుడైనను లేడు. అంతమంది జనులలో తా నేకాకియై సంచరించుచున్నట్లు తోచెను. మఱియును ఆశీతలదేశమున శరీరరక్షణమునకు వలయుదుస్తు లాతనియొద్ద లేవు. రెండుమాసములైన వెనుక, సెప్టెంబరులోగాని సభ జరుగదనియు, ప్రఖ్యాతసంస్థలచే బంపబడిననే కాని ప్రతినిధులుగా నెవ్వ రంగీకరింపబడరనియు, అందులకు కాలముకూడ దాటెననియు దెలిసికొని స్వామి విహ్వలచిత్తుడయ్యెను. ఇక నేమి చేయుట! అమితప్రయాసతో నింత దూరదేశపర్యటన మొనర్చుటంతయు వ్యర్థమేనా? ధనము నీటివలె వెచ్చింప వలసిన అమెరికాదేశమున నిర్ధనుడగు తా నిక నిలుచుటెట్లు? నాటిస్వామి మనఃస్థితిని వర్ణించుచు కాలాంతరమున స్వామిశిష్యురాలైన సోదరి నివేదిత (Miss Margaret Noble) ఇట్లు వ్రాసియున్నది:

"స్వామిశిష్యుల కాతనియందలి యఖండవిశ్వాసముచే, మానవ ప్రయత్నమున కసాధ్యమగుకార్యమును స్వామిపై బెట్టితిమని తోపనేలేదు. వివేకానందుడు వెడలిన జాలును; ఉపన్యసించునవకాశము తప్పక లభించునని వారు తలచిరి. వారివలెనే అమాయకుడగు స్వామికిని అంతకంటె విశేషమేమియు గోచరింపలేదు. ఈశ్వరప్రేరణమున దా నీమహాయత్న మొనర్చుచుంటినను

విశ్వాసమున సాధకబాధకము లెవ్వియు నాతనికి బోడకట్టనేలేదు. అఖిల ప్రపంచ శక్తిసంపన్నిలయమైన మతమహాసభావ్యూహమును బ్రవేశించుటకై హిందూ మత ప్రతినిధి యిట్లు నిరాధారముగా వెడలుటయు ముందు ప్రకటన లెవ్వియు జరుగకుండుటయు హిందూమతమున నిట్టికార్యములకై తగినకట్టుపాట్లు లేకుండుటను స్పష్టమొనర్చుచున్నవి.”

కార్యవైకల్యమునకు ఖిన్నుడగునీసమయమున భగవత్కటాక్షము స్వామిపై నద్భుతముగా బ్రసరించెను. స్వామి మదరాసుమిత్రులలో నొక మహనీయుడు అమెరికాలోని తన పరిచితులకు స్వామినిగూర్చి వ్రాసెను. వా రంత స్వామిని గలిసికొని, స్వామి ప్రతిభను, శీలమును గాంచి, విశేషముగా నాదరించిరి.

షికాగోలోకంటె బోస్టనునగరమున దక్కువ వ్యయ మగునని విని, స్వామి రైలుబండి నెక్కి యచటికి కరుగుచుండెను. ఆబండిలోనే పయనించుచుండెన బోస్టను సమీపగ్రామవాసిని యగు నొకవృద్ధనారీమతల్లి స్వామిని జూచి, యాతనితో సంభాషించి, మహానందమొంది తన గృహమున కాహ్వానించెను. స్వామి యంగీకరించి యామె మందిరమున బసచేసెను. అనేకులు వచ్చి స్వామిని యథేచ్ఛముగా బ్రశ్నింప నారంభించిరి.

స్వామి యమెరికాలోని జైలుపరిస్థితులను గాంచి యొకశిష్యున కిట్లు వ్రాసియున్నాడు:

“దీనిని వారిచట చెఱసాలయనరు, ప్రవర్తనసంస్కరణశాల (Reformatory) యందురు. అమెరికాలో నే జూచిన మహాఘన విషయ మిది. ఇచట ఖైదీల నెట్లాదరించి, వారి ప్రవర్తనమును దిద్ది, సంఘమున కుపకరించుసభ్యులుగా జేయుదురో చూచితీరవలయును. ఇక భారతదేశములోని దీనులను, నిమ్నజాతులను మనము చూచువిధానమునుగూర్చి తలచిన గుండె బ్రద్దలగును. వారి కిక తరణోపాయ మేలేదు. క్రూరసంఘతాడనములచే క్రుంగి కృశించుచు వారు తాము మానవులమనుమాటనే మఱచిరి. ఇందులకు ఫలితము దాస్యము; బానిసత్వము. యూదులు జీసస్ ప్రభుని కాదని నాటినుండియు

ప్రతివానిచేతను మొట్టికాయలను దినుచు కొంపయును గోడును లేక ప్రపంచ మంతటను బికారివాండ్రై యెట్లు తిరుగుచున్నారో అట్లే మీరును మిమ్ములను పాలించుట పాడియని తోచినజాతికెల్ల దాస్యముచేయుచున్నారు. . . . ఓక్రూరభారతీయులారా! మనదేశమున నొకవైపున మీక్రూరశాసనములును మఱియొకవైపున నీచదాస్యమును తాండవించుచుండుట మీకు గోచరించుట లేదే!

"సనాతనధర్మమున కీదోషము నంటగట్టుట తగదు. పారమార్థికము లనియు వ్యావహారికములనియు సర్వవిధక్రూరసిద్ధాంతముల గల్పించు పండితంమన్యుల, వంచకులదోష మిది యని పరమేశ్వరుడు నాకు దెలిపియున్నాడు. . . .

"యువకులారా! నడుములు బిగియింపుడు. . . . ఈ కార్యమును నిర్వహించుటకై పరమేశ్వరుడు నన్ను నియమించియున్నాడు. నాజీవితము యాతనలతో, దుఃఖపరంపరలతో, నిండిపోయినది. నాయాప్తబంధువులు, మిత్రులు నిరాహారులై నాకట్టెదుట మరణించిరి. . . .

"వినయవిధేయులగు మీయందే నే నాశపెట్టుకొనియున్నాను. దీనులకై పరితపింపుడు. సాహాయ్య మయాచితముగా వచ్చితీరును. ఈదుఃఖభారముతో, ఈయాశయములతో, నేను పండ్రెండుసంవత్సరములు తిరుగాడితిని. ధనాధికు లనువారి, ఘనులనువారి, యింటింటికి దిరిగితిని. దుర్భరదుఃఖాగ్నిచే కుమిలిపోవుచు, ప్రపంచార్ధభాగమును దాటి సాయముకొఱకీ నూతన దేశమునకు వచ్చితిని. సర్వేశ్వరుడు నాకు సాయపడునను ధైర్యము కలదు. ఒకవేళ నే నీవిదేశములో ఆకలిబాధచే, శీతయాతనచే నాశమందవచ్చును. కాని యువకులారా! దరిద్రులను దీనులను అజ్ఞానులను లేవనెత్తు నీసానుభూతిని, ఈకార్యదీక్షను, ఈపోరాటమును స్థిరాస్తిగా నేను మీ కొసగుచున్నాను. . . భగవదనుగ్రహమున తప్పక మనయత్నము సిద్ధించును. ఈమహాసమరమున వందలకొలదిమంది పడిపోయిన మఱల వందలకొలదిమంది వచ్చి నిల్వ సంసిద్ధులై యుందురు. వలయునది <u>ఉజ్జ్వలమగు విశ్వాసము, సముజ్జ్వలమగుసానుభూతి!</u> జననము లేదు; మరణములేదు—ఆకలిలేదు, దప్పిలేదు, భగవంతుని స్మరింపుడు—ముందునకు సాగిపొండు! భగవంతుడే మననాయ

కుడు. పడిపోయిన వారికై వెనుకకు జూడకుడు! సోదరులారా! ఇదియే మార్గము."

భగవత్కటాక్షము కలుగునను నిట్టి యపారవిశ్వాసమే కష్టసాగరము నుండి స్వామిని గాపాడినది. మతమహాసభలో మాటాడుట కెట్టి యవకాశ మును గాన్పింపని సమయమున, 'హార్వర్డు' విశ్వవిద్యాలయమందలి 'రైటు' అనుపండితుడు స్వామితో బ్రసంగించి యిట్లు పలికెను: "స్వామిజీ! మహా సభలో హిందూమత ప్రతినిధిగా నిలుచుటకై మీయధికారము నడుగుట సూర్యుని ప్రకాశింప నధికారము నడుగుటే." ఇట్లు వచించి యాపండితుడు, మహాసభ కభ్యర్థుల నెన్నుకొను తనమిత్రుడగు సభాధ్యక్షునకు స్వామినిగూర్చి "మనమహాపండితు లందఱకంటెను వేయిఱెట్లెక్కుడెఱిగిన విద్వాంసు డీత" డని వ్రాసి, తగుపరిస్థితులను గల్పించి, స్వామివిజయమునకు మార్గదర్శకు డయ్యెను. రైటుపండితుని సాయము నూతగాగొని, స్వామి షికాగోనగరము నకు వెడలుచు, విధివశమున త్రోవతప్పెను. మఱునాడు సర్వమతమహాసభలో, దనసందేశముచే బశ్చిమఖండము నుఱ్ఱూత లూగింపవలసియుండిన స్వామి నాటి రాత్రి పరుండుటకు తావుదొరకమి, రైలుబండి సరకుపెట్టె నొకదానినిగాంచి, దిక్కులేని దీనునివలె నందు పరుండి నిద్రించెను! ఈశ్వరసంకల్ప మెప్పు డెట్లుండునోకదా! ఉదయమున లేచి, అమెరికాదేశపు గోటీశ్వరు లుండు తావున స్వామి, క్షుద్బాధచే, యాచింపసాగెను. ఆతని ధూళిధూసరితవస్త్ర ములను జూచి, కొందఱు దూషించిరి. మఱికొందఱు పొమ్మని తలుపులు బిడా యించిరి. స్వామిహృదయము కంపించెను. అపరిమితాయాసముచే నొక్క యడుగైనను ముందునకు వేయజాలక, భగవన్నామస్మరణమొనర్చుచు ఆ భారతభాగ్యోదయబాలభానుడు నేలపై గూలబడియెను. తోడనే స్వామి కెదుటనున్న యొకదివ్యభవనమునుండి కరుణాస్వరూపిణియగు నొక వనితా మణి—జార్జిహేల్‌సతి యనునామె—తలుపు తెఱచుకొని, ఱివ్వున స్వామి యొద్ద కేతెంచి, 'మహాశయా! మతమహాసభ కభ్యర్థులా మీరు?' అని

ప్రశ్నించి, స్వామిని దనయింట నుండ నాహ్వానించెను! ఆసాధ్వీమతల్లి సేవకులు స్వామికి సమస్తోపచారముల నొనర్చిరి. భోజనానంతరము స్వామి నామె మతమహాసభా కార్యాలయమునకు స్వయముగా దోడ్కొనిపోయెను. సభవారు సంతసముతో స్వామిని ప్రతినిధిగా నంగీకరించిరి. 'ఆహా! ఏమి పరమేశ్వరవిలాసము! ఆకరుణాపయోనిధి త న్నె ట్లుద్ధరించెనో!' స్వామి కృతజ్ఞత వర్ణనాతీతము. సనాతనధర్మతత్త్వమును ఋషీశ్వరవాణిని శ్రీ రామకృష్ణసందేశమును సభాముఖమున యథారీతిని బ్రదర్శింప దన్నర్హునిగా జేయుమని భగవాను నాతడు ప్రార్థించెను.

## ఇరువదిమూడవ ప్రకరణము

## సర్వమత మహాసభ

1893-వ సంవత్సరమున షికాగోనగరమున జరిగిన మతమహాసభ ప్రపంచచరిత్రలో నొకమహాసంఘటనము. అయ్యది నిఖిలప్రపంచమహాజనసభ; సనాతనధర్మచరిత్రమున నూతనశకమును నిర్మించిన వివేకానందసందేశవాహిని. ముముక్షుజనమార్గదర్శకమై, మానవకల్యాణహేతుభూతమై, అన్వర్థనామధేయమై బరగు వివేకానందనామమును జగద్విఖ్యాతమొనర్చిన దీమహాసభయే. 'అన్యమతములు శాశ్వతనరకహేతువులు; మామత మొక్కటియే మోక్షద్వార' మనియెడు స్వమతాహంకారపూరితుల దురభిమానతిమిరమునకు సూర్యోదయమై పరిణమించిన దీమహాసభయే. జిజ్ఞాసయం దేమి, తత్త్వజ్ఞానమునం దేమి, క్రైస్తవమతమును మించిన మతములు కలవని పాశ్చాత్యలోకమునకు జాటిన దీమహాసభయే. వేయేల, సనాతనధర్మోన్నతిని పశ్చిమఖండమునకేకాక ప్రపంచమంతటికిని జాటుటకు దోడ్పడిన యీమహాసభ మన కత్యంతము స్మరణీయము, శ్లాఘాపాత్రము!

ప్రాక్పశ్చిమఖండములందలి పేరెన్నికగన్న తత్త్వకోవిదులు, కళాప్రపూర్ణులు, పండితప్రకాండులును ఆసభ నలంకరించిరి. ఇంచుమించు పది వేలమందిజను లామహాసభయం దాసీనులైరి. ప్రబలయత్నములచే నీమహాసమావేశము గూర్పబడియెను. వివిధమత ప్రతినిధులచే వేయిపత్రము లా సభాముఖమున జదువబడినవి. 'రోమనుక్యాథలిక్' సంస్థకు సర్వాధికారియగు 'కార్డినల్ గిబ్బన్స్' మిర్మిట్లు గొల్పు దుస్తులను దాల్చి సభామధ్యమున నున్న తాసనమున నాసీను డయ్యెను. అతని కిరువైపులను ప్రాచ్యప్రతినిధులు దివ్యాంబరధారులై కూర్చుండియుండిరి. అందు దేదీప్యమానమగు వస్త్రములను స్వర్ణచ్ఛాయతో నొప్పుతలపాగను ధరించి, వివేకానందస్వామి బ్రాహ్మబౌద్ధమహమ్మదీయప్రతినిధులమధ్య సర్వజనాకర్షణీయుండై కూర్చుండియుండెను.

మనోహరమగుగానములతోడను ప్రార్థనలతోడను సభ ప్రారంభమైనది. ప్రతినిధు లొకరివెనుక నొకరు సభారంజకముగా నుపన్యసింపసాగిరి. కాని స్వామి, 'యీమహాజనసాగరసమక్షమున నా నే నుపన్యసించుట' యని భయ కంపితు డయ్యెను. ఇతరవక్తలవలె స్వామి తనయుపన్యాసమునుగాని, దానికి వలయుసామగ్రినిగాని సిద్ధమొనర్చుకొని రాలేదు. సభాధ్యక్షు డెన్నిసార్లు త న్నుపన్యసింపుమని కోరినను 'ఇప్పుడు కా'దనియే స్వామి సమాధానము. తుద కీత డుపన్యసించునా యని యధ్యక్షుడు సంశయింపసాగెను. ఎట్లైన నాతడు లేచి, వివేకానందస్వామియే తరువాతివక్తయని ప్రకటించెను. ఇక మాటాడక తప్పదు. స్వామి సంసిద్ధుడై నిల్చెను.

ఆతనివదనము సహస్రరత్నకాంతిసన్నిభమై ప్రజ్వలించెను. ఎదుట నున్న సభాసాగరముపై నాతనిదృష్టి నిల్చెను. సభయంతయు నిశ్శబ్దముగా నుండెను. సరస్వతీదేవికి మ్రొక్కి యాతడు, 'అమెరికాసోదరసోదరీమణు లారా!' యని సభ్యులను సంబోధించెను. తోడనే అపూర్వమగు నొక మహోత్సాహతరంగము సభాసాగరమునుండి వెలువడియెను. కరతాళధ్వనులు మిన్నుముట్టుచుండెను. ఈ మహాకౌతుకప్రకటనమును జూచి స్వామి దిగ్భ్రాంతుడయ్యెను.

ఆయానందసాగరఘోష కొంత శాంతించినవెనుక స్వామి సనాతన వైదికయతిసంప్రదాయముపేర తన కవకాశమొసగిన యాయధునాతన జన సంఘమున కభివందనమాచరించి, లోకమున కాదినుండియు సహనమును సర్వ మతసత్యత్వమును బోధించిన సనాతనధర్మము ధర్మములకెల్ల తల్లి యను వచనములతో దనయుపన్యాసమున కుపక్రమించెను. స్వామి యుదాహరించిన ప్రవచనములను వినుడు :

'వివిధప్రదేశములలో బుట్టిన నదులు సముద్రమున సంగమించునట్లే వివిధభావములచే మనుజు లవలంబించు వివిధారాధనమార్గములు వక్రములై

గన్పట్టినను, అవక్రములై గన్పట్టినను, సర్వేశ్వరా! నిన్నే ప్రాపింపజేయుచున్నవి.'*

'ఎవరెట్లు భావించిన నట్లే నేను వారి ననుగ్రహించుచున్నాను.'†

స్వామి ప్రకటించిన వినిర్మలమనోభావములును ఆతని విశాలదృష్టియు సర్వమతసమరసభావమును సభ్యులను సమ్మోహితుల నొనర్చెను. స్వామి యొసగిన సందేశము జగత్ప్రసిద్ధమగు నాతని 'సనాతనధర్మ ప్రకాశిని' యం దిమిడియున్నది. అందలి ముఖ్యవిషయము లివి:

సర్వధర్మసమన్వయస్వరూపమే వేదాంతము. వివిధమతారాధనము లన్నియు భగవత్తత్త్వమును దెలుపు వివిధమార్గములు.

ఆత్మ నిత్యశుద్ధము; జననమరణాతీతము; అద్వితీయము. భేదములన్నియు కేవల మజ్ఞానముచే గోచరించుచున్నవి.

అనేకజన్మములలో నొనర్చిన గణనాతీతసాధనల మహాఫలితమే అట్టి యేకత్వదర్శనము.

ఆత్మ యెప్పుడును సృష్టింపబడునది కాదు.

మరణమనగా కేవల మొకశరీరమును విడిచి మఱియొకశరీరమును దాల్చుటయని భావింపనగును.

మానవునివర్తమానస్థితి యాతనిపూర్వకర్మఫలితము. ప్రస్తుతకర్మములు భావిదశను నిర్ణయించును.

భగవద్దర్శనము లభించుటకు ముం దహంకారము నశింపవలయును.

జీవునివ్యక్తిత్వమనునది వట్టిభ్రాంతి.

భౌతికశాస్త్రదృష్టితో జూచినను, ఏకత్వమే,—అద్వైతమే— సిద్ధాంతమని నిశ్చయింపనగును.

---

*" * * * *

రుచీనాం వైచిత్ర్యా దృజుకుటిలనానాపథజుషామ్
నృణామేకో గమ్యస్త్వమసి పయసామర్ణవ ఇవ."

—శివమహిమ్నస్తోత్రము, 7.

† "యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహమ్,"

—భగవద్గీత, 4-11.

మానవుని పాపి యనుటకంటె మహాపాపము మఱియొకటిలేదు. ఆత డమృతపుత్రుడు. ప్రకృతికాత డధీనుడుకాడు; ప్రకృతి యాతని దాసురాలు.

వేదములు మనలను బంధించు నిర్జీవశాసనములు కావు. ఎవ్వనియాజ్ఞచే వాయువు వీచునో, అగ్ని దహించునో, మేఘుడు వర్షించునో, మృత్యువు ప్రాణులను గ్రసించునో, దయాసాగరుడగు నాసర్వేశ్వరుని జేరు మార్గములను బ్రకటించుటయే వేదశాస్త్రముల ముఖ్యోద్దేశము.

ప్రార్థనలు, కర్మకలాపములు మున్నగునవి చిత్తశుద్ధికిని ప్రతిమారాధనము ధ్యానమునకును దోడ్పడును. కావున నివి సామాన్యవిధులయ్యును అవశ్యకములై యున్నవి. అభివృద్ధి జెందినకాలమునందు వీనిని విడనాడ నగును.

ధర్మమనునది పూర్వపక్షసిద్ధాంతములతోడను గ్రంథములతోడను గూడినవిషయము కాదు. సాక్షాత్కారమే ధర్మతత్త్వము,—సనాతన ధర్మతత్త్వము.

దేశకాలాద్యతీతమగు సనాతనధర్మమే స్వామి ప్రదర్శించిన హిందూమతము. అట్టి విశ్వమానవమతదివ్యతేజము నెదుట ప్రత్యేకమతసంప్రదాయములు కాంతివిహీనములై కన్పట్టెను. స్వామిదివ్యసందేశమును విని, సభ్యులాతని మహాప్రవక్తయనియుం ఆచార్యుడనియుం కీర్తించు టాశ్చర్యము కానేరదు. ఈసందర్భమున సోదరి నివేదిత వ్రాసినవాక్యములు గమనింపదగియున్నవి :

"...యుగయుగములనుండియు ఆత్మవికాసవంతమై ప్రశాంతినిలయమగు భారతీయవిజ్ఞానసాగరము వివేకానందస్వామిసందేశమున భాసించెను. యుగయుగములనుండియు అనేకమతసంప్రదాయప్రపూర్ణమైన పారమార్థిక ప్రపంచము, మహర్షులపాదధూళిచే పవిత్రీకృతమైన పుణ్యభూమి, సనాతన భారతవర్షము, స్వామిసందేశమున ప్రతిబింబితమై దీపించెను.... ఆసమయమున నాత డుపన్యసించినది స్వాత్మానుభూతిని గూర్చి కాదు. తన గురుమహాశయుని గూర్చి యైనను స్వామి యాతరుణమున బ్రసంగింపలేదు.

"ఆసభావేదికపై వివేకానందునివలె ప్రబోధకులై నిల్చినఘను లితరులు లేకపోలేదు. కాని వారందఱు ప్రత్యేకమతసంప్రదాయములనుగూర్చి బోధ లొనర్చిరి. వివేకానందస్వామి యొక్కడే సర్వమతగమ్యప్రాయమగు మహోత్కృష్టమతమునుగూర్చి బోధింపవచ్చిన మహనీయుడు...."

సనాతనధర్మౌన్నత్యమును స్వామి సందేశవైభవమును పాశ్చాత్యు లెట్లు గుర్తించిరో గనుడు! సభయందలి శాస్త్రశాఖాధ్యక్షుని వాక్యములను వినుడు :

"సనాతనధర్మముపలె సర్వమతమహాసభను అమెరికాప్రజ నత్యద్భుత రీతి నరికట్టిన మతసంస్థయు తత్ప్రతినిధియగు వివేకానందస్వామివంటి మహావక్తయుం లేరనుట నిస్సంశయము. స్వామియుపన్యాస మన్నచో సభ్యుల కపరిమితోత్సాహము, ఆనందము. మతమహాసభయందును నాయధ్యక్షతక్రింద జరుపబడిన శాస్త్రశాఖాసమావేశములందును నాత డనేకపర్యాయము లుపన్యసించెను. క్రైస్తవులు కానిండు, క్రైస్తవేతరులు కానిండు,—సభారంజకులై మించిన వక్తలలో ఎప్పుడును ఆతడే అగ్రగణ్యుడు. ఆత డెచటి కేగిన నచటి కరిగి వేలకొలది జను లాతడు పల్కుప్రతిశబ్దమును ఆత్రముతో నాలకించు వారు....క్రైస్తవులలో స్వమతాభిమానపూరితులగు సనాతనులు సహితము 'వివేకానందుడు సాక్షాన్నరేంద్రు' డని పల్కిరి!"

నిజమే! ఆత డన్వర్థనామధేయుండగు నరేంద్రుడే కదా!

జగత్ప్రసిద్ధిగాంచిన బిసెంటువనితామణి యీసందర్భమున వ్రాసిన వాక్యము లిట్టే సముచితములై యొప్పుచున్నవి :

"...ఆసమయమున నాతనిమూర్తి సూర్యప్రభాభాసమానమైవిలసిల్లెను. అతని సందేశవాక్యామృతమును గ్రోలి సభ్యులానందపరవశులై యాత డుచ్చరించు ప్రతిశబ్దమును స్వరమును నిశ్చేష్టులై యాలకించువారు. స్వామిసందేశమును విని యాతనియుపన్యాసానంతరము సభనుండి యీవలకు వచ్చుచు నొక క్రైస్తవు డిట్లు పల్కెను: 'అమహనీయుండా క్రైస్తవమతబాహ్యుడు(Pagan)! ఆమహనీయుని దేశీయులయొద్దకా, మన క్రైస్తవమతబోధకులను బంపుట! వారే మనయొద్దకు మతబోధకులను బంపు టుచితము.'" (క్షప్తము.)

సర్వమతమహాసభ లోకమున కొసగిన సందేశ మేమి? స్వామియే యిట్లు వచించెను :

"...మతమహాసభ లోకమున కేమైన జాటినచో నది యిది: పూజ్యత, పవిత్రత, త్యాగము—ఇవి ప్రపంచమున నేమతసంస్థకును ప్రత్యేకమగు 'హక్కులు' గావనియు ప్రతిమతమును లోకోత్తరచరిత్రులగు పురుషులను స్త్రీల నుద్భవింపజేసినదనియుం జాటినది. ఇట్లు విస్పష్టమై యుండ, నెవ్వరైనను దమమత మొక్కటియే సుస్థిరముగా నిలిచి, యితరమతము లన్నియుం నశింపవల యునని భావించు నెడల, అట్టి మందబుద్ధుల యవివేకమునకు నాహృదయాంతర్గతపరితాపమును దెలుపుచు, వారెంత ప్రతిఘటించినను, 'వలయునది కలహముకాదు, సహకారము; అన్యమతధ్వంసము కాదు, తదాశయగ్రహణము ; శత్రుత్వము కాదు, శాంతియుత సమన్వయ'మని మతపతాకలపై వ్రాయబడుదినము శీఘ్రకాలముననే వచ్చితీరును' అని తెల్పెదను."

పేరుప్రతిష్ఠలను ఆశింపక పరివ్రాజకుడై సంచరించుచుండిన స్వామి మతమహాసభలో నుపన్యసించినవెనుక జగద్విఖ్యాత మహాప్రవక్తయై మించెను. వివేకానందనామము దిగ్దిగంతముల మాఱుమ్రోగెను. షికాగోమహానగరవీథులలో ప్రతికుడ్యమును స్వామినిలువుపటములతో నలంకరింపబడియెను. జనులాపటములకడ గుమికూడి వినమ్రశిరస్కులై స్వామికి జోహారుసల్పుచుండిరి. స్వామివర్ణనలతో పత్రికలు నిండిపోయెను. స్వమతాభిమానపూరితమగు 'న్యూయార్క్ హెరాల్డ్' సైత మిట్లు వ్రాసినది:

"ప్రపంచమతమహాసభలో వివేకానందస్వామి యగ్రగణ్యుడనుట నిస్సంశయము. ఆతని ప్రవచనములను వినినవెనుక, అట్టివిద్వజ్జననిలయమగు భారతదేశమునకు మాక్రైస్తవమతబోధకులను బంపు టెంతటి యవివేకమో హించితిమి."

'బోస్టన్ ఈవినింగ్ ట్రాన్స్‌పోర్ట్' ఇట్లు వ్రాసెను :

"భావౌన్నత్యముచే నేమి, దివ్యమూర్తిమత్త్వముచే నేమి, మతమహా

సభ కత్యంత ప్రీతిపాత్రుడై యొప్పిన దాతడే. సభావేదికపై నాతడడుగిడిన జాలును; సభ్యులహర్ష ధ్వనులు మిన్నుముట్టును. ఇట్టివేలకొలది జనులయభినంద నముల నాతడు పసిబాలునివలె గ్రహించును. అహంకారము లేశమైన నాతని యందు గానరాదు. సభాకార్యక్రమము ముగియుంవఱకును జనుల నరికట్టుటకై కార్యనిర్వాహకులు వివేకానందునాపువారు. సభ్యులను రంజింపజేయజాలని వక్త ముందు వేసవిదినమున దీర్ఘోపన్యాసము చేయుచుండ, విసువుచెంది వందల కొలదిజను లిండ్ల కరుగుచుండ, సభాధ్యక్షుడు లేచి, 'స్వస్తివాచకములకు ముందు వివేకానందుడు కొంచెమునే పుపన్యసించు'నని ప్రకటించును.... అంతటితో ఆకొలంబస్‌భవనమున విసరుకొనుచు గూర్చుండెడి వేలకొలదిజనులు అందఱును గంటలకొలది యితరుల యుపన్యాసములను వినుచు, వివేకానందుని పావుగంటయుపన్యాసమును వినుటకై చిఱునగవుతో నిరీక్షించికొనియుందు వారు...."మఱియొకప్పు డాపత్రికయే యిట్లు వ్రాసెను: "నిక్కముగా మహాపురుషుడును సరళహృదయుడును విద్వదవతంసుడు నగు వివేకానందు నితో మాపండితు లెంతమాత్రమును బోల్పదగరు."

"మతమహాసభ నత్యద్భుతముగా స్వవశము గావించుకొనిన మహావక్త వివేకానందస్వామి" యని సభాసాధారణసంఘాధ్యక్షుడే వచించెను. "మహా సభయొక్క ముఖ్యోద్దేశములనుగూర్చి వివేకానందునివలె గంభీరముగ నుపన్య సించినవక్త మఱియొకడులేడు. ఆత డీశ్వరప్రేరిత మహావక్త" యని 'న్యూయార్క్ క్రిటిక్‌పత్రిక' ప్రకటించెను. ఇట్టిప్రశంసల నన్నిటిని ప్రకటించినచో ప్రత్యేక మొక గ్రంథమగును.

స్వామియుపన్యాసముల ననేకపత్రికలు దినదినము పూర్తిగా బ్రకటిం చుటయేకాక, వానినిగూర్చి విశేషముగా బ్రశంసింప నారంభించెను. స్వామి యిట్టి జగద్విఖ్యాతిగౌరవములచే నలరి గర్వించెనా? ఎన్నివేలనదీనదములు దన్నుజేరినను మేరమీఱని సముద్రమువంటి దాతనిహృదయము. మతమహా సభలో విజయముగాంచిన నాటిరాత్రియే నిక్కముగా స్వామి తనకిక స్వేచ్ఛా మయపరివ్రాజకజీవితానందదినము లంతరించెనని బాలునివలె విలపించెను. నిజమే. జగత్సందేశకుడై లోకసంగ్రహకర్మమునాచరింప విధినిమంత్రితుడగు స్వామి

కిక నేకాంతవాసము సంఘటిల్లు టెట్లు? కార్యరంగమున నాత డిక తనజీవితము నర్పింపవలసియున్నది.

ఈసమయమున స్వామిధీరత్వము, అఖండాత్మవిశ్వాసమును ప్రకటించు నొక సంఘటనమునుగూర్చి చరిత్రకారులప్రపంచచరిత్ర (*Historians' History of the World*) అను గ్రంథ మిట్లు వ్రాయుచున్నది:

"ప్రపంచమతమహాసభలో దనయుపన్యాసమధ్యమున నాతడొక నిమేష మాగి, 'హిందువులవేదవేదాంతములను జదివి, వారిమతమునుగూర్చి స్వతంత్రజ్ఞానమును బడసినవారు మీలో నెందఱు గలరో చేతులెత్తు'డని వచించెను. వివిధదేశతత్త్వజ్ఞశిఖామణులతో గూడినయీమహాసభనుండిముప్పురు నలుపురు మాత్రమే చేతులెత్తిరి. అంత నాతడు తన ప్రతిభాతిశయ మొప్ప, వాత్సల్యపూర్వకముగా సభ్యుల నవలోకించి, సభ్యులు లజ్జావనతవదను లగునట్లు సరళగంభీరోక్తుల 'నిట్టి స్థితిలోనా, మీరు మమ్ముగూర్చి విమర్శింపసాహసించెదరు!' అని పల్కెను."

మతమహాసభలో స్వామి పొందినయఖండవిజయమునుగాంచి, కొందఱు క్రైస్తవమతప్రచారకులును దివ్యజ్ఞాన సమాజప్రముఖులును స్వామియశశ్చంద్రికలను గళంకమాపాదింపయత్నించి, తత్కాలిపుంజమున దమదుస్స్వభావమును బ్రదర్శించుకొనిరి. షికాగోనగరమందలి కోటీశ్వరులదివ్యభవనములు స్వామి కాతిథ్యమొసగ బోటీపెట్టుకొనినవి. అందలి స్వర్గతుల్యవైభవమును గాంచినంతనే భారతదేశములోని దరిద్రనారాయణులదుఃస్థితిని దలచి స్వామి దుఃఖింప నారంభించెను. పరుండుట కొసగబడిన హంసతూలికాతల్పము లాతనికి ముండ్లపొదలుగా దోచెను. అశ్రుధారలచే నాకని పరుపుపిండు తడిసిపోయెను. దుఃఖావేశముచే తుదకు నేలపైబడి బోరన విలపింపసాగెను. "ఓ జగజ్జననీ! నామాతృదేశమున ఘోరదారిద్ర్యము తాండవించుచుండ నాకీ పేరు ప్రతిష్ఠలేల? పట్టెడన్నములేక మాప్రాణములు పోవుచుండ నిచటువీరు శరీరసౌఖ్యములకొఱకు లక్షలు వ్యయించుచున్నారే! భారతదేశదీనజనకోటి

నెవ్వ రుద్ధరింతురు? వారల కడుపుజిచ్చు చల్లార్చువా రెవరు? తల్లీ! వారల కెట్లు తోడ్పడగలనో తెల్పవా?" యని మొఱలిడెను. దరిద్రులందును దీను లందును నిట్టియఖండసానుభూతియే—అపరిమితప్రేమయే—స్వామి యొన ర్చిన ఘనకార్యములకన్నిటికిని మూలకారణము.

స్వామి యిట్లు తన యుద్యమనిర్వాహణమార్గమునుగూర్చి చింతించు చుండ ప్రసిద్ధమగు నొకయుపన్యాససంస్థ యాతని నమెరికాదేశమం దంతటను నుపన్యసించుచు బర్యటన మొనర్ప నాహ్వానించెను. స్వామి తనయాశయము లను వ్యాప్తిచేయుట కిదియే యదనని యంగీకరించెను. ఈయుపన్యాసదిగ్వి జయయాత్రలో స్వామి 'షికాగో, బోస్టన్, కేంబ్రిజ్, వాషింగ్టన్, న్యూయార్క్' మున్నగు ముఖ్యపట్టణము లన్నిటియందును సనాతనధర్మ మును హైందవవిజ్ఞానమును సహస్రముఖముల వ్యాప్తియొనర్చెను. క్రైస్తవ మతాచార్యు లాతని దమప్రార్థనాలయములలో నుపన్యసింప బ్రార్థించి రన్నచో జనసామాన్యముమాట చెప్పనేల? స్వామి యొనర్చిన యుపన్యాసయాత్ర పాశ్చాత్యదేశమున సనాతనధర్మ విజయయాత్రయని చెప్పనొప్పును.

భారతీయులనుగూర్చి పాశ్చాత్యులకు గల దురభిప్రాయములను స్వామి తీవ్రముగా ఖండించెను. ఇవ్విషయమై 'అయోవా స్టేట్ రిజిస్టర్' అను పత్రికయం దిట్లు వ్రాయబడెను:

"భారతీయవిజ్ఞానమును ఖండించుచు స్వామితో వాదమునకు దిగినవారిపాట్లు పరమాత్మున కెఱుక. అత్యద్భుతమగు నాభారతీయుని కుశాగ్రధీశక్తి ముందా, అట్టివాదములు నిలుచుట! వారివాదములను స్వామి గోటితో మీటువాడు....నిజమైన క్రైస్తవులందఱకు వివేకా నందుడును వివేకానందోద్యమమును నిశ్చయముగా సమాదరణీయములై యొప్పెను."

సంకుచితాభిప్రాయములన్నను, స్వమతాహంకారమన్నను స్వామికి పరమాసహ్యము. క్రైస్తవులలోపముల నాతడు స్పష్టముగా, నిర్భయముగా, ప్రకటించెను. స్వామి యుపన్యాసములనుండి యిందుల కొక నిదర్శనము:

1894-వ సంవత్సరమున, డిట్రాయిట్ నగరమున నాత డిట్లు వక్కాణించెను :

"ఒకవిషయమును మీకు నే నిచట తెలుపవలసియున్నది. నా మాటలు సానుభూతిరహితములని భావింపకుందురుగాక. మీరు మీ దేశీయులకు విద్య చెప్పించి, దుస్తుల నిచ్చి, వేతనము లొసగుచున్నారు గదా. ఎందులకు? వారు మా దేశమునకు వచ్చి మాబుుషులను మాయాలయములను మామతమును నిరసించి దూషించుటకు. వా రొకదేవాలయమునొద్దకు వచ్చి, 'ఓవిగ్రహారాధకులారా! మీరందఱు నరకమున కరుగుదు'రని ప్రకటింతురు. కాని హిందువులు శాంతస్వభావులు కావున నవ్వుచు, 'ఈమూర్ఖులు వాగిన మనకేమి?' అని వెడలిపోవుదురు. ఇక మీమతబోధకులకు పరమతఖండనమును దూషణమును నేర్పు మీపాఠకడలను మేము రవంత విమర్శించినంతనే మీరు చేయు గందరగోళము, గగ్గోలు చెప్పతరముగాదు. మీయిచ్చవచ్చినట్లు చేయుఁడు. మాజీవిత విధానము మాకు తృప్తికరముగానున్నది. ఒక్కవిషయమున మీస్థితికంటె మాది మేలనుట నిస్సంశయము. హేతువిమర్శచేయక మానవుడు పాపియను ఘోర వికృతసిద్ధాంతమును మాబిడ్డల కెన్నఁడును మేము బోధింపము. మీయాచార్యులు మామతధర్మములను ఖండింపబోవునపు డీవిషయమును గుర్తింతురుగాక. భారతీయులందఱును లేచి హిందూమహాసముద్రపు టడుగుననున్న బురద నంతను దీసి పాశ్చాత్యదేశములపై బడవైచినను, అయ్యది మీరు మాపట్లసల్పుచున్న ఘోరకృత్యములలో సహస్రాంశమునకైనను సరిరాదు. ఎందులకు? మీమతమును వీడి మామత మవలంబింపజేయుటకు మే మొక్కమతప్రచారకుని మీదేశమున కెన్నడైనను బంపియెఱుగుదుమా?...ఎన్ని (శ్రీరంగ) నీతులు చెప్పినను మీరు మీమతవ్యాప్తిచేసినవిధాన మెట్టిది? కత్తి దూయనిదే, రక్తపాతము గావింపనిదే ఏదేశములో మీక్రైస్తవమతము వ్యాపించెనో చెప్పుడు. క్రైస్తవమతచరిత్రమున నిందులకు భిన్నముగా ఒక్కనిదర్శనము జూపిన జాలును. లేదు, గాలించిచూచినను లేదు.—మీపలెనే విఱ్ఱవీగిన యరబ్బు లేమైరి? రోమను లెచటనున్నారు?...స్వార్థపరత్వమే మూలాధారమై, భోగానుభవమే పరమావధియై యున్న యేమతసంస్థయైనను నేడో, రేపో,

నశింపకతప్పదు....మీరు క్రైస్తవులు కారు. జాతీయతనుబట్టిచూచిన మీరు క్రైస్తవులుగా చెన్నదగరు....సజీవమై మీజాతి నిలువవలయు నన్నచో మీ జీవితవిధానము మాఱవలయును. రాముడేలుహృదయమున కాము డుండ జాలడు....క్రైస్తవ ధర్మరహితులై భవనములలో నుండుటకంటె క్రైస్తవులై మీరు గుడిసెలలో నుండుట మేలు."

క్రైస్తవమతాచార్యులయెదుట, క్రైస్తవదేశమున నిలిచి, నిర్భయముగా నిట్లు వారిదోషములను ప్రకటించిన స్వామిధైర్య సాహసము లెట్టివో యూహింపుడు! అట్టియెడ క్రైస్తవమతప్రచారకులు గొందఱు స్వామిపై దండెత్తు టాశ్చర్యము కానేరదు. స్వామిపేరుప్రతిష్ఠలను జెఱుచుటకు వారు విశ్వప్రయత్నముచేసిరి. ధనాశజెట్టి కొందఱు యువతులను దనకడ కంపిరని స్వామియే తెలిపియున్నాడు. కాని త్యాగాగ్నిజ్వాలయగు నాతని విశుద్ధవర్తనము వారికి తమబుద్ధిహీనతను బ్రకటించెను.

స్వామివచనములు గంభీరములయ్యును, అందలి హాస్యహేళనచమత్కృతులు మెఱుపుదీగలవలె మెఱసి సభ్యుల నాశ్చర్యచకితుల నొనర్చెడివి. "హైందవస్త్రీలు తమ బిడ్డలను నదులలో మొసళ్ల కర్పింతురట, కాదా?" యని యొకాతె ప్రశ్నింప, స్వామి వెంటనే, "యథార్థము తల్లీ! నన్ను వా రట్లే పాఱవైచిరి. కాని నేను మీపూర్వగాథలలోని 'జోనా'వలె మఱల పైకి వచ్చితిని" అని పల్కెను!

మఱియొకప్పుడు స్వామి పాశ్చాత్యనాగరికతయందలి లోపముల నిట్లు ఖండించెను: "సదుద్దేశముతో నిష్కర్షగా జెప్పుదును నేను. యథార్థ మిది. నేనిచటకు మిమ్ము పొగడుటకు రాలేదు....మీడంబములను దోషములను లోపములను దెలిపి మీకు భగవంతుని జేరు మార్గమును జూపుటకై వచ్చి యున్నాను. మీరు నాబిడ్డలు. మీక్రైస్తవమతాచారములనుగూర్చికాని, మీ విచిత్రజీవితరీతులనుగూర్చికాని నుతులను స్తోత్రములను జేయుందునని భావింపకుడు....మీక్రైస్తవమత మెచట నున్నది? స్వార్థపరత్వముతో—పరమత వినాశైకకాంక్షతో—నిండిన మీహృదయములలో జీసస్సునకు తావులేదు.

ఆమహానీయుఁ డిపు డిచట నున్నచో నాతనికి తలదాచుకొనుటకు మీరు తా వీయకుండెడివారే!" అంత నొకక్రైస్తవాచార్యశేఖరుఁడు, "స్వామీ! క్రైస్త వాదర్శము నింతచక్కఁగా నెట్లు గ్రహించితిరి?" అని యడుగ, స్వామి యిట్లు బదులుచెప్పెను: "ఏల? క్రీస్తు ప్రాచ్యుఁడే! ప్రాచ్యులమగు మా కాతని తత్త్వము సులభముగా, విస్పష్టముగా, దెలియుట యాశ్చర్యము కానేరదు."

క్రమముగా స్వామి కనేకక్రైస్తవాచార్యులును ప్రఖ్యాతపురుషులును మిత్రులైరి. "మిమ్ము నిందించువారల కేల బదులుచెప్పరు?" అని వారడుగ, స్వామి యిట్లు వచించును: "పరులు మనలను దూషించినచో బ్రతిఘటింప నేల? మఱియు దన్ను దాను సమర్థించుకొనుట సన్న్యాసిధర్మము కాదు. 'సత్యమేవ జయతే, నానృతమ్' అని నమ్ముఁడు." అట్టిదూషణములకు భగవత్ప్రార్థనమే శాంతమూర్తియగు స్వామిసమాధానము.

సనాతనధర్మప్రచారము, మాతృదేశపునరుద్ధరణము—ఇవియే స్వామి సంకల్పములు. ఉపన్యాససంస్థ యాజమాన్యమున స్వామి యొసగిన ప్రత్యుప న్యాసమునకును ధన మధికముగా వచ్చుచుండెను. తన్మూలమున భారతదేశమున వివిధరాష్ట్రములలో ప్రజాసేవకసంస్థలను నెలకొల్పవలయునని స్వామితలంపు. కాని, యట్లు వచ్చినసొమ్ములో నేయల్పభాగమో స్వామి కిచ్చి, మిగిలిన దంతయు ఉపన్యాససంస్థయే మూటగట్టుకొనుచుండెను. ఒకయుపన్యాసమునకు 2500 డాలర్లు (అనగా సుమారు ఏడువేల ఐదువందలరూపాయిలు) వచ్చెను. అందు స్వామికి లభించినవి 200 డాలర్లే (సుమారు ఆఱువందల రూపాయిలు మాత్రమే). ఈమోసము నంతను గ్రహించి స్వామి యాక్రమసంస్థతో సంబంధము విడిచి, యుచితముగా నుపన్యాసము లొసగ నారంభించెను.

నిరంతరబోధోపన్యాసములచే తీరిక లేకున్నను స్వామి తనప్రాచ్య శిష్యులను మఱవలేదు; వారి కిట్లు వ్రాసెను: "మీస్త్రీలస్థితిని మీరు బాగు చేయలేరా? లేకున్న మీకు తరణోపాయము లేదు. స్త్రీల నుద్ధరింపనియెడల

మీరు ఎప్పటివలెనే అధఃపతితులైయుండురు. పారమార్థికవిషయమున మనతో బోల్చిచూచిన, అమెరికావారల్పులు. కాని సాంఘికముగా మనకంటె వారు కోటిరెట్లు ఘనులు. వారి సంఘములోనున్న మంచి విషయములను గ్రహించుచు మనపరమార్థమును వారికి బోధింతము గాక." మానవకల్యాణహేతుభూతము లగు నిట్టిసమన్వయభావములే సుప్రసిద్ధమగు నాతని "ప్రాక్పశ్చిమములు" అను గ్రంథరూపము నొందినవి.

ఇప్పట్టున భారతదేశ మేమి చేయుచుండెనో గమనింతము. అఖిల ప్రపంచమతమహాసభలో స్వామివిజయమునుగూర్చి విని, భారతీయు లెల్లరును బ్రహ్మానందభరితులై యాతని కీర్తింపసాగిరి. అమెరికాజనులు స్వామిసందేశ మును గమనించిన యద్భుతవిధానము, స్వామి ప్రతిభాతిశయమునుగూర్చి వా రొనర్చిన ప్రశంసలు, ఆతనిదేశసేవాపరాయణత్వము—ఇవియే నాటివార్తా పత్రికలలోని వార్తలు. ఇక బారానగరమఠమందలి సోదరశిష్యులు స్వామి విజయమున కుప్పొంగిపోయిరని చెప్పవలయునా? "నరేంద్రుడు ప్రపంచము నట్టూతలూగించును" అను శ్రీరామకృష్ణగురుదేవున మోఘవాక్యముల నావేశ పూరితులై వారు స్మరించిరి.

భారతదేశమం దంతటను వివేకానందనామము రామనామమువలె వ్యాపించెను. ఈదివ్యోత్సాహతరంగములు మొట్టమొదట చెన్నపట్టణము నుండియు వంగదేశమునుండియు బయల్వెడలి క్రమముగా భరతఖండమంత టను ప్రసరించెను. ఆసేతుహిమాచలము, వివిధరాష్ట్రములు వివేకానంద జయ జయధ్వానములతో బ్రతిధ్వనించెను. చెన్నపట్టణమున సర్ సుబ్రహ్మణ్యా అయ్యర్ మున్నగు ప్రముఖులు మహాసభ చేసి, తమకృతజ్ఞతాభినందనములను స్వామికి దెల్పిరి. రామనాథరాజగు భాస్కరసేతుపతి, ఖేత్రీమహారాజగు అజిత్సింగ్ బహద్దరు మున్నగువారును స్వామి కభివందనములను దెల్పిరి. స్వామి జన్మస్థానవాసులగు కలకత్తాపౌరులు పొందిన యానంద మిక వర్ణనాతీతము. వంగదేశములోని సుప్రసిద్ధపండితులు, పత్రికాధిపతులు, న్యాయమూర్తులు,

రాజకీయనాయకులు మున్నగుఘనులు వేలకొలది స్వామిని ప్రశంసించు టకై పురమందిరమున మహాసభచేసి యీక్రింది యభినందనలేఖను స్వామి కంపిరి :

"పరమపూజ్యులగు శ్రీమద్వివేకానందస్వాములవారి చరణకమల సన్నిధికి.

"షికాగోమహానగరమున జరిగిన యఖిలప్రపంచమతమహాసభయం దఖండశక్తిసామర్థ్యములతో మీరు సనాతనధర్మప్రాతినిధ్యము వహించినందు లకై యీమహాసభవారు ఏకగ్రీవముగా మి మ్మభినందించుచున్నారు : భార తీయులకు ప్రాణతుల్యమగు సనాతనధర్మమునకు తాము సల్పిన మహాసేవలను కృతజ్ఞతాపూర్వకముగా గొనియాడుచున్నారు. నేటికి హిందూమత మొక ప్రచారకుని గాంచినందులకు, మహాదృష్టవశమున మీవంటి జగత్ప్రచారకుని గాంచినందులకు, భారతీయులెల్లరును గర్వింపవలసియున్నది.

"మీమహోద్యమమును గొనసాగించుటకై సర్వేశ్వరుడు మీకు దీర్ఘా యురారోగ్యముల నొసగుగాక !" (క్షత్తము.)

మహావక్తయు సుప్రసిద్ధ రాజకీయవేత్తయు నగు సురేంద్రనాథబెనర్జీ యిట్లు వచించెను :

"స్మరణీయమగు ప్రాచీనకాలమున మనమహర్షులవాక్యములు కోట్లు కొలది జనులకు శాంతి నొనగూర్చినవి; ఇకముందుగూడ నట్లే కోట్లకొలదిజను లకు మనమత మఖండశాంతి నొసగగలదు. ఎక్కడి పాశ్చాత్యులు! ఎక్కడి సనాతనధర్మము! మహోన్నతమగు సనాతనధర్మసందేశమును పాశ్చాత్యుల కనర్గళముగా జాటిన యావివేకానందయతివరేణ్యునకు వినమితశిరస్కులమై కృతజ్ఞతాభివందనముల నర్పింపకుండ నుండగలమా?" (క్షత్తము.)

భారతదేశమున నూతనసంచలనము, నూతనోత్తేజము గలుగనారం భించెను. వివిధరాష్ట్రములలో జనులు సభలు జరిపి వివేకానందుని కీర్తించు టయేకాక, వివేకానందజనకమగు సనాతనధర్మ మద్వితీయమని గుర్తింపసాగిరి.

చైతన్యవిరహితమై నిద్రాణమైయున్న భారతదేశము వివేకానంద భానూదయ తేజమున మేల్కాంచి, భావిభాగ్యఫలసూచకమై విజృంభింపసాగెను.*

---

* ఒకయుపన్యాసమున స్వామియే యిట్లు వచించెను: "దీర్ఘనిశీథము పటాపంచలగుచున్నది, దుస్సహయాతన తుదముట్టుచున్నది, మృతప్రాయమగు కళేబరము చైతన్యవంతమగు చందమున పొడకట్టుచున్నది. చరిత్ర వినియెఱుం గని ప్రాచీనకాలమునుండి యొకదివ్యవాణి—జ్ఞానభక్తికర్మములకు అనంత హిమాలయమనదగు ప్రాచీనభారతవర్షమందుండి—శాంతమయ్యును విస్పష్ట స్వరకలితమగు నొకదివ్యవాణి—వినవచ్చుచున్నది....అదిగో, నిద్రాణమై యున్న మన భారతాంబ మేల్కాంచుచున్నది!...ఆమె నెవ్వరు నిక ప్రతిఘటింపజాలరు, ఏబాహ్యశక్తియు ఆమె నిక నిరోధింపజాలదు. ఆమె మఱల నిద్రపోబోవదు. అఖండభారతశక్తి విజృంభించుచున్నది."

## ఇరువదినాల్గవ ప్రకరణము

# మతప్రచారమునందలి వివిధానుభవములు

సనాతనధర్మప్రచార మొనర్చుచు స్వామి పశ్చిమఖండమున సల్పిన యుపన్యాసపర్యటనమందలి వివిధానుభవములను గమనింతము. సహజముగా స్వామి యీసమయమున ననేకపాశ్చాత్యప్రముఖులను గలిసికొనెను. అజ్ఞేయవాదులలో సుప్రసిద్ధుడగు రాబర్ట్ ఇంగర్ సాల్ స్వామితో ననేకమతవిషయములనుగూర్చి చర్చించుచు నిట్లు పలికెను: "నలుబదిసంవత్సరముల క్రితము మీరీదేశములో మతప్రచారమొనర్పవచ్చియున్నచో మి మ్మురితీసియుందురు, లేక కాల్చివైచియుందురు, ప్రతిగ్రామమునను తాళ్లు ఉవ్వియుందురు." కేవలదురహంకారసంజనితమగు నింతటిపరమతద్వేషము పాశ్చాత్యదేశములలో ప్రబలియుండె ననుసంగతి స్వామి కాశ్చర్యము గొల్పెను.

స్వామి యొసగుచుండిన వేదాంతోపన్యాసములను విని, కొందఱు తుంటరి గోపబాలకు లాతని మనోనిశ్చలత్వమును బరీక్షింపదలచి యుపన్యాసమధ్యమున తుపాకిగుండ్లను బఱపిరి. కర్ణకఠోరమగుధ్వనులతో తుపాకిగుండ్లు చెవుల కిరువైపులను దుస్సిపోవుచుండినను స్వామి నిశ్చలుడై యుపన్యసించుచుండుట గాంచి, వార లాశ్చర్యచకితులై స్వామి స్థిరచిత్తతను మెచ్చుకొనిరి!

మఱియొకప్పు డొక నీగ్రోకూలివాడు స్వామి ప్రయాణమధ్యమున నాతని సమీపించి, "మాజాతిలో నీవంటి మహానుభావుడు జన్మించుట చాల గొప్పసంగతి. దయచేసి, ఒకసారి 'షేక్ హాన్డ్' (కరచాలనము) చేయనిమ్ము" అని కోరెను. అఖండప్రేమపురస్సరముగా స్వామి యానీగ్రోకూలివానికి ధన్యవాదమొనర్చుచు, (పాశ్చాత్యమర్యాదననుసరించి) ఆతనితో కరచాలనమొనర్చెను. చాలసారులు అన్నవిక్రయశాలాధికారులు స్వామి నీగ్రో యని

తలచి నిరాకరించుట తటస్థించెను. క్షౌరశాలలలోసహితము స్వామి నిగ్లే 'ఫా'ష్మని నిరసించియుండిరి. వారికి స్వామి తాను నీగ్రోనుకానని యేల తెలుప లేదని యొక పాశ్చాత్యశిష్యుడు ప్రశ్నింప, స్వామి యిట్లు బదులుచెప్పెను : "పరుల నణచి, తాను పైకి వచ్చుటయా! అట్టి ఘోరకృత్యములు చేయుటకు నేను జన్మింపలేదు!"

ఉపన్యాసపర్యటనమున వివిధసంఘములనుండి స్వామి కాహ్వానములు సంతతధారగా వచ్చుచుండెను. సాధ్యమైనంతవఱకు స్వామి వాని నంగీకరించు వాడు. పాశ్చాత్యులకు వేదవేదాంతవిశాలాశయములను ప్రకటించుటయే, అందు ముఖ్యముగా అద్వైతవేదాంతదుందుభిని మ్రోగించి స్వమతాహంకార మత్తులను మేల్కొల్పుటయే, స్వామియాశయము. అహర్నిశము పర్యటనము చేయుచు స్వామి వారమునకు పండ్రెండు మొదలు పదునాలుగువఱకు నుప న్యాసము లొసగుచుండెడివాడు. కొన్నివేళల దినమునకు రెండుమూడుపన్యాస ములుకూడ నీయవలసివచ్చెడిది. మానవశక్తి కసాధ్యమగు నికార్యమును ఈశ్వరప్రేరితుడును ఈశ్వరనియమితుడును గావుననే స్వామి యొనర్పగల్గెను. అనేకపర్యాయము లర్ధరాత్రిసమయమున స్వామికి మఱుసటిదినమున తా నుపన్యసింపవలసినవిషయమునుగూర్చి యెవ్వరో యొకవ్యక్తి తన యెదుట నుపన్యసించుచున్నట్లు వినవచ్చుచుండెడిదట. అదియే మఱునాడు స్వామి యుపన్యాసము !

అసాధారణమగుయోగసిద్ధు లీసమయముననే స్వామి కప్రయత్నముగా గలుగసాగెను. స్పర్శమాత్రముననే పరులజీవితము నాతడు మార్పగలిగి యుండెను. చూచినంతనే యొకనిపూర్వజన్మవృత్తాంత మాతనికి గరతలామలక మగుచుండెడిది.

ఈసమయమున కలకత్తాలో కొందఱుప్రముఖులు స్వామియుపన్యాస ములను రాజకీయభావగర్భితములని తోచురీతిని ప్రకటింపసాగిరి. ఇవ్విషయ మునుగూర్చి స్వామి తన మదరాసుశిష్యులలో నొకని కిట్లు వ్రాసెను :

"రాజ్యతంత్రముతోగాని, రాజకీయాందోళనముతో గాని నాకు లేశ మును సంబంధము లేదు. నేను లక్షించునది పరమార్థమొక్కటియే. అది సరిగా నున్నయెడల మిగిలినవన్నియుం స్వయముగనే చక్కబడును....నావ్రాతలకు గాని, వచనములకుగాని రాజకీయాభిప్రాయములను ముడిపెట్టవలదని కలకత్తా జనులకు నీవు గట్టిగా చెప్పవలయును. నేనొక రాజకీయప్రతినిధినని క్రైస్తవ ప్రచారకుల కుపన్యసించుచు, రెవరెండు కాళీచరణ బెనర్జీ చెప్పెనని వింటిని. ఏమి యర్థరహిత ప్రలాపము!...ఆతడు బహిరంగముగా అట్లు చెప్పినయెడల నే నెట్టు రాజకీయప్రతినిధినో బహిరంగముగా ఏకలకత్తాపత్రికకైనను వ్రాసి యాబాబును ఋజువుచేయుమనుము, లేనిచో దనమూర్ఖప్రకటనమును రద్దు చేసికొనుమని నామాటగా జెప్పుము. ఇది వారికుయుక్తి! సామాన్యముగా క్రైస్తవప్రభుత్వము లన్నిటియందును గానవగు లోపములనుగూర్చి న్యాయ్య దృష్టితో నేను గొన్ని ఖండనలను జేసియున్నమాట నిజమే. అంతమాత్ర ముచే రాజకీయపుగొడవతో నాకు సంబంధమున్నదనియా యభిప్రాయము? ఆయుపన్యాసములనుండి కొన్ని ఘట్టములను వేఱుగా ముద్రించి నేనొక రాజకీయ ప్రచారకుడనని చూపుట మహాఘనకార్యముగా దలచువారికి, 'పరమేశ్వరా! ఈమిత్రుల బారినుండి నన్ను కాపాడుము' అని మొఱ పెట్టెదను....

"అవిచ్ఛిన్నమౌనమే నాయపవాదకులకు నాసమాధానమని నామిత్రు లకు జెప్పుము. 'కుక్కకాటునకు చెప్పుదెబ్బ' సామ్యముగా వారితో నేను వాదమునకు దిగినపక్షమున మనమును వారిస్థితికే దిగినవారమగుదుము. సత్యము స్వయంజ్యోతియనియుం నాకొఱకై వారెవ్వరితోను వివాదమునకు దిగనక్కఱ లేదనియు తెలియజెప్పుము. వారింకను నేర్చుకొనవలసిన విషయము లనేక ములు గలవు, వారు కేవలము పసిబిడ్డలు. సుఖస్వప్నములతో—వెఱ్ఱిమొఱ్ఱి ఊహాలతో—నిండియున్నవి వారిబుఱ్ఱలు—ముక్కుపచ్చలాఱని కుఱ్ఱలుగదా వారు!

"...అర్థరహితమైన యీలౌకికజీవితముతో, పత్రికాఘోషలతో, వర్ణనలతో—నాప్రాణము విసివి వేసారినది. ఆహా! హిమాలయప్రశాంతి మఱల నాకెప్పుడు లభించునోకదా!"

## ఇరువదియైదవ ప్రకరణము

# ఉద్యమ ప్రారంభము

వంతమహాసభానంతరము స్వామి యొనర్చిన మహోపన్యాసపర్యటనముచే వేదాంతతేజము అమెరికాఖండమున నెట్లు వ్యాపించెనో చూతము. అట్లాంటిక్ సముద్రతీరమునుండి మిసిసిపిమహానదివఱకును గల ముఖ్యపట్టణము లన్నిటియందు దాత డొక్క-సంవత్సరములో పర్యటన మొనర్చి మహోపన్యాసములొసగెను. స్వామి యనేకసభలచే, సంఘములచే నాహ్వానింపబడియెను. గ్రీనేకర్‌దేశీయమహాసభలలో వేదాంతతత్త్వమునుగూర్చి స్వామి యనేక పర్యాయము లుపన్యసించెను. పాశ్చాత్యశ్రోతలు పద్మాసనస్థులై గూర్చుండి యుండ నచట నొకవృక్షముక్రింద స్వామి బోధించువాడు. ఆవృక్షమునకు 'స్వామివృక్ష'మని పేరిడిరి. బ్రూక్లిన్ పట్టణ నైతికసంఘమునం దాత డొసగిన సనాతనధర్మోపన్యాసములను విని, పందలకొలది పాశ్చాత్యులు వేదాంత జిజ్ఞాసచే "దినదినము బోధింపు" డని ప్రార్థింప స్వామి యంగీకరించెను. అచట స్వామి యొసగిన 'సనాతనధర్మసందేశము'నుగూర్చి 'బ్రూక్లిన్‌స్టాండర్డ్' అను పత్రిక యిట్లు ప్రకటించెను:

"హైందవయతియగు వివేకానందపరమహంస బ్రూక్లిన్‌నైతిక సంఘాహ్వానము నంగీకరించి, ప్రేమసహనములనుగూర్చి పల్కినవాక్యము లమృతోపమానములు. సనాతనఋషీశ్వరదివ్యవాణి స్వామివాణియందు ప్రతిధ్వనించెను. ఆతని వాగమృతధారలచే సమ్మోహితులైన శ్రోతలతో ఆవిశాలభవనము క్రిక్కిఱిసిపోయినది....నిజముగా వివేకానందునిగొప్పతన మాతనికీర్తికంటెను ఘనతరము...."

స్వామి పిమ్మట న్యూయార్కుమహాపట్టణమున దినదినము సనాతన ధర్మతత్త్వములను బోధింప నారంభించెను. జను లపరిమితముగా వచ్చి శ్రద్ధతో

వినసాగిరి. స్వామికి శిష్యురాలై హరిదాసి యనునామమున ఖ్యాతివహించిన వాల్డో కన్య (Miss S. E. Waldo) యిట్లు వ్రాసెను :

"...1895-వ ఫిబ్రవరి నెలలో పాఠము లారంభమైనవి. శ్రోతల సంఖ్య దినదినము అత్యద్భుతముగా వృద్ధిజెందనారంభించెను. ఆదృశ్యమంతయు అతిరమణీయము. స్వామి నేలమీద కూర్చుండుట చూచి యందఱు నేల మీదనే కూర్చుండువారు. మందిరమంతయు నిండిపోయెడిది, చోటు చాలక కొందఱు మెట్లపై గూర్చుండువారు. ఏమి యాప్రారంభపాఠములు!...ఆ ప్రసంగము లతిమనోహరములు కదా! అచటి కరుదెంచుమహాభాగ్యము లభించినవారు తమజన్మములో స్వామివచనముల నెన్నటికిని మఱవజాలరు. ఏమి సరళగంభీరమూర్తి! ఏమి భావనైర్మల్యము! ఏమి మృదుమధురవాక్ప్రవాహము! ఆమహనీయుడు పల్కు ప్రతివచనమును తమ సౌఖ్యాసౌఖ్యములనన్నిటిని మఱచి యత్యంతమగు నాత్రముతో జను లాలకించువారు...."

కాని స్వామికి వలయునది ప్రశాంతిమార్గప్రకటనముగాని ప్రశంసలు కావు. రాజయోగరహస్యముల నాతడు సాధకులకు దినదినము బోధింప సాగెను.

భారతదేశములోనిశిష్యు లీసమయమున తిరిగిరండని కోరుచు స్వామికి లేఖ లంపుచుండిరి. స్వామి వారల కిట్లు సమాధానమొసగెను : "స్వశక్తిపై నాధారపడి నిల్వుడు, నిక్కముగా మీరు భారతపుత్రులైనచో, ప్రచండ దీక్షతో, సింహబలసాహసములతో, కార్యరంగమున బ్రవేశింపుడు. మనము భారతదేశమునేకాక, ప్రపంచమునంతను మేల్కొల్పవలసియున్నది." భారత దేశసమస్యలు తన కెట్లు కరతలామలకమైయుండెనో స్వామి వ్రాసినలేఖలు ప్రకటించును.

భారతదేశములోని క్రైస్తవమతప్రచారకులు స్వామియుద్యమమును గూర్చియు స్వామినిగూర్చియు ఖండన లారంభించిరి. మిత్రు లాతని కీసంగతి దెలుప స్వామి యిట్లు సమాధానమొసగెను :

"...జనులు నన్ను దూషింపనిండు, భూషింపనిండు. ఇకముందెన్నడు

మీరు వానిని లక్షింపకుడు....ప్రాణములున్నంతవఱకు నేను నాయుద్యమ మును విడువను. మరణానంతరముగూడ లోకకల్యాణమునకై కృషిచేసెదను. అసత్యముకంటె సత్యము కోటిరెట్లు ఘనతరము. వలయునది **సౌశీల్యము, హృదయనైర్మల్యము, సత్యారాధనము—యథార్థవ్యక్తిత్వ ము—ఇదియే శక్తి,** ఇవి నాయొద్ద నున్నంతవఱకు మీరు భీతిల నక్కఱ లేదు; నాశిరోజమునకైనను ఎవ్వరును హానిచేయజాలరు. నాకార్యవిఘాతము చేయబూనినవారియత్నము భగ్నమగును. భగవదాదేశమును స్మరింపుడు...."

ఈసమయమున స్వామి వ్రాసిన లేఖలు* ఇట్టే మహావేశజనకములై యాతనిభావౌన్నత్యమును ప్రకటించుచున్నవి. ఇందులకు గొన్ని నిదర్శన ములు :

"...త్యాగాగ్నికీలలలో దుమికి జనులకు పారమార్థికచింత గల్గింపుడు. శ్రద్ధయున్నచో సమస్తము లభించును."

"...సోదరులారా! దారిద్ర్యముచే, మతాచార్యకైతవముచే, రాక్షస శాసనములచే, అధఃపతితమైయున్న భారతసోదరకోటియొక్క సముద్ధరణము నకై మన మందఱ మహర్నిశము ప్రార్థింతముగాక!...ఇరువదికోట్ల హిందు వులు విద్యావిహీనులై, దరిద్రులై, క్షుధార్తులై కృశించిపోవుచున్నారే! ఆహా! వారి కిక తరణోపాయ మేమి? వారికై పరితపించువా రెవరు? ఇంటింటికి దిరిగి వారికి విద్య నేర్పు వారెవరు? సోదరులారా! ఈదీనులే మీకర్చనీయుం లని గ్రహింపుడు. వారిని గూర్చియే స్మరింపుడు. వారి సముద్ధరణార్థమే కృషి చేయుడు. వారికొఱకే ప్రార్థింపుడు—భగవంతుడు మీకు మార్గము జూపును. **దీనులగూర్చి యెవ్వనిమానసము క్షోభించునో వాడే మహా త్ముడు: క్షోభింపనిచో దురాత్ముడే....కోట్లకొలదిజనులు విద్యావిహీనులై క్షుధార్తులై దినములు గడపుచుండ వారిని క్రేగంటనైనను జూడక, విశేషము వారికష్టార్జితముచే తాము**

---

* శ్రీవివేకానందలేఖావళి యను పేర స్వామిలేఖలు ఈ గ్రంథకర్తచే అనువదింపబడి మాచే ప్రకటింపబడుచున్నవి.—ప్రకాశకులు.

విద్యావంతులైన వారందఱును దేశద్రోహులని నాయభి ప్రాయము.”

“—సోదరులారా! మనము నిర్ధనులమనుమాట నిజమే. కాని నిర్ధనులే ఆదినుండియు భగవత్కార్యముల నొనర్చుటకు సాధనభూతులైరని గ్రహింపుడు.”

స్వామి యుపదేశములననుసరించి చెన్నపురశిష్యులు ‘బ్రహ్మవాది’ యనుపత్రికను ప్రకటింపనారంభించిరి.

ఇక నమెరికాఖండమున స్వామి తన శిష్యులకు స్వానుభవనిదర్శన పూర్వకముగా రాజయోగజ్ఞానయోగములను బోధించుచుండెను. స్వామి ప్రకటించిన యోగసిద్ధాంతములు సుప్రసిద్ధమానసికశాస్త్రవేత్తయగు విలియమ్ జేమ్సు వంటి యనేకపాశ్చాత్యపండితుల దృష్టిని భారతీయవిజ్ఞానమువైపునకు మఱల్చెను. స్వామితో జేమ్సుపండితు డనేక విషయములనుగూర్చి చర్చించెను. తత్త్వానుభవరత్నాకరము (Varieties of Religious Experience) అను తన సుప్రసిద్ధగ్రంథమున స్వామి నీతడు వేదాంతి శిరోభూషణము (The Paragon of the Vedantins) అని పేర్కొనియున్నాడు. స్వామిని తనగృహమున కాహ్వానించి యాతిథ్యమొసగుచు, “గురువర్యా!” యని సంబోధించెను.

పాశ్చాత్యప్రముఖు లనేకులు స్వామికి శిష్యులైరి. జనసామాన్యమున నాతనికి వేలకొలదిశిష్యు లుండిరి. అర్హులగువారల కాతడు సన్న్యాసదీక్ష నొసగెను. స్వామి మహోద్యమ మీవిధముగా పశ్చిమఖండమున వేరుపాఱు చుండెను. కాని, సంతతబోధోపన్యాసములచే, నిరంతరతీవ్రతమకర్మాచరణముచే, స్వామివంటి మహాయోగికిసైతము కొన్నివేళల విసువు జనించు టాశ్చర్యము కానేరదు. అట్టి సమయములలో వైరాగ్యజ్వాలయై స్వామి యిట్లు భావించును: “నాకాషాయాంబరములు, నాముండితమస్తకము, నాయరణ్యవిహారము, నాభిక్షాచరణమును నాకెప్పుడు లభించునో కదా!” మఱల లోక

సంగ్రహాకర్మపరతంత్రుడై యిట్లు తలచును: "సంఘస్థాపనమున దోషము లుండుగాక....కాని సమస్తము సంఘమువలననే సిద్ధించును...అంతర్వాణి నాలకించి కర్మ మాచరించుటయే మనవిధి. అట్టి సత్కర్మాచరణ మీనాడు గాకున్న, మనయనంతరము నేయివత్సరములకైనను సంఘమున పరివర్తనము గల్గించితీరును." కార్యరంగమును వరించి, కర్మశూరుడై వర్తించుటయే స్వామి యాశయము. ఫలాపేక్షారహితుడై తనసందేశము నొసగుటే యాతని సంకల్పము. ఇదియే కదా నిష్కామకర్మాచరణము!

'సరియైనవారి'తో పరిచయము గలుగజేసికొని, గొప్పవారిపలుకు బడిని సంపాదించుట మంచిదని కొందఱు స్వామి కుపదేశించిరి. స్వామి వారి కిట్లు బదులుచెప్పెను: "పరమేశ్వరు డెవరిని నాయొద్ద కంపునో వారే **'సరియైనవారు.'** స్వానుభవముచే నాకు దెలిసిన విషయమిది. అట్టివారే నాకార్యమును నిర్వహింపగలరు. తదితరు లున్నచో, భగవంతుడు వారి నను గ్రహించి, నన్ను వారిబారిపడకుండ రక్షించుగాక!" తరువాత శివస్తోత్ర మొనర్చుచు స్వామి యిట్లు ప్రార్థించెను: "పరమేశ్వరా! బాల్యమునుండియు నాకు నీవే శరణ్యుడవు. ధ్రువములకడ కరిగినను, ఎడారులకేగినను, పర్వతా రణ్యముల నొంటరిగా దిరుగాడినను, సాగరగర్భమున బయనించినను నీవు నన్ను విడనాడవు...." మఱియుం గొన్నిదినములైనవెనుక నిట్లు వ్రాసెను: "...నరునిసాయ మన నెంత? నరునిపై నాధారపడుట మానినకొలదియు నారాయణునిసాయ మధికమగుచుండును." మూడు దినములకు పిమ్మట మఱల నిట్లు లిఖించెను: "పరమదుర్మార్గులనుండి 'సరియైనవారిని' సిద్ధమొనర్చుటే ఆచార్యునివిధి....నే నొకనిముఖమువైపు జూచినంతనే వానిగుణస్వభావము లును విలువయు నిట్టివని రామకృష్ణునను గ్రహామువలన అమోఘముగా నా యంతఃకరణము దెల్పును."

స్వామికార్యక్రమ మపరిమితముగా వృద్ధిజెందనారంభించెను. ప్రతి దినోపన్యాసములతోడను పాఠములతోడను కాల మాక్రమింపబడ స్వామికి

లేటికయనునది లేకుండెను. విశ్రాంతి యత్యావశ్యకమై తోచెను. అట్టిసమయమున స్వామితో సహస్రద్వీపవనము (Thousand Island Park)న వేసవి గడపదలచి శిష్యు లాతని నటకు రమ్మని ప్రార్థించిరి. స్వామి సమ్మతించి వెడలెను. సహస్రద్వీపవనమున స్వామి జీవితమునుగూర్చి సోదరి 'క్రిస్టిన్' (Sister Christine) అను శిష్యురా లిట్లు వ్రాసెను :

"...మాలో నొకరికి సహస్రద్వీపవనమున నొకగృహము కలదు. స్వామి నట కాహ్వానించితిమి. స్వామి తనశిష్యులనుండి యోగుల 'నుత్పత్తి' ('manufacture') చేయుటయే తనసంకల్పమని తెల్పెను. మా కాతడు మంత్రోపదేశ మొనర్చి తనదివ్యదృష్టిచే మాజీవితవృత్తాంతములను పూసగుచ్చినట్లు తెల్పెను....దివ్యావేశము అను పక్షములపై మమ్మాతడు ఆత్మానందధామమునకు గొనిపోయెను. మాకు ముక్తిమార్గమును జూపుటయే స్వామిపరమ సంకల్పమని గ్రహించితిమి....భగవదవతారమూర్తియగు వివేకానందుని సన్నిధానమున జీవించు టెంతటి సుకృతమో కదా!...అహోరాత్రము అచట భగవంతునిగూర్చియే చింతనము..." (క్లుప్తము.)

పరిచారకుల నియోగింప నిష్టపడక స్వామి శిష్యులచేతనే పనులు చేయించువాడు. గానకవితావక్తృత్వాదికళలయం దెంతటినిపుణుడో, వంట యందును అంతటినిపుణు డగు స్వామియు దక్షిణ మధురాహారములను వండి పెట్టి శిష్యుల నానందింపజేయువాడు.

సహస్రద్వీపవనమున స్వామి శిష్యుల కొనర్చిన మహోపదేశములే ప్రబోధరత్నాకరము * (Inspired Talks) అను నాతని సుప్రసిద్ధ గ్రంథరూపమును దాల్చినవి.

---

* ఇది యీ గ్రంథకర్తచే అనువదింపబడి, మాచే ప్రకటింపబడి యున్నది.—ప్రకాశకులు.

ఇందలి కొన్ని ప్రబోధరత్నములు:

"భగవంతు డొక్కడే దాత, లోకులందఱును వర్తకులు."

"ఆత్మశక్తిని నీయం దుద్దీపింపజేయువాడే గురువు."

ఆత్మానుభవవైభవమును దెలుపుచు స్వామి యీసమయమున నిట్లు వ్రాసియున్నాడు: "ముక్తసంగుడను నేను. నాబంధములు విచ్ఛిన్నములైనవి. అమృతపుత్రుడనగు నేను లోకమున కొసగవలయు సందేశము కలదు. నాకార్యమును నిర్వహించు ధీరుల నుత్తమోత్తములను ఆపరమేశ్వరుడే నాకడ కంపును." స్వామి గొందఱకు బ్రహ్మచర్యదీక్షను ఇరువురకు సన్న్యాసదీక్షను ఒసగెను.

జనసామాన్యమునకు బోధించుటకుబదులు ధనాధికులకు బోధించి వారి నాకర్షించుట చాల లాభదాయకమని స్వామికి గొంద ఱుపదేశింపనారంభించిరి. అట్టిసిచాభిప్రాయములను నిరసించుచు స్వామి వారి కొసగిన ప్రత్యుత్తరమే జగత్ప్రసిద్ధమగు నాతని 'యతిగీతము' (Song of the Sannyasin). స్వర్ణమయమైనను సంకెలలు సంకెలలేయనియు సన్న్యాసికి మానావమానములు సమానములనియు అజ్ఞాననిద్రనుండి లోకులను మేల్కొల్పుటయే యాతనిపరమధర్మమనియు స్వామి యిందు జాటియున్నాడు. జ్ఞానభక్తి వైరాగ్యములతో బొంగి పొరలుచు దివ్యావేశజనకమగు నీయతిగీతము* స్వామి రచనములలో నుత్తమోత్తమముగా బరిగణింపబడియున్నది.

---

* ఇది మహాకవి శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారిచే అనువదింపబడి, మాచే ప్రత్యేకముగ ప్రకటింపబడుచున్నది.—ప్రకాశకులు.

"సంఘమునుగాని, వ్యక్తినిగాని సంస్కరింపవలయునని బలాత్కారముగా బ్రయత్నించుచో సిద్ధించున దెప్పుడును అపజయమే. 'నీవు మంచివాడవే, కాని యింకను మంచివాడవగుము' అని చెప్పుడు; కాని యెవ్వనిని 'నీవు దుర్మార్గుడవు' అనకుడు."

"మానవుడు తాను దుర్బలుడననుకొనుటయే మహాదోషము."

"పుస్తకములలో జ్ఞానమును పరులచేతిలో ధనమును ఉన్ననేమి? లేకున్ననేమి?"

## ఇరువదియాఱవ ప్రకరణము

# ఆంగ్లదేశమున స్వామి యుద్యమము

సనాతనధర్మ సందేశమును అమెరికాదేశమునకే కాక, పాశ్చాత్యలోకమున కంతకును అందు ముఖ్యముగా ముందడుగువైచుచున్న ఆంగ్లదేశమునకును దెలుపవలయునని స్వామియాశయము. ఈసమయముననే మిస్ ముల్లర్, ఇ. టి. స్టర్డీ యను నాంగ్లేయ ప్రముఖులిరువురు స్వామిని ఆహ్వానించిరి. బ్రిటిషు సామ్రాజ్యాకేంద్రస్థానమగు నాంగ్లదేశమున సనాతనధర్మ ప్రచార మొనర్చుట కిదియే యదనని స్వామి బయలుదేఱెను.

మార్గమధ్యమున స్వామి ప్యారి (Paris) మహాపట్టణమున గొన్ని దినము లుండెను. ఈసమయమున భారతదేశములో క్రైస్తవప్రచారకులు కొందఱు స్వామిపాశ్చాత్య దిగ్విజయమునుగూర్చి కండ్లలో నిప్పులు పోసికొన నారంభించిరి. "వివేకానందుని దిగ్విజయమువలన భారతదేశములో క్రైస్తవ మతప్రచారకుల యాదాయము ఒక్కసంవత్సరములో పదిలక్షల పౌనులు (అనగా సుమారు ఒకటియునరకోట్ల రూపాయిలు) పడిపోయిన"దని ప్రభుత్వమువారే ప్రకటించిరి. అందుచే నెత్తి, నోరు గొట్టుకొని, స్వామికీర్తి నెట్లైనను మాపవలయునని ప్రచారకులు పన్నుగడ లారంభించిరి. పశ్చిమఖండమున స్వామియాహారవిహారములనుగూర్చి వారొనర్చుచుండిన దుష్ప్రచారములను* విని, పూర్వాచారపరాయణులు స్వామిని నిందింపసాగిరి. శిష్యు లివ్విషయమై స్వామిని హెచ్చరింప స్వామి యిట్లు ప్రత్యుత్తరమొసగెను :

---

* స్వామి స్వభావవర్తనములనుగూర్చి సామాన్యప్రచారకులు చేయునిందలను తీవ్రముగా ఖండించుచు అనేక క్రైస్తవమతాచార్యులే స్వామిని గొనియాడుచు అతనిగూర్చి "మాప్రాచ్యసోదరుడు" అని వచించువారు.

"క్రైస్తవప్రచారకుల ప్రలాపములను మీరింతగా గమనించుట నా కాశ్చర్యముగానున్నది....భారతీయులు నేను సరియగు హైందవాహారమునే తినవలయునని కోరునెడల వెంటనే యొకవంటవానిని, వలయుధనమును బంపుదని వారికి దెలియజేయుడు. అణుమాత్రమైనను సాయముచేయని యీయవివేకులవాచాలతను జూచిన నాకు నవ్వు వచ్చుచున్నది. మఱియు సన్న్యాసికి ప్రధానవ్రతములగు బ్రహ్మచర్యత్యాగముల కెన్నడైనను వ్యతిరిక్తముగా వర్తించితినని మిషనరీలు మీకు జెప్పినచో వారు వట్టి 'అబద్ధపుకోరు'లని తెల్పుడు....ఇక నాసంగతి వినుడు. నే నొకరియాజ్ఞలకు బద్ధుడనుగాను. నా జీవితమెందుల కుద్దేశింపబడినదో నాకు తెలియును. స్వదేశదురభిమానముతో నాకు సంబంధము లేదు. మనఃపూర్వకముగా జెప్పుచున్నాను. నేను భారతదేశమున కెంత చెందుదునో ప్రపంచమునకును అంత చెందెదను. ఏదేశమునకుగాని నామీద ప్రత్యేకపుహక్కు లేదు. ఒకదేశమునకు నేను దాసుడను కాను.

"...దైవమానవరాక్షసశక్తు లన్నిటికంటెను మహత్తరమైన శక్తి నా కాధారభూతమైయున్నది. హిందూసంఘములోని 'విద్యాధికు'లందుమాత్రమే కానవచ్చు స్వజాత్యహంకారపిశాచగ్రస్తులలో, మూఢవిశ్వాసపరులలో, దయావిహీనులలో, వంచకులలో, నాస్తికులలో, పిఱికిపందలలో, ఒకడనై తుచ్ఛజీవనముచేసి చచ్చుటకు జన్మించినవాడనని భావింపకుడు. పిఱికితనమనిన నాకు పరమాసహ్యము. పిఱికిపందలతోగాని, రాజకీయమూర్ఖ్యముతోగాని నా కెట్టిసంబంధమును వలదు. రాజకీయమున నాకు లేశమును విశ్వాసము లేదు. ప్రపంచములో భగవంతుడు, పరమార్థము—ఇవియే నా రాజకీయములు. మిగిలినదంతయు చెత్త...."

స్వామి లండన్ నగరమును జేరినంతనే మిత్రు లాతనికి సుస్వాగతమొసగి, యొకరి వెనుక నొకరు తమయిండ్లలో నాతిథ్య మీయసాగిరి. 'హిందూయోగి వచ్చె' ననువార్త విని వేలకొలదిజనులు స్వామిని సందర్శించుచుండిరి. వివిధసంఘములనుండి స్వామి కాహ్వానములు రాసాగెను. ప్రఖ్యాత పత్రికాధిపతు లనేకులు స్వామిని సందర్శించి యాతని ప్రతిభాతిశయమును గూర్చియు బోధనపాటవమునుగూర్చియు బ్రశంసించిరి. జనసామాన్యమునకై యొకబహిరంగోపన్యాస మేర్పాటుచేయబడెను. లండన్నగరమున వైభ

హోన్నతమగు 'పిక్కడిల్లీ'లోని రాజభవనమున స్వామి వేలకొలది జనులకు ఆత్మజ్ఞానమునుగూర్చి యుపన్యసించెను. సభ్యు లాతని మహోపన్యాసమును విని సమ్మోహితులైరి. మఱునాడు పత్రికలన్నియు స్వామిప్రశంసలతో నిండి పోయెను. 'లండన్ డెయిలీక్రానికల్' అను పత్రిక యిట్లు చాటెను:

"ప్రఖ్యాత హైందవయతిపుంగవుడగు వివేకానందుని ముఖాకృతి బుద్ధదేవుని ప్రశాంతవదనమును స్మరింపజేసెను. స్వామి మనవర్తకార్జిత భోగ భాగ్యములను రక్తవాహినులను బ్రవహింపజేయు మనయుద్ధములను మన పర మతద్వేషమును తీవ్రముగా ఖండించి, 'ఇవియే మీ నాగరికతయైనచో అట్టి దాంభిక నాగరికతయందు దణుమాత్రమును మాకు వల'దని వచించెను."

'లండన్‌నగరమున హిందూయోగి' యను శీర్షికతో "వెస్టుమినిస్టర్ గెజెట్' పత్రిక స్వామినిట్లే విశేషముగా బ్రశంసించెను.

ఈ ప్రశంసలన్నిటికంటెను లండన్‌నగరమున స్వామి కొకమహత్తరమైన విజయము చేకూరెను. స్వామియుద్యమవ్యాప్తికై తనసర్వస్వమును సమర్పించి సనాతనధర్మమునకు అఖండసేవ సల్పి భారతీయులకృతజ్ఞతకు పాత్రురాలైన సోదరి నివేదిత (Miss Margaret Noble) లండన్‌నగరముననే స్వామికి శిష్యురాలయ్యెను. * ఈమె విశేషవిద్యావంతురాలు; స్వయముగా తాను

* తన ప్రథమసమావేశమునుగూర్చి నివేదిత యొనర్చిన వర్ణన మెంతయు హృద్యమై యొప్పుచున్నది:

"...ఆచార్యపీఠమున అంతటిసామాన్యపరిస్థితులలో స్వామిని మఱల నే నెన్నడును ఇంగ్లాండులో కనియుండలేదు. అనంతరము స్వామి నిరంతరము ఉపన్యసించుచుండువాడు, లేదా, స్వామి సమాధానించు ప్రశ్నలు అసంఖ్యాకులగు సభ్యులచే లాంఛనముగా వేయబడుచుండెడివి. కాని యీ మొదటి సారి సమావేశమైన మేము, పదునైదు పదునాఱుగురము; అందు అనేకులము ఆప్తమిత్రులము. దివ్యకాషాయాంబరధారియు అతిదూరదేశసందేశధారియు నగు స్వామి యపుడపుడు 'శివా! శివా!' యని విచిత్రముగా నుచ్చరించుచు మా నడుమ నాసీనుడైయుండెను. విశేషధ్యానశీలురై మను మహానీయుల

స్థాపించిన యొకవిద్యాలయమున కధ్యక్షురాలు. స్వామి ప్రసంగములను ఉప న్యాసములను విని, వేదాంతవాక్యరత్నముల మూల్యమునుగూర్చి మున్ముందు సంశయించినను, క్రమముగా, నయ్యవి యమూల్యములని గ్రహించి, శిరసా వహించి, స్వామికి శిష్యురా లయ్యెను.

ఆంగ్లదేశమున దనయుద్యమవ్యాప్తినిగూర్చి స్వామియే యిట్లు వ్రాసి యున్నాడు :

"...ఇచట నాయుద్యమ మద్భుతముగా సాగినది....జనులు గుంపులు గుంపులుగా వచ్చుటచే వారికి తగునాసనము లొసగుటకు నాకు శక్యము కాలేదు. అందుచే స్త్రీలును నేలమీదనే కూర్చుండువారు. రాబోవువారము నే నమెరికాకు వెడలెదనని విని యిచటిజనులు చాల విచారించుచున్నారు. నేను వెడలినచో నిచట నాయుద్యమమునకు హాని కలుగునని కొందఱయభి ప్రాయము. కాని నే నట్లు తలంపను. మానవులపై, పరిస్థితులపై నే నెన్న డాధారపడువాడను కాను. పరమేశ్వరుడే నా కాధారభూతుడు.

"...నిజముగా కార్యభారముచే అలసియున్నాను. ఇంత తీవ్రముగా బనిచేసినచో మఱెవ్వడైన నీపాటికి మరణించియుండును. చిరకాలవిశ్రాంతికై భారతదేశము రాగోరెదను...."

స్వామియుద్యమవిజయమునుగూర్చి యొకదినపత్రిక యిట్లు ప్రక టించెను :

"తమగురువర్యుని మ్రోల హైందవశిష్యులవలె లండన్ యువతీమణు లనేకులు...నేలమీద పద్మాసనస్థలై కూర్చుండి స్వామివాక్యముల నత్యంత భక్తితో వినుచుండిన యాదృశ్యము నిజముగా అతిదుర్లభము. స్వామి భార

---

వదనారవిందములందు వెల్లొందు సాధుత్వసమ్మిళితౌదార్యము—ప్రాయికముగా బాలజీసస్ మోమున రాఫేల్ (Raphæl) చిత్రించిన యావినిర్మలోదార దృష్టి—స్వామివదనమున భాసించుచుండెను.

"...అద్భుతమగు ప్రాచ్యకంఠస్వరమున స్వామి గానమొనర్చిన యా సంస్కృతశ్లోకములను...నాజన్మములో ఎన్నటికిని మఱవజాలను."

లీయులపై ఆంగ్లేయులకు గల్గించుచున్న ప్రేమసానుభూతులు భారతదేశాభివృద్ధికి దోడ్పడగలవను టెంతయు నిశ్చయము."

ఇంక ననేకు లీవిధముగా స్వామియుద్యమమును కీర్తించియున్నారు. భగవద్గీతాది వేదాంత గ్రంథపఠనార్థము స్వామి తనశిష్యులను తమలో తామొకసంఘము నేర్పఱచుకొన ప్రోత్సహించి, అమెరికాదేశమునకు బయలు నేడెను.

## ఇరువదియేడవ ప్రకరణము

## ఉద్యమ వ్యాప్తి

అమెరికాలో స్వామి ప్రారంభించిన మహోద్యమము నాతడాంగ్లదేశములో నుండగా కృపానందస్వామి (Leon Landsberg), అభయానంద (Mme Marie Louise), హరిదాసి (Miss S. E. Waldo) యను శిష్యులు విశేషసామర్థ్యముతో నిర్వహించుచుండిరి. స్వామి మహోత్సాహపూరితుడై తిరిగి అమెరికా కార్యరంగమున ప్రవేశించెను.

స్వామియుపన్యాసము లింకను గ్రంథస్థముకాలేదు. సమర్థులగు సాంకేతికలేఖకులు దొరకకుండుటయే యిందులకు ముఖ్యకారణము. ఈసమయమున జె. జె. గుడ్విన్ అను లేఖకుడు స్వామియుపన్యాసములను వ్రాయుటకై నియమింపబడుట తటస్థించెను. ఈతడు బహుసమర్థుడు. వివేకానందవచనామృతము నేడు ప్రపంచమం దంతటను వ్యాపించుటకు మూలకారణభూతుడీగుడ్విన్ మహాశయుండే. స్వామియుపన్యాసములను విని యీతడు భక్తిపూరితుడై, శిష్యుడై, తనజీవితాంతమువఱకును స్వామిసేవ యొనర్చెను. స్వామి యీతనిగూర్చి 'నా కుడిభుజ'మని వచించియున్నాడు.

స్వామి న్యూయార్కు పట్టణమున వరుసగా ననేక బహిరంగోపన్యాసము లొసగ నారంభించెను. Lightning Orator (**మహోపన్యాసక విద్యుల్లత**) యని యాతడు పేరుపడసెను. అమెరికాజనులలో స్వామి వేదాంతోపన్యాసములు గల్గించిన సంచలనము అత్యద్భుతము. ఉపన్యాస సుధను గ్రోలినవారందఱు నాతనిపాదముల కరుగుచుండుటచే అచటస్థలము చాలకుండెను. స్వామివిజయమునుగూర్చి కృపానందుడు (Leon Landsberg) ఇట్లు వ్రాసియున్నాడు :

"...వేదాంతవిజ్ఞానమును వ్యాప్తిచేయుటకై స్వామి ప్రదర్శించు శక్తి మహాద్భుతము....దినమునకు రెండుపన్యాసములు, దేశదేశాంతరములలో నుత్తరప్రత్యుత్తరములు, తన్ను సందర్శింపవచ్చు జనులతో సమావేశములు, శిష్యులకు వలయు గ్రంథరచన—అనుదినము, ఇంతటి మహాకార్యభారమును వహించు స్వామిశక్తి మానవాతీతము. విశ్వమానవప్రేమచే, నిరుపమాన సంకల్పశక్తిచే, అఖండాధ్యాత్మిక బలముచే, స్వామి యిట్టి కష్టతరమగు కార్యము నవలీలగా సలుపుచున్నాడు.

"...దివ్యజ్ఞానప్రదీప్తములగు స్వామిబోధోపన్యాసములు జనుల మూఢవిశ్వాసములను దురభిప్రాయములను క్రమముగా సడలించి, సత్యకాంక్ష నుద్దీపింపజేసి, సంఘశ్రేయమునకు మార్గదర్శకము లగుచున్నవి. వేదాంతమును గూర్చి విశేషముగా తెలిసికొనవలయు ననుతీవ్రవాంఛ జనులలో వ్యాప్తమైనది. **ఆత్మ, ప్రకృతి, మోక్షము** మున్నగు పదములు వాడుకమాటలవలె తఱచుగా ప్రతిమనుష్యునిచేతను వచింపబడుచున్నవి. శంకరరామానుజనామధేయములు హక్స్లి, స్పెన్సర్ నామములతో తుల్యముగా వ్యాప్తమైనవి. భారతదేశమునకు సంబంధించిన గ్రంథములకొఱకు జనులు భాండాగారములను గాలించుచున్నారు. మాక్సుమ్యులర్, కోల్‌బ్రూక్, డోయిసన్ వ్రాసిన వేదాంతగ్రంథములు అపరిమితముగా వ్యయమగుచున్నవి. . . ."

అమెరికాలోని ప్రఖ్యాతకవయిత్రియగు విల్‌కాక్స్ (Mrs. E. Wilcox) వనితామణి యిట్లు వ్రాసియున్నది :

"పదిరెండు వత్సరములకు పూర్వము ఒకప్పుడు న్యూయార్కులో మా యింటిసమీపమున వివేకానందు డను నొక హిందూవేదాంతబోధకు డుపన్యసించునని వినుట తటస్థించెను. వేడుకకొఱకు (నేనును నాభర్తయు) ఆయుపన్యాసమునకు వెడలితిమి. ప్రారంభించి పదినిమేషములు కాకముందే, అద్భుతము, అనిర్వాచ్యము, అలౌకికము నగు నానందపారవశ్యమున ఉపన్యాసాంతము వఱకు నిశ్చేష్టులమై కూర్చుంటిమి. ఆయుపన్యాసమును విని నూతనస్థైర్యముతో, నూతనోత్సాహముతో, నూతనాశయములతో నింటికి కరిగి, సాంసారికబాధలను తృణప్రాయముగా నెంచి, విహితకృత్యములను మహానందముతో

నిర్వర్తింపగల్గుచున్నారము. ఆసమయమున, 'ఇదియే నే నింతకాలమునుండి యు వాంఛించుచు వెదకుచున్న మతము, భగవద్భావము, తత్త్వము'— అని నాభర్త వచించెను. అద్భుతమగు వివేకానందుని మానసరత్నాకరము నుండి తాత్త్వికరత్నములను ఆత్మబలదాయకభావశక్తికములను సంగ్రహించు తలంపున ననంతర మాతడు స్వామి యొసగు సనాతనధర్మబోధోపన్యాసములను వినుటకై నెలలకొలది నాతో వచ్చుచుండెడివాడు...."

హార్వర్డువిశ్వవిద్యాలయమందలి తత్త్వజ్ఞానసంఘమువారు స్వామి నాహ్వానించిరి. అచట స్వామి యొసగిన 'వేదాంతతత్త్వ'మను మహోపన్యాసమును గూర్చి పూజ్యుడును క్రైస్తవమతాచార్యుడు నగు ఎవరెట్ (C. C. Everet, D. D., L. L. D.) పండితు డిట్లు వ్రాసియున్నాడు: "...వివేకానందుడును వివేకానందోద్యమమును అఖండముగా మనల నాకర్షించెను. నిజముగా హైందవవిజ్ఞానమును మించిన మనోహరమగు విజ్ఞానము మఱియొకటి లేదు.... పరమార్థమగు నేకత్వమును విడిచి సదా మన పాశ్చాత్యతత్త్వజ్ఞులు ద్వైత ప్రపంచవిచారనిమగ్నులై యుందురు. జగత్తున కాధారభూతమగు నేకత్వమునుగూర్చి ప్రాచ్యులే మనకు బోధింపదగినవారు. ఇట్టియుత్కృష్టతత్త్వము నత్యద్భుతముగా మనకు బోధించిన వివేకానందున కెంతయు కృతజ్ఞులము."

స్వామి యీసమయమున నొకరి కిట్లు వ్రాసెను:

"గ్రహింప దుస్తరమగు నద్వైతము కళాసంశోభితమై దైనందిన జీవితమున సజీవమై యొప్పవలయును; దుర్భేద్యమైన పురాణములనుండి సుబోధమగు నైతికసూత్రములు వెలువడవలయును; భీతిగొలుపు యోగతత్త్వముల నుండి అత్యంతశాస్త్రీయమును ఆచరణయోగ్యమునగు మానసికశాస్త్రము బయల్వెడలవలయును—ఇదంతయు పసిబాలునకునైతము అవగాహనమగు భాషాస్వరూపము నొందవలయును. ఇదియే నాజీవితోద్యమము...."

స్వామిరాజయోగ భక్తియోగాది మహోపన్యాసగ్రంథములు వెలువడి అమెరికాదేశము నాక్రమించెను. హార్వర్డు, కొలంబియా విశ్వవిద్యాలయములవంటి సుప్రసిద్ధపాశ్చాత్యవిశ్వవిద్యాలయములు స్వామిని తమకళా

కాలములో ప్రాచ్యవిద్యాపీఠము నధిష్ఠింప నాహ్వానింపసాగెను. క్రైస్తవప్రచారకులలో దురభిమానపూరితులు మాత్రము స్వామినిగూర్చి దుష్ప్రచారములు చేయుచునేయుండిరి. కాని, యెంతధూళి రేగినను సూర్యకాంతిని నిరోధింప జాలదుకదా!

స్వామితో నొకరు, "క్రైస్తవమతసంస్థ ప్రపంచము నుద్ధరించుటకై యవతరించినది" అని పలుకగా స్వామి, "ప్రపంచోద్ధరణమే క్రైస్తవమత సంస్థ చేయుచున్న ఘనకార్యమైనయెడల, అబిసీనియాదేశమును ఎందుచే రక్షించినదికాదు?" అని ప్రశ్నించెను. స్వామి విశాలదృష్టి యెట్టిదో గనుడు!

స్వామియుదారభావములనుగూర్చి 'హార్టుఫర్డు దినపత్రిక' యిట్లు ప్రకటించెను: "క్రైస్తవబ్రువు లనేకుల యుపన్యాసములకంటె స్వామియుపన్యాసములు విశేషముగా క్రీస్తుమహాశయునిబోధనల కనుగుణముగా నున్నవి. స్వామి హృదయము సమస్తమతములకును సంఘములకును తా వొసగునట్టి విశాలహృదయము. . . ."

ఈసమయమున స్వామి తమ కొసగిన **భారతనారీమణుల యాదర్శములు** అనుమహోపన్యాసము వించి (బోస్టనులోని) కేంబ్రిజి పురవాసినులు భారతదేశములోనున్న స్వామి మాతయగు శ్రీభువనేశ్వరీదేవి కిట్లు వ్రాసిరి:

**"శ్రీమద్వివేకానందస్వామి మాతృదేవీ సన్నిధికి.**

"అమ్మా,

"మేరీమాత తనపుత్రుని లోకమున కొసగిన దివ్యానందదాయకమగు నీ 'క్రిస్మస్' మహోత్సవసమయము స్మరణీయముగదా. తావకీయ పుత్రరత్న సాన్నిధ్యము మాకు లభింపజేసిన నీకిదే మా ప్రణతులు. ఆబాలగోపాలమునకు మా కాత డొనర్చుచున్న మహోదారసేవలను 'భారత నారీమణుల యాదర్శములు' అను మొన్నటి యీ యుపన్యాసమున నీచరణకమలముల కర్పించెను.

అతని మాతృభక్తి శ్రోతల కెల్లరకును దివ్యావేశజనకమై, ఆత్మోద్ధారకమై విల సిల్లెను.

"తల్లీ! నీయనుంగుసుతునిమూలమున నీవు సాగించుచున్న మహోద్యమమును నీదివ్యజీవితము నెంచి మేమర్పించు కృతజ్ఞతాభివందనములను గైకొను మని వేడుచున్నారము...."

స్వామి మూర్తిమత్త్వమును అతని యుద్యమమును అమెరికాప్రజ నద్భుతరీతిని స్వవశము గావించుకొనెను. శిష్యు లాతనిప్రతిభను గుర్తించిన విధానమునకు గొన్ని నిదర్శనములు: ఒకరిట్లు వ్రాసిరి:

"స్వామితో నూరక నడచిన జాలును. అతని కేవలహాస్యసంభాషణ ములవలన నకస్మాత్తుగా మనహృదయములలో మహోన్నతభావతరంగములు పొంగిపొరలును."

మఱియొక రిట్లు వ్రాసిరి:

"అతని దివ్యసుందరవిగ్రహము సర్వజనుల నత్యద్భుతరీతి నాకర్షించును. అట్లయ్యును, అతడు దేహాభిమానశూన్యుడనియుం ఆత్మస్వరూపుడనియుం నాతని జూచువారికి బోధకట్టును."

వేఱొక రిట్లు వక్కాణించిరి:

"స్వామిసాన్నిధ్యప్రభావమును వర్ణింప నాతరముకాదు. ఒరుల దృష్టిని దనవైపునకు ద్రిప్పుకొనగల్గిన సమర్థు డాతడు. నామాట లసంబద్ధము లని భావింపకుందురు గాక. అతనిధీరగంభీరవాక్యములను విని నిజముగా సొమ్మసిలినవారు గలరు. అతిసూక్ష్మములగు నాతనియుక్తులును భావములును శ్రోతలను దిగ్భ్రాంతుల నొనర్చెను. స్వామితో వాదించుటచే గలిగిన నాడీకంపముచే మూడుదినములు మంచముపట్టిన వ్యక్తి నొకని నే నెఱుగుదును. స్వామి మూర్తి మహోన్నతమై, భక్తిపూర్వకభయావహమై యొప్పెను. తలచినచో నాత డెంతటివానినైనను నిజముగా నిర్మూలముచేయగల సమర్థుడు."

"అఖండశక్తిమంతుడయ్యును స్వామి నవనీతకోమలహృదయుడు. బాలుని బోలు నమాయకుడయ్యును మహాప్రవక్త."

స్వామినిగూర్చిన యిట్టి ప్రశంసలనన్నిటిని వ్రాసినచో ప్రత్యేక మొక గ్రంథమగును.

స్వామియుద్యమము అమెరికాదేశమున అఖండవిజయము గాంచెను. న్యూయార్కుమహాపట్టణమున స్వామి యొక వేదాంతసంఘమును నెలకొల్పెను. వేదాంతబోధనము, వేదాంతానుష్ఠానము, సర్వమతసమరసభావము—ఇవియే తదీయసంఘాశయములు. ఈసంఘసభ్యులు 'వేదాంతు' లనబరగుచుండిరి. ఫ్రాన్సిస్ లెగెట్ అనుమహనీయుని స్వామి యీసంఘమున కధ్యక్షునిగా నియమించెను.

ఏప్రిల్ 1896-వ సంవత్సరమున స్వామి మఱల న్యూయార్కు నుండి లండన్ పట్టణమునకు బయలుదేఱెను. అంతకు ముందుగనే (స్వామి) తాను వ్రాసిన లేఖల ననుసరించి శారదానందు డచటికి వచ్చి తన్ను గలిసికొన ఆశ్చర్యానంద భరితుడయ్యెను. స్వామి మాతృదేశమును విడిచిన తరువాత సోదరశిష్యుని గలిసికొనుట కిదియే ప్రథమము. మిస్ ముల్లర్, ఇ. టి. స్టర్డీలు గురుభక్తితో స్వాముల కాతిథ్యమొసగిరి.

అచిరకాలముననే స్వామి యోగజ్ఞానములనుగూర్చి బోధోపన్యాసము లారంభించెను. లండన్ పౌరులకు స్వామి వేదాంతవచనములం దభిరుచి జనింప, వేలకొలదిజనులు శ్రద్ధతో వినసాగిరి. అనేకసంస్థలు స్వామి నాహ్వానింప సాగెను. ఒకచోట, ప్రఖ్యాతతత్త్వజ్ఞుడగు నొకముసలిదొర స్వామి యుపన్యాసానంతరము లేచి, "మీయుపన్యాసమంతయు అద్భుతముగానున్నది. అందులకు నా మనఃపూర్వకాభినందనము. కాని మీరు చెప్పినదానిలో క్రొత్త విషయమేమియు నాకు గనబడుటలేదు" అని పలికెను. వెంటనే స్వామి యిట్లు పలికెను: "మహాశయా! నిజము. నేను మీకు తత్త్వమునుగూర్చి తెలిపితిని. ఈసృష్టియు సృష్టికర్తయు మానవకోటియు అనాదిసిద్ధమగు ఈపర్వతములును ఎంత పురాతనములో తత్త్వము కూడ నంత పురాతనమైనదే. తత్త్వమునుగూర్చి పర్యాలోచించి తదనుగుణముగా ఆచరించునట్లు మీకు

బోధింపగల్గితినేని నామాటలు నిరుపయోగములు కావు గదా!" "వినుడు, వినుడు" అనుశబ్దము నతిశయించిన కరతాళధ్వనులు మిన్ను ముట్టెను. సభ్యులందఱును స్వామివాక్యములకు వశ్యులైరి. మఱల స్వామి యిట్లు బోధించెను: "నాహృదయాంతర్జ్యోతియై వెలుంగుచుండుటచేతనే తత్త్వమును గనుగొంటిని. ఈమతమునందో, ఆమతమునందో తత్త్వము కానవచ్చునని భ్రమింపకుడు. తత్త్వము మీయందే కలదు. 'తత్త్వమసి' యను నుపనిషద్వాక్యమును వినుడు."

ఈసమయమున మాక్సుమ్యులరుపండితుడు స్వామి నాహ్వానించెను. స్మరణీయమగు ఆసమావేశమునుగూర్చి స్వామి యిట్లు వ్రాసియున్నాడు :

"...మాక్సుమ్యుల రెంతటిమహనీయుడో కదా! నే నాతనిదర్శనము నకై వెడలితిని. ఆతనికి నాయభివందనముల నర్పింప వెడలితినను టెంతయుం సమంజసము. ఏలన, శ్రీరామకృష్ణుని బ్రేమించువార లేదేశీయులైనను, ఏమతస్థులైనను, ఏసంప్రదాయమునకు జెందినను, వారిని దర్శించుట నాకు తీర్థయాత్ర....'రామకృష్ణుని నేడు వేలకొలదిజను లారాధించుచున్నారు' అని నేను పలుక నాతడు, 'ఆతని గానిచో మఱియెవ్వరి నారాధింపదగును?' అని వచించెను....అఖండకృషి సల్పి, వేదశాస్త్రములయెడ పాశ్చాత్యుల కాతడు గల్గించుచున్నగౌరవభావము, దివ్యతేజోదీపితమగు ఆవృద్ధుని ప్రశాంతవదనము, ఉదారహృదయయగు నాతని సహధర్మచారిణి, ప్రకృతిరమ్యవనప్రదేశమున ననంతశాంతినిలయమగు నాతని కుటీరము—ఇవన్నియుం బ్రహ్మర్షి రాజర్షులతో, వానప్రస్థులతో, అరుంధతీవసిష్ఠులతో, మహోన్నతమై మించిన సనాతన భారతవర్షమును తలపునకు దెచ్చెను....భారతదేశముపై నాతని కెంతప్రేమయో! నామాతృదేశమునం దాతనిప్రేమలో శతాంశమున్నచో ధన్యుడను....'భారతదేశమునకు మీ రెప్పు డరుదెంచెదరు? వేదవేదాంతములను యథారూపమున బ్రదర్శించి భారతదేశమునకు మహోపకారముసల్పిన మీకు ప్రతి భారతీయుండును మనఃపూర్వకముగా స్వాగతమొసగును' అని నేనంటిని. అంత నామహర్షి వదనము దేదీప్యమానమై యానందాశ్రువులు రాలుచుండ, శిరఃకంపన మొనర్చుచు గద్గదస్వరమున నిట్లు వచించెను:

'నేను భారతదేశమునకు వచ్చినచో మఱల నిచటికి రాజాలను; అచటనే మీరు నాకంత్యక్రియలు జరుపవలసివచ్చును....."

స్వామికిని మాక్సుమ్యులరుమహాశయునకును బెంపొందిన మైత్రి వర్ణనాతీతము. స్వామి యొసగిన సాయముచే మాక్సుమ్యులరుపండితుడు వ్రాసిన శ్రీ రామకృష్ణజీవితము సవిమర్శమయ్యును భక్తిరసభరితమై యలరారుచున్నది.

లండన్‌నగరమున స్వామిప్రభావమునుగూర్చి 'క్రస్ట్రీ ఫహౌస్' అను పత్రిక యిట్లు ప్రకటించెను :

"లండన్‌మహాపట్టణమున ప్రపంచములోని సమస్తజాతిజనులు అన్ని తరగతులవ్యక్తులు గలరు. కాని ప్రస్తుత మిచట వేదాంతబోధోపన్యాసము లొసగుచు సర్వజనాకర్షణీయుడై వెల్గొందుచున్న మహనీయునకు వివేకానందున కెవ్వరును సాటిరారు." (క్లుప్తము.)

లండన్‌నగరమున స్వామియుద్యమ మీవిధముగా జయప్రదమగుటయే కాక, స్వామి కిచట నల్వురు మహనీయులు శిష్యులైరి. వారలే గుడ్విన్ సోదరినివేదితా సెవియరుదంపతులు. వీరందఱును ఆత్మార్పణ మొనర్చి, భారతదేశ మరుదెంచి యఖండసేవ సల్పిన ధీరులు. స్వామి వీరినిగూర్చి ఐరోపాఖండములో దన వేదాంతోద్యమవనమున లభించిన దివ్యకుసుమములుగా నెంచెను.

స్వామి తీవ్రకార్యభారముచే శ్రమచెందియుండుటజూచి శిష్యులాతని బశ్చిమదేశపర్యటన మొనర్ప నాహ్వానించిరి. స్వామి వెంటనే యంగీకరించెను. ముల్లరుకన్యయు సెవియరు దంపతులును స్వామి ననుగమించిరి. స్వామి వీరితో ప్యారిమీదుగా జినీవా కేగి, యచట విమాన (Balloon) యాత్ర సల్పి, యటనుండి ఆల్ప్సుమహాపర్వతమందలి మంచుకొండల నెక్కి, స్విట్జర్లాండ్‌లోని ప్రకృతిసౌందర్యమును దిలకించి మహానందభరితుడై యాత్ర సాగించుచుండెను. ఇట్లుండ జర్మనీలో కీల్ విశ్వవిద్యాలయమున తత్త్వశాస్త్ర పండితుడగు దేవసేన (Deussen) మహాశయుండు * స్వామిని దనగృహమున

* డాయిసన్ (Deussen) ఇట్లు పిలువబడ నామోదించువాడని స్వామి వ్రాసియున్నాడు.

కాహ్వానించుచు లేఖ వ్రాసెను. శిష్యసమేతుడై స్వామి కీల్ పట్టణమున కేగి పండితుని దర్శించెను. పశ్చిమఖండమున వేదాంతవిజ్ఞానమును వ్యాప్తిచేయ నఖండకృషిసల్పిన డోయిసన్ మాక్సుమ్యూలరుల నొండొరులతో బోల్చుచు స్వామి యిట్లు ప్రశంసించెను :

"...అమెరికా ఇంగ్లాండ్ దేశములందలి సంస్కృతపండితుల ననేకులను జూచియున్నాను....వారలధీచాతుర్యమును స్వార్థరహితసేవలును ప్రశంసనీయము లనుటకు సందియము లేదు. కాని, భారతదేశమునకు, భారతీయవిజ్ఞానమునకు, పశ్చిమఖండమున నిజమైనమిత్రులున్నచో, వారు డోయిసన్ మాక్సుమ్యూలరులే యని నానిశ్చితాభిప్రాయము....మాక్సుమ్యూలరు వేదాంతోద్యమమునకు వృద్ధనాయకుడైనచో దేవసేనుడు తదంగరక్షకయువకబృందమున నగ్రగణ్యుడు. వేదవేదాంతరత్నాకరమునందలి యమూల్యరత్నములను మాక్సుమ్యూలరు తననిరుపమానశబ్దశాస్త్రప్రావీణ్యముచే లోకమునకు బ్రదర్శించి పాశ్చాత్యులదృష్టి నరికట్టియున్నాడు. కాని డోయిసన్ వాఙ్మయపరిశోధనల నొకప్రక్క నుంచి, ధైర్యసాహసములతో నుపనిషద్రహస్యములను విమర్శించి, తృప్తినొంది, వేదాంతమే మానవునకు శాంతి నొసగగలదని లోకమునకు బాహాటముగా జాటియున్నాడు....ప్రస్తుత మిట్టి భారతదేశబాంధవులతోడ్పాటు మన కత్యావశ్యకమైయున్నది...."

దేవసేనునిగృహమున నాతిథ్యమును గొని, స్వామి మిత్రులతో మఱల ఇంగ్లాండునకు బయనమయ్యెను. స్వామిని విడువజాలక దేవసేనుడు స్వామి ననుగమించెను.

తనయుద్యమమునకు దోహద మొసగుటకై స్వామి నూతనోత్సాహముతో మఱల లండన్‌నగరమున బ్రవేశించెను. అమెరికాలో స్వామి తాను నాటిన వేదాంతవనమును వృద్ధిచేయుటకై శారదానందుని బంపి, లండన్ పౌరులకు జ్ఞానయోగమునుగూర్చి బోధోపన్యాసము లారంభించెను. పాశ్చాత్య పండితులనేకాక, ప్రాచ్యసనాతనతత్త్వవేత్తలను సహితము కలవరపఱిచిన మాయాసిద్ధాంతము స్వామియుపన్యాసముఖ్యవిషయము. మాయాతత్త్వమును

గూర్చి స్వామి స్పష్టీకరించినరీతి నింతవఱ కేతత్త్వవేత్తయు స్పష్టీకరించినది లేదని చెప్పవచ్చును. జీవబ్రహ్మైక్యము, ఆత్మస్వాతంత్ర్యము మున్నగుక్లిష్టమగు నద్వైతతత్త్వములపై స్వామి తనదివ్యానుభవసహజవాక్చాతురీతేజమును బఱపి, విస్పష్టమొనర్చి, సభ్యుల నద్వైతానందసాగరోత్తుంగతరంగముల నోల లాడించెను.

ఆంగ్లదేశమున స్వామియుద్యమ మిట్లు విశేషవ్యాప్తిగాంచుచుండ, శారదానందుని కార్యనిర్వహణనైపుణిచే అమెరికాఖండమున వేదాంతోద్యమము సాఫల్యము జెందుచుండెను. హెలెన్ హంటింగ్టన్ అనునామె యిట్లు వ్రాసియున్నది : "...స్వామిసందేశప్రభావ మిచట సూర్యప్రభాసమానమై ప్రజ్వలించుచున్నది. ఒకప్రాచ్యు డిట్టివిదేశము (అమెరికా)లో, చిరకాలానుగతమగువిద్యచే, భావములచే, ఆచారవ్యవహారములచే, హైందవవిజ్ఞానభిన్నాభిప్రాయపూరితులమగుమా పాశ్చాత్యుల కిట్టియఖండవేదాంతాభిమానము పుట్టింపగల్గునని మే మెవ్వరము కలనైనను తలచియెఱుగము. స్వామియుద్యమమున మాకు జనించిన యభిరుచి, అభినివేశము, తాటినూకుమంటవంటి తాత్కాలికావేశము కాదని విన్నవించుదానను. స్వామియనుచరు లందఱును వారివారికి లభించునవకాశములనుబట్టి మనఃపూర్వకముగా వేదాంతతత్త్వమును వ్యాప్తి చేయ యత్నించుచున్నారు....'పాపులకే కాక పునీతులకును శ్రీరామకృష్ణ జీవితము పరప్రసాదము' అని స్వామి తనగురుదేవునిగూర్చి వచించిన చందమున స్వామిసాన్నిధ్యమును మాకు పరప్రసాదమై యొప్పెను...."

స్వామి తనయుద్యమము అమెరికాలోను ఇంగ్లాండులోను నిర్విఘ్నముగా కొనసాగుననిగ్రహించి, మాతృదేశమునకు మఱల నిశ్చయించుకొనెను. మాతృదేశపునరుద్ధరణయత్న మొనర్చుటయే యిక స్వామిపరమసంకల్పము. స్వామి భారతదేశమునకు మఱలునని విని, ఇ. టి. స్టర్డీ మహాశయునియధ్యక్షత క్రింద లండన్ పౌరులు స్వామిగౌరవార్థము మహాసభ జరిపిరి. ఆసభనుగూర్చి హేమన్డు అనునత డిట్లు వ్రాసియున్నాడు :

"నా డాదివారము. వర్తకశాల లన్నియు మూయబడినవి. వ్యాపార మంతయు గట్టువడినది. విశేషవాణిజ్యఘోషతో నిండియుండు లండన్పురవీథు లన్నియు చాలవఱకు నిశ్శబ్దముగా నుండెను. వీడ్కోలు ఏర్పాటు చేయబడిన సభామందిరము వివిధపుష్పమాలలతోడను చిత్రపటములతోడను దివ్యాలంకృతమై శోభిల్లుచుండెను. లండన్పౌరు లాబాలగోపాలము సభకు విచ్చేసిరి. అందఱకును ఒక్కటే కోర్కె. స్వామినిసందర్శించి, యాతనివాక్యసుధను గ్రోలి, మఱియొకసారి స్వామి కాషాయవస్త్రములను కన్నుల కద్దుకొనవలయునని వారి యభిలాష."

"నిర్దిష్టసమయములలో సభావేదికపై గాయకులు మధురగానముల నాలపించిరి. వక్తలగుపురుషులును స్త్రీలును స్వామియెడ తమకు జనించిన ప్రేమ తాత్పర్యముల నుపన్యాసరూపమున వెల్లడించిరి. సభ్యుల కరతాళధ్వనులు మిన్నుముట్టెను. కొందఱు వియోగవిచారముచే నిశ్చేష్టులై యుండిరి. కొందఱ నేత్రము లశ్రుపూరితములైనవి. సభాముఖమున గాంభీర్యము మూర్తీభవించెను. దివ్యకాషాయాంబరధారియు చంద్రప్రభాభాసమానుడు నగు స్వామిజీ యాసమయమున తనచూడ్కులనెడి ప్రశాంతికిరణములను సభ్యసాగరముపై బఱపెను...."

లండన్పౌరు లర్పించిన యభినందనపత్రిక నందుకొని స్వామి దివ్య ప్రేమభరితమగు సమాధానము నొసగెను.

లండన్నగరమున స్వామి వేదాంతోద్యమవిజయమునుగూర్చి సోదరి నివేదిత యిట్లు వ్రాసెను: "పడచెందినవానికి నిర్మలోదకమువలె, భక్తునకు పరమేశ్వరసందర్శనమువోలె, మాలో ననేకులకు స్వామివచనము లఖండశాంతి నొనగూర్చినవి....జనసామాన్యము నమ్మునట్టి క్రైస్తవమతసిద్ధాంతము లనుబురద నీటిని వడియగట్టుటకై వేదాంతమను నిండుపగింజ నేడు మాకు లభించినది.... అంధకారమున బడి యల్లాడుచుండిన మాకు వేదాంతజ్యోతి మార్గదర్శకమై దీపించుచున్నది."

స్వామివిజయమునుగూర్చి సుప్రసిద్ధుడగు బిపిన్ (విపిన) చంద్రపాలు మహాశయు డిట్లు వ్రాసియున్నాడు :

"ఆంగ్లదేశములో వివేకానందు డొసగిన యుపన్యాసములవలన విశేషమగు మే లేమియుం గలుగలేదనియు నాతని మిత్రులును శిష్యులును గోరంతలు కొండంతలు చేసి ప్రశ్నించుచున్నారనియుం గొందఱు భారతీయులు తలచుచున్నారు. కాని నేనిచటికి వచ్చిచూడగా అతని ప్రభావము దేశమందంతటను వ్యాపించినదని కనుగొంటిని. నేను వివేకానందునిసంప్రదాయమునకు జెందకున్నను, అతనియభిప్రాయము లన్నిటితో నేకీభవింపకున్నను, వివేకానందు డిచటియాంగ్లేయులలో అధికసంఖ్యాకుల దృక్పథమును మార్చి వారి హృదయములకు ఔదార్యము కల్గించెనని చెప్పకతప్పదు. వివేకానందుని బోధలచే నిచటివా రనేకులు వేదశాస్త్రములలో ఉత్కృష్టతత్త్వము లిమిడియున్నవని దృఢముగా నమ్ముచున్నారు. ఇంతియే కాక ఆంగ్లభారతదేశములమధ్య నభేద్యమగు సంబంధము నాతడు కల్పించియున్నాడు....వివేకానందతత్త్వవ్యాప్తిచే వందలకొలదిజనులు క్రైస్తవమతమును విడనాడివైచిరి. వివేకానందుని యుద్యమ మెంతవిశేషముగా, మూలమూలల, వ్యాపించియున్నదో గ్రహించుట కీక్రిందినిదర్శనము చాలును :

"నే నిచట (లండన్ పట్టణమున) నొకమిత్రుని గలిసికొనుటకై వెడలుచు, త్రోవ తప్పి యొకవీథిమూల నిలుచుంటిని. అంతలో నొక స్త్రీ యొక బాలుడు తన్ను వెంబడించుచుండ నాకు మార్గమును గనబఱచి, 'తమరు లండనునకు వచ్చుచున్నారని వార్తాపత్రికలమూలమున వినియున్నాను: తమ దివ్యవిగ్రహమును జూచినంతనే, 'అదిగో చూడు! ఆయనయే వివేకానంద స్వామి' అని మాపిల్లవానికి జెప్పుచుంటిని' అని యామె పలికెను. తొందరగా వెళ్లవలసియుండుటచే 'నేను వివేకానందుడను కాను' అని చెప్పుట కవకాశము లేకపోయినది. కాని యాతల్లి తాను స్వయముగా వివేకానందు నెన్నడు జూడకున్నను, అతనియం దంతటిగౌరవభావము కలిగియుండుట జూడ నిజముగా నా కాశ్చర్యమైనది. కాషాయవస్త్రముతో నిర్మింపబడిన నాతలపాగ నా కట్టియఖండగౌరవము కల్గించినందులకు తలపాగ నభినందించుకొనుచు అపరిమితానందభరితుడనైతిని. మఱియుం భారతదేశమునెడ విశేషగౌరవభావము జూపుచు, భారతీయుల వేదవేదాంతతత్త్వము లనినంతనే అత్యంతమగునాత్రముతో జెవియొగ్గి విను విద్యాధికుల ననేకుల జూచితిని."

"లండన్ నగరమున నాయుద్యమ మద్భుతవిజయము గాంచినది" అని స్వామియే వ్రాసియున్నాడు.

ఈసమయమున స్వామియఖండధైర్యసాహసములను బ్రకటించు నొక విషయము నిచట తెలుపవలసియున్నది. ఒకసారి మిస్ ముల్లర్‌తోడను మఱి యొక ఆంగ్లేయ మిత్రునితోడను స్వామి యొకపొలములో నడచుచుండెను. అంత నొకపిచ్చియెద్దు అంకెలువైచుచు వారిని తరుముకొని వచ్చుచుండెను. ఆంగ్లమిత్రుడు లేనిపోని ప్రతిష్ఠకు బోక పిక్కబలము చూపి, సురక్షితస్థానము జేరుకొనెను. ముల్లరుకన్య కొంతదూరము పరుగెత్తి, యలసటచే నిక పరుగెత్త లేక చదికిలపడియెను. ఆమెకు సాయముచేయుమార్గము కన్పట్టక స్వామి, 'ఇదియా, పర్యవసానము!' అని యామెముందునకు దుమికి, దండలుకట్టుకొని పుంగవము నెదిర్చి నిల్చెను. పుంగవము పురుషపుంగవమగు స్వామి ధైర్యసాహసములను జూచి పాఱిపోయెను.

ఆర్తరక్షణార్థమై స్వామి మృత్యువు నెదిర్చి నిల్చిన మహావీరుడు! అతి బాల్యముననే స్వామి యిట్లనేకులను రక్షించియున్నాడు.

స్వామి లండన్ నగరమును వీడి భారతదేశమునకు బయనమయ్యెను. సెవియరుదంపతులు సమస్తము త్యజించి స్వామి ననుగమించిరి. ఇప్పట్టున స్వామి నొక యాంగ్లమిత్రు డిట్లు ప్రశ్నించియుండెను: "స్వామిజీ! అఖండ భోగైశ్వర్యశక్తిసముపేతమగు పశ్చిమఖండమున నాలుగేండ్లు నివసించిన వెనుక మీదేశమునుగూర్చి యేమని తలచెదరు?" స్వామి యిట్లు బదులు చెప్పెను: "నే నిచటికి వచ్చుటకుముందు మాదేశమును ఊరక ప్రేమించితిని. **ఇప్పుడో, భారతదేశపుధూళి నాకు పరమపవిత్రము: భారత దేశపుగాలి నాకు మహాభాగ్యము: భారతదేశ మిపుడు నాకు పావనతమపుణ్యక్షేత్రము."** స్వామిప్రయాణమున జరిగిన యొకటి రెండు ముఖ్యసంఘటనముల నిచట తెలుపవలసియున్నది. స్వామితో బయనించుచుండిన యిరువురు క్రైస్తవప్రచారకులు అతనితో సంభాషణ

లోనికి దిగి సనాతనధర్మమును హిందువులను దూషింపనారంభించిరి. వినగల్గి నంతసేపు విని, మెల్లగా లేచి, వానిలో నొకని మెడపట్టిక చేతబట్టి, స్వామి, "మామతము నిక దూషించితివా, నిన్నీసముద్రములో ద్రోసివేసెదను" అని బెదరించెను. అంత నా క్రైస్తవమతాచార్యుడు గడగడలాడుచు, "రక్షింపు" డని స్వామిని క్షమాపణవేడుకొనెను. అంతటినుండియు స్వామియెడ నాతడు విశేషభక్తిమర్యాదలు చూపనారంభించెను. ఇవ్విషయమునే స్వామి మానస మున నిడుకొని, కలకత్తాలో నొకశిష్యునితో నిట్లు పల్కియున్నాడు: "సింహా! మీ యమ్మగారి నెవ్వడైన దూషించిన నేమి చేయుదువు?" "వానిపై నుఱికి బుద్ధి చెప్పెదను." అని శిష్యుడు బదులుచెప్పెను. "బాగుగా జెప్పితివి. నిజముగా మనదేశమాతయగు మనమతమందుగూడ నీ కట్టి యభిమాన మున్నపక్షమున నొక్కహిందూసోదరుడైనను క్రైస్తవమతస్థుడుగా మార్చ బడుట చూచి నీవూరకుండగలవా? కాని, దినదినము ఈపని జరుగుచున్నను నీకు చీమ కుట్టినట్లైనను లేదే! నాయనా! నీకు మతభక్తి యెక్కడిది? ఎక్క డిది నీకు దేశభక్తి? నీకట్టెదుట క్రైస్తవప్రచారకులు హిందూమతమును దూషింపని దినమున్నదా! ఇట్టి ఘోరకలి జరుగుచుండగా స్వమతరక్షణార్థము నిలువబడు దేశభక్తులు మీలో నెంద ఱున్నారు? ఈయవమానముచే నెంద ఱకు రోషావేశము గలుగుచున్నది?"

కొలదిదినములకు పూర్వము స్వామి తనభారతదేశాగమనమునుగూర్చి శిష్యులకు వ్రాసియుండెను. ఆవార్త దేశమం దంతటను వ్యాపించెను. భార తీయు లందఱును మహోత్సాహపూరితులై స్వామిని గారవింప నుద్యమించిరి. వివిధరాష్ట్రములలో స్వామి నాహ్వానించుటకై ప్రజాస్వాగత సంఘముల నేర్పఱిచి యఖండప్రయత్నములు సల్పుచుండిరి. స్వామి సోదరశిష్యు లిరు వురు తమసోదరాగ్రగణ్యుని సందర్శింప చెన్నపట్టణమునకును సింహళము (Ceylon) నకును వెడలియుండిరి. శిష్యు లనేకులు వివిధరాష్ట్రములలో స్వామి రాకకై నిరీక్షించుచుండిరి. కాని, స్వామి యీసంగతి నెఱుంగడు.

మాతృదేశోద్ధరణచింతానిమగ్నుడై యుండెను ఆమహనీయుడు. కొలదికాలము నకు పూర్వము పశ్చిమదేశమున స్వామి తనశిష్యులతో నిట్లు పల్కియుండెను : "భారతీయులు నావచనములను వినితీరవలయును. భారతదేశము నుజ్జ్వాత లూగించివై చెదను ! నూతనచైతన్యముచే భారతజాతికి గగుర్పాటు గల్గింతును ! ఉండుడు. భారతీయులు న న్నెట్లాదరింతురో, నామాటలను తలదాల్తురో, చూచెదరుగాక ! జీవితము ధారపోసి నే నిచట వెదజల్లిన సందేశముయొక్క విలువను భారతదేశమే, భారతజననిమాత్రమే, గ్రహింపగలదు. విజయోత్సాహముతో, భారతమాత న న్నాదరించును." దివ్యావేశపూరితుడై స్వామి పల్కిన వాక్యము లెట్లు ఫలించెనో వెల్లడికాగలదు.

## ఇరువదియొనిమిదవ ప్రకరణము

# విజయయాత్ర

నవీనభారతదేశచరిత్రమున వివేకానందుని స్వదేశాగమన మొకమహాసంఘటనము; హిందూమతచరిత్రమున నూతనశకారంభము; సనాతనధర్మపునః ప్రతిష్ఠాపనమున కారంభోత్సవము; భారతీయులలో నూతనోత్సాహము, నూతనోత్తేజము పొడసూపనారంభించిన సుముహూర్తము. ప్రపంచమతమహాసభావేదికపై స్వామి సనాతనధర్మవిజయధ్వజస్థాపన మొనర్చెనని, వేదాంత సందేశముచే పాశ్చాత్యలోకమును జయించెనని, వినిననాటినుండియు భారతీయులు స్వామిరాకకై స్వాతివర్షమునకు ముత్తెపుజిప్పలవలె నిరీక్షించుచుండిరి.

స్వామి యెక్కినయోడ సింహళము జేరుసరికి తీరమున వేలకొలది జనులు స్వామికై యెదురుచూచుచుండిరి. స్వామి యఖండస్వాగతోత్సవములను బ్రత్యక్షముగా దర్శించినవారి కథనమును విందము. ఒకస్థానికపత్రిక యిట్లు వ్రాసెను :

"కొలంబోనగరహిందూసంఘచరిత్రమున 1897-వ జనవరి 15-వ తేదీ చిరస్మరణీయమగు పుణ్యదినము. అఖండప్రతిభాసమన్వితుడగు వివేకానందుని యాగమనము భారతదేశభాగ్యోదయసూచకము; అపూర్వాధ్యాత్మిక సంచలనహేతువు.... కాషాయాంబరధారియై దేదీప్యమానమగు విశాలనేత్రములతో పరమపావనసంధ్యానమయమున ఆయోగీంద్రు దరుదెంచెను. స్వామి సందర్శనమునకై వేచియున్న జనసమూహముల ప్రేమపూర్వకమహోత్సాహప్రదర్శనములను వర్ణింపనలవికాదు. జయజయధ్వానముల నలిశయించిన కరతాళధ్వనులు సాగరగంభీరఘోషను మ్రింగివైచెను. గౌరవనీయులగు కుమారస్వామిగారు స్వామిని సుగంధకుసుమమాలాలంకృతు నొనర్చిరి. అంత స్వామి సందర్శనమునకై జనసమూహము నదీప్రవాహమువలె చొరుచుకొని వచ్చెను.

ఆవేగము నేమానవశక్తియుం నిరోధింపలేకపోయెను. అంతలో స్వామి నొక దివ్యతురంగశకటము స్వాగతాలంకారశోభితమగు పందిరియొద్దకు గొనిపోయెను. శకటమునుండి స్వామి యచట దిగినంతనే ఛత్రచామరాది సపర్యలతో, దివ్య మంగళవాద్యములతో, ఆహ్వానమునకై ప్రత్యేకముగా నమర్పబడిన పుష్పమంట పమునొద్దకు వేలకొలది జనులు అడుగులకు మడుగులొత్తుచు స్వామిని దోడ్కొనిపోయిరి. మంటపమును బ్రవేశించినంతనే మనోహరమగు నొకకల్పిత సహస్రదళకమలము వికసింప నందుండి యొకపిట్ట ఆవ్వన పైకెగిరెను. స్వామి దివ్యమంగళ విగ్రహావలోకనాతత్పరులై జను లెవ్వరును అచటియపూర్వా లంకారములను లక్షింపరైరి....శిష్యసమేతుడై పుష్పవర్షము గురియుచుండ స్వామి సభావేదికాతలమ్మున దివ్యాసనాసీనుడయ్యెను. గానప్రార్థనాద్యనంతరము కుమారస్వామిగారు లేచి, స్వామిపాదములకు సాష్టాంగప్రణామ మొనర్చి, హిందూసంఘుపక్షమున స్వాగతము దెల్పిరి. అంత స్వామి, గంభీరహర్షధ్వనులం మిన్నుముట్టుచుండ లేచి, తన సహజగంభీరవాగ్ధాటి సభ్యులను తన్మయతనొం దింప, నాడు వా రొసగిన మహాస్వాగతము తనవంటి యొకవ్యక్తికి జేయ బడినగౌరవముగా గాక, సనాతనధర్మోన్నతిని, త్యాగోన్నతిని భారతీయులు గుర్తించిన యద్భుతనిదర్శనముగా పరిగణింతునని తెలుపుచు నిట్లు వచించెను :

" 'బిచ్చమెత్తుకొను సన్న్యాసికి భారతీయులు నేడొసగిన యిట్టి మహా రాజసముచితస్వాగతము వారిపారమార్థికశీలమును బ్రకటించుచున్నది. నేటి మహోత్సాహపూర్వకమగు మీగౌరవమునకు పాత్రుడైనవా డొకసైన్యాధి పతికాడు, రాజ్యతంత్రజ్ఞుడుకాడు, ధనికుడుకాడు, అతడు పేదసన్న్యాసి. ఐనను ఐహికభోగభాగ్యాధిపతులు, మహామహు లాతని గారవింపవచ్చి యున్నారు. పారమార్థికశీలమున కిది ప్రబలనిదర్శనము. పారమార్థికచింత యను పునాదులపై నిర్మింపబడిననేకాని జాతీయజీవన మను సౌధము సుస్థిర ముగా నిలువజాలదు.' "

"పావనభారతవర్షము"నుగూర్చి కొలంబోనగరమున స్వామి వేల కొలదిజనులకు మహోపన్యాసము నొసగెను. అనంతరము పురమందిరమున వేదాంతమునుగూర్చి మనోహరముగా నుపన్యసించెను.

సింహళమున కాండి, జాఫ్నా మున్నగు నగరములలో జనసమూహముల మహాస్వాగతములను బొంది, తనదివ్య సందేశము నొసగి, యటనుండి స్వామి (హిందూదేశమునందలి) పాంబన్ పట్టణమును జేరెను. అచట స్వామిసందర్శనమునకై వేచియుండిన రామనాథరాజగు భాస్కరసేతుపతి స్వామిని గాంచినంతనే సపరివారముగా సాష్టాంగవందన మాచరించెను. పాంబన్‌నగరవాసులు స్వామిని విజయోత్సవముతో నాహ్వానించి స్వాగతము దెల్పిరి. అటనుండి స్వామి నూరేగించుటకై రాజతురంగశకటమున నాసీను నొనర్చిరి. గుఱ్ఱములను విప్పివైచి భాస్కరసేతుపతి స్వామిశకటమును స్వహస్తములతో లాగెను. అనంతరము స్వామి రామేశ్వరాలయమును దర్శించి, యచట గూడిన భక్తబృందమునకు తీర్థోద్దేశ్యమును, ఆరాధనతత్త్వమును దెలుపుచు, విగ్రహములలోమాత్రమేకాక, దరిద్రులలో, దుర్బలులలో, దీనులలో, నున్న శివుని గాంచి యర్చించుటే శివార్చనమని బోధించెను. మఱునాడు రామనాథరాజు వేలకొలదిబీదల కన్నవస్త్రదాన మొనర్చెను. స్వామిమాతృదేశాగమనజ్ఞాపకార్థము రాజు నలుబదియడుగుల యెత్తగు విజయస్తూపమును నిర్మించెను: అందలి శిలాక్షరము లివి:

"సత్యమేవ జయతే.

"రామనాథరాజగు భాస్కరసేతుపతిచే నిర్మింపబడిన యీస్తూపము శ్రీమద్వివేకానందస్వాములవారు విశ్వమానవప్రేమపూరితులై పాశ్చాత్యలోకమున వేదాంతసందేశ మొసగి, యసదృశదిగ్విజయము గాంచి, తమపాశ్చాత్యశిష్యులతో మాతృదేశమునకు తిరిగి వేంచేసి, ప్రప్రథమమున భారతభూమిపై తమదివ్యపాదారవిందముల నిడిన పవిత్రస్థల సూచకము. 27-1-1897."

భాస్కరసేతుపతి తన్ననుగమింప, స్వామి రామనాథనగరమునకు బయనించెను. అచట వేచియున్న వేలకొలది జనులకు స్వామిరాకను దెలుపుటకై ఫిరంగి ప్రేల్పబడెను. ఊరేగింపు సాంతమగువఱకు ఫిరంగులు ప్రేలుచునే యుండెను. అఖండవైభవోపేతుడై స్వామి రాజసభాభవనమును జేరుసరికి

సభ నలంకరించియున్న వేలకొలదిజనులు జయజయధ్వానములు సల్పిరి. భాస్కరసేతుపతి స్వామిని యఖండభక్తిపురస్సరముగా సభ్యుల కెఱింగించి మహోత్సాహముతో స్వామి నభినందించెను. రాజసోదరుడగు దినకర సేతుపతి యొక దివ్యస్వాగతపత్రమును కనకసంపుటమునం దుంచి స్వామి కర్పించెను. అంత స్వామి రామనాథరాజుమతభక్తి నుగ్గడించుచు మహోప న్యాస మొనర్చెను. స్వామి రాజునకు రాజర్షి యను బిరుదము నొసగెను.

అటనుండి స్వామి మధుర, తిరుచినాపల్లి, కుంభకోణము మున్నగు పట్టణములలో అఖండగౌరవమునంది, యెల్లెడలను తనదివ్యసందేశమును వెద జల్లుచు చెన్నపట్టణము జేరెను. స్వామి చెన్నపట్టణము జేరులోపున నొక యద్భుతసంఘటనము జరిగినది. దీనివలన దక్షిణదేశస్థులకు స్వామిపై నెట్టి యఖండప్రేమతాత్పర్యములు తనరియుండెనో వెల్లడి కాగలదు. చెన్నపట్ట ణము జేరుటకు ముందు కొలదిమైళ్లదూరములో నున్న యొకచిన్న స్టేషనున వేలకొలది జనులు "జగద్గురుని" సందర్శించుటకై వేచియుండిరి. కాని యచట బండి యాగదు. కొలదినిముసములు బండి నాపుమని జనులు స్టేషనుమాస్టరును వేడుకొనిరి. కాని యాత డంగీకరింపలేదు. స్వామిసందర్శనైకాయత్తచిత్తు లగు జను లంతట బండి కొలదిదూరములో నుండుట గాంచి, ప్రాణభీతిని స్వామియందలి తమయనంతప్రేమకు బలియొసగి, రైలుబద్దెల కడ్డముగా బండు కొనిరి! ఈసత్యాగ్రహమును జూచి స్టేషనుమాస్టరునకు గుండె దడయెత్తెను! శకటరక్షకుడు బుద్ధిమంతు డగుటచే వెంటనే రైలుబండి నాపివైచెను. స్వామి కొలదినిముసములు వారిముందు నిలిచి, హృదయపూర్వకముగా వారల నభినం దించుచు, దివ్యప్రేమవిలసిత వాక్యములచే నానందింపజేసెను.

స్వామిని సందర్శించుటలో నిక చెన్నపట్టణవాసుల మహోత్సాహము చెప్ప నలవి కాదు. * స్వామిని షికాగోమతమహాసభ కంపిన చెన్నపురిపౌరులు

---

* సుప్రసిద్ధమగు హిందు ఇట్లు ప్రకటించెను :

"శ్రీవివేకానందస్వామికి స్వాగత మొసగుటకై నేడు స్టేషనుయొద్ద

స్వామి నాహ్వానించుటకై నేడు మఱల తమ కవకాశము లభించినదని మురిసి పోవుచుండిరి. "శాంతిసంధాయకా! స్వాగతము!" "ప్రబుద్ధ భారతీయ మనఃపూర్వకాభినందనము!" "నరవరేణ్యా!" స్వాగతము! "జయ! వివేకానందయతీశ్వర!" "జయ! సనాతనమహర్షిగణచరణసేవక!", "స్వస్తి! శ్రీరామకృష్ణ శిష్యాగ్రగణ్యా!" మున్నగు స్వాగతవాక్యములచే విలసితములగు తోరణములతోడను మనోహరములగు నానావిధస్వాగతాలంకారములతోడను పట్టణమంతయు కన్నులపండువుగా నుండెను. స్వాగతసంఘమువారు ఎగ్మూరు స్టేషనును అతివైభవముగా నలంకరించిరి. బండి నిలుచుచోటికి వచ్చువారలకు టిక్కెట్లు పెట్టబడినను నిముసములో ఆస్థలమంతయు జనులతో నిండిపోయెను. పట్టణమందలి సుప్రసిద్ధవ్యక్తు లందఱు నచటికి వచ్చియుండిరి. ఉదయము 7 గంటల 50 నిమిషములకు బండి స్టేషనులో ప్రవేశింపగనే స్వామినిగాంచి, జనులందఱును "జయ! శ్రీ వివేకానందస్వామిజీమహారాజునకు జయ!" "శ్రీరామకృష్ణపరమహంస దేవునకు జయ!" యని యుచ్చైస్స్వరమున జయజయధ్వానములు సల్పిరి. సన్నాయి మనోహరమగు స్వాగతసంకీర్తనములు పాడెను. శిష్యసమేతుడై బయటికి వచ్చినంతనే స్వామిని దివ్యకుసుమమాలాలంకృతు నొనర్చిరి. గంభీరహర్షధ్వనులతో, జయజయధ్వానములతో, ఊరేగింపుటుత్సవము బయలుదేఱెను. ప్రతిగృహమునొద్దను దేవున కిచ్చువిధమున స్వామికి ఫలపుష్పాదినైవేద్యములను హారతులను పౌరు లొసగిరి. ఊరేగింపు సాగిన మార్గమంతయుం పుష్పపత్రతోరణములతోడను స్వాగతపతాకతోరణములతోడను అతి వైభవముగా నలంకరింపబడియుండుట జూడ,

---

గూడిన జనసహస్రముల మహోత్సాహమును భక్తిప్రపత్తులును వర్ణనాతీతములు.... నేటి మన మతాచారములందు పరివర్తనము గలుగవలయు నన్నచో వివేకానందస్వామివంటి మహనీయుంతే నాయకత్వము వహింపవలసి యున్నది...."

హిందూసంఘమునకు స్వామి తనఘనసేవలచే నెట్టియపూర్వభక్తితాత్పర్య విలయమయ్యెనో తెలియుచున్నది. ఉత్సవము కెర్నసుభవనమునకు వచ్చు సరికి కళాశాలావిద్యార్థులు గుఱ్ఱములను విప్పివైచి, స్వామి శకటమును లాగి యానందించిరి.

స్వామి చెన్నగరమున తొమ్మిదిదినము లుండెను. ఆ తొమ్మిదిదినము లును చెన్నపురిపౌరులకు నవరాత్రిమహోత్సవములే. వేలకొలదిజను లుదయా స్తమయము లెఱతెఱపిలేకుండునట్లు స్వామిని సందర్శించుచుండిరి. విద్వ ద్వైదికసభ, సంఘసంస్కారసభ మున్నగు వివిధసంస్థలు స్వామికి అభినందన పత్రికలను సమర్పించెను. సంస్కృతము, తెలుగు, అరవము మున్నగు వివిధ భాషలలో మొత్త మిరువదినాలుగు స్వాగతపత్రములు స్వామి కర్పించిరి. స్వామి విచ్చేసిననాటికి మూడవనాడు విక్టోరియాభవనమున పౌరాభినందన సభ జరుపబడెను: భవనమునందును వెలుపలను జనులు ఇసుక వైచిన రాల కుండునట్లు కిటకిటలాడుచుండుట గని స్వామి భవనమునుండి వెలువడి యొక గుఱ్ఱపుశకటముపై నిలిచి, (స్వామియే వచించిన చందమున) 'గీతాపద్ధతిని' దివ్యోపన్యాసము నొనర్చెను. * చెన్నగరమున స్వామి యొసగిన 'నాయుద్యమ విధానము,' 'భారత భాగ్యోదయము,' 'వేదాంతము: నిత్యజీవనము,' 'భారతర్షి వరేణ్యులు' 'మన మహోద్యమము' అను నుపన్యాసములు వివేకానందవాఙ్మ యమున సుప్రసిద్ధములై యలరారుచున్నవి. స్వామిభావములు భారతజాతీయ తను ప్రాణవంతమొనర్చినవి.

---

* స్వామి చెన్నగరమున నుండగా జరిగిన కొన్ని విశేషములు:

కొందఱు శైవులు అద్వైతవేదాంతము నధిక్షేపింప బ్రయత్నింప వారికి స్వామి తమయుక్తిహీనతను దెలిపి, "అన్నాతురులకు అన్నమిడుట, దుఃఖితుల నోదార్చుట, దీనులకు సాయపడుట, రోగులకు సేవచేయుట— ఇదియే భగవంతుని దెలిసికొనుటకును సేవించుటకును ఉత్తమమార్గము" అని బోధించెను.

భారతదేశమున స్వామిప్రభావ మిట్లు భానుదీప్తితో వెల్గొందుచుండగ, విలియమ్ జేమ్స్, సి. సి. ఎవరెట్ మున్నగు పాశ్చాత్యప్రముఖు లనేకులు తమదేశమున స్వామివేదాంతోద్యమవ్యాప్తి నభినందించుచు, మఱియొకసారి రాగోరుచు స్వామి కాహ్వాన మంపిరి. ఇంగ్లాండు, అమెరికాదేశములలో వేదాంతోద్యమాభివృద్ధినిగూర్చి శిష్యులయొద్దనుండి స్వామికి అభినందనలేఖలు వచ్చుచుండెను. తిలక్ మహాశయుఁడు స్వామి నీసమయమున పూనానగరమున కాహ్వానించెను. అచటికి వెడలుదమనుకొన్నను విశ్రాంతి స్వామికి అత్యావశ్యకమైయుండెను. ఫిబ్రవరి 15-వ తేదీ సోమవారమున స్వామి జన్మస్థానమగు కలకత్తాపట్టణమునకు పొగయోడలో బయనించెను.

---

స్వామి తనతో వాదింపవచ్చిన మఱియొక వైష్ణవపండితు నుద్దేశించి యిట్లు తెల్పెను : "మనస్సును కలవరపఱిచి తుదకు జనులను నాస్తికులను జేయుం నిట్టినిరర్థకవాదములను తుదముట్టింప దోడ్పడుటకే నాయీయవతారమని పండితుడు గ్రహించుగాక."

## ఇరువదితొమ్మిదవ ప్రకరణము

## వంగదేశాగమనము: శ్రీరామకృష్ణసేవాసంఘస్థాపనము

వంగదేశమాత తనపుత్రాగ్రగణ్యు డెప్పు డరుదెంచునా యని మహోత్కంఠతో వేచియుండెను. ప్రజాస్వాగతమునకు ముందుగా స్వామిని గౌరవించుటకై దర్భంగమహారాజునధ్యక్షత క్రింద ప్రభుస్వాగతసంఘ మేర్పడియెను. స్వామి ఖిదిర్‌పురము జేరుసరికి స్వాగతసంఘసభ్యులు వచ్చి స్వామిని ప్రత్యేకపుర్లైలుబండి (Special train)లో కలకత్తాపట్టణమునకు దోడ్కొనిపోయిరి. స్టేషనులో బండి యాగినంతనే స్వామిసందర్శనమునకై ఉదయము నుండియు అచట వేచియుండిన వేలకొలదిజనులు గంభీరహర్ష ధ్వను లొనర్చిరి. స్వామి బయటికి వచ్చి వినయపూర్వకముగా జనులకు నమస్కరించెను. సమీపముననున్నవా రాతనిపాదధూళిని శిరమున దాల్చుటకై ముందున కేగ వెనుకనున్నజను లుచ్చైస్స్వరమున జయజయధ్వానము లొనర్చిరి. 'ఇండియన్ మిర్రర్' పత్రికాధిపతియగు నరేంద్రనాథసేనుడు స్వాగతసంఘనాయకుడై వచ్చి, స్వామిని కుసుమమాలాలంకృతు నొనర్చి, హాయయానమున గూర్చుండ బెట్టెను. పున్నమచంద్రుని మించు స్వామివదనము దక్క శరీరమంతయు కుసుమమాలలచే ఆవృతమైయుండెను. ఆదివ్యసుందరరూపమును దిలకించు జనసమూహమున గల సన్న్యాసులలో స్వామిసోదరశిష్యు లాకర్షణీయులై యుండిరి. వంగదేశీయుల మహోత్సాహమును గాంచి స్వామి పులకితగాత్రుడయ్యెను.

శిష్యసమేతుడై స్వామి వాహనమున గూర్చుండినంతనే కొందఱు వంగయువకులు—విద్యార్థులు—ముందునకు దుమికి, గుఱ్ఱములను విప్పివైచి స్వామివాహనమును లాగసాగిరి. దివ్యమంగళవాద్యములతో, భజనసంఘములతో, జయజయఘోషతో నుత్సవము బయలుదేఱెను. పుష్పపత్రతోరణముల

తోడను స్వాగతవాక్యాలంకృతతోరణములతోడను మనోహరముగా వీథు లలంకరింపబడియుండెను. రిప్పన్‌కళాశాలలో స్వామికి స్వాగత మొసగిరి. స్వామిని సందర్శించి యాతనివాక్యసుధను గ్రోలు తమకముతో, నుత్సాహముతో, జను లనంతముగా నచటికి రాసాగిరి. అందులకై రిప్పన్‌కళాశాలలో కంటె పౌరులకు విశేషమగు నవకాశమును గలుగజేయు తలంపున ప్రజాస్వాగతము తాత్కాలికముగా నిలుపబడెను.

ప్రతిదినము, ప్రతినిమేషము జనులు స్వామిని సందర్శించుచుండిరి. పగలు సాధారణముగా కాశీపురోద్యానభవనమునందును రాత్రులందు ఆలంబజారునందలి మఠమునందును స్వామి నివసించుచుండెను. కొలదిదినము లైనంతనే పౌరాభినందనసభ జరుపబడెను. వంగదేశమునందలి విద్యార్థులు, జమీందారులు, సన్న్యాసులు, పండితులు, పత్రికాధిపతులు—వేలకొలదిజను లాసభ నలంకరించిరి. సభాధ్యక్షుడగు రాజావినయకృష్ణదేవబహద్దరు స్వామి భారతజాతీయవీరుడని తెలుపుచు విపులముగా కీర్తించెను. అనంతరము చక్కని రజతసంపుటమున స్వాగతపత్రము స్వామి కర్పింపబడియెను. అంత స్వామి, గంభీరహర్షధ్వనులు చెలరేగ, లేచి, యఖండదేశభక్తిసముజ్జ్వలమగు గంభీరోపన్యాసము నొసగెను. హిందూమతవిజ్ఞానములను నూతనవిధమున నిర్వచించి స్వామి తనసందేశముచే భారతజాతీయతకు నూతనదృక్పథమును గల్పించి యున్నాడు. శ్రీరామకృష్ణుడు సాక్షాదవతారమూర్తియనియు సమస్తమతసంఘశ్రేయమునకై పారమార్థికాదర్శస్వరూపుడై యవతరించెననియు భారతీయులకు స్వామి తనయుపన్యాసమున బ్రకటించెను. వివేకానందుడు నవీన భారతదేశప్రవక్తయని జనులు గుర్తింపమొదలిడిరి. హిందూమతసాంఘికవ్యవస్థలు పరివర్తన మొందసాగెను. అచిరకాలముననే దేశములో నూతనసంస్థ లుదయించెను.

ప్రజాస్వాగతానంతరము కొలదిదినములకు శ్రీరామకృష్ణజన్మదినోత్సవము తటస్థించెను. స్వామి యుత్సవమున బాల్గొనునని తెలిసి వేలకొలది

జనులు దక్షిణేశ్వరవనమున కరుదెంచిరి. జనసమూహములు తన్ననుసరింప స్వామి కాళీమాతయాలయమున కేగి యభివందనమొనర్చెను. పాశ్చాత్యశిష్య సమేతుడై స్వామి గురుదేవుడు నివసించినట్టియు తపమొనర్చినట్టియు పుణ్య స్థలముల నన్నిటిని దర్శించెను. శ్రీరామకృష్ణభగవానునిగూర్చి యుపన్యసింపు డని భక్తజనులు స్వామిని ప్రార్థించిరి. స్వామి మాటాడ యత్నించెను, కాని యాతనికంఠనాద మాజనసాగరఘోషలో లీనమైపోయెను. శ్రీరామకృష్ణ వివేకానందజయజయధ్వానములతో, భక్తజనసంకీర్తనములతో దక్షిణేశ్వరవన మపు డఖండభక్తిసుగంధసంభరితమై యొప్పెను.

స్వామి యీసమయమున కాశీపురమందలి సీలువనగృహమున బసచేసి, దినదినము ఆలంబజారుమఠమున దనసోదరశిష్యులను గలిసికొనుచుండెను. స్వామిసందర్శనమున కనేకప్రఖ్యాతపురుషులు, యువకులు, కళాశాలావిద్యా ర్థులును దినదినము వచ్చి స్వామి ననేకవిషయములనుగూర్చి ప్రశ్నించువారు. స్వామిదృష్టియంతయు యువకులమీదనే లగ్నమైయుండెను. విద్యాలం కృతులు, బ్రహ్మచారులునగు యువకులే ఆత్మమోక్షజగత్కల్యాణములు సాధింపగలరని స్వామివిశ్వాసము. కాని, వారిశరీరదౌర్బల్యము, బాల్యవివా హములు మున్నగు లోపములను జూచి ఖిన్నుడై యఖండప్రేమతో వానిని వెల్లడించి, స్వామి తనమధురగంభీరవాక్కులచే వారల యాత్మవిశ్వాసము నుద్దీపింపజేయువాడు.

కొందఱు వైష్ణవమతస్థులు స్వామి పశ్చిమఖండమున వేదాంతమునే కాని కృష్ణభక్తిని బోధింపలేదని స్వామిసందేశమును నిరసింపయత్నించియుం డిరి. స్వామి యివ్విషయము నుద్దేశించి యొకవైష్ణవభక్తునితో నిట్లు పలికెను: "బాబాజీ! అమెరికాలో నే నొకసమయమున కృష్ణునిగూర్చి యుపన్యసించి తిని. ధనికురాలగు నొక సుందరయువతీమణి యాయుపన్యాసమును విని భక్తి సంభరితహృదయయై తనసర్వస్వమును త్యజించి, యేకాంతమగు నొకద్వీప మున కరిగి, కృష్ణధ్యాన నిమగ్నయై కాలము గడపెను."

ఒకయువకుడు స్వామిని సందర్శించి, జ్ఞానార్థ మనేక మతసంస్థల కరుగుచుందుననియు నెందును శాంతి లభింపలేదనియు వచించెను. స్వామి యిట్లనియెను : "నాయనా! భయపడకు. నీస్థితిని నేను నొకప్పు డనుభ వించియున్నాను. వివిధమతస్థులు నీ కేమి తెల్పిరో, వారిబోధలను నీ వెట్లను సరించుచున్నావో నాకు దెల్పుము." అంత నాయువకుడు, విగ్రహారాధన ప్రయోజనమునుగూర్చి యొక దివ్యజ్ఞానప్రచారకుడు తృప్తికరముగా దెలుప జాలకాలము పూజ లొనర్చితి ననియు శాంతిగానక మఱియొకనిబోధల ననుసరించి మనస్సు శూన్యముగా నొనర్పయత్నించితిననియు వచించి, "స్వామిజీ! ఇప్పటికిని గదితలుపులు బిగించి, కన్నులు మూసికొని దినదినము ధ్యానించుచునేయుందును. కాని శాంతి దొరకలేదు. తాము మార్గము తెలుప గలరా?" యని ప్రశ్నించెను: స్వామి ప్రేమపూరితుడై యిట్లు వచించెను: "నామాటలు నీవు లక్షించునెడల మొదట నీవు నీగదితలుపులను తెఱచి; మూసికొనిన కన్నులను విప్పి నీచుట్టుపట్లనున్న పరిస్థితులను పరికింపుము. నీ యిరుగుపొరుగున వందలకొలది దీనులు, నిస్సహాయులు పడియున్నారు. నీ శక్తికొలది వారిని సంరక్షింపుము. రోగులకు మందిచ్చి సేవింపుము. క్షుధార్తు లకు భోజనమిడుము. విద్యావిహీనులకు నీవు నేర్చినవిద్య గఱపుము. మన శ్శాంతికి నీ కిదియే మార్గము." అంత నా యువకుడు రోగులకు సేవ చేయు నెడల తనకు నిద్రాభంగము చే...అని యేమేమో పలుకుచుండ స్వామి చిఱునవ్వు నవ్వి యిట్లు వచించెను : "ఇంత దేహాభిమానము గల నీవు రోగు లకు సేవచేయు టటుంచి వారి దరిచేరవని నీవాలకమే తెలుపుచున్నది!"

మఱియొకనాడు శ్రీరామకృష్ణుని గృహస్థశిష్యుడగు నొకపండితుడు వచ్చి స్వామి నిట్లు ప్రశ్నించెను : "త్యాగము, లోకసేవ మున్నగువిషయము లనుగూర్చి తా మింతగా చెప్పుచుందురే; చూడగా నివి యన్నియు మాయా ప్రపంచములోనివి! మాయాతీతుడై మోక్షము నొందుటయే మానవునకు పర మావధియై యుండ, తాపత్రయహేతువగు కర్మకలాపమునుగూర్చి బోధిం

చుటవలన ప్రయోజనమేమి?" వెంటనే స్వామి యిట్లు పలికెను: "పండిత వరేణ్యా! ముక్తిపొందవలయుననెడి యభిప్రాయము మాత్రము మాయలోనిది కాదా? ఆత్మ నిత్యముక్తమని వేదాంతము బోధించుటలేదా? ఇక దేనికి మోక్షప్రయత్నము!"

ఇంద్రియనిగ్రహమునుగూర్చి ప్రసంగించుచు స్వామి యొకనాడు స్వానుభవమును దెల్పెను. కామమును జయింప స్వామి యెట్టి యసిధారా వ్రత మవలంబించెనో దీనివలన తెలియగలదు. స్వామి యిట్లు వచించెను: "నవయౌవనదశలో నే నొకప్పుడు కామవికారముచే తీవ్రబాధనొంది, ప్రాణమువిసివి, రోషావేశమున లేచి, కాలుచున్న యొక పాత్రమీద గూర్చుంటిని. అనేకదినములకుగాని యాపుండు మానలేదు!" ఇంద్రియనిగ్రహ మెంత కష్టసాధ్యమో కదా!

స్వామి, ప్రియనాథముఖర్జీ యను నొక భక్తునిగృహమున నుండగా నొక గోరక్షణప్రచారకుడు చందాకొఱకు స్వామిని సందర్శించెను. ఆతని వృత్తాంతము కొంతవఱకు వినిన పిమ్మట స్వామి యాతనితో నిట్లు సంభాషించెను: "మధ్యపరగణాలలో మిలిమీఱిన కాటకము సంభవించి జనులను నాశనము చేయుచున్నది. ఆకలిబాధచే మరణించినవారిసంఖ్య 900,000 (తొమ్మిది లక్షలు) అని ప్రభుత్వమువారు ప్రకటించిరి. మృత్యుముఖమునుండి ఈక్షుధార్తులను రక్షించుటకు మీసంఘ మేమైన జేయుచున్నదా?"

ప్రచారకుడు: "అట్టివిషయములతో మాకు సంబంధములేదు. గోమాతలను రక్షించు టొక్కటే మాసంఘోద్దేశము."

స్వామి: "లక్షలకొలది నీసోదరులు—స్వమతస్థులు—ఘోరమగు కాటకముచే ప్రాణములు గోల్పోవుచుండ, దహించుకొనిపోవుచున్న వారి కడుపులలో నొకముద్దవేయుట మీకు ధర్మమని తోచలేదా?"

ప్రచారకుడు: "లేదు. వారిపాపకర్మఫలితమే యీకాటకము. 'యథా కర్మ తథా గతిః.'"

ఈమాటలు విని స్వామి కాలరుద్రుడై వెంటనే కోపము నణచుకొని

ప్రచారకునితో నిట్లు పలికెను: "అయ్యా! కట్టెదుట సోదరమానవులు వేల కొలది ఆకలిబాధచే చనిపోవుచుండ, వారిని క్రేగంటనైనను జూడక, పశు పక్ష్యాదుల నుద్ధరింప లక్షలకొలది వ్యయించు మీసంఘములతో నే నేకీభవింప జాలను. అట్టి సంఘములచే లోకమున కీషణ్మాత్రమును శ్రేయము కలుగునని నేను నమ్మను. 'తాము చేసిన కర్మములచే వారీవిధముగా మరణించుచున్నారు: కావున వారిని చావని' మ్మనుచుంటివా? ఈ క్రూరసిద్ధాంతము చేయుంటకు నీకు నో రెట్లు వచ్చెను? సిగ్గులేదా నీకు? కర్మసిద్ధాంతమునకు నీ వీవిధముగా వ్యాఖ్యానము చేసినపక్షమున నొకరి మేలుకొఱకు మనము యత్నించు టెందు లకు? గోవులు కటికవాండ్ర చేతులలోబడి నఱకబడుటయు అవి చేసిన కర్మము వలననే. మీరు వానిని రక్షింపబూను టనావశ్యకము!"

ప్రచారకుడు తల గోకికొనుచు, "తాము సెలవిచ్చినమాట నిజమే. కాని, స్వామీ! శాస్త్రములు 'గోవు మనతల్లి' యని చెప్పుచుండుట లేదా?" యనియెను. స్వామి నవ్వి, "వాస్తవము! గోవు మన తల్లి యను విషయ ములో సందేహము లేదు. కాకున్న మఱెవరి కింతటి ధీమంతులగు పుత్రు లుదయింతురు!" అనియెను. కాని యా 'పల్లెటూరిబైతు'నకు స్వామియభి ప్రాయము బోధపడక కాబోలును, "సంఘమున కేమైన దయచేయుం"డని కోరెను. అంత స్వామి యిట్లు పలికెను: "నేను సన్న్యాసిని నను విషయము తమకు తెలియనిదికాదు. ఒకవేళ జనులు నాకు ధనమిచ్చిన, మొదట దానిని మానవసేవకై వినియోగింతును. ముందన్నపానీయములు, తరువాత చదువు, సంధ్యలు—వీని కవకాశములను గలుగజేసి దీనులను లేవనెత్తుటకై యత్నిం చెదను. ఈ కార్యములకు బోగా నేమైన మిగిలిన పక్షమున మీసంఘమున కొసగ యత్నింతును."

ప్రచారకుడు వెడలిన పిమ్మట స్వామి తనసన్నిధినున్న భక్తబృంద ముతో నిట్లు పలికెను: "స్వయంకృతకర్మముచే నీవిధముగా చనిపోవుచున్న వారికి తోడ్పడు టెందులకట! ఏమి యర్థరహిత ప్రలాపము! దేశ మిందుచేతనే

అధోగతి పాలైనది. కర్మసిద్ధాంతమున కెట్టివిపరీతార్థముకల్పింపబడినదో చూచితిరా! సోదరమానవుల దుఃస్థితిని జూచి జాలినొందనివా డెట్లు మానవు డనదగును?" స్వామి శరీరము దుఃఖజుగుప్సావేశముచే వణకిపోయెను.

ఆత్మవిశ్వాసము లోపించుటయే భారతీయుల దుఃస్థితికి కారణమని స్వామి యొక శిష్యునితో నిట్లు ఘోషించెను:

"ప్రకృతి నెదిర్చి నిల్చుటయే ఆత్మధర్మము. ప్రకృతిదాస్యమే నేటి మనదుఃస్థితికి హేతువు... నా కఖండాత్మవిశ్వాసము కలదు. భారతీయులు బలహీనులనియు అల్పులనియు నిరసించు పాశ్చాత్యులు, భగవదనుగ్రహమువలన నాకట్టివిశ్వాసముండుటచేతనే, నన్ను తమగురువుగా పరిగణించుచున్నారు. నీవును అఖండశక్తిజ్ఞాన సంపన్నుడనని విశ్వసించి వర్తించినచో అద్భుతకార్యము లొనర్పగలవు. 'లెమ్ము! మేల్కొనుము! ఈస్వప్నస్థితి చాలును. నీలోనున్న దివ్యశక్తిని బ్రకటింపుము!' అని ప్రతిభారతీయునకును దెల్పుము!" (క్షప్తము.)

*ఆత్మమోక్షజగత్కల్యాణములకై నూతనాదర్శములను బ్రకటించి

---

* ఈసమయమున జరిగిన యొక విచిత్రసంఘటన.

ఒకనాడు స్వామి ప్రేమానందుడను సోదరశిష్యునితో బ్రసంగించుచు అకస్మాత్తుగా నిశ్చేష్టుడై పిమ్మట నిట్లు పల్కెను: "నీవిపుడేమైనను చూచితివా? శరీరమునుండి శిరస్సు ఛేదింపబడియుండిన యొకపిశాచము అతిదీనముగా నావైపు జూచుచు దన దుఃస్థితిని దొలగింపుమని వేడుచున్నట్లు నాకిపుడు కాన్పించినది." సోదరశిష్యుడు తన కేమియు గోచరింపలేదనియెను. ఐనను విచారణచేయగా మఠమున కెదుటనున్న తోటలో అనేక సంవత్సరములకు పూర్వము ఒకబ్రాహ్మణుడు ధనము బదులిచ్చి యపారమైనవడ్డీ గైకొనుచుండువాడనియు ఒకఋణగ్రస్తుడు ఒకనాడు వానిని హత్యచేసి శవమును గంగలో బాఱవైచియుండెననియు దెలియవచ్చెను. స్వామి యిట్టిపిశాచములను గనిన సమయము లనేకములు గలవు. కరుణామయుడగు స్వామి వానివిముక్తికై ప్రార్థించి వానిని దీవించువాడు.

సోదరశిష్యులచే వానిని శిరసావహింపజేయుటే స్వామివిజయము లన్నిటిలో నుత్తమోత్తమవిజయము. ఇంతవఱకు సోదరశిష్యులు లౌకికవాతావరణమును సాధ్యమైనంతవఱకు తప్పించుకొని, తీవ్ర జపతపములచే ఆత్మమోక్షమును సాధించుటయే పరమాదర్శముగా గ్రహించియుండిరి. ఇదియే ఋషు లామోదించిన ప్రాచీనసంప్రదాయ మనుటకు సందియములేదు. కాని సనాతనసన్న్యాసాదర్శమునకు నూతనోత్తేజమును నూతనచైతన్యమును బ్రసాదించిన యాచార్యశేఖరుడు వివేకానందస్వామి. స్వామి తనసోదరుల కిట్లుద్బోధించెను: "శ్రీరామకృష్ణుని శిష్యులమగు మన మాత్మమోక్షమునకై ప్రాకులాడు టత్యంత శోచనీయము. 'ఒక్క ప్రాణికి సాయము చేయగల్గినచో, సహస్రపర్యాయములు కుక్కనై పుట్టుటకైన సంసిద్ధుడ'నని గురుదేవుడు వచింపలేదా? ఆ మహనీయునకు ప్రీతిపాత్రుల మగుటయే మోక్షము మనకు కరతలామలక మనుటకు నిదర్శనము. మీలో ప్రతివ్యక్తియు ఆధ్యాత్మికసింహమని గుర్తింపుడు. మతధర్మముల నుద్ధరించుటే మనధర్మమని గ్రహింపుడు. ప్రతిజీవియు సాక్షాద్భగవత్స్వరూపమని గ్రహించి, దరిద్రనారాయణుల, నార్తనారాయణుల నర్చించువిధానము లోకమునకు మనము చూపవలసియున్నది. భారతదేశమున నూతనసన్న్యాససంప్రదాయమును స్థాపించుటయే నాజీవితోద్దేశ్యము. జనసామాన్యము నుద్ధరించుటకై జీవితములను ధారపోయుటే ఈసన్న్యాసుల యాదర్శము." శ్రీరామకృష్ణదివ్యవాణియే వివేకానందవాణియని గ్రహించి సోదరశిష్యులు వినమితశిరస్కులై స్వామియాజ్ఞ లెట్టివైన బరిపాలింప బద్ధకంకణులైరి.

స్వామియభిప్రాయానుసార మిదివఱకే శారదానంద అభేదానందులు పశ్చిమఖండమున కేగి స్వామి వెల్గించిన వేదాంతప్రదీపమును ప్రజ్వలింపజేయుచుండిరి. శ్రీరామకృష్ణభగవాను నర్చించుచు పండ్రెండేం డ్లహర్నిశము మఠమును కనిపెట్టుకొనియుండిన మహనీయుండు రామకృష్ణానందుడు స్వామికోరిక ననుసరించి చెన్నపట్నమున మఠమును స్థాపించి దక్షిణదేశమున

గురుసందేశమును వ్యాప్తిచేయ వెడలెను. సోదరశిష్యులయం దాతడు జూపు చుండిన యఖండప్రేమానురాగముల నుద్దేశించి, "శశి (రామకృష్ణానందుడు) మాతల్లి" యని స్వామి వచించియున్నాడు. మొదటినుండియు స్వామిభావ ములతో నేకీభవించిన మహాత్ముడు అఖండానందుడు మూర్షిదాబాదు జిల్లాలో కాటకముచే జనిపోవుచుండిన జనులరక్షణకై సేవాశ్రమమును నెలకొల్ప నేగెను. ఇట్లు సోదరశిష్యులహృదయక్షేత్రమున స్వామి నాటిన సేవాధర్మ బీజమే కాలక్రమమున మహావృక్షమై శ్రీరామకృష్ణమఠసేవాశ్రమములనెడి శాఖోపశాఖలతో నేడు జగద్వ్యాప్తమై దేశసేవనేకాక, ప్రపంచసేవను సల్పుచున్నది.

మనశ్శరీరశక్తులను ధారపోసి తీవ్రకర్మమొనర్చుటచే స్వామియారోగ్యము మందగించెను. వైద్యుల హితోపదేశము ననుసరించి స్వామి విశ్రాంతి నొందుటకై డార్జిలింగున కేగెను. బర్ద్వాన్ మహారాజు అచటి తనభవనమున నొకభాగము స్వామిబస కొసగెను. ఈ సమయమున స్వామియోగసిద్ధులను బ్రకటించుకొన్నిసంఘటనములు జరిగెను. ఒకభక్తుడు తీవ్రజ్వరము చేతను అపస్మారముచేతను బాధనొందుచుండ స్వామి యాతనిశిరమును స్పృశించెను; వెంటనే జ్వర ముపశమింప నాతడు స్వస్థుడయ్యెను.* సంకీర్తనముచేయుచు నాత డావేశపరవశుడై కేకలిడి, గోండ్రించి, మూర్ఛనొందుచుండెడివాడు. స్వామి యొకనా డాతని హృదయమును దాకెను. నాటినుండియు ఆభక్తుడు

* స్వామి పరివ్రాజకుడై సంచరించుచు (అల్మోరానగరమున) క్షుద్ర దేవతావేశముచేతను తీవ్రజ్వరముచేతను బాధపడుచుండిన యొకవ్యక్తి నిట్లే స్పృశించి స్వస్థు నొనర్చియున్నాడు. మఱియొకప్పుడు (హిమాలయపర్యటన మున) ఒక క్షుద్రదేవతావిష్టుని గొందఱుమాంత్రికు లెఱ్ఱగాగాల్చినగొడ్డటితో స్పృశించుటచే నాతనిశరీరము కాలుచున్నను, ఆవేశము మాత్రము విడువ కుండెను. అంత నాయూరిపెద్ద స్వామిని గాంచి, యాతనియావేశమును తొలగింపుడని పట్టుపట్టెను. స్వామి యాదేవతావిష్టునిశిరమును స్పృశించి, కొంచెముసేపు జపించెను. వెంటనే యాతడు సంపూర్ణముగా స్వస్థుడయ్యెను!

అద్వైతియై జ్ఞానయోగసాధనల నవలంబింపసాగెను! కాలక్రమమున నీతడు మఠమున కరుదెంచి సచ్చిదానందుడనబరగెను.

ఈసమయమున రాజపుత్రస్థానమునుండి ఖేత్రీ మహారాజు తన్ను సందర్శించుటకై కలకత్తానగరమునకు వచ్చెనని విని, స్వామి వెడలి మహారాజును గలిసికొని, సనాతనధర్మోద్ధరణమునుగూర్చి విశేషముగా బ్రసంగించెను. పిమ్మట డార్జిలింగున కేగి, కొలది నెలలుండి, మఱల మఠమున కరుదెంచెను.

"ప్రశాంతినిలయమగు" మఠమున దన సోదరులనడుమ నున్నప్పుడే స్వామికి పరిపూర్ణానందము. స్వామిసందేశమును విని విద్యాధికులగుయువకు లనేకులు సర్వసంగపరిత్యాగులై మఠమున కరుదెంచిరి. స్వామి వారలకు సుశిక్షణము గఱపి తన మహాకార్యమును నిర్వహింప సమర్థుల నొనర్చుచుండెను. మఠమున నీవఱకే సుశిక్షితులగు బ్రహ్మచారులు నల్వురు సన్న్యాసదీక్ష నొసగ స్వామిని బ్రార్థించిరి. వారిలో నొకని పూర్వాశ్రమజీవిత మంతయోగ్యమైనది కాదను కారణమున సోదరశిష్యు లాతనిసన్న్యాసార్హతనుగూర్చి యభ్యంతరము వెలిబుచ్చిరి. స్వామి దయాప్రపూర్ణుడై యిట్లు వచించెను: "మీ యభిప్రాయ మేమి? మనమే యింత సంకోచించిన నిక పాపుల నుద్ధరించువా రెవరు? ఉత్తమ జీవితమును గడపుదమని యాతడు సమస్తము త్యజించి మఠమునకు వచ్చుటయే ఆతనిభావసంశుద్ధిని దెలుపుచున్నది. మన కాత డాదరణీయుడు. కాక నొకడు పాపియైనను, ఆతనిప్రవర్తన మార్పలేకున్నచో మీరు సన్న్యాసులమని చెప్పికొన నేల? గురుచిహ్నమగు కాషాయమును ధరించు టెందులకు?"

నలువురు బ్రహ్మచారులును సన్న్యాసమును స్వీకరించిరి. స్వామికి మఱెన్నడిట్టియానందము కలుగలేదు. స్వామి వారలకిట్లుద్బోధించెను: "ఆత్మమోక్షజగత్కల్యాణములకోసము ప్రపంచమున సన్న్యాసి జన్మించుచున్నాడు. పరహితార్థము తనజీవితము నర్పించుటకై, ఆకసము నార్తనాదములచే చిల్లులువడజేయు దీనజనకోటికష్టములను దొలగించుటకై, అనాథల కన్నీటిని ఆపుటకై, పుత్రశోకసంతప్తలగు తల్లుల నోదార్చుటకై, అజ్ఞానులు

పథఃపతితులునగు జనులు స్వశక్తిపై నిలుచుటకు వలయు సదుపాయముల నొనగూర్చుటకై, జాతిమతభేదములను గణింపక సమస్తమానవకోటికిని ఇహపరసౌఖ్యదాయకమగు శాస్త్రబోధ లొనర్చుటకై, ప్రతివ్యక్తియందును నిద్రాణమైయున్న బ్రహ్మశక్తిని మేల్కొల్పుటకై—సన్న్యాసి యీలోకమున జన్మించుచున్నాడు. ఈమహాకార్యమును నిర్వహించుటకై మన మీలోకమున జన్మించితిమనుమాట మఱువకుడు. ఇందులకై మనజీవితముల నాహుతియొనర్పవలసియున్నదని గుర్తింపుడు. లెండు, మేల్కొనుడు, పరులను మేల్కొల్పుడు. జీవితోద్దేశ్యమును సఫలమొనర్చి పరమావధిని ప్రాపింపుడు.''

ఇట్లు వచించి యట్టిదివ్యజీవితమునకు వలయు నఖండవైరాగ్యసంపదను గూర్చి స్వామి యిట్లు హెచ్చరించెను : ''సమస్తము మీరు త్యజింపవలయును. స్వసుఖము నెంతమాత్ర మూశింపరాదు. సమస్తసంగపాశములను ఖండించి వేయవలయును. కామకాంచనములను విషతుల్యముగను ; పేరుప్రతిష్ఠలను మలప్రాయముగను ; గౌరవమును ఘోరనరకముగను ; స్వజాత్యహంకారమును సురాపానమహాపాతకమువలెను తలపవలయును. ఆధ్యాత్మికచింతాసక్తులై, తోడివారల కాచార్యులై ఆత్మమోక్షజగత్కల్యాణములకై మీరు జీవింపవలయును. ఈకార్యములను నిర్వహింప మీరు మీజీవితములను ధారపోయగలరా ? దూర మాలోచించియే ఈ యాశ్రమమును స్వీకరింపుడు. పూర్వాశ్రమ మవలంబింప మీ కింకను అవకాశము కలదు. నాయాజ్ఞలను శిరసావహింప మీరు సిద్ధముగ నున్నారా ? మీకు శ్రేయస్కరమని తలచి, నేను మిమ్ము పెద్దపులి నెదిరింపుడన్నను, కాలకూటసర్పమును జేబట్టు డన్నను, గంగాప్రవాహమున దుమికి మొసలిని బట్టుకొను డనినను, లేక నేటినుండి అస్సాము తేయాకుతోటలలో కూలీలుగా బనిచేయుటకై మిమ్మమ్మివైచినను, నిరశనవ్రతులై ప్రాణములువిడువుడన్నను, పంచాగ్నిమధ్యమున దగ్ధమగు డన్నను, నాయాజ్ఞలను శిరసావహింప మీరు సంసిద్ధులే కద ?'' బ్రహ్మచారులు వి

మితశిరస్కులై మౌనముచే దమ్మయంగీకారమును దెల్పిరి. అంత స్వామి వేద ప్రోక్తముగా వారలకు శ్రాద్ధవిరజాహోమాదులను జరిపి సన్న్యాసదీక్ష నొస గెను. వీరే విరజానంద * నిర్భయానంద ప్రకాశానంద నిత్యానందులైరి.

అభినవసన్న్యాసులు వచ్చి స్వామికి సాష్టాంగ వందన మొనర్చిరి. స్వామి వారల నాశీర్వదించి యిట్లు వచించెను: "మానవజన్మమున మహో త్తమమగు వ్రతమును నేడు మీరు దాల్చితిరి. మీజన్మము ధన్యమైనది. మీ జననీజనకులు ధన్యులైరి. మీవంశము నేడు ధన్యతజెందినది." *

స్వామి కిక మిగిలియున్న మహాకార్యము దేశోద్ధరణయత్నమునకై, లోకకల్యాణమహాయత్నమునకై, వలయు సేవాసంఘస్థాపనము. తత్కార్యా లోచనాసక్తచేయుటకై స్వామి శ్రీరామకృష్ణుని గృహస్థశిష్యులలో ననేకుల కాహ్వానములంపెను. వారును సన్న్యాసశిష్యులును బలరామవసువునింట సమావేశమైరి. స్వామి మాతృభాషలో నిట్లుపన్యసించెను:

"శాశ్వతఫలధాయకమగు నెట్టిమహాకార్యమును ఒకసంఘ మనునది లేనిదే కొనసాగజాలదని వివిధదేశపర్యటనములచే నాకు గల్గిన యనుభవము వలన గ్రహించితిని. మనదేశమున ప్రస్తుతపరిస్థితులలో ప్రతి వ్యక్తికిని సమాన

---

* ఇందు శ్రీవిరజానందస్వాములవారు (ప్రస్తుతము శ్రీరామకృష్ణమఠ సేవాసంఘాధ్యక్షులు) నాకు సన్న్యాసాశ్రమము ననుగ్రహించియున్నారు.
—గ్రంథకర్త.

† ఈసమయమున స్వామి శరచ్చంద్రచక్రవర్తి యనుగృహస్థ శిష్యునకు మంత్రోపదేశ మొనర్చి పిమ్మట నిట్లు హెచ్చరించెను: "నీయందును నీదేశీయులందును శ్రద్ధను పురికొల్పుము! తత్త్వాన్వేషణమునకై—ఆత్మ మోక్షమునకై —ఆవశ్యకమగుచో నచికేతునివలె యమాలయమునకైనను బోవుటకు వెనుదీయకుము!...భయమే మరణము, కావున నిర్భయుడవు కమ్ము. భయరహితుడవై నేటినుండి ఆత్మమోక్ష జగత్కల్యాణములకై నీజీవి తము నాహుతియొనర్ప సంసిద్ధుడవు కమ్ము. కానిచో ఈరక్తమాంసమయ కళేబరమును మోయుటవలని ఫలమేమి?..."

మగు 'హక్కుల' నొసగు (ప్రజాస్వామిక) విధానము ననుసరించి సంఘమును స్థాపించుట దుస్తరము. కావున మనము స్థాపింపబోవు సంఘము ప్రస్తుత మొకనియధికారమునకు బద్ధమైయుండవలయును....

"ఏమహనీయునిమూలమున మేము సన్న్యసాశ్రమము స్వీకరించితిమో, ఏమహాత్ముని మీ రాదర్శపురుషునిగా గ్రహించి గృహస్థధర్మము నిర్వర్తించుచున్నారో, ఏమహాపురుషునిపవిత్రనామము, అద్వితీయజీవితోపదేశప్రభావము, నాతనినిర్యాణానంతరము పదిరెండువర్షములలో ప్రపంచవ్యాప్తిగాంచి మించినవో, ఆదివ్యపురుషుని నామమే యీసంఘమున కనువర్తించును. ఈసంఘము అందుచే శ్రీరామకృష్ణసేవాసంఘము (Sri Ramakrishna Mission) అని వ్యవహరింపబడును. మనమందఱ మా ప్రభునిసేవకులము. మీరందఱీ మహాకార్యమున మాకు దోడ్పడెదరు గాక!"

సభ్యు లేకగ్రీవముగా స్వామిప్రతిపాదనము నామోదించిరి. సంఘోద్దేశ్యములనుగూర్చియు కార్యక్రమమునుగూర్చియు చర్చయైనవెనుక నీక్రింది తీర్మానములు కావింపబడియెను:

విశ్వమానవకల్యాణమునకై శ్రీరామకృష్ణుడు బోధనపూర్వకముగను స్వీయజీవితమున నాచరణపూర్వకముగను బ్రకటించిన ధర్మతత్త్వములను వ్యాప్తిచేయుటయు ఐహికాముష్మికశ్రేయమునకై యీధర్మముల నాచరింపబరులకు దోడ్పడుటయు శ్రీరామకృష్ణసేవాసంఘోద్దేశ్యము.

ఏకము, శాశ్వతమునగు సనాతనధర్మమునే వివిధమతములన్నియు వివిధరీతులుగా బ్రదర్శించుచున్నవని గ్రహించి సర్వమతసామరస్య మొనగూర్చుటకై శ్రీరామకృష్ణుడు నెలకొల్పిన మహోద్యమమును సక్రమమార్గమున నిర్వహించుటయే శ్రీరామకృష్ణసేవాసంఘకర్తవ్యము.

జనులకు ఐహికాముష్మికశ్రేయోదాయకములగు విద్యలు నేర్పుటకు దగినవారలను సిద్ధముచేయుట, కళలను, పరిశ్రమలను వృద్ధిచేయుట, శ్రీరామకృష్ణునిజీవితమున స్పష్టీకరింపబడినరీతిని వేదాంతాదిమతాభిప్రాయములను జనసామాన్యమునకు అందచేయుట—ఇయ్యవి సంఘకార్యనిర్వహణమార్గములు.

సన్న్యాసులకును సంఘకార్యములలో బాల్గొను తదితరులకును వలయు శిక్షణము గఱపుటకై దేశమున వివిధరాష్ట్రములలో మఠములును ఆశ్రమములును స్థాపింపబడవలయును.

విదేశములకును భారతదేశమునకును సన్నిహితసంబంధమేర్పఱిచి సమరసభావమును బెంపొందించుటకై (మతవిషయకమగు)కృషి చేయవలయును. అందులకై విదేశములలో మఠములను సేవాశ్రమములను స్థాపించుటకును వేదాంతతత్త్వప్రచార మొనర్చుటకును సుశిక్షితులైనవారలను బంపవలయును.

రాజకీయవిషయములతో ఈసంస్థ కెట్టి సంబంధమునుండరాదు.

సంఘాశయములతో నేకీభవించు వార లెవ్వరైనను సభ్యులుగా నుండవచ్చును.

పిమ్మట కార్యనిర్వాహకులు నియమింపబడిరి. స్వామి సంఘమునకు సాధారణాధ్యక్షు డయ్యెను. కలకత్తాలోని కేంద్రమఠమునకు బ్రహ్మానంద నధ్యక్షునిగను యోగానందు నుపాధ్యక్షునిగను స్వామి నియమించెను.

క్రమముగా సంఘకార్యక్రమ మభివృద్ధియగుటచే కార్యనిర్వహణ సౌలభ్యముకొఱకు 1909-వ సంవత్సరమున ఈసంస్థ శ్రీరామకృష్ణసేవా సంఘమనియు శ్రీరామకృష్ణమఠమనియు రెండుభాగములుగా విభజింపబడెను. మఠమున జేరు ముముక్షువులకు సన్న్యాసజీవనమునకు వలయు శిక్షణము గఱపుటయే శ్రీరామకృష్ణమఠసంస్థయొక్క ముఖ్యోద్దేశము. వైద్యశాలలు, విద్యాలయములు, సేవాశ్రమములు మున్నగుసంస్థలను నెలకొల్పి మానవసేవ చేయుటయే శ్రీరామకృష్ణసేవాసంఘముఖ్యోద్దేశ్యము. సుశిక్షితులైన బ్రహ్మచారులును సన్న్యాసులునే సేవాసంఘకార్యనిర్వాహకులలో ప్రధానవర్గమై యుండుటచే ఈసంస్థలు రెండును మనశ్శరీరములవలె పరస్పరసంబద్ధములై యొప్పుచున్నవి.

సేవాసంఘాభివృద్ధినిగూర్చి స్వామి కార్యాలోచనాతత్పరుడై యుండెను. ఐనను సంఘసంస్థాపనవిషయమై శిష్యబృందముమధ్య మొట్టమొదట

భేదాభిప్రాయములు కలుగకపోలేదు. ఉపన్యాసాదికములచే మతబోధచేయుం స్వామిపద్ధతులును లోకోపయుక్తకార్యక్రమమునుగూర్చినట్టి స్వామిభావములును శ్రీరామకృష్ణుని పారమార్థికాదర్శములకు వ్యతిరిక్తమనియు విశేషము పాశ్చాత్యపద్ధతులనియు పాశ్చాత్యాశయములనియు నొకసోదరశిష్యుడు ప్రతిఘటింపసాగెను. స్వామి దివ్యావేశపూరితుడై యిట్లు ఘోషించెను :

"ఇవి శ్రీరామకృష్ణుని యాశయములతో నేకీభవింపవని నీ కెట్లు తెలియును? అనంతాశయసాగరమగు శ్రీరామకృష్ణుని నీపరిమితమగు సరిహద్దులలో బంధింపదలచితివా? ఈసరిహద్దులను భేదించివైచి యాతని దివ్యాశయములను ప్రపంచమంతటను వెదజల్లెదను. తన నారాధించుచు గూర్చుండుడని యాతడెన్నడును విధింపలేదు. అతడు బోధించిన పారమార్థికాదర్శములను సాధనలను మన మనుష్ఠించుటయేకాక మానవకోటికంతకును బోధింపవలయును. పరమార్థమును బొందుమార్గము లనంతములు. ఇవియన్నియు కోట్లకొలదిశాఖలతో క్రిక్కిఱిసియున్న యీ ప్రపంచమున నింకొకశాఖ నిముడ్ప నేబుట్టలేదు. శ్రీరామకృష్ణుని ప్రాప్తి లభించుటచే మనము ధన్యులము. ఆతనిదివ్యాశయములను జగద్వ్యాప్తియొనర్చుటే మన కర్తవ్యము."

సోదరశిష్యుడు మాఱాడలేదు. స్వామి మఱల నిట్లు వక్కాణించెను :

"ఈ నాజీవితములో గురుకటాక్ష మనేకపర్యాయములు నాకు ప్రత్యక్షగోచరమైనది. ఆతడే నావెనుకనుండి సమస్తకార్యములను జేయించుచున్నాడు. అలసటచెంది, ఆకలిబాధచే నేనొకచెట్టుక్రింద కూలబడినపుడు, కటిప్రదేశమును గప్పుకొనుటకు నా కొక గుడ్డపేలికయైన లభింపనపుడు, చేత గాసైన లేక ప్రపంచయాత్ర చేయ నిశ్చయించుకొని బయల్వెడలినపుడు, గురుమహాశయుడే కంటిని ఱెప్పవలె నన్ను కాపాడియున్నాడు. మఱియు షికాగోనగరవీధులలో జనులు గుంపులుగుంపులై యీవివేకానందదర్శనభాగ్యమునకై తల్లడిల్లినపుడు ఆమహాత్మునికటాక్షము చేతనే అట్టి యఖండగౌరవమునంతను, మఱెవ్వరైన నందు సహస్రాంశము చేతనే యొడలు మఱచిపోవుస్థితిలో, జీర్ణించుకొని యహంభావవశవర్తిని గాకుండ నిల్వగల్గితిని. ఆభగవానుని యమోఘసంకల్పముచే నే నెచటి కరిగిన నచట విజయమే సిద్ధించినది.

ఇపు డీదేశమునకు గొంతసేవ చేయదలచి యున్నాను. మీరు మీసంశయముల నన్నిటిని విడిచిపెట్టి నాకు సాయమొనర్తురా, అపరమపురుషు ననుగ్రహము వలన మన మద్భుతకార్యముల నొనర్పగలము.”

సోదరశిష్యునిధర్మసందేహ మింకను నివృత్తియైనట్లు కాన్పింపమి స్వామి మఱల నిట్లు వక్కాణించెను:

“విషయ మిది. శ్రీరామకృష్ణునియాధిక్య మెట్టిదో శిష్యు లెన్నటికిని అవగాహనము చేసికొనజాలరు. అత డాధ్యాత్మికసాగరము. అతని యాశ యము లనంతములు. బ్రహ్మజ్ఞానమునకైనను పరిమితి కనుగొనవచ్చును గాని, యగాధమగు మనగురుదేవునిమనస్తత్త్వ మిట్టిదని నిర్ణయింపజాలము. ఆమహా త్ముని కరుణాకటాక్షవీక్షణ మొక్కటి ప్రసరించినజాలును; లక్షమంది వివేకా నందు లరనిముసములో బయలుదేఱగలరు! ఐన నాతడు నన్ను నిమిత్తమాత్రు నిగా జేసికొని నామూలమున దనకార్యముల నొనర్పసంకల్పించినచో ఆసంక ల్పమును శిరసావహించెదను.”

దివ్యాదర్శమూర్తిమత్త్వమే శ్రీరామకృష్ణుని వ్యక్తిత్వమనియు త్యాగాత్మానుభవములను మానవసేవతో మేళవించు విధానమును లోకమునకు బోధించుటయే గురుదేవుని జీవితోద్దేశమనియు గ్రహించిన శిష్యాగ్రగణ్యుడు, ఆత్మమోక్షజగత్కల్యాణముల నొనగూర్చుటకై శ్రీరామకృష్ణమఠసేవాసంఘ ములను స్థాపించిన లోకోత్తరచరిత్రుడు, వివేకానందుడు. **త్యాగసేవలే నవీనభారతజాతీయాదర్శములని స్వామి చాటియున్నాడు.**

మఱియొక సమయమున నొక సోదరశిష్యుడు శ్రీరామకృష్ణుడు ప్రక టించిన యాశయములు భక్తిప్రధానమగు మోక్షసాధనలైయుండ, స్వామి తెల్పు పాశ్చాత్యసంప్రదాయసిద్ధమగు మానవసేవ బంధహేతువనియు గురూపదేశవ్యతిరిక్తమనియు ఖండింప నారంభించెను. స్వామి యాతనివిమర్శన మును విని మున్ముందు హాస్యపూర్వకముగా ని ట్లనియెను: “నీ కేమి తెలి యును? నీవు పరమ మూర్ఖుడవు. ఆగురువునకు దగిన శిష్యుడవే నీవు! గుణిత ములో ప్రథమాక్షరమగు ‘క’గాంచి, కృష్ణుడు జ్ఞప్తికిరా నిక ముందునకు

బోధాలకుండిన ప్రహ్లాదునిచదువువలె అక్షరాభ్యాసమునాడే నీచదువు అంత మైనది! మీరే కాబోలును, భ-క్తు-లు, వెఱ్ఱిపుల్లయ్యలు! పరవిద్యయన మీ కేమి తెలిసినది ? ముక్కుపచ్చలాఱని పసిబిడ్డలు మీరు. చేతులు జోడించు కొని, 'ఓపరమేశ్వరా ! నీముక్కెంత చక్కగానున్నది! నీ కన్ను లెంత మనో హరములు!' మొదలగు నర్థరహితస్తోత్రములు చేయుచు, నిక మీకు మోక్ష మునకు లోటులేదనియు అవసానకాలమున శ్రీరామకృష్ణుడు వచ్చి మిమ్ము వైకుంఠమునకు ఎత్తుకొనిపోవుననియు దలచుచున్నారు ! విద్య, మతప్రచా రము, మానవసేవ——ఇవి యన్నియు మాయాసంజనితములని మీయభిప్రాయ ము. శ్రీరామకృష్ణుడు స్వయముగా నిట్టికార్యము లొనర్పలేదనియా? 'మొదట భగవంతుని దెలిసికొనుము; 'జగద్ధితాచరణ' మనునది పిచ్చిమాట' యని యాత డొకనితో బల్కెననియా ? భగవత్ప్రాప్తియనగా నంత తేలిక కాబోలును! లాగుకొనుటకు అర్భకులచేతిలోని యాటబొమ్మ కాబోలును భగవంతుడు!"

క్రమముగా ఆవేశపూరితుడై యిట్లు ఘోషించెను :

"శ్రీరామకృష్ణునిగూర్చి నాకంటె మీ కెక్కువ తెలియుననని మీయభి ప్రాయము! జ్ఞానమనునది ప్రేమానురాగములను మంటగలిపి, శుష్కమార్గము చే బొందనగు మిట్టవేదాంతమని మీయభిప్రాయము. మానవుని బలహీనునిజేయు నర్థరహితభావోద్రేకమే మీభక్తి. రామకృష్ణునిగూర్చి లవలేశమైనను గ్రహిం చిరో లేదో, మీ రాతనితత్త్వమును బోధింప జూచుచున్నారు. చాలు చాలును! మీరామకృష్ణు డెవరికి గావలయును ? మీభక్తిముక్తు లెవరికి గావల యును ? మీశాస్త్రబోధ లెవరికి గావలయును ? తమస్సున మునిగి నిర్జీవులై యున్న నాభారతసోదరులను కర్మయోగప్రభావముచే బునరుజ్జీవింపజేసి, స్వశక్తిపైనిల్పు ధీరులనొనర్చుటకై మహానందముతో వేయినరకములైన ననుభ వింతును. నేను రామకృష్ణునకుగాని మఱెవ్వరికిగాని యనుచరుడనుగాను. నా కార్యక్రమమును గొనసాగించువారల యనుచరుడను నేను! నేను రామకృష్ణు నకుగాని మఱెవ్వరికిగాని దాసుడనుగాను; స్వకీయముక్తిని పాటింపక పర యార్థమై పాటుపడువారల దాసుడను నేను."

భావావేశముచే స్వామిశరీరము కంపించెను. కంఠస్వరము గద్గదిక చెందెను. నేత్రయుగళమునుండి బాష్పధారలు ప్రవహింపసాగెను. అంత నాత డొక మెఱపుదీగవలె లేచి శయనమందిరమునకు వెడలిపోయెను. సోదర శిష్యులు ప్రచలితమానసులైరి. భయముచే వారిగుండెలు దడదడ కొట్టుకొన సాగెను. స్వామినిగూర్చి యట్లు విమర్శించినందులకై వారు పశ్చాత్తప్తులైరి. కొలదినిముసములైనవెనుక స్వామిగదియొద్ద కేగిరి. బాష్పధారలు కన్నుల వెంట ప్రవహింప స్వామి భావసమాధినిమగ్నుడై యుండెను. ఒకగంట గడ చెను. స్వామి లేచి, ముఖముకడుగుకొని, మిత్రులున్నస్థలమున కరుదెంచెను. ఆతనివదనము ప్రశాంతినిలయమై యుండెను. శిష్యు లెవ్వరును మాటాడ సాహసింపలేదు. స్వామి యిట్లు వచించెను :

"మానవుడు భక్తిపరవశుడైనపు డాతనిహృదయమును నరములును అత్యంత మృదుత్వమునంది పుష్పస్పర్శను సహితము సహింపలేనిస్థితిలో నుండును!... నాలో పొంగిపొరలుచున్న భక్తిప్రవాహముయొక్క వేగము నరికట్టుటకై సదా అఖండప్రయత్నము చేయుచున్నాను. నా మాతృదేశమునకు వలయుసేవ యింకను పూర్తిగాకుండుటచే, ప్రపంచ మునకు నాసందేశ మింకను పరిసమాప్తి నొందని హేతువుచే, జ్ఞానపాశ ములచే నన్ను నేను బంధించుకొన యత్నించుచున్నాను.... నే నింకను చేయ వలయుకార్యము కలదు. రామకృష్ణునిదాసానుదాసుడను నేను. నన్నాతడు తన కార్యము నొనర్చుటకై నియమించియున్నాడు. అయ్యది పూర్తిచేయనిదే నాకాతడు శాంతినొసగడు. ఆమహనీయుని గూర్చినే నేమని వచింతును! నాయం దాతని కెట్టియఖండానురాగమో!"

యోగానందాదిసోదరశిష్యు లట్టియఖండభావావేశము మఱల కలుగు నేమోయని భయమంది, "మేడ మీదిభాగమున పచారుచేసెదరా?" యని మెల్లగా స్వామిని ప్రశ్నించిరి. స్వామి సమ్మతించి వెడలెను. సోదరశిష్యుల సల్లాపములతో నించుమించుగా నర్ధరాత్రమగుసరికి స్వామి మఱల యథాస్థితి నొందెను.

శిష్యులసంశయాంధకారము స్వామిదివ్యాదేశమహాతేజముచే పటాపంచలైనది. శ్రీరామకృష్ణుడే వివేకానంద హృదయాంతర్జ్యోతియై వెల్గొందు చుండెనని శిష్యులందఱకును నాడు విస్పష్టమైనది. స్వామి నిరుపమానగురుభక్తిని విశ్వమానవప్రేమను బ్రకటించుసంఘటనము లిట్టి వనేకములు కలవు.

స్వామి యొకనాడు శరచ్చంద్రుడను శిష్యునకు శాయనాచార్యుని ఋగ్వేదభాష్యమును బోధించుచు, దన్ను సందర్శింపవచ్చిన మహాకవి గిరీశచంద్రఘోషును జూచి యిట్లు వచించెను: "గిరీశమహాశయా! మీ రీ వేదములను జదువుటకై యెన్నడును బ్రయత్నింపరైతిరి. మీకృష్ణులతోడను విష్ణులతోడనే కాలముగడపితిరి." అంత వినయపూర్వకముగా గిరీశచంద్రుడిట్లనియెను: "నాయనా! ఈవేదములన్నియు జదువుటవలన నాకేమి ప్రయోజనము? నాకు అందులకు వలయు అవకాశమును లేదు; వేదముల నర్థముచేసికొను కుశాగ్రబుద్ధియు లేదు. వాని కొకనమస్కారముచేసి శ్రీరామకృష్ణుని నిర్హేతుకకృపవలన ఈసంసారసాగరమును దాటెదను. వేదాంతమత ప్రచారరూపకముగా నీవలన జరుగవలసిన కార్య మాతనికి విశేషముగా నుండుటచే శ్రీరామకృష్ణు డీవేదశాస్త్రముల నన్నిటిని నీచే జదివించియున్నాడు." ఇట్లు వచించి, గిరీశచంద్రుడు లేచి, వేదగ్రంథముల కనేక పర్యాయములు సాష్టాంగప్రణామమొనర్చి, "వేదస్వరూపుడగు శ్రీరామకృష్ణునకు జయమగు గాక!" యని పల్కెను. కొంతసేపైనవెనుక నాతడు లోకమునందలి దుఃస్థితిని గూర్చి ప్రసంగించుచు నిట్లు తెల్పెను: "దినదినము, ఏబదిమందికి అన్నప్రదానముచేయు నొకగృహిణి నేడు తినుటకు అన్నములేక పస్తుపడియున్నది! మఱియొకసాధ్విని గొందఱు దుర్మార్గులు పాతివ్రత్యభంగమొనర్చి చిత్రవధ చేసిరి! అనాథయగు నొకయువతి తాను చేసినతప్పును దాపజాలక ఆత్మహత్య చేసికొనినది. నరేంద్రా! వేదములలో నిట్టిదుఃఖమును దుఃస్థితిని దొలగించు నుపాయము లేవైనను జూపబడినవా?" ఇట్లు ప్రశ్నించి, మానవదౌర్బల్యమును లోకమునందలిఘోరయాతనలను గిరీశకవిచంద్రుడు చిత్రింపసాగెను.

ఆవర్ణనలను విని స్వామి దుఃఖమును భరింపజాలకపోయెను. ఆతని నేత్రము లశ్రుపూరితములైనవి. విచారమును మఱుగు పఱుపజాలక స్వామి యటనుండి లేచి వెడలిపోయెను. గిరీశచంద్రుడంత శరచ్చంద్రు నుద్దేశించి యిట్లు వచించెను: "చూచితివా, మీగురువు ఎట్టి యుదారహృదయుడో! అఖండప్రజ్ఞావంతుడని కాని, విద్యావాచస్పతియని కాని నే నాతని గౌరవింపను. మానవకోటిదుఃస్థితిని దలచి కన్నీళ్లుగార్చిన యామహనీయుని యుదారహృదయమే నా కెంతయు మాననీయము. మీస్వామిజీ యెంతటిమహాపండితుడో, జ్ఞానియో, అంతటిభాగవతోత్తముడు; విశ్వమానవప్రేమపూరితుడు."

ఇంతలో స్వామి వచ్చి యిట్లు వచించెను: "గిరీశమహాశయా! ఇటు చూడుడు. నా కిట్లు తోచుచున్నది. ఒక్కప్రాణికిగల దుఃఖమును బోగొట్టగల్గినచో మహానందముతో వేయిజన్మములైన నెత్తుటకు సంసిద్ధుడను. స్వీయముక్తివలన నేమిప్రయోజనము? ప్రతిజీవిని మోక్షమార్గమున నాతో గొనిపోయెదను."

"స తరతి స తరతి లోకాం స్తారయతి" (భాగవతోత్తములు తాము తరించుటయేగాక లోకమును తరింపజేయుదురు) అను నారదభక్తిసూత్రమునకు స్వామిజీవితమే నిదర్శనము.

## ముప్పదియవ ప్రకరణము

## స్వామి యుత్తరదేశజీవితము

దురదృష్టవశమున ననారోగ్యస్థితి స్వామికి బాధ గల్గించుచుండెను. వైద్యుల యభిప్రాయము ననుసరించి, స్వస్థతనొందుటకై స్వామి కలకత్తానగరమును వీడి, హిమాలయమునందలి ఆల్మోరానగరమునకు పయనమయ్యెను. దారిలో లక్నోనగరవాసులు స్వామికి ప్రేమప్రపూర్ణమగు స్వాగతము నొసగిరి. అటనుండి ఆల్మోరాప్రాంతముననున్న లోడియానగరమున కేగుసరికి వేలకొలదిజనులు వచ్చి మహావైభవాన్వితమగు స్వాగతము నొసగి గారవించిరి. చక్కనిజీనుతో నలంకరింపబడిన గుఱ్ఱము నెక్కించి స్వామిని యూరేగించుచుండ, వేలకొలది భారతనారీమణులు గృహోపరిభాగముల నుండి స్వామిపై బుష్పాక్షతలను జల్లిరి. * అనంతరము పురమధ్యమున సభ జరిపి పౌరులు వివిధభాషలలో స్వామికి స్వాగతపత్రములను సమర్పించిరి. ఉచితరీతిని స్వామి సమాధాన మొసగుచు, మహోన్నతమగు హిమాలయ పర్వతము శాశ్వతముగా మన కొసగుచున్న సందేశము త్యాగము అని వచించెను!

ఆల్మోరానగరమున క్రమముగా స్వామి కారోగ్యము కలుగనారంభించెను. కలకత్తాలోనున్న తనవైద్యునకు స్వామియే యిట్లు వ్రాసియున్నాడు:

"...నా కిప్పు డఖండబలము చేకూరినది. హిమాలంకృతములగు పర్వతశిఖరముల కెదుట పద్మాసనస్థుడనై,

---

* ఇచట నొకవిశేషము జరిగెను. పూర్వము పరివ్రాజకుడై సంచరించుచు ఆల్మోరాప్రాంతమున నపరిమితాయాసముచే తాను నేలపై గూలబడినపు డొక దోసకాయ నోటి కందియిచ్చి ప్రాణము కాపాడిన యొకఫకీరును స్వామి జనసమూహమునగాంచెను. తోడనే యుత్సవము నాపి, స్వామి యాతడు తన్నెట్లు రక్షించెనో మిత్రులకు దెలుపుచు నాతనికడ కేగి, కృతజ్ఞతాసూచకముగా గొంతధన మొసగెను.

న తస్య మృత్యు ర్నజరా న వ్యాధిః
ప్రాప్తం హి యోగాగ్నిమయం శరీరమ్'

అను నుపనిషద్వాక్యము నుచ్చరించుచు ధ్యానస్థితుడనగు నన్ను మీ రొక్కసారి వచ్చి చూచినచో నే నెట్టిస్థితిలో నున్నానో మీకు తెలియగలదు.''

స్వామి యిట్లు విశ్రాంతినొందుచుండ, క్రైస్తవ ప్రచారకులు మఱల గందరగోళము చేయనారంభించిరి. అందు ప్రముఖుడగు డాక్టరు బారోస్ ఈసమయమున భారతదేశమునకు వచ్చి, స్వామి అమెరికాస్త్రీలను దూషించెనని తుచ్ఛప్రచార మారంభించెను. ఇవ్విషయమును విని స్వామి యిట్లు వ్రాసియున్నాడు :

''ఈపాటికి డాక్టరు బారోస్ అమెరికా చేరునని తలంతును. శుద్ధ దురభిమానగ్రస్తమగు తనక్రైస్తవమతబోధచే భారతీయుల నాత డుద్ధరింప వచ్చెను. పాపము, అతనిబోధల నెవరును చెవియొగ్గి వినలేదట! కాని, వారా తనియెడ విశేషాదరము జూపిరి. అందులకు కారణము నేను వ్రాసినయుత్తరమే సుమీ.' కాని యాతనికి తెలివితేటలు గల్గించుట నావల్లకాలేదు. ఆధ్యాత్మిక విషయములలో భారతదేశము నెదుట నిలువగల్గిన దేశము ప్రపంచమున లేదు. భౌతిక విజ్ఞానములో పాశ్చాత్యు లెట్టి యౌన్నత్యము పొందినను పారమార్థిక విషయములలో వారి కింకను అక్షరాభ్యాసము కాలేదు. భౌతికవిజ్ఞానము క్షణికభౌతికసంపత్తిహేతువు : పరవిద్య, శాశ్వతబ్రహ్మానందదాయకము. లౌకిక చింతామాధ్యము ఆర్పరాని తృష్ణను బుట్టించి తుదకు వ్యక్తిని సంఘమునుగూడ నశింపజేయును.''

కొందఱు సంకుచితబుద్ధులు అమెరికాదేశమున దన్నుగూర్చి చేయుచుండిన దుష్ప్రచారములనుగూర్చి స్వామి యొకపాశ్చాత్యశిష్యున కిట్లు వ్రాసెను :

''...నాశ్రేయమునుగూర్చి మీరు భయపడనక్కఱలేదు...నాయపవాదకు లెంత గగ్గోలుచేసినను, సువిశాలమగు నీవిశ్వమున నాకు తావు లేకపోలేదు. ఏమైనను నాకృషి నాకు సంతృప్తికరముగా నున్నది. ప్రారబ్ధానుసారము

వర్తించితినేకాని నేనెన్నడును ఈకార్య మిట్లు జరుగవలయునని సంకల్పించిన వాడనుగాను. భారతజనసామాన్యము నుద్ధరించు టెట్లనియే నే బరితపించితిని. నేటికి గొంతవఱకు అందు జయముగాంచితిని. దేశమున జనులు కాటకముచే, మహావ్యాధులచే, బాధల నొందుచున్నతఱి నాబిడ్డ లెట్లు విషూచిగ్రస్తులగు మాలలకజ్జను నిరాహారులై మరణించు పంచములపంచను సేవచేయుచున్నారో చూచిన మీకు బ్రహ్మానందమగును. సర్వేశ్వరుడే నాకును వారికిని దోడ్పడు చున్నాడు....బోద్ధూడనివారి పలుకులనా నేను పాటించునది ? ఏమేమి ? పరతత్త్వమును సంసారసారహీనతను గ్రహించిన నేనా, పసిపాపల ప్రలాప ములను విని నామార్గమునుండి చలించుట ! ఇదియా నన్నుగూర్చి మీయభి ప్రాయము ?

"...నావిధ్యుక్తకర్మము సమాప్తమైనదని తోచుచున్నది—మూడు నాలుగేండ్లకంటె నిక నే నెక్కువ జీవింపను. స్వీయమోక్షేచ్ఛ నశించి పోయి నది. ప్రాపంచికభోగముల నెన్నడును కాంక్షించినవాడనుగాను. లోకశ్రేయ మునకై నే నారంభించిన యుద్యమము జయప్రదముగా సాగుటొక్కటే నాకు వాంఛితము. నాయుద్యమము అప్రతిహతము. భారతదేశమందైనను నాకృషి కొనసాగుట చూచి గుండెలపై జేయివైచుకొని నిద్రింతును. సమస్తజీవస్వరూ పుని, అద్వితీయుని, మదీయైకవిశ్వాసపాత్రుని, విశేషము నాదుష్టనారా యణుని, నాయార్తనారాయణుని, నాదీననారాయణుని, సమస్తదేశీయుల కెల్ల పేదయగు నా (భారత) నారాయణుని, నాయిష్టదేవత నర్చించుటకై యెన్ని జన్మములైన నెత్తెదనుగాక, ఎన్ని వేలబాధలనైన ననుభవింతునుగాక.

"'ఎవ్వ డల్పుడుగను అధికుడుగను, కీటకముగను కిరీటాధిపతిగను, పాపిగను పుణ్యాత్ముడుగను వెల్గొందునో ఆసర్వేశ్వరుని భజింపుడు; ఇతర విగ్రహములను విచ్ఛిన్నముచేయుడు.'

"...నా కాధారభూతమైయున్న వ్యక్తి సర్వేశ్వరుడు కాని వివేకా నందుడు కాడు.

"...ఈఘోరమాయాప్రపంచమును, నిస్సారమగు నీసంసారమును త్యజించి సుఖింపుడు. కామకాంచనములను పరిత్యజింపుడు. వీనికంటె వేఱొక బంధము లేదు. పెండ్లి, కామకాంచనములు—ఇవియే నిజమైన పిశాచములు.

శరీరమే, శరీరాభిమానమే, మోహము. కామకాంచనములు తొలగినచో మోక్షము కరతలామలకమగును."

ఇవ్విషయ మిట్లుండగా, అమెరికాస్త్రీలయెడ స్వామి తనసద్భావమును గూర్చి ఖేత్రీమహారాజున కిట్లు వ్రాసియున్నాడు :

"...అమెరికాస్త్రీలను నేను దూషించితిననుట పిచ్చిమాట. అమెరికా మాతలారా ! వేయిజన్మము లెత్తినను నేను మీఋణమును దీర్చుకొనజాలను. మీ రట్టిసాయ మొనర్చితిరి నాకు." (క్లిష్టము.)

స్వామి కొంత స్వస్థత చేకూరినంతనే ఉత్తరదేశమున దనసందేశమును వ్యాప్తిచేయ సంకల్పించెను. అచటి వివిధరాష్ట్రములనుండి స్వామి కనేకాహ్వానములు వచ్చుచుండెను. ఆల్మోరానగరమున రెండుపన్యాసము లొసగి, యటనుండి బయలుదేఱి, స్వామి బారిల్లి, అమృతసరము మున్నగు పట్టణములలో స్వాగతముల నంది, కాశ్మీరమహారాజునాహ్వానము ననుసరించి జమ్మూ నగరమున నాతని గలిసికొనెను. మహారాజునకు దనసందేశమును దెలిపి స్వామి యటనుండి లాహోరు జేరెను. అచట సనాతనులకును ఆర్యసామాజికులకును శ్రాద్ధకర్మాదివిషయములలో తీవ్ర భేదములు కలవు. స్వామి యొకనాడు శ్రాద్ధకర్మమును సభలో చక్కగా సమర్థించెను. ఆర్యసామాజికులు స్వామిని విశేషముగా గారవించిరి.

కాలాంతరమున అద్వైతవేదాంతకేసరియై జగద్విఖ్యాతిగాంచిన రామతీర్థగోస్వామిని స్వామి యీలాహోరునగరముననే కలిసికొనెను. స్వామివలెనే ఈ మహనీయుండును వేదాంతతత్త్వమును భారతదేశమునందును అమెరికాదేశమునందును గూడ విశేషముగా జాటియున్నాడు. రామతీర్థగోస్వామి యీ సమయమున నొక కళాశాలలో గణితశాస్త్రపండితుడుగా నుండెను. స్వామి నీతడు ఆహ్వానించి యాతిథ్యమొసగెను : భోజనానంతరము స్వామి మనోహరమగు నొక హిందీకీర్తనమును బాడెను. * "నిరుపమానమగు స్వామికంఠ

* "జహా రామ తహా కామ నహీ, జహా కామ తహా నహీ రామ...."

మాధుర్యము గీతార్థమును విస్పష్టమొనర్చి శ్రోతలను పులకితాంగులనొనర్చెను" అని రామతీర్థస్వామియే వ్రాసియున్నాడు.

స్వామికిని రామతీర్థస్వామికిని గుదిరిన మైత్రి వర్ణనాతీతము. స్వామి యటనుండి వెడలునపుడు రామతీర్థగోస్వామి తనబంగారుగడియారమును స్వామి కొసగెను. ప్రీతిపూర్వకముగా స్వామి గ్రహించి, మఱల రామతీర్థుని జేబులోనుంచుచు, "ఈ జేబులో నే నీగడియారమును ధరించు కొందు" నని పల్కెను.

స్వామి యటనుండి ఆళ్వారునగరమున కేగి మహాస్వాగతమునొందెను. పరివ్రాజకదినములలో నచట తన కాతిథ్య మొసగిన యొకవృద్ధనారీమతల్లి కతిథియై స్వామి యామెకు నూఱురూప్యముల నొసగి యటనుండి ఖేత్రీ మహారాజ సంతతాహ్వానముల ననుసరించి ఖేత్రీనగరమునకు అరిగెను. మహారాజు స్వామి నమితోత్సాహముతో గారవించి, మూడు వేలరూప్యముల నొసగి, రాష్ట్రోద్యోగులచేతను జనులచేతను విశేషధన మిప్పించెను. స్వామి యాధనమును వెంటనే మఠమున కంపెను. ఖేత్రీనగరమున నుపన్యసించుచు స్వామి యిట్లు వచించెను : "నేటిభారతీయులు హిందువులు గారు ; వేదాంతులును గారు. వారు 'నన్ను ముట్టుకొనకు' మను మతస్థులు. వంటయిల్లే వారి దేవాలయము. వంటకుండలే వారిదేవతలు. ఈస్థితి శీఘ్రముగా తొలగిపోవలెను. లేనిచో మనమతమునకే ముప్పు వాటిల్లును. ఉపనిషదౌన్నత్యమును జనులు గుర్తింపవలయును. వివిధ శాఖాసంప్రదాయములలోని యంతఃకలహము లంతరింపవలయును." అర్థరహితబాహ్యాచారములను బట్టుకొని ప్రాకులాడు చుండుటయే భారతీయులదాస్యమునకు మూలకారణమని స్వామి కాశ్మీర మహారాజునకు దెలిపియున్నాడు. స్వామి యిట్లు వచించెను : "నిజమైన పాతకములగు వ్యభిచారాది నీచకృత్యములు చేయువారిని ఈదినములలో ఎవ్వరును

---

అనుకీర్తనము—రాము డేలు హృదయమున కాముడును కాము డేలు హృదయమున రాముడు నుండనేరరు.

వెలివేయరు. ఇప్పుడు పాలిత్యమంతయు సంఘమున కుపద్రవమంతయు భోజ్యపానీయాదినిబంధనలతో గూడుకొనియున్నది!"

భారతదేశోద్ధరణమునకై స్వామి తనయుపన్యాసపర్యటనమున దెల్పిన కార్యవిధానమందలి ముఖ్యవిషయము లివి:

(1) వర్ణములలో ఉపశాఖలను బోనడచి, ఈయుపశాఖలలో అంతర్వివాహములు జరుపుకొనవలయును. వివాహములకు కొంతమితి యనునది యుండవలయును. "ప్రతివ్యక్తియు పెండ్లికై ఉబలాటపడుచు దేశమున మఱి పదుగురుబానిసలను గనుటవలన ప్రయోజనములేదు.

(2) తత్త్వబోధలకుముందు అన్నపానములను సమకూర్చి జనసామాన్యస్థితిని బాగుచేయవలయును. ఇందులకై జనులలో విద్యావ్యాప్తిచేయు టత్యావశ్యకము. బ్రాహ్మణులను పండితులను నిందింపరాదు. ఏలన భారతీయవిజ్ఞానఖనులగు వేదశాస్త్రములను నిలువబెట్టినవారు బ్రాహ్మణులే. వారు లేనిచో భారతదేశమున నీపాటికి సంస్కృత మంతరించెడిదే.

(3) దేశములో తగురీతిని సంస్కృతవిద్యావ్యాప్తి జరుగవలయును.

(4) బలిష్ఠులను మేధానిధులను వెలువడజేయు జాతీయవిశ్వవిద్యాలయములు స్థాపింపబడవలయును.

(5) త్యాగము, సేవ—ఇవియే మహోత్తమాదర్శములని భారతీయులు గుర్తింపవలయును.

(6) అంతఃకలహములను బోనడచి, జనులలో ఐకమత్యమును బెంపొందింపవలయును.

(7) సనాతనధర్మతత్త్వములను పాశ్చాత్యులకు బోధించుటకును వారి పారిశ్రామికవిద్యలను నేర్చికొనుటకును యువకులకు దగు శిక్ష గఱపి పంపవలయును.

## ముప్పదియొకటవ ప్రకరణము

# మఠమున స్వామిజీవితము : శిష్యశిక్షణము

శ్రీసేతుహిమాచలము స్వామి తనసందేశమును వ్యాప్తి యొనర్చియున్నాడు. దేశోద్ధరణకార్యక్రమము— నిర్మాణకార్యక్రమము—నిక నిర్వహింప వలసియున్నది. అందులకు శిష్యులను సమర్థుల నొనర్చుటకై స్వామి మఠమున కరుదెంచెను.

కలకత్తాలోని రామకృష్ణపురమున నవగోపాలఘోషనునొక భక్తుడు తనయింట శ్రీరామకృష్ణపూజామందిరమును నిర్మించి, విగ్రహప్రతిష్ఠాపనార్థము స్వామి నాహ్వానించెను. స్వామి సోదరశిష్యబృందసమేతుడై, వందలకొలది జనులు తన్ను వెంబడింప, "భావాతీతా! బాల రామకృష్ణ!" యను నర్థమిచ్చు పల్లవిగల వంగకీర్తనమును బాడుచు మహోత్సాహముతో బయలుదేఱెను. కాషాయవస్త్రధారియై స్వయముగా మృదంగము వాయించుచు, సామాన్య విరాగివలె వీథులవెంట భజనచేయుచు నేగుచుండిన యాయతివరేణ్యుని గని, "పాశ్చాత్యప్రపంచమున వేదాంతదుందుభిని మ్రోగించిన జగద్గురువరేణ్యుడా యీతడు!" అని జను లాశ్చర్యచకితులై, భక్తిపులకితాంగులై, "జయ! శ్రీరామకృష్ణపరమహంస! జయ! శ్రీవివేకానంద!" యని జయజయధ్వానములు సల్పిరి. స్వామి నవగోపాలఘోషు నింటికరుదెంచి, సమంత్రకముగా శ్రీరామకృష్ణవిగ్రహమును మందిరమున బ్రతిష్ఠించుచు జగత్ప్రసిద్ధమగు నీక్రిందిశ్లోకమును రచించెను :

> "స్థాపకాయచ ధర్మస్య సర్వధర్మ స్వరూపిణే,
> అవతారవరిష్ఠాయ రామకృష్ణాయ తే నమః."

1898-వ సంవత్సరారంభమున, గంగానదీతీరమున, బేలూరుగ్రామమున శాశ్వత శ్రీరామకృష్ణమఠనిర్మాణమునకై స్వామి పదునేనెకరముల

భూమిని యొకభవనమును గొనియుండెను. అందులకు విశేషధన మయ్యెను. ఆధనములో విశేషభాగ మర్పించు మహాభాగ్యము స్వామిశిష్యురాలగుము ల్లరు కన్యకు లభించెను. ఆంగ్లదేశమున స్వామి యుద్యమమునకై విశేషధనసాహాయ్య మొనర్చిన వనితామణి యీమెయే. ఇట్లే అమెరికాదేశవాసినియగు ఓలిబుల్ సతీమణి మఠమున శ్రీరామకృష్ణపూజామందిరమును నిర్మించుటకై వలయుధన మొసగి ధన్యురా లయ్యెను. మఠనిర్మాణ మంతటికిని మొత్తముమీద లక్ష రూప్యములైనవి.

అచిరకాలమునసే శ్రీరామకృష్ణజన్మదినోత్సవము తటస్థించెను. స్వామి యీసమయమున నుపనయనసంస్కారవిహీనులగు క్షత్రియులకును వైశ్యులకును మొత్త మేబదిమందికి దనశిష్యుడగు శరచ్చంద్రచక్రవర్తి పురోహితుడు కా నుపనయన మొనర్చెను. *

శ్రీరామకృష్ణజన్మోత్సవమునకు మూడుదినములకుముందు మహాశివరాత్రి దివసమున శిష్యులందఱును స్వామిని సాక్షాత్ పరమశివునివలె జటాజూట రుద్రాక్షమాలికాదులచే నలంకరించిరి. ఏమి శివస్వరూపసాక్షాత్కారము! స్వామి జగన్మోహనకంఠమున రామనామమును కీర్తింప భక్తబృందము తన్మయతనొందెను. అనంతరము స్వామి గిరీశచంద్రు నట్లే యలంకరించి, శ్రీరామకృష్ణునిగూర్చి ప్రసంగింపుడని వచింప, గిరీశుడు భక్తిపులకితాంగుడై, "పరమదయానిధియగు మన శ్రీరామకృష్ణభగవానునిగూర్చి నే నేమని వచింతును! బాల్యమునుండియు కామకాంచనవినిర్ముక్తులగు మీ సాన్నిధ్యమును అధమాధముడనగు నాకు లభింపజేసిన యాకరుణాపయోనిధి నిర్హేతుకకటాక్షమును నేను వర్ణింపజాలను" అని గద్గదకంఠుడై వచించి యూరకుండెను.

ఈసమయమున జరిగిన మఱియొక ముఖ్యవిషయము స్వరూపానందుని సన్న్యాసస్వీకరణము. స్వామి యీతనిపొండిలిని, త్యాగమును, జ్ఞానమును

* "ప్రతిదినము అధమము నూఱుసారులైనను గాయత్రీమంత్రమును జపింపుడు" అని స్వామి వారల కీసమయమున బోధించెను.

గాంచి, వెంటనే సన్న్యాసదీక్ష నొసగి, "స్వరూపానందునిరాకచే నేడు మనకు మహాలాభము చేకూరిన"దని వచించెను. అచిరకాలముననే యీతడు ప్రబుద్ధభారతపత్రికాధిపతియై, హిమాలయమునందలి అద్వైతాశ్రమమునకు అధ్యక్షపదవి నొంది తనయందలి స్వామియఖండవిశ్వాసమును ధ్రువపఱిచెను.

స్వరూపానందుని సన్న్యాసస్వీకరణమునకు నాలుగుదినములకుపూర్వము నోబుల్ కన్యకు స్వామి బ్రహ్మచర్యదీక్ష నొసగి నివేదితయని పేరిడెను. ఆమెకు ఆధ్యాత్మికశిక్ష గఱపుటకై స్వామి స్వరూపానందుని నియమించెను. నివేదిత భారతదేశమున కరుదెంచునపుడు స్వామి యామె కిట్లు వ్రాసియున్నాడు: "భారతదేశముకొఱకు నీవు కృషిచేసినను చేయకున్నను, వేదాంతమును నీ వంగీకరించినను అంగీకరింపకున్నను, ఆమరణము నేను నీకు బాసటనై నిల్చెదను. ఏనుగుదంతములు ముందునకు వచ్చునే కాని వెనుకకెన్నడును బోవు. ఇట్టివే మానవుని వచనములు." ఏమి శిష్యవాత్సల్యము!

నివేదిత భారతమాతృనివేదితమానసయై గంగానదీతీరమున కుటీరమును నిర్మించుకొని, జోసఫైన్ మెక్లాడ్, ఓలిబుల్, మున్నగువనితామణులతో గూడి బ్రహ్మచర్యవ్రతము నెఱపుచుండెను. స్వామి వారల కిట్లుద్బోధించెను: "మీ భావములను, ఆశయములను, ఆచారములను సమస్తము భారతీయముగ, హైందవసంప్రదాయానుగుణముగ నొనర్చుకొనుటకై ప్రబలయత్నమొనర్పవలయును. మీబాహ్యాంతరంగికజీవనమంతయు సనాతనబ్రాహ్మణ బ్రహ్మచారిణీ జీవనము ననుసరింపవలయును. ఇదియే మీకాదర్శము. మనశ్శుద్ధిపూర్వకముగా వాంఛించినచో మార్గము అలవడును. కాని మీపూర్వాభ్యాసములను, పూర్వజీవితమును మఱచిపోవలయును, మఱచునట్లు చేసికొవలయును. తద్విషయమైన స్మరణమేని కూడదు." వేలకొలది పరీక్షలచే, పరిశోధనలచే, పరిపూర్ణత నొంది, విదేశీయుల దాడులను సరకుగొనక, కాలపురుషునికరాఘాతము నెదిర్చి, సుస్థిరమై నిల్చిన భారతీయవిజ్ఞానము నిరుపమానమని స్వామిబోధలచే

వారు గ్రహించిరి. దారిద్ర్యమే త్యాగనియతియనియు త్యాగమే పరమ ధర్మమనియు వారు గుర్తించిరి. శబ్దస్పర్శాదిపాశములచే నింద్రియములు జీవుని సంసారబద్ధు నొనర్చుచున్నవనియు విషయములను విషతుల్యముగా నెంచి త్యజించుటయే మోక్షోపాయమనియు స్వామియుపదేశములవలన గ్రహించి, వారు పరమవిరక్తులై గురువాక్యశ్రవణమననాదినిష్ఠలతో ఆదర్శ జీవనము గడపుచుండిరి.

స్వామి యీసమయమున మఱల వైద్యుల సదుపదేశము ననుసరించి, శరీరారోగ్యమును బడయుటకై డార్జిలింగునకేగెను. అచటనుండగా కలకత్తాలో మహామారిజాడ్యము (Plague) జనులను నాశనముచేయుచున్నదనువార్త విని, స్వామి వెంటనే జనులకు తనశక్తికొలదియు సాయమొనర్చుటకై కలకత్తాకు తిరిగివచ్చెను. ప్రజాసాహాయ్యమునకై హిందీవంగభాషలలో స్వామి ప్రకటనపత్రికలను వ్రాయుచుండుట జూచి యొకసోదరశిష్యుడు, "స్వామిజీ! మీకు ధన మెచ్చటనుండి వచ్చును?" అని ప్రశ్నించెను. మహావేశపూరితుడై, కృతనిశ్చయుడై, వెంటనే స్వామి యిట్లు వచించెను: "ఏల? వలసినచో క్రొత్తగా గొనిన మఠప్రదేశము నమ్మివేయుదము. మనము సన్న్యాసులముకదా! వెనుకటివలెనే చెట్లక్రింద నివసించుచు, బిచ్చమెత్తుకొని బ్రదుకుటకు సంసిద్ధులమై యుండవలయును. మన కట్టెదుట బాధపడుచున్న జనులదుఃస్థితిని బోగొట్టగల్గినచో మఠాదుల నమ్మివైచిననేమి?" స్వామిలోకసేవాపరాయణత యెట్టిదో గనుడు! అదృష్టవశమున మఠమమ్మివేయవలసిన యవసరము రాలేదు. స్వామి ప్రకటనము గాంచి వివిధరాష్ట్రములనుండి వలసినంతధనమేకాక ప్రజాసేవకులుగూడ నరుదెంచిరి. ఇట్లు మహోత్కృష్టవేదాంతమతధర్మములను ప్రత్యక్షముగా ఆచరించి చూపిన **స్వామి యనుష్ఠానవేదాంతియని** లోకమునకంతకును బ్రకటితమైనది. తన మహోదారసేవలచే స్వామి జనులకు అఖండప్రేమపాత్రుడై యొప్పెను.

కలకత్తానగరమున వ్యాపించిన మహామారివ్యాధి నిర్మూలనమైనవెనుక

స్వామి కొందఱుశిష్యులతో నైనిటాలుమీదుగా అల్మోరానగరమునకు అరిగెను. నైనిటాలులో నొకమహమ్మదీయుఁడు స్వామిని సందర్శించి, యాతని దివ్య మూర్తిని యద్భుతశక్తులనుగాంచి, యచ్చెరువొంది యిట్లు వచించియుండెను : "స్వామిజీ! జనులు మిమ్ము అవతారపురుషుడని ప్రకటించునెడ, అట్టివారిలో మహమ్మదీయుఁడనగు నేనే ప్రథముడను సుడీ!" స్వామి నీతడు తనగురువుగా సంభావించి మహమ్మదానందుడని పేరిడుకొనెను.

నైనిటాలుజనులతో స్వామి యనేక ప్రసంగముల నొనర్చెను. ప్రాచ్యులతో బోల్చిచూచిన, పాశ్చాత్యజనసామాన్యమునకు మతవిషయకజ్ఞానము బండిసున్నయని తెలుపుచు స్వామి యీక్రిందివిచిత్రవృత్తాంతమును వెల్లడించెను : "ఒకప్పు డొకక్రైస్తవమతాచార్యుఁడు గనులలో బనిచేయు కూలీలకడ కరిగి బైబిలులోని ఘనవిషయములనుగూర్చి వారికి బోధింప యత్నించెను. బోధన పూర్తియైనవెనుక వా రెంతవఱకు గ్రహించిరో తెలిసికొన నెంచి, 'క్రీస్తు యెవ్వరో ఇపుడు మీకు తెలిసినదా?' యని ప్రశ్నించెను. కూలీలలో నొకడు వెంటనే, 'వాని నంబరు ఎంత?' యని ప్రశ్నించెను! అచట బనిచేయు కూలివాండ్రకు సంఖ్యలుండును. పాప మాకూలివాడు క్రీస్తు కూడ నొకసంఖ్యగల కూలివాడని తలచి, సంఖ్య తెలిసినచో, జట్టులోనుండి కనుగొందమని యట్లు ప్రశ్నించినాడు—"అని స్వామి నవ్వి, మఱల నిట్లు వచించెను : "పాశ్చాత్యులకు మతవిషయకపరిజ్ఞానము లేనేలేదు. అచట జనసామాన్యమునకు మత విషయములు తలకెక్కవు. భారతీయులలో ఎవ్వరైన లండనునకుగాని, న్యూయార్కునకుగాని వెడలి యచటి జనసామాన్యపుటవినీతిని జూచినచో, శరీరము కంపమెత్తును. ప్రాచ్యులలో అధమాధములకైనను లండనులోని పట్టపగటి 'హైడ్ పార్కు' దృశ్యములను జూచినచో, శరీరము జలదరించును.

"పశ్చిమఖండవాసులలో సామాన్యజనులు మతవిషయకజ్ఞానవిహీనులును అవినీతిపరులునే కాక, పట్టిపశుప్రాయులు. ఒకనాడు నేను లండన్‌నగరవీథిలో నడచుచుండగా నాకాషాయవస్త్రములను జూచి, యొకబొగ్గుబండిని తోలువా

డొకబొగ్గుకాలిని నామీద విసరినాడు. అదృష్టవశమున నది తప్పిపోయి చెవి ప్రక్కనుండి దూసికొనిపోయినది."

వస్త్రధారణమున తమనుండి యించుక భేదించినచో తాల్మి యుప్వ టయా? ఏమి దౌర్జన్యము!

స్వామి విద్యార్థిదశలో దనకు పరిచితుడగు యోగేశచంద్రదత్తును నైనిటాలులో గలిసికొనెను. అతడు పట్టభద్రులగు భారతీయవిద్యార్థులను ఇంగ్లాండునకు 'సివిల్ సర్వీస్' పరీక్షలకు బంపుటకై ధనము ప్రోగుచేయవలయు ననియు అయ్యది దేశోన్నతి కావశ్యకమనియు వచించెను. స్వామి యిట్లు పలి కెను: "అది పట్టిది! వారా, దేశక్షేమమునకై పాటుపడువారు! పశ్చిమఖండ మునకు అరిగి, స్వదేశీయాచారదూరులై మాతృదేశమునే మఱచి, వచ్చి, వారు ఎంతసేపు యూరపియనులతో సంసర్గమొనర్ప నభిలషింతురు. ఇది నిశ్చయము. అట్టివిద్యార్థులు పాశ్చాత్యవస్త్రధారణము, పాశ్చాత్యభోజనము, పాశ్చాత్య మర్యాదలు మున్నగు విదేశీయసంప్రదాయముల నన్నింటిని అనుకరించుచు, దేశభక్తిరహితులై, స్వార్థభూయిష్ఠులై మాతృదేశమునే మఱతురు." ఇట్లు వచించి, హైందవుల ఆర్థికదుఃస్థితినిగూర్చియు దేశీయపరిశ్రమాభివృద్ధియెడ జనుల యలక్ష్యమునుగూర్చియు దలపోసి, స్వామి కన్నీరు కాల్వలై పాఱ విలపింప నారంభించెను. ఇవ్విషయమునుగూర్చి యోగేశచంద్రు డిట్లు వ్రాసి యున్నాడు:

"ఆదృశ్యమును నాజన్మములో నెన్నటికిని మఱవజాలను! అతడు మహాత్యాగి, సర్వసంగపరిత్యాగి. అట్లయ్యును భారతదేశ మాతని హృదయాం తస్థమైయున్నది. భరతఖండ మాతని ప్రేమనిధానము. భారతదేశమునకై యాతడు పరితపించెను, విలపించెను, భారతదేశముకొసమే యాతడు మర ణించెను. భారతవర్ష మాతని హృదయములో, రక్తనాళములలో, స్పందించెను. వేయేల? భారతమాతయే యాతని హృదయాధిష్ఠాన దైవతము. స్వామిజీవిత ముతో భారతవర్షమునకు అవినాభావసంబంధ మేర్పడియున్నది."

నైనిటాలునుండి స్వామి నివేదితాదిశిష్యసమేతుడై అల్మోరానగరమున

కేగెను. భారతీయవిజ్ఞానమునుగూర్చి అల్మోరాలో స్వామి యొనర్చిన ప్రసంగముల నామె **శ్రీవివేకానందస్వామితో నొనర్పబడిన కొన్ని పర్యటనముల వృత్తాంతము** (Notes of Some Wanderings with the Swami Vivekananda) అను గ్రంథమున వర్ణించియున్నది. అతిరమణీయములును ప్రబోధాత్మకములునగు నిందలి భావములకు గొన్ని నిదర్శనములు :

"ఒకనాడు స్వామి శివాజీనిగూర్చియు మహారాష్ట్రులనుగూర్చియు బ్రసంగించుచు నిట్లు తెల్పెను: 'శివాజీ సన్న్యాసివేషమును దాల్చి, (యొక సంవత్సరము) పర్యటన మొనర్చుటచే తిరిగి రాయగడమున కేతేరగల్గెను. నేడు కూడ ప్రభుత్వమువారికి సన్న్యాసులనిన హడలు. కాషాయవస్త్రములమఱుగున నేశివాజీ దాగుకొనియుండునో యని వారిభయము!'

"మఱియొకనాడు శ్రీశుకునఖండజ్ఞానవైరాగ్యములను వర్ణించెను. శ్రీశుకుడే స్వామికి ఆదర్శయోగి—జగత్తును లీలామాత్రముగ దర్శించిన పరమహంసచక్రవర్తి. శ్రీరామకృష్ణు డెట్లు బాలనరేంద్రునిగూర్చి 'నాశుకు' డని వచించియుండెనో కాలాంతరమున మాకు దెలియవచ్చెను....భగవద్గీతా ప్రాశస్త్యమును శుకునౌన్నత్యమును గొనియాడుచు, 'నే నెఱుంగుదును (గీతాతత్త్వమును), శుకు డెఱుంగును, ఒకవేళ వ్యాసు డెఱింగియుండవచ్చును—కొ-ల-ది-గా!' అని పరమశివుడు పల్కిన వాక్యములను స్వామి యుదాహరించెను. ఆసమయమున దివ్యానందమూర్తిభావమో యన విరాజిల్లిన యాతని యపూర్వముఖవికాసమును నాజన్మములో ఎన్నటికిని మఱవజాలను....స్వామి యిట్లు వచించెను: 'అఖండ సచ్చిదానందసాగరామృతమును పుడిసెడు గ్రోలు మహాభాగ్యము శ్రీశుకునకుమాత్రమే లభించెను! ఋషులలో అనేకులు తత్సాగరఘోషను మాత్రము విని మరణింతురు. కొలదిమందికి దర్శనమును, ఏయల్పసంఖ్యాకులకో చవిచూచుభాగ్యమును లభించును. కాని శ్రీశుకుడమృతపాన మొనర్చిన ఋషివరేణ్యుడు!'

"బుద్ధునిగూర్చి స్వామి ప్రసంగించినసమయము చిరస్మరణీయము. ప్రసంగవశమున స్వామి పల్కినయొకమాటను బట్టుకొని బౌద్ధులవలెనే

స్వామియు వేదనిందకుడని తలచి శ్రోతలలో నొకరు, 'స్వామీ! మీరు బౌద్ధులని నే నింతవఱు కెఱుగనైతిని!' అని పల్కిరి. బౌద్ధశబ్దమును వినినంతనే ప్రఫుల్లవదనారవిందుడై స్వామి యావ్యక్తిని గాంచి యిట్లు పల్కెను: 'తల్లీ! బుద్ధునిదాసదాసానుదాసుడను నేను. స్వార్థరహిత కర్మపరాయణుండు, సమస్త సృష్టిజాతమును తన వినిర్మలప్రేమహస్తములతో ఆలింగన మొనర్చుకొనిన కరుణామూర్తియునగు నాప్రభువరేణ్యునకెనయగు వారెవ్వరు? చక్రవర్తియుం త్యాగిచక్రవర్తియు నగు నా మహనీయుడు, ఆహా! క్షుద్రమగు నొక మేకను రక్షించుటకై తన ప్రాణముల నర్పింప సమకట్టెనే! చండాలుని యాతిథ్యమును గొని యాతని దీవించిన యా ఉదారహృదయుని, ఒకపులియాకలి బాపుటకై తనశరీరము నర్పించిన యామహనీయుని ప్రేమము, ఆహా! సమస్తలోకాతీతము! భావనాతీతము!! నేను బాలుడనై యుండగా ఆ మహనీయుడు నాగదిలోనికి వచ్చి సాక్షాత్కరించెను. పరమేశ్వరు డాతడని గ్రహించి నేనాతనికి పాదాక్రాంతుడనైతిని!' "

పరిపూర్ణముగా విమర్శించిననేకాని నివేదిత స్వామివచనముల నంగీకరించెడిదికాదు. ప్రేమపూర్ణుడై యొకనాడు, బోధనానంతరము, స్వామి త న్నాశీర్వదింప దనకు గలిగిన ఆత్మవికాసమునుగూర్చి యనంతరము ఆమె యిట్లు వ్రాసెను :

"స్పర్శచే శ్రీరామకృష్ణు డొరులకు జ్ఞానదాన మొనర్పగల్గిన మహిమాన్వితుడు. అట్టి తన దివ్యశక్తిని నరేంద్రుడును జూపు సమయము రాగలదని పూర్వమే యాతడు శిష్యులకు దెల్పియుండెను. అందలి సత్యమును స్వానుభవముచే నేనిపుడు గ్రహించితిని....ఆల్మోరాలో నాటి సాయంసమయమున ధ్యానించుచుండ, హేతువాదముచే నాకంతవఱు కలభ్యమైన యనంతమంగళ స్వరూపము అనుభవగోచరమయ్యెను...సద్గురువరేణ్యులు మనసంకుచితదృష్టిని తొలగించి సమ్యగ్దృష్టిని గల్గింపగలరని గ్రహించుట కదియే నాకు మొదటి సారి."

ఈసమయమున పావాహారిబాబాయొక్కయుం గుడ్విన్ మహాశయుని యొక్కయుం మరణమునుగూర్చి విని స్వామి పరితపించెను. కాని, దుఃఖ

వార్తను విననప్పు డాతని విచారము భక్తిభావమున లయించెను. నివేదిత యిట్లు వ్రాసెను :

"'త్యాగరహితమైన భక్తి పతనహేతువు, వినాశమునకు బుట్టినిల్లు' అని తెల్పుచు స్వామి యిట్లు వచించెను : 'వైరాగ్యము నిలువ వలయునన్న, తీవ్రతపోనియమముల నవలంబింపవలయును. స్వార్థపరతను చల్లార్పవలయును. లేనిచో ఏనిముసమునసైనను సంసారదావానలమున బడి మనఃకమలము మ్రగ్గిపోవుట కవకాశము కలదు.' ఇట్లు వచించి, 'ముక్తిమార్గమున చరించు మనుజు డెపుడు అనపాయు'డను ప్రశ్నకు సమాధానముగా నొకచిన్నకళ్లేరమున బూడిదె నిడి పంపిన సన్న్యాసినియొక్క వృత్తాంతమును స్వామి మాకు దెల్పెను. ఏలన, కామమును జయించు టంత కష్టసాధ్యము. ఏనిముసమునసైనను విజేత నిర్జితుడు కావచ్చును."

ఏమైనను గుడ్విన్ మరణమునుగూర్చి స్వామి పరితప్తుడై యిట్లు ఘోషించెను : "...హాతవిధీ! గుడ్వినుని జంపిన నిన్ను జెనకి చెండాడినను పాపములేదు!—గుడ్విన్ బ్రదికియున్నచో, ఎట్టి ఘనకార్యము లొనర్చియుండునో కదా!" అనంతరము స్వామి యిట్లు వ్రాసెను :

"గుడ్వినునకు నాకృతజ్ఞతాఋణము నెన్నటికిని దీర్పజాలను. నా భావము లెవ్వరికైననుపయోగపడినచో, అందలి ప్రతిపదమును నిరుపమానము, నిరంతరమునగు నా మహనీయుని స్వార్థరహితసేవలవలననే ప్రకటితమయ్యె నని గ్రహింతురు గాక. గుడ్విన్ మహాశయుని మరణముచే ఎనలేనిప్రాణమిత్రుని, శిష్యోత్తముని, అసహాయశూరుని గోల్పోయితిని. పరోపకారపరాయణుడగు నాతని మరణముచే లోకమునకు తీరనినష్టము సంభవించినది."

దేశభక్తుడు, మహావిద్వాంసుడు నగు అశ్వినీకుమారదత్తు స్వామిని అల్మోరానగరమున దర్శించెను. *అశ్వినీకుమారుడు తన్ను 'స్వామిజీ' యని సంబోధింప స్వామి వెంటనే యిట్లు పల్కెను : "నేను మీకెపుడు స్వామినైతిని?

*అశ్వినీకుమారుడు స్వామిబస కేగి, "నరేంద్రదత్తునిబస యిదియేనా?" యని ప్రశ్నింప యువకుడగునొక సన్న్యాసి యించుక కుపితుడై యిట్లని యెను : "అయ్యా! ఇచట నరేంద్రదత్తు అనువారెవ్వరును లేరు. నరేంద్ర

నే నింకను పూర్వపునరేంద్రుడనే సుడీ! గురుమహాశయుం డేపేర నన్ను బిలిచెనో ఆపేరు నాకు అమూల్యమగు పెన్నిధి. న న్నాపేరనే పిలువుడు."
అంత వారిరువురకు నీక్రింది సంభాషణము జరిగెను :

అశ్వినీకుమారుడు : "ప్రపంచపర్యటన మొనర్చి యనేకలక్షలజనులకు ఆధ్యాత్మికోత్తేజము గల్గించితిరిగదా. భారతదేశశ్రేయోపాయమేమో నాకు దెల్పుడు."

స్వామి : "గురుదేవుడు దెల్పిన విషయములకు మించి నేజెప్పవలసిన దేమియుంలేదు. ధార్మికజీవనమే మన ప్రాణము. ధర్మప్రతిష్ఠితమైనప్పుడే యే సంస్కారణమునైనను భారతజన సామాన్య మామోదించును, సంస్కారణములు ధర్మద్వారమున వెలువడవలయును. ఆమహనీయుండే యిట్లు తెల్పియున్నాడు. తద్వ్యతిరిక్తముగా నొనర్పయత్నించుట గంగా ప్రవాహమును హిమాలయ మందలి యుత్పత్తిస్థానమునకు మఱల్చి నూతనమార్గమున బ్రవహింపజేయ యత్నించుటే."

అశ్వినీ. : "జాతీయమహాసభ (Congress) చేయుచున్న కార్యములు దేశక్షేమజనకములని నమ్మెదరా?"

స్వామి : "నమ్మజాలను. కాని, లేనిబావకంటె గుడ్డిబావ మేలనుటకు సందియములేదు. నిద్రించుచున్న భారతజాతిని సర్వవిధములను మేల్కొల్పుట శ్రేయస్కరము. జనసామాన్యము నుద్ధరించుటకై 'కాంగ్రెస్' ఏమి చేయుచున్నదో చెప్పుడు. ఏవో కొన్ని తీర్మానములు చేయుటతోడనే స్వాతంత్ర్యము హస్తగతమగుననుకొనుచుంటిరా? నే నట్లునమ్మను. మొట్టమొదట జనసామా

---

దత్తు చనిపోయి చాలకాలమైనది. ఇచటనున్నవారు శ్రీవివేకానందస్వామిజీ." అందులకు వివేకానందస్వామిజీతో దనకు పనిలేదనియుం పరమహంసదేవుని నరేంద్రుని గలిసికొనుటకే తానచటికి వచ్చితిననియుం అశ్వినీకుమారుడు చెప్పుచుండ స్వామి లోపలనుండి యీసంభాషణనుగూర్చి విని, సన్న్యాసిని మందలించి, అశ్వినీకుమారున కెదురేగి, వినయపూర్వకముగా నమస్కరించెను.

న్యమును ప్రాణవంతమొనర్పవలయును. క్షుద్బాధ నివారణమైనపక్షమున స్వాతంత్ర్యమును జనులే ఆర్జించుకొందురు. వారికోసమేమైనను కృషిచేసిన యెడల 'కాంగ్రెస్'తో నే నేకీభవింతును. ఆంగ్లేయుల సుగుణముల నలవరచు కొనుటయు మన కావశ్యకమే."

అశ్వినీ.: "మతము లేక ధర్మమనగా ఏదైన ప్రత్యేక సంప్రదాయ మనియా మీయభిప్రాయము?"

స్వామి: "ప్రత్యేకసంప్రదాయమునా గురుదేవుడు బోధించినది? ఐన నాతడు వేదాంతమునుగూర్చి సర్వధర్మసమన్వయమతమనియు సర్వతో ముఖధర్మమనియు జెప్పియున్నాడు. అందుచే నేనును వేదాంతమతమునే బోధింతును. కాని నామతసారము **బలము** (శారీరమానసికాధ్యాత్మిక బలము). గీతోపనిషద్భాగవతధర్మములలో నేదియైనను కానిండు, మనః స్థైర్యము నాత్మోత్తేజమును గల్గింపని ధర్మమును నేను ధర్మముగా బరిగణింపను. ధర్మమనగా బలము, శక్తి: బలమునకు మించినదేదియు లేదు."

అశ్వినీ.: "నేనేమి చేయవలయునో దయతో జెప్పుడు."

స్వామి: "మీరు విద్యావిషయకమగు కృషి చేయుచున్నారుకదా. అదియే సరియైనపని. మహాశక్తి మీయందు కార్యరూపము నొందుచున్నది. జ్ఞానదానము మహోత్తమదానము. మానవులను జేయు విద్య జనులలో వ్యాప్తి చేయుడు. పిమ్మట గమనింపవలసినది శీలనిర్మాణము. మీవిద్యార్థులశీలము వజ్రతుల్యముగా నొనర్పుడు. వంగయువకులయస్థులనుండి భారతదేశదాస్యమును విచ్ఛిన్నము చేయు వజ్రాయుధము నిర్మింపబడవలయును. అర్హులగు యువకులను గొందఱను నాకు ఈయగలరా? ఇచ్చినచో ప్రపంచము నుఱ్ఱూతలూగించెదను.

"ఇక రాధాకృష్ణకీర్తన లెచ్చట చెలరేగుచున్నను యథేచ్ఛగా కొఱడా కట్టి వినియోగింపుడు. దేశమంతయు అధోగతిపాలగుచున్నది. ఆత్మనిగ్రహము లేనివారా, ఇట్టికీర్తనలను బాడుచు చిందులుద్రొక్కుట! మనోమాలిన్య మణ

మాత్రమున్నను అందలి మహోన్నతాదర్శములకు మహాప్రతిబంధకము. ఇది యేమి యొకసక్కెమా? కావలసినంత కాలము పాడితిమి; చిందులుద్రొక్కితిమి,—కొంతకాలమువఱకు విరమించిన మఱేమియు ప్రమాదములేదు. ఇంతలో దేశము బలాఢ్యమగుట కవకాశము చిక్కును.

"ఇక నస్పృశ్యులనబడు మాలమాదిగలు, పాకివాండ్రు మున్నగువారందఱియొద్దకును బోయి ఇట్లు ఘోషింపుడు: 'మీరే భారతజాతిప్రాణము. మీయందే ప్రపంచపరివర్తనము గల్గించు ననంతశక్తి కలదు. లెండు. బంధవిముక్తులు కండు. ప్రపంచమంతయు మిమ్ము జూచి ఆశ్చర్యపడగలదు. పోయి వారికొసము పాఠశాలలను నెలకొల్పుడు, వారి కుపనయనము నొనర్పుడు."

అశ్వినీకుమారుడు వెడలుటకుముందు స్వామి నిట్లు ప్రశ్నించెను: "చెన్నపురిబ్రాహ్మణులు మిమ్ము వేదాధికారములేని శూద్రుడని పలుకగా, 'నేను శూద్రుడనైన, చెన్నపురి బ్రాహ్మణులారా! మీరు చండాలురకెల్ల చండాలు' రంటిరట నిజమా?"

స్వామి: "నిజమే."

అశ్వినీ.: "ఆచార్యులు, ఆత్మనిగ్రహసంపన్నులునగు మీవంటివారట్లు మఱల నిందించుట ధర్మమా?"

స్వామి: "ధర్మమని యెవరందురు? నాది న్యాయ్యమని నే నెన్నడును చెప్పలేదు. వారి యధికప్రసంగముచే నాకొడలు మండగా నోటినుండి యామాటలు జారినవి. ఏమిచేయుంట? కాని వానిని సమర్థించువాడను కాను."

ఈమాటలు విని అశ్వినీకుమారుడు స్వామి నాలింగనమొనర్చుకొని యిట్లు పలికెను: "నేడు మీయందు నాగౌరవభావము సహస్రగుణాధికమైనది. మీరు ప్రపంచవిజేతలగుటకు, శ్రీగురుదేవునకు అత్యంతప్రేమపాత్రులగుటకు, కారణము నేనిపుడు గ్రహించితిని!"

## ముప్పదిరెండవ ప్రకరణము

# కాశ్మీర అమరనాథ క్షీరభవానులలో స్వామిదివ్యానుభవములు

స్వామి శిష్యసమేతుడై ఆల్మోరానగరమునుండి మనోహరమగు పర్వతారణ్య ప్రదేశముల మీదుగా కాశ్మీరమును జేరెను. ఎచట కేగినను ఏకాంతవాసము, మౌనము—ఇవియే జ్ఞానసాధన కాలవాలమని స్వామి శిష్యుల కిట్లు తెల్పెను :

"ప్రాచ్యపాశ్చాత్యవిజ్ఞానమార్గములకు గల భేదము నాకీ విషయమున నద్భుతముగా గోచరించుచున్నది. ఇరువదియేండ్లు ఎవ్వడైన నేకాంతవాసము చేసి మతిభ్రష్టుడు గాకుండ నుండజాలడని యూరపియనులు భావింతురు. భారతీయులన్ననో, ఇరువదియేండ్లు ఏకాంతవాసముచేసిన నేకాని మానవుని పరిపూర్ణునిగా పరిగణింపరాదని భావింతురు."

కాశ్మీరమున స్వామి భారతీయులదేవాలయనిర్మాణ కౌశలమును బ్రశంసించుచు నిట్లు పల్కెను: "దేవాలయ నిర్మాణమున భారతీయులెట్టి ప్రతిభాతిశయమును బ్రకటింతురో కనుడు! అందులకై వారెప్పుడును అద్భుతమగు ప్రకృతిరమ్యప్రదేశములను గైకొందురు. ఈదేవాలయము (తక్త్ఇ సులేమాన్ అను దేవాలయము) కాశ్మీరమునంతను బరిపాలించుచున్న దననొప్పును. బాలసూర్యరక్తిమతో వెల్గొందు నీహారిపర్వతము నీలవర్ణజలములనుండి సింహగంభీరాకృతితో లేచుచున్నది. ఇక మార్తాండదేవాలయమున కావచ్చునికనుమ పాదపీఠమై యలరారుచున్నది."

అటనుండి శ్రీనగరమున కేగుచు వైరాగ్యప్రపూర్ణుడై స్వామి యిట్లు వచించెను: "సంసారమున జనకునివలె వర్తించు టంత సులభమని తలపకుడు. సిరిసంపదలను లక్షింపక, పేరుప్రతిష్ఠల నీసడించి, భార్యాపుత్రాదులయెడ మమతాగంధరహితుడై, నిస్సంగుడై రాజ్యపరిపాలన మొనర్చు టెంతకష్టమో.

కదా! పశ్చిమఖండమున నొకరివెనుక నొకరు వచ్చి, నాతో తాము జనక స్థితి నొందితిమని చెప్పియున్నారు. వారికి నేను, 'మీవంటి మహనీయు లింకను భారతదేశమున బుట్టలేదు!' అనిమాత్రమే చెప్పియుంటిని.

శ్లో. 'మేరుసర్షపయో ర్యద్వత్, సూర్య ఖద్యోతయోరివ,
సరిత్ సాగరయో ర్యద్వత్, తథా భిక్షు గృహస్థయోః.'

మేరుపర్వతమునకును ఆవగింజకును, సూర్యునకును మిణుగురుబురువు నకును, సముద్రమునకును పిల్లకాలువకును ఎంతటి వ్యత్యాసము కలదో సన్న్యాస జీవనమునకును గార్హస్థ్యజీవనమునకును అంతటివ్యత్యాసము కలదు. ఇవ్విషయ మును గ్రహించి, మీబిడ్డలకు బోధించు టెన్నడును మఱవకుడు. బ్రహ్మచర్య సన్న్యాసవ్రతములను దాల్చియు ఆవ్రతములను బరిపాలింపజాలని భ్రష్టులను సహితము నే నాశీర్వదింతును. ఏలన వారును జీవితాదర్శమును గమనించి పరులకు గొంతవఱకు మార్గదర్శకులగుచున్నారు. సర్వసంగపరిత్యాగచిహ్న మగు కాషాయమే గాని లేనిచో, భోగలాలసత్వమును సంసారమోహమును లోకమున మనుష్యత్వము నీపాటికి నాశనము చేసివైచియుండెడివి."

భారతజాతీయాదర్శములనుగూర్చి ప్రసంగించుచు స్వామి యిట్లు వచించెను: "సన్న్యాసి కాంచనవాంఛనే ఆత్మహత్యగా పరిగణింపవలయును."

"దేశోన్నతి, వంశాభివృద్ధి—ఇవియే హైందవవివాహాదర్శములు."

"ఓ పాశ్చాత్యులారా! మీరు దుఃఖారాధకులు! మీదేశమందంతటను నాకట్లు గోచరించినది. పశ్చిమఖండమున సాంఘికజీవనములోనున్న బండారము ఇది: పైకి గానవచ్చునవి పకపకనవ్వులు, లోపల జూచిన వలవలయేడ్పులు. ఇచటనో, బాహ్యమునకు గాన్పించునది దుఃఖమే, కాని యంతరంగమున జూచిన కేవలనిశ్చింత, ఉల్లాసము."

నాయకలక్షణములనుగూర్చి స్వామి యిట్లు వచించెను:

"ఎవ్వడైన నొక్కజన్మములో ప్రజానాయకుడు గాజాలడు. జన్మతః మహానాయకుడై పుట్టవలయును. ఏలన, కష్టమంతయు సంఘస్థాపనము

నందుగాని, కార్యక్రమకల్పనమునందుగాని లేదు. నాయకలక్షణము, నాయకత్వార్హతానిదర్శన మిది : భిన్నాభిప్రాయములు, భిన్నసంప్రదాయములు గల జనులను వారి సమానాశయములనుబట్టి యేకసూత్రబద్ధులనుగా నొనర్చి, నడపుటలోనే నాయకుని శక్తిసామర్థ్యములు గనవచ్చును. ఈ కార్య మెన్నటికిని ప్రయత్నముచే సాధ్యముకానేరదు; కేవలము స్వతస్సిద్ధముగా జరుగవలసిన కార్యమిది.'' *

స్వామి మహావేదాంతియయ్యును, ఆచార్యశేఖరుడయ్యును, మహోల్లాసవంతుడై తన హాస్యచమత్కృతులచేతను, హేళనపూర్వకములగు కథలచేతను శ్రోతలను కడుపుబ్బ నవ్వించును! స్వామి పశ్చిమఖండములో నుండగా క్రైస్తవమతాచార్యు లీలక్షణమును గాంచి వెగటుచెందిరి. వారిలో గొందఱు తత్త్వవేత్తలు ఆతని సమీపించి, ''స్వామీ! నీవు మతాచార్యుడవు. సామాన్యులవలె నీవు నవ్వుట, పరిహాసములు చేయుచుంటయు తగదు. అట్టిప్రవర్తన నీకు అనుచితము—'' అని యుపదేశింప స్వామి యిట్లు బదులుచెప్పెను: ''అమృతపుత్రులము, బ్రహ్మానందపుత్రులము, మనము. అట్టి మన మేల మొగము ముడుచుకొని విచారగ్రస్తులమై యుండవలయును?''

ఇస్లామాబాదులోనుండగా స్వామి యొకప్పుడు తన యమృతత్వమును మృత్యుంజయత్వము నిట్లు ప్రకటించెను: ''మృత్యు వెపుడాసన్నమైనను నేను సంసిద్ధుడను. బాహ్యవిషయములనుగూర్చి నాకు స్పృహగాని, భయముగాని, సంశయముగాని లేశమును లేదు. మరణ మాసన్నమైనంతనే తత్ప్రయత్నమున

---

* దేశభక్తినిగూర్చి ముచ్చటించుచు స్వామి జపాన్‌దేశీయుల నిట్లు ప్రశంసించెను : ''దేశభక్తివిషయమున జపాన్‌దేశీయులకు గ్రీసుదేశస్థులుగాని మతెవ్వరుగాని సాటిరారు. వాక్శూరులు కారు, వారు కార్యశూరులు;— దేశమునకై సమస్తము వారు త్యజింతురు. తమ రాజకీయప్రభుత్వములను దేశైక్యముకొఱకై ధారపోయు జమీందారులు నేడు జపాన్‌దేశమున గలరు. దేశద్రోహియగువా డొక్కడును జపాన్‌దేశీయులయుద్ధమున గానిపింప లేదు. చూచితిరా, వారిదేశభక్తి!''

నిమగ్నుడనై యుండును.” ఇట్లు వచించి రెండు బొమ్మతాళ్లను జేపట్టి యొండొంటిని టక్కున దాకి, “నాహృదయ మింతగట్టిది : ఏలన, భగవత్పాదారవిందములను నేను స్పృశించితిని” అని వచించెను ! *

నివేదిత తన్ననుగమింప కాశ్మీరమునుండి స్వామి యమరనాథమున కేగెను. తీర్థయాత్రలో నాచరింపబడు స్నానదేవతాసందర్శనాదులను స్వామి యథావిధిగా బరిపాలించును. పుణ్యతీర్థములలో గ్రుంకులిడును; దేవతాదర్శనమునకు ముం దుపవసించి, ఫలపుష్పాదినైవేద్యములచే దేవతామూర్తుల నర్చించి మఱి భుజించును; దేవతామూర్తులకు సాష్టాంగ మొనర్చును; జపమాలతో జపించును; దేవాలయప్రదక్షిణ మొనర్చును.

శ్లో. “న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసఙ్గినామ్,
జోషయే త్సర్వకర్మాణి విద్వా న్యుక్త స్సమాచరన్.”

‘కర్మమునం దాసక్తులైన యజ్ఞానులకు జ్ఞాని బుద్ధిభేదమును గల్గింపరాదు : మఱియేమన, దాను పూనికతో కర్మములను జేయుచుండి వారిచేగూడ కర్మములను జేయింపవలెను’ అను గీతావాక్యము ననుసరించియే స్వామి సర్వదా వర్తించెను.

---

* బౌద్ధహిందూక్రైస్తవధర్మముల నొండొంటితో బోల్చుచు స్వామి యీసమయమున నొనర్చిన ప్రసంగము లెంతయు గమనింపదగియున్నవి. స్వామి తనశిష్యుల కిట్లు తెల్పెను : “వైదికమతశాఖయే బౌద్ధమతము: అందుండి రోమన్ క్యాతలిక్కులు తమ కర్మకాండను గ్రహించినారు. వైదిక కర్మకాండలో నివేదనమున్నది, మీరు Blessed Sacrament అనుదానినే మేము ప్రసాదము అందుము. మీరు మోకరించి నివేదనచేయుచో (ఉష్ణదేశములలోని యాచారము ననుసరించి) మేము కూర్చుండి చేయుదుము, ఇదియే భేదము. టిబెట్ (అనబడు నుత్తరకురువర్షము)న జనులు మోకరించి నివేదన చేయుదురు. ఇక ధూపదీపములు, సంకీర్తనమును వైదికకర్మకాండయందును గలవుగదా....మీరు Tonsure అనునది శిరోముండనాచారమున భారతదేశమునందును గలదు....సన్న్యాసులును సన్న్యాసినులును బౌద్ధమతమునకు పూర్వమే వైదికమతమున వెలసియుండిరి....”

స్వామిసన్నిధిని పాశ్చాత్యశిష్యురా లుండుటగాంచి పూర్వాచారపరాయణులగు సాధువులు మొట్టమొదట స్వామిపై ధ్వజమెత్తినను, ఆతని జ్ఞాన వైరాగ్యప్రతిభాతిశయమును, నివేదితభక్తిసౌజన్యములను గాంచి స్వామికి పాదాక్రాంతులైరి. వందలకొలదియాత్రికులును సన్న్యాసులును సర్వదా స్వామిని సందర్శించి యాతని వాక్యామృతమును గ్రోలి చనుచుండువారు.

శిష్యసమేతుడై స్వామి యత్యున్నతమగుమంచుకొండలపై వెలసిన యమరనాథగుహాలయమునకేగెను. భస్మధారియు భక్తిప్రపూర్ణుడు నగు స్వామి శివుని హిమలింగముప్రోల సాష్టాంగవందన మొనర్చి భావసమాధినిమగ్నుడయ్యెను. అమరనాథపరమశివుడు తనకు సాక్షాత్కరించి స్వేచ్ఛామరణము నొందునట్లు వరమొసగెనని మాత్రమే స్వామి తన దివ్యానుభవమునుగూర్చి తెల్పియున్నాడు. అచట దివ్యావేశపారవశ్యముచే స్వామి శరీరము ప్రకంపితమై అపూర్వపరిణామము నొందెను. అనంతర మొకవైద్యుడు స్వామిని గాంచి యిట్లు వచించెను: "స్వామిజీ! అది నిజముగా మరణావస్థ. మీ హృదయ మపుడు స్తంభించి యుండెడిది. కాని యందులకు మాఱు శాశ్వతమగు వృద్ధినొందినది!"

యాత్రలో నివేదితకు హిందూమతోదారాశయములనుగూర్చి స్వామి పెక్కుబోధ లొనర్చి, "హిందూమతము నిక **వీరహిందూమతము** నొనర్పవలసియున్న" దని వచించెను. "స్వామిజీ! బలాఢ్యులు బలహీనుల నణగద్రొక్కుసమయమున మన కర్తవ్యమేమి?" అని యొక ధర్మజిజ్ఞాసువు ఇంతకుముందు స్వామిని ప్రశ్నింప స్వామి యిట్లు ఘోషించెను: "సంశయ మేల? అట్టి బలాఢ్యులను డొక్కచీల్చివేయుము. అదియే నీ కర్తవ్యము." ఈరీతినే మఱియొకప్పు డిట్లు వచించెను: "**అలసతచేతనో, అశక్తత చేతనో క్షమచూపుటకంటె పోరాడుటయే మంచిది. దేవతా సైన్యములను సైతము అవలీలగా జయింపగల్గుదువేని క్షమ చూపుము**.... ప్రపంచము యుద్ధరంగము. వీరుడవై ప్రతికూలురను జయిం

పము." మఱియొకరు, "స్వామిజీ! దురాత్ముల నెదుర్కొని ధర్మరక్షణయత్నమున ప్రాణముల నర్పింపవలెనా? లేక శాంతితో నూరకుండవలయునా?" యని ప్రశ్నింప స్వామి మెల్లగా, "ప్రతీకారమును నే నామోదింపను" అని చాలసేపూరకుండి, "—సన్న్యాసులవిషయమున సుమీ. ఆత్మసంరక్షణము గృహస్థధర్మము!" అని వక్కాణించెను. భారతీయు లీ ధర్మతత్త్వమును గమనింతురుగాక!

స్వామి కాశ్మీరములో నుండగా మహారాజు స్వామియందును స్వామియనుచరులందును విశేషగౌరవాదరములను జూపెను. కాశ్మీరమహారాజు తన రాష్ట్రమున మఠమునకును సంస్కృతకళాశాలకును వలయుస్థలము నొసగదలచి స్వామి నాహ్వానించెను. స్వామి వెడలి తగినస్థలము నెన్నుకొనెను. కాని యచటి రాజప్రతినిధి (English Resident) స్వామి యెన్నికను త్రోసివైచినాడు! దేవుడు వరమిచ్చినను పూజారి వరమీయడు కదా! స్వామి దూరదృష్టిచే అయ్యది తగిన తావుకాదనియు అంతయు భగవత్సంకల్పమనియు గ్రహించి యూరకుండెను.

అమరనాథయాత్రానంతరము స్వామిమానసము జగన్మాతృభావమున లగ్నమయ్యెను. నావ నడపు నొక మహమ్మదీయుని పుత్రికను—నాలుగేండ్ల బాలికను—ఉమాకుమారీభావమున స్వామి యీసమయమున నారాధింపసాగెను. ఎచట జూచినను జగన్మాతయే తనకు సాక్షాత్కరించుచుండెననియుం తల్లి బిడ్డను నడిపించురీతిని జగన్మాతయే, లేక గురుదేవుడే తనచేయి బట్టుకొని నడిపించుచుండెననియు స్వామి శిష్యులకు దెల్పెను. ఇట్టి దివ్యానుభవమున తన్మయుఁడై, యొకనాటి సాయంకాలమున '**కాళీమాత**' (Kali The Mother) అను మనోహరమగు ఖండకావ్యమును రచించెను. కావ్యము పూర్తియైనంతనే భావోద్వేగముచే హస్తమునుండి కలము క్రింద బడిపోయెను. స్వామి మహోన్నతభావసమాధినిమగ్నుడయ్యెను.

జగన్మాతృస్వరూపము నెంచి స్వామి యిట్లు వక్కాణించెను: "శాంత్యా

నందదాయకమగు ననుభవములందువలెనే దోషము, దుఃఖము, భీతి, వినాశము ననువానియందును అప్రయత్నముగా లోకేశ్వరీవిలాసమును గుర్తింపనేర్చి కొనుడు !" "కాళికాంబా! కపాలమాలికచే వారు నిన్నలంకరించుట నిజమే; కాని భయాన్వితులై యెత్తిగిలి, 'దయామయీ!' యని నిన్ను వారు సంబోధింతు రనంతరము!" "ఘోరమూర్తిని—కరాళిని—పూజించుటచేతనే ఘోర సంసారసాగరమునుండి తరింపనగును. మృత్యువును ధ్యానింపుడు! మృత్యువును ధ్యానింపుడు! కాళిని—మహాకాళిని—సంహార కాళిని—అర్చింపుడు! ఆమెయే పరబ్రహ్మము! ఆమె శాపముకూడ పరప్రసాదమే. హృదయమే శ్మశానము కావలయును; అందు కామక్రోధాదిశత్రువులను భసీపటల మొనర్పవలయును. అపుడు జగజ్జనని మనకు ప్రత్యక్షమగును!"

స్వామి యటనుండి యొంటరిగా శ్రీరభవాని కరిగెను. వారముదినములచట నిత్యము శ్రీరభవానీదేవ్యాలయమున దేవిని శ్రీరాదులతో నర్చించి జపహోమాదుల నాచరించెను. మఱియు ప్రత్యూదయమును అచట నొక బ్రాహ్మణపండితుని కుమార్తెను ఉమాకుమారీభావమున అర్చించి మహోజ్జ్వల భక్తిపూరితు డయ్యెను.

శ్రీరభవానిలో స్వామిజీవితమున నొక ముఖ్యసంఘటనము జరిగెను. మహమ్మదీయ కరాసిఘాతమున కెరయై చాలవఱకు శోభను గోల్పోయిన భవానీదేవ్యాలయమును గాంచి, స్వామి ఖిన్నుడై యిట్లు భావింపసాగెను: "ఇట్టిఘోరదురంతము నొనర్చిన యామహమ్మదీయఘాతుకులను తమ యావచ్ఛక్తితో నెదుర్కొనక హిందువు లెట్లూరకుండిరో గదా! నేనే అపు డిచట నుండినపక్షమున నిట్టిదురంతమును జరుగనిచ్చెడివాడనా? దివ్యమాతృరక్షణార్థము ప్రాణముల నర్పించి యుండెడివాడను!" ఇట్లు భావించుచుండగా స్వామికి జగన్మాతృవాణి యిట్లు వినవచ్చెను: "మతాంతరులు నాయాలయములలోనికి వచ్చి నావిగ్రహములను పాడుచేసిన నేమి మునిగిపోయినది? నీ కెందుల కీతాపత్రయము? నీవా నన్ను రక్షించునది? లేక నేనా నిన్ను రక్షించుదానను?"

మాయాయవనిక విచ్ఛిన్నమైనది. అహంకారము ఉన్మూలితమైనది. సమస్తము దైవాధీనమై స్వామికి గోచరించెను. పరివర్తితమానసుడై స్వామి శ్రీనగరమునకు అరుదెంచి దేవతాప్రసాదమగు బంతిపూవులను శిష్యుల శిరములపైనిడి యాశీర్వదించి యిట్లు వచించెను: "ఇక 'హరిః ఓమ్!' కాదు! అంతయు మాతయే! నాదేశభక్తియంతయు సమసిపోయినది. ఇపుడు సమస్తము జగన్మాత! జగన్మాత!" ఇట్లు వచించి స్వామి శిష్యులకు దనదివ్యానుభవమును దెల్పెను. శిష్యులు నిశ్చేష్టులై వినిరి.

క్షీరభవానీదేవియాలయమున స్వామి పూజించుచు పాడుపడియున్న యాయాలయమును మఱల కట్టించుటనుగూర్చి యొకనాడు చింతించుచుండ దేవి తన యశరీరవాక్కుల నిట్లు తెల్పియుండెను: "నాయనా! వినుము. తలచినచో నేను అసంఖ్యాకములగు నాలయములను దివ్యమఠములను నిర్మించుకొనగలను. ఇప్పుడీక్షణమున, ఇచ్చట, సప్తాంతరువులుగల సువర్ణాలయమును నిర్మించుకొనగలను." ఇవ్విషయమునే తలచి కాలాంతరమున నొకశిష్యునితో స్వామి యిట్లు తెల్పెను: "ఆదివ్యవాక్కులను వినిననాటినుండియు నాసంకల్పములను విరమించితిని. జగన్మాతృసంకల్పమే సర్వదా నెఱవేఱుగాక!"

స్వామి కీసమయమున నొకగండము గడచెను. స్వామిదివ్యమూర్తిని గాంచి యొకపకీరుశిష్యుడు స్వామి సందర్శనమునకై వచ్చుచుండెడివాడు. ఒకనా డాతడు జ్వరముచేతను తీవ్రమగు తలనొప్పిచేతను బాధపడుచుండెనని విని, స్వామి దయాప్రపూర్ణుడై యాతని శిరమును స్పృశించెను. వెంటనే యాతడు స్వస్థుడయ్యెను! అనంతర మాతడు స్వామిసన్నిధానమునకు దఱచు వెడలుచుండుట గాంచి యాతని గురువగు పకీరు అసహనముచే స్వామిని దూషించి, యిక నాతనియొద్దకు వెడలవలదని శిష్యు నాజ్ఞాపించెను. మఱియు దురాత్ముడగు నాతడు, స్వామిపై ప్రయోగము చేయుదుననియు స్వామి కాశ్మీరమునుండి వెడలులోపున వమనము చేసికొనుననియు రిమ్మచే బాధపడుననియు జెప్పెను. దురదృష్టవశమున నట్లే జరుగ, స్వామి క్షోభపడి, తన

దుఃస్థితికి అగ్రహపరవశుడై యిట్లు భావించెను: "ఏమి ప్రయోజనము నాకు శ్రీరామకృష్ణునివలన? నావేదాంతబోధనలు, నాదివ్యానుభవములు, ఆత్మ సర్వ శక్తిమత్త్వము, సమస్తము ఒక క్షుద్రమాంత్రికుని ప్రయోగమునుండి నన్ను కాపాడజాలనప్పుడు వీనిచే నేమి ప్రయోజనము?"

మనశ్శాంతియు శరీరస్వస్థతయుం జేకూఱినంతనే స్వామి శిష్యసమేతుడై లాహోరుమీదుగా బేలూరుమఠమునకు అరుదెంచెను. *

---

* ఈసమయమున స్వామి మనఃస్థితినిగూర్చి సోదరినివేదిత యిట్లు వ్రాసెను: "స్వామి యుదారహృదయమునుగూర్చి నేనేమని చెప్పుదును! ప్రపంచమున నెవ్వరి కాపద సంభవించెనని తెలిసినను మాగురుదేవుడు పరితప్తుడై పోవునే! తన కెవ్వ రెట్టిబాధ కల్గించినను, తుదకు తన్ను హత్యచేయవచ్చినను ఆమహనీయునిహృదయమునుండి ప్రేమమయాశీర్వచనములే వెలువడునని మాకు తోచెను....

"స్వామి మాకు వసిష్ఠవిశ్వామిత్రుల కథను జెప్పెను : తన నూర్గురు వంశీయులను గోల్పోయి యేకాకియై నిస్సహాయుండై వసిష్ఠు డెట్లు మను చుండెనో వివరించెను: ప్రకృతిరమ్యవనమున పండువెన్నెలరాత్రులలో వసిష్ఠాశ్రమ మెట్లొప్పెనో చిత్రించెను.—అరుంధతీవసిష్ఠులు తమకుటీరమున నుందురు. తనవైరియగు విశ్వామిత్రుడు వ్రాసిన యొకగ్రంథమును వసిష్ఠుడు ఏకాగ్రచిత్తుడై చదువుచుండును. అంత నరుంధతి యాతని సమీపించి, 'చూడుడు! చంద్రు డెట్లు ప్రకాశించుచున్నాడో!' యనును. వసిష్ఠుడు తల యెత్తకయే,—'విశ్వామిత్రుని ప్రతిభ సహస్రగుణాధికమై ప్రకాశించుచున్నది సుమీ!' యని పల్కును.

"మనప్రేమముసైతము వ్యక్తిగతవైరమును లేశమును పాటింపక శత్రు ప్రతిభను గొనియాడుచు తన్మయుడై వరలిన వసిష్ఠునిప్రేమను బోలియుండ వలయునని స్వామి తెల్పెను."

## ముప్పదిమూడవ ప్రకరణము

# శ్రీ రామకృష్ణమఠ ప్రతిష్ఠాపనము: ఆదర్శములు

1898-వ డిసెంబరు 9-వ తేదీ శ్రీ రామకృష్ణమఠచరిత్రమున చిర స్మరణీయమగు సుదినము. ఏలన, శ్రీ రామకృష్ణునిదివ్యబోధనలను వేదవేదాంత తత్త్వములను లోకకల్యాణమునకై దేశదేశాంతరములలో వ్యాప్తిచేయుటకై ఆనాడు శ్రీ వివేకానందస్వామి శాస్త్రోక్తముగా శ్రీ రామకృష్ణమఠప్రతిష్ఠ నొనర్చెను.

దివ్యగంగాస్నాతుడై నూతనకాషాయాంబరములనుదాల్చి, శ్రీ రామ కృష్ణునియస్థిసంచయమును పుష్పములతోడను బిల్వపత్రములతోడను మహో జ్జ్వలభక్తిమెయినర్చించి, స్వామి ధ్యాననిమగ్నుడయ్యెను. కొంతవడికి ధ్యాన మునుండి వెలువడి, శిష్యబృందము తన్ననుగమింప, గురుదేవునియస్థులుగల పాత్రను కుడిభుజమున నిడుకొని, శంఖఘంటారవములు మిన్నుముట్టుచుండ నీలాంబరముఖోపాధ్యాయునివసగృహమునుండి నూతనమఠప్రదేశమునకు అరు దెంచెను. దారిలో స్వామి యొక శిష్యున కిట్లు తెల్పెను: "గురుదేవు డొక ప్పుడు నాతో నిట్లు పల్కెను: 'నన్ను నీ భుజములపై నిడుకొని నీ యిచ్చ వచ్చినచోటికి, ఎచటికి గొనిపోయినను—అల్పకుటీరమున గానిమ్ము, చెట్టు క్రింద గానిమ్ము—నేను వెడలి నివసింతును.' ఆకరుణాపయోనిధివాగ్దానము ననుసరించియే భావిమఠప్రదేశమున కాతని స్వయముగా నేనే గొంపోవు చున్నాను. అనుచరుల హృదయములందు విశుద్ధత, పవిత్రత, విశ్వమానవ ప్రేమము మొదలగు నాతని దివ్యాదర్శముల నెంతవఱ కాతనినామము రగు ల్కొల్పునో అంతవఱ కచట నిశ్చయముగా నాతడు వెలసియుండునని గ్రహింపుము."

మఠప్రదేశమున నొక దివ్యాసనముపై గురుదేవునియస్థులుగల పాత్రము

నుంచి స్వామియు స్వామితో భక్తులందఱును అఖండభక్తిపూర్వకముగా సాష్టాంగవందనమాచరించిరి. పిమ్మట శాస్త్రోక్తముగ పూజలను, విరజాహోమము నొనర్చి, స్వయముగా స్వామి పాయసమును వండి శ్రీరామకృష్ణభగవానున కర్పించెను. ఆసమయమున స్వామి భక్తబృందము నిట్లు సంబోధించెను: "సోదరులారా! యుగావతారపురుషుడగు శ్రీగురుదేవుడు శాశ్వతముగా నిచట వెలసి బహుజనహితార్థము, బహుజనసుఖార్థము ఈస్థలమును సర్వమత సామరస్యనిలయమగు పుణ్యక్షేత్ర మొనర్చుగావుత మని మీరందఱును మనఃపూర్వకముగా ప్రార్థింపుడు!" వినమితశిరస్కులై, బద్ధాంజలులై యందఱును భగవానుని ప్రార్థించిరి.

నాటి స్వామిదివ్యోత్సాహము వర్ణనాతీతము. స్వామి యిట్లు వచించెను : "పరమేశ్వరసంకల్పముచే నేడాతని ధర్మక్షేత్రము ప్రతిష్ఠితమైనది. పండ్రెండు సంవత్సరములనుండి నేను తలదాల్చిన భారమునుండి నేడు విముక్తుడనైతిని. ఇపుడు నాకొక దివ్యదృశ్యము గోచరించుచున్నది. ఈమఠము సకలవిద్యలకును సాధనలకును దివ్యనిలయమగును. మధ్యభాగమున సన్న్యాసులు నివసింప, పవిత్రగృహస్థులు పారమార్థికవిశ్వవిద్యాలయమగునట్టి యీ మఠము చుట్టును పరిసరమునందును గృహములు కట్టుకొని నివసింతురు. దక్షిణభాగమున ఇంగ్లాండు, అమెరికాదేశములనుండి భగవానునియనుచరులు వచ్చి నివసింతురు!"

స్వామి ప్రకటించిన మఠాదర్శనియమములు జాతీయవిద్యావిధానమునుగూర్చియు దేశోద్ధరణపద్ధతినిగూర్చియు స్వామిభావములను వెల్లడించును. స్వామి యొకశిష్యున కిట్లు చెప్పెను :

"ఇచట నుద్భవించు నాధ్యాత్మికశక్తి ప్రపంచమంతటను వ్యాపించి జనులకు నూతనాశయములను నూతనదృక్పథమును గల్గించును. జ్ఞానకర్మ భక్తి యోగములను సమన్వయించు దివ్యాదర్శము లిచటినుండి వెలువడి విశ్వవ్యాప్తి నొందును. చైతన్యవిరహితులై, నిర్జీవులై యున్న జను లిచటి సన్న్యాసుల సంకల్పమాత్రముననే పునరుజ్జీవితులగు సమయము రాగలదు....

"ప్రాచీనగురుకులవిధానము ననుసరించి యిచట నొక విద్యాలయము స్థాపితమై యొప్పును. అందు వ్యాకరణము, వేదాంతము, వివిధకళలు, వేద శాస్త్రములు, సాహిత్యము, ఆంగ్లమును బోధింపబడును. ఇచటి విద్యార్థులు బ్రహ్మచారులు. వారికి భోజనాదిసౌకర్యములను మఠమే సమకూర్చును. ఐదు సంవత్సరముల శిక్షణానంతరము ఈ బ్రహ్మచారులు ఇంటికి కరిగి గృహస్థజీవన మవలంబించుటకుగాని, యిచటి పెద్దలయనుమతి గైకొని సన్న్యాసము స్వీక రించుటకుగాని స్వతంత్రులై యుందురు. అవిధేయుడై యున్నను, దుష్టవర్తను డై యున్నను ఈ బ్రహ్మచారులలో నెవ్వనిగాని మఠాధికారులు వెడలగొట్ట నధి కారులై యుందురు. విద్యావిషయములలో జాతిభేదములు పాటింపబడవు..."

అంత శిష్యుడు, "దేశమున మఱల గురుకులవిధానమును నెలకొల్పుద మనియా మీ యభిప్రాయము?" అని ప్రశ్నింప, స్వామి యిట్లు సమాధాన మొసగెను: "నిస్సందేహముగా: అవశ్యము నెలకొల్పవలయును. ఆధునిక విద్యావిధానములో బ్రహ్మవిద్యావికాసమునకు లేశమును తావులేకుండు టెంతయు శోచనీయము. బ్రహ్మచర్యవిధానమును పునరుద్ధరింపవలయును. ఐనను కాలానుగుణముగా గొన్నిమార్పులు చేయవచ్చును.

"శ్రీరామకృష్ణుని పేర నొక యన్నసత్రము నిచట స్థాపించి దరిద్ర నారాయణుల కందఱకు బిచ్చ మెత్తుకొని వచ్చిరయ్యెనను ఎల్లవేళల తృప్తికర ముగా బెట్టవలయును.... ప్రథమకర్తవ్యము అన్నదానము. రెండవది విద్యా దానము. అనంతరము జ్ఞానదానము. జనులను నిజమైనమానవుల గావింపవలయు నన్నచో, వీనిని సమన్వయించి తీరవలయును. ఇట్టి ధర్మసమన్వయమే ఈ మఠమునకు పరమాదర్శము, విధ్యుక్తధర్మము....

"అన్నసత్రములందును, ఆశ్రమములందును దరిద్రులుగాని, రోగులు గాని ఇద్దఱుముగ్గురు ఉండుట కనువైన మంచిగదు లుండవలయును. వారికి వలయు సౌకర్యముల నొనగూర్చి రోగులచికిత్సకొఱకై వైద్యుల నేర్పఱుప వలయును. సేవాశ్రమము లన్నసత్రశాఖలుగా నుండును...క్షుధార్తులెందఱు వచ్చినను ఎప్పుడుపచ్చినను లేదనరాదు. ఇచట వడియగట్టబడు గంజి గంగలో బడి గంగాజలములను తెల్లగా జేసివేయవలయును!...

“నిద్రాణమైయున్న మీయందలి దివ్యాత్మశక్తి యెవనియం దెపుడు విజృంభించునో యెవరు చెప్పగలరు? ఆతల్లి తనకటాక్షముచే మీలో నొక్కని దివ్యశక్తిని ఉద్దీపింప జేయునెడ, అట్టియన్నసత్రములు వందలు, వేలు, దేశమం దంతటను వెలువడగలవు! జ్ఞానము, భక్తి, శక్తి—ఇయ్యవి సహాజముగా ప్రతిజీవియందును గలవని గ్రహింపుడు. ఇయ్యవి వ్యక్తమగుటయందలి తారతమ్యమే జీవు నధికునిగనో, అల్పునిగనో చేయుచుండును. పరమేశ్వరునకును మనకును మధ్యనున్న మాయాయవనిక తొలగినంతనే ప్రకృతి మనకు దాస్య మొనర్చును. అపుడు మనమేమి సంకల్పించినను జరిగి తీరును.

“పరమేశ్వరకటాక్షమున్నచో, ఈమఠము సర్వమతసమన్వయనిలయమై మించును. గురుదేవుడు సర్వమతాదర్శసంపూర్ణ సమన్వయమూర్తి. అట్టి సమన్వయాదర్శము నిచట మనము ప్రజ్వలింపజేసినచో, నాతని తత్త్వసింహాసన మాధ్యాత్మిక సామ్రాజ్యమున సుస్థిరమై విరాజిల్లును. బ్రాహ్మణుడు మొదలుకొని చండాలునివఱ కెవ్వరు వచ్చినను సమస్తమతావలంబకులును తమతమ యాదర్శముల నిట గనుగొను నట్లాచరించి చూపవలయును. మొన్న మన మిచట శ్రీరామకృష్ణభగవానుని దివ్యమూర్తిని స్థాపించుసమయమున నాతని మహోన్నత భావతరంగములు వెలువడి తమ దివ్యతేజఃపుంజములచే సమస్తప్రపంచము నావరించుచున్నట్లు కన్గొంటిని! సమస్తజనులకును ఆతని యుదారాశయములను బ్రకటించుటకే నాజీవితమును ధారపోసితిని, ధారపోసెదను. మీరును అట్లే యొనర్పుడు. శుష్కవేదాంత పఠనమువలన నేమి ప్రయోజనము? పరిశుద్ధాద్వైతతత్త్వమును మన నిత్యజీవితములో అనుష్ఠించి చూపవలయును. ఈ యద్వైతవాదము నింతవఱకు అరణ్యములందును, గుహలందును దాచియుంచినారు. ఈ తత్త్వామృతమును వెలికి దీసికొనివచ్చి బాహాటముగా ప్రపంచమంతటికిని పంచిపెట్టు భాగ్యము నాకు చేకూఱినది. సమస్తగృహములలో, ఆరామములలో, పర్వతములలో, బయళ్లలో, అద్వైతవేదాంతదుందుభి మాఱుమ్రోగవలయును. రండు, మీరందఱును నాయండ నిల్చి కార్యదీక్షను బూనుడు.

“స్వీయమోక్షప్రాప్తిచే నేమి ప్రయోజనము? మధురాహారమును విశేష మనుభవించువాడెవడు? అంతయుం దానే తినువాడా, అన్యులతో గూడి

భుజించువాడా? సమస్త ప్రపంచమును మనతోగూడ మోక్షసౌధమునకు గొనిపోవలయును. ఈమాయా ప్రపంచమున మన మాధ్యాత్మికదావాగ్నిని ప్రజ్వలింపజేయవలయును. అపుడే సచ్చిదానందసామ్రాజ్యమున సుప్రతిష్ఠితులమై వెలయగలము! ఓహో! శాశ్వతాత్మానందమున కెనయగు నానందమెద్ది? 'సర్వభూతస్థమాత్మానం, సర్వభూతాని చాత్మని'—తన్ను సర్వభూతములందును, సర్వభూతములయందును దన్ను గాంచునట్టి యా యనిర్వాచ్య స్థితిలో వివశులై మీరు బ్రహ్మానందసాగరమున నోలలాడెదరు. సమస్తజీవులందును నిరుపమానప్రేమసానుభూతులను జూపుట మీకు అపుడు నైసర్గికమగును. ఇదియే అనుష్ఠానవేదాంతము."

## ముప్పదినాల్గవ ప్రకరణము

## సోదరబృందమున స్వామిజీవితము

శరీరగృహమున నున్నందులకు జెల్లింపవలసిన అద్దెయే వ్యాధి. భగవదంశ సంభూతులగు సద్గురువరేణ్యులు శిష్యులవగు జ్ఞానప్రతిబంధకపాపము లను స్వయముగా వ్యాధిరూపముననో, ఇతరబాధలరూపముననో అనుభవింతు రని విశ్వసింపనగును. ఏమైనను స్వామి యీదినములలో నుబ్బసముచే బాధ పడుచుండెను. శరీరారోగ్యమునుగూర్చి విశేష శ్రద్ధవహింపవలయునని వైద్యులు హెచ్చరించిరి. ఐనను ధ్యాననిమగ్నుడై శరీరము నెపుడు చాలిం చునో యని సోదర శిష్యులు స్వామిని వేయికన్నులతో జూచుచు భావావేశ మును బొందకుండ జేయుటకై సదా యత్నములు సల్పుచుండిరి. నిస్పృహు డగు స్వామి యీదినములలో దానడిగిన ప్రశ్నలకే సమాధానము నిచ్చుచుండెడి వాడు.

స్వామి అమరనాథమునుండి వచ్చినవెనుక తనదివ్యానుభూతినిగూర్చి యొకశిష్యున కిట్లు తెల్పెను: "అమరనాథమునకు వెడలిన నాటినుండియు సాక్షాత్ పరమశివుడు నామానసమున బ్రవేశించియున్నాడు. ఆత డిక నన్ను విడువడు!" పిమ్మట క్షీరభవానీదేవియాలయములో దాను వినినయశరీరవాక్కు లను శిష్యునకు దెలిపి, అయ్యవి వాస్తవములని వక్కాణించెను.

అనంతరము శిష్యుడు, "స్వామిజీ! తామెన్నడైనను దయ్యములను జూచితిరా?" యని ప్రశ్నింప, స్వామి తనబందుగులలో నొకయామె పిశాచము తన కప్పుడప్పుడు కాన్పించి దూరదేశవృత్తాంతములను దెల్పు చుండెడి దని సమాధానమొసగుచు నిట్లు పల్కెను: "కాని విచారింపగా అవృత్తాంతములు ఒక్కొకసారి వాస్తవములు కాకుండెడివి. ఒక పుణ్యస్థల

మున నేనామె పిశాచజన్మముయొక్క నివృత్తికై ప్రార్థించితిని. నాటి నుండియు ఆపిశాచము మఱల నాకంట బడలేదు." *

స్వామిని సందర్శించి యాతని బోధామృతమును గ్రోలుటకై జనులనంతముగా వచ్చుచుండిరి. స్వామి నిద్రాహారములను మఱచి వారితో ప్రసంగించుట జూచి సోదరశిష్యులు వారింప యత్నించిరి. కాని స్వామిదయాసాగరము నెవ్వ రరికట్టగలరు? స్వామి యిట్లు వచించువాడు: "అనేక శ్రమల కోర్చి వా రిచటికి వచ్చుచుండ, ఇచటనే కూర్చుండియున్న నేను వారితో రవంత సంభాషింపవలదా ? దానిచే నాయారోగ్యము చెడిన జెడుగాక."

ప్రేమమూర్తియగు స్వామియనుగ్రహము పాపాత్ములందును పుణ్యాత్ములందునుగూడ సమానముగా ప్రసరింపసాగెను. కాని, లోకులు కాకులుగదా! ఎంతటి విషయలోలుడైనను తన్ను కొంచెము స్తుతించినంతమాత్రమున స్వామి వాని ననుగ్రహించి యాశీర్వదించుచుండెనను వదంతి లోకులలో వ్యాపించెను. ఇవ్విషయమునుగూర్చి యొకశిష్యుడు దన్ను ప్రశ్నింప, స్వామి యిట్లు సమాధాన మొసగెను : "బాలుడా ! ఏమనుచుంటివి ? ఎవ్వడెట్టివాడో నాకు దెలియదనుకొనుచుంటివా ? నేనొకని జూచినంతనే వాని చిత్తవృత్తులనేకాక పూర్వజన్మవృత్తాంతమును సహితము చూచాయగా గ్రహింతును. అంతర్నిహితమైయున్న వాని చిత్తవృత్తులెట్టివో నాకు వెల్లడియగును. ఐనను అట్టివారి నెందులకు ఆశీర్వదింతునో తెలియునా ? ఆనిర్భాగ్యులెట్టులైనను రవంత చిత్తశాంతిని బొందుతలంపున వారు, వీరనక, సమస్తజనుల నర్థింతురు. కాని వారి

---

* స్వామిపరివ్రాజకయాత్రలో (చెన్నపట్టణమున) ఇట్టి సంఘటన మే మఱియొకటి జరిగియున్నది. కొన్నిపిశాచములు లేనిపోని వృత్తాంతములను జెప్పి స్వామిమానసమును కలవరపఱుపసాగెను. కొన్నిదినములైన వెనుక స్వామి వానిని ధిక్కరింప నయ్యవి స్వామికి తమ దుఃస్థితిని దెల్పెను. అంత స్వామి యొకనాడు సముద్రతీరమున కేగి, యిసుకతో పిండప్రదాన మొనర్చి, వానికి శాంతి చేకూర్చి, తాను స్వస్థచిత్తు డయ్యెను.

నాదరించువారెవరు? తుదకు వారు నాయొద్దకు వత్తురు. నేనును నిరాకరించిన నిక వారి గతియేమి? కావున నేను లేనిపోని విమర్శచేయను. ఆహా! వారి మనోవ్యధ యెంత దుర్భరమో కదా! ప్రపంచము ఘోరయాతనానిలయము!” కరుణాపయోనిధియగు శ్రీరామకృష్ణుని హృదయమే స్వామి హృదయము!

నివేదిత స్థాపించిన బాలికాపాఠశాల స్వామికి విశేషాదరణపాత్రమయ్యెను. అనేకవిషయములనుగూర్చి స్వామి యామెకు సదుపదేశము లొనర్చుచుండెడివాడు. నివేదిత బ్రహ్మచర్యనియమముల నన్నిటిని యథావిధిగా బరిపాలించుచుండెను. అర్థరహితబాహ్యాచారములను సడలించి, స్వామి నివేదిత వండిన యాహారపదార్థములను తాను భుజించుటయేకాక శిష్యబృందముచే దినిపించువాడు. భారతీయులు తమసంఘమున నివేదితకు ఉచితస్థానమునొసగి మనఃపూర్వకముగా ఆదరించుటకై వలయు సమస్త యత్నములను స్వామి యొనర్చెను.

నివేదితాదిశిష్యసమేతుడై స్వామి యొకనాడు కలకత్తాలోని జంతుప్రదర్శనశాలకు వెడలెను. ప్రసంగవశమున పరిణామవాదమునుగూర్చి ప్రదర్శనశాలాధికారికి స్వామి మహాద్భుతముగా బోధించెను. పతంజలిమహర్షిని మించిన పరిణామవేత్తలు ప్రాక్పశ్చిమములలో నింతవఱ కెవ్వరును లేరనియు డార్విన్‌మహాశయుని పరిణామవాదము జంతువులకును వృక్షములకునేకాని మానవులకు వర్తింపదనియు నిరూపించెను. “ఐనచో శారీరబల మావశ్యకమని తాము నొక్కిచెప్పుచుండుటకు కారణమేమి?” అని తరువాత నొకరు ప్రశ్నింప స్వామి యిట్లు ఘోషించెను:

“మానవులా మీరు? ఆహారనిద్రాదికములతో సంతుష్టులు, భయపిశాచావిష్టులునగు మీరు కేవలము పశుప్రాయులు! కాసంత తార్కికబుద్ధియే లేనిచో నీపాటికి మీరు చతుష్పాదజంతువులుగా పరిణమించెడివారే! ఆత్మగౌరవహీనులై, అసూయాద్వేషపూరితులై, పరదేశీయులచే పరమనికృష్టులుగా బరిగణింపబడుచున్నారు మీరు. మీదంభమును మీ రిక్తసిద్ధాంతములను అటుంచి, మీపైనందినజీవితచర్యలను మీ నడవడిని ప్రశాంతముగా బరిశీలింపుడు. పశు

స్వభావమునకు మీరు వశ్యులై యుండుటచే, బ్రదుకుదెరువుకొఱకు ప్రయత్నింపుడనియు అందులకై మొట్టమొదట శరీరబలము నార్జించుకొనుడనియు మీకు నేను బోధించుచున్నాను. ఉట్టి కెగురలేని యమ్మ స్వర్గమున కెగురబోయెనట! బలోపేతులైనచో మనస్సును నిగ్రహించుటకు మఱింత మీ రర్హులై యుందురు. 'నాయమాత్మా బలహీనేన లభ్యః' అనుపట్ల ముఖ్యముగా దుర్బలదేహులు ఆత్మసాక్షాత్కారమున కనర్హులని మఱల మఱల నేను నొక్కి వక్కాణించెదను. మనోనిగ్రహము చేకూఱినంతనే, సంపూర్ణముగా మనస్సు మీకు వశమైనంతనే, శరీరము బలిష్ఠముగా నున్నను లేకున్నను మీరు గమనింప నక్కఱలేదు. మనశ్శరీరములు మీకపుడు జోహారు చేయును."

త్రిగుణాతీతుని యాధిపత్యమున 'ఉద్బోధన' యను వంగీయపక్షపత్రిక వెలువడి స్వామికి అమితానందమును గూర్చెను. శారీరమానసికాధ్యాత్మికాభివృద్ధిని చేకూర్చి భారతజాతీయతను బెంపొందించునట్టి భావములనే ప్రకటింపవలయుననియు కవితావాఙ్మయతత్త్వశాస్త్రములను గూర్చి ప్రాచీన సంప్రదాయములను నిరసింపక, ప్రాచీనాధునికాభిప్రాయసమన్వయమునే ఆదర్శముగా గ్రహింపవలయుననియు చండాలునిసైతము క్రమముగా బ్రాహ్మణస్థితికి గొనివచ్చుటకై వేదవేదాంతాశయముల నత్యంతసరళశైలిలో బ్రదర్శించి జనులలో వ్యాప్తిచేయవలయుననియు స్వామి తెల్పెను.

కలకత్తానగరమునుండి స్వామి విశ్రాంతికై వైద్యనాథమునకు అరిగి యొకభక్తునింట బసచేసెను. సోదరశిష్యుడగు నిరంజనానందు డీసమయమున స్వామితోగూడ నుండెను. ఒకనాడు సాధుసోదరు లిరువురును వాహ్యాళికేగి వచ్చుచుండ, దారిలో నొకదీనుడు రక్తగ్రహణిచే బాధపడుచు బాటప్రక్కను నిస్సహాయుడై యుండుట గాంచి, సోదరునిసాయమున స్వామి వానిని మెల్లగా లేవనెత్తి, రోగనివారణార్థము తమ నివాసస్థానమునకు దీసికొనివచ్చెను. అచట వాని శరీరమును శుభ్రమొనర్చి, మంచిబట్టలను గట్టబెట్టి, సాధుసోదరులు సేవచేయ నారంభించిరి. అచిరకాలముననే అతడు ఆరోగ్య

మును బడసెను. స్వామి కాతిథ్యమొసగిన గృహస్థు డాతని నిరుపమానకారుణ్యమును దీనజనవాత్సల్యమును గాంచి యచ్చెరువొందెను.

ఈసమయమున స్వామి యొకలేఖలో వ్రాసిన యీ క్రిందివిషయములు సాంఘికసమస్యలనుగూర్చి స్వామిభావములను బ్రకటించును.

"...బలాత్కారముగా సంఘములో నొక యాచారమును బ్రవేశపెట్టుటకు ఋషికి గానిమ్ము, మునికి గానిమ్ము, సాక్షాద్భగవంతునికే కానిమ్ము—అధికారములేదు. పరిస్థితులనుబట్టి ఆవశ్యకమైనపుడు సంఘమే ప్రత్యేకమగు కొన్ని యాచారముల నవలంబించుచుండును....తాత్కాలికముగా సంఘమున కివి క్షేమకరములయ్యును, కాలక్రమమున మహోపద్రవహేతువులు కావచ్చును.

"ఉదాహరణమునకు దేశమందలి స్త్రీపునర్వివాహనిషేధమును గైకొందము. ఏ దుర్మార్గులో, ఋషులో, ఈ శాసనమును దెచ్చిపెట్టిరని తలపకుడు....ఇందు రెండువిషయములను గమనింపవలసియున్నది:

"(అ) స్త్రీపునర్వివాహములు శూద్రులలో (అధోజాతులందు) జరుగుచున్నవి.

"(ఆ) అగ్రజాతులలో పురుషులసంఖ్యకంటె స్త్రీలసంఖ్య హెచ్చుగానుండును.

"ఇట్టిపరిస్థితులలో విధిగా ప్రతిబాలికకు వివాహముచేయవలయునన్నచో, ఒకబాలికకు ఒకభర్త దొరకుటయే దుర్లభము. ఇకనొక్కొకతెకు ఇద్దఱు ముగ్గుర మాట చెప్పనేల? అందుచే సంఘము ఉభయులలో నొకరికి ప్రాతికూల్యము గల్పించినది—అనగా, ఒకసారి పెండ్లియైన స్త్రీకి రెండవ వివాహమున కొప్పుకొనలేదు. ఒప్పుకొనినచో, ఒక స్త్రీకి భర్తదొరకకుండబోవును. ఇక స్త్రీలసంఖ్యకంటె పురుషుల సంఖ్యయే హెచ్చుగానున్న జాతులలో ఈబాధ లేకుండుటచే స్త్రీపునర్వివాహము లందు జరుగుచున్నవి. పాశ్చాత్యదేశములలోగూడ కన్యలకు భర్తలు దొరకుట నానాటికి కష్టసాధ్యమగుచున్నది.

"వర్ణవ్యవస్థయొక్కయు ఇతర సాంఘికవ్యవస్థలయొక్కయు విషయముకూడ నిట్టిదే.

"అందుచే ఏసాంఘికాచారమునైనను మార్పవలయునన్నచో, మొట్టమొదట అది యెందుచే ఆవశ్యకమైనదో కనిపట్టవలయును; అపుడు దానిని (ఆవశ్యకతను) తొలగించినయెడల ఆయాచారము దానియంతనదియే అంతరించును. అంతియేకాని, ఊరక ఖండనమండనలవలన నేమియు ప్రయోజనము లేదు.

"ఇతరుల ధనాదులను మన మపహరించి యనుభవించుట కెట్టి యాటంకము నుండరాదని కాదు, "స్వాతంత్ర్యము" అను పదమున కర్థము. కాని, యితరుల కెట్టి హానియు గల్గింపకుండ మన శరీరమును, బుద్ధిని, సంపదను స్వేచ్ఛగా వినియోగించుకొనుటకు మనకు సహజమైన యధికారము కలదనుటయే ఆపదమునకు అర్థము. మఱియు ధనవిద్యాజ్ఞానములను బడయుటకు సంఘమునందలి ప్రతివ్యక్తికిని సమానమైన యవకాశము ఉండవలయును.... అజ్ఞులకును పేదలకును స్వాతంత్ర్యమిచ్చినచో—అనగా శరీరము, సంపద మొదలైనవానిని యథేష్టముగా వినియోగించుకొననిచ్చినచో—శ్రీమంతుల బిడ్డలవలెనే వారిబిడ్డలకును విద్యాభ్యాసాదులకు అవకాశమున్నచో—వారు పెడదారి త్రొక్కుదురనియు దుర్మార్గులగుదురనియుం కొందఱందురే—వాస్తవమాయని మఱియొక శంక! ఇట్లు చెప్పువారు సంఘశ్రేయోభిలాషులో, స్వార్థపరాయణులో—గమనింపుడు. "అందఱు పల్లకి యెక్కిన మోయువారెవరు?"—'జనసామాన్యమునకు విద్యనేర్పిన నిక మనకు సేవచేయువారెవరు?' అని ఇంగ్లాండుదేశములోగూడ ననేకులు శంకించుచుండగా వింటిని.

"సంఘమనగా నేమి? జనసామాన్యమా, లేక మీరు, నేను, అగ్రజాతులందలి మఱియే యల్పసంఖ్యాకులునా?

"మఱియు, ఒకవేళ రెండవపక్షమే నిజ మనుకొన్నను, 'ఇతరులకు దారిజూపువారము మనము' అనుకొను టర్థరహితాహంభావము. మన మేమి సర్వజ్ఞులమా? 'ఉద్ధరేదాత్మ నాత్మానమ్' ప్రతిమానవుడును తన్నుతానే యుద్ధరించుకొనవలయును.... ఇట్టి స్వాతంత్ర్యమునకు బ్రతికూలములగు సాంఘిక విధులను శీఘ్రముగా నిర్మూలింపవలయును. స్వాతంత్ర్యాభివృద్ధి నొనగూర్చునట్టి సంప్రదాయములనే ప్రోత్సహింపవలయును...."

వైద్యనాథమునుండి స్వామి మఱల బేలూరుమఠమున కరుదెంచి శిష్య

శిక్షణమున నిమగ్నుడయ్యెను. అల్పవిషయములందు సైతము అత్యంత శ్రద్ధ వహింపవలయునని శిష్యులను హెచ్చరించుచు స్వామి యొకప్పు డిట్లు నుడివెను: "హుక్కా అమర్చుటనుగూడ సరిగా నేర్చినవాడు ధ్యాన మొనర్చుటకును సమర్థుడగును. బాగుగా వంటచేయజాలనివాడు సన్న్యాసమున సమగ్రత నొందజాలడు. ఏకాగ్రము, పరిశుద్ధమునగు మానసములో నొనర్పబడిననే కాని వంట హితముగా నుండనేరదు." తత్త్వశాస్త్రవిషయములనుగూర్చి ఆశువుగా నుపన్యసింప శిష్యులను ప్రోత్సహించుచు స్వామి తగుశిక్షణము గఱపును. సర్వదా సరియగు ప్రయత్నమే స్వామికి వలయునది; జయాపజయములు గణనీయములు కావు. స్వామిశిక్షణమున శిష్యులు సర్వవిధములను అభివృద్ధినొందసాగిరి.

ఆదర్శము లాచరణపూర్వకములైనపుడే శోభిల్లునని స్వామి యిట్లు వక్కాణించును:

"ఆత్మవిశ్వాసపూరితులగు కొందఱమానవులచరిత్రయే ప్రపంచచరిత్ర. అట్టి విశ్వాసమే, శ్రద్ధయే, లోని దివ్యత్వమును ప్రకాశిత మొనర్చును. శ్రద్ధాభక్తు లున్నచో, సమస్తము సుసాధ్యమగును. అపజయమనగా నేమి? అంతర్నిహితమగు ననంతశక్తిని వ్యక్తమొనర్చుటకై శక్తికొలదియు ప్రయత్నింపకుండుటే. ఆత్మవిశ్వాసము లేకుండుటయే మరణము.

"మొదటిది ఆత్మవిశ్వాసము, తరువాతిది భగవద్విశ్వాసము. 'ఆశిష్ఠో దృఢిష్ఠో బలిష్ఠః'—* ఇట్టివారు పదుగు రున్నచో, ప్రపంచము నుత్తలపాలూగింపవచ్చును. దయాప్రపూర్ణహృదయము, మేధాసంపత్తి, భుజబలము— ఇవియే మనకు వలయునవి....భగవత్కార్యముల నొనర్చుటకు అర్హులు, నిమిత్తమాత్రులు కండు. భగవంతుడే కర్త. మీరుకాదు. మానవునందు, మానవునం దన నేల, అణువునం దీవిశ్వమంతయు నిమిడియున్నది. విశ్వశక్తి యంతయు అణువునకు ఆధారభూతమైయున్నది. హృదయమునకును బుద్ధికిని వైషమ్యము సంభవించినచో, హృదయ ప్రేరణము నవలంబింపుడు."

---

* కార్యదక్షులు, దృఢగాత్రులు, బలోపేతులు నగువారు.

అధికారివాదమె న్నడును స్వామి యామోదించువాడు కాడు. భేదబుద్ధిని విడిచి, మహోన్నతాధ్యాత్మికతత్త్వములను సమస్తజనులకును బాహాటముగా దెలుపవలయుననియు దనశిష్యులు జనుల యాచారవ్యవహారములకు జంకక, నిర్భయముగా సత్యమును బ్రకటింపవలయుననియు దెలుపుచు స్వామి యిట్లు ఘోషించెను :

"కల్లబొల్లి మాటలేల? పందిని నంది అన నేల? పరమార్థమును తుచ్ఛప్రాపంచికవిషయములతో సమన్వయింప జూచు యత్నమునకు మూలకారణము పిఱికితనము, పట్టి పిఱికితనము. ధైర్య మవలంబింపుడు! నాశిష్యులు ధైర్యశాలులై యుండవలయును. నిర్భయులై వేదశాస్త్రములందలి తత్త్వములను బాహాటముగా జనులకు బోధింపుడు. మీగౌరవము పోవుననికాని, జనులకు మీయందు ద్వేషము కలుగుననికాని భయపడకుడు. ఇంచుకయు వ్యామోహమునకు జిక్కక సత్యారాధకులై యున్నచో, మీకు అలౌకికబలము కల్గును. అసత్యములని మీరు గర్హించు విషయములను అపుడు మీయెదుట బ్రస్తావింప జనులు భీతిల్లుదురు. పదునాలుగేం డ్లచంచలదీక్షతో సత్యమును మీరు పరిపాలించునెడల జనులు మీరేమి చెప్పినను విశ్వసించి శిరసావహింతురు. ఇట్లు వర్తించినచో దేశీయులను బంధవిముక్తుల నొనర్చి, దేశోద్ధారకులై, లోకమునకు మహోపకారము నొనర్చినవార లయ్యెదరు."

భర్తృహరి కవీంద్రుని "ధైర్యపద్ధతి"యే స్వామి పద్ధతి. స్వామి యిట్లు బోధించును :

" 'శ్లో. నిన్దన్తు నీతినిపుణా యది వా స్తువన్తు
లక్ష్మీః సమావిశతు గచ్ఛతు వా యథేష్టమ్,
అద్యైవ వా మరణ మస్తు యుగాన్తరే వా
న్యాయ్యాత్పథః ప్రవిచలన్తి పదం నధీరాః.'

"తమ్ము నీతివేత్తలు దూషింతురుగాక, భూషింతురుగాక; లక్ష్మీకటాక్షము కలుగుగాక; ఇంట దారిద్ర్యదేవత తాండవించుగాక; ఇప్పుడే మరణము సంభవించుగాక, యుగాంతమందు గలుగుగాక: ధీరులగువారు న్యాయ్యమార్గమును దప్పరు."

'శ్లో. క్వచిత్పృథ్వీ శయ్యః క్వచిదపి చ పర్యఙ్కశయనః
క్వచిచ్ఛాకాహారః క్వచిదపి చ శాల్యోదనరుచిః,
క్వచిత్కన్థాధారీ క్వచిదపి చ దివ్యామ్బరధరో
మనస్వీ కార్యార్థీ న గణయతి దుఃఖం న చ సుఖమ్."

"కార్యార్థియగు ధీరుడు ఒకచో నేలను బరుండును, ఒకచో దివ్య తల్పమున శయనించును; ఒకచో శాకములు గుడుచును, ఒకచో ఉత్కృష్ట శాల్యోదనమును భుజించును; ఒకచో బొంత ధరించును, ఒకచో దివ్యాం బరములను దాల్చును; కాని కష్టసుఖముల నెన్నడును పాటింపడు."

స్వామిదృష్టిలో సమస్తకర్మములును భగవదారాధనవిధానములే. దరిద్రనారాయణసేవ, క్షామనివారణము, అనాథశరణాలయనిర్మాణము, విద్యాలయప్రతిష్ఠాపనము మున్నగునవన్నియు శ్రీరామకృష్ణసేవా సంఘసభ్యులకు విధ్యుక్తకర్మములు. "తాపసులు తమశరీరమును శుష్కింప జేసికొందురుగాక! కర్మనిష్ఠులకు ఇనుపకండలతో, ఉక్కునరములతో, గూడిన దృఢశరీరము కావలయును! కావున బిడ్డలారా! శరీరబలము నార్జింపుడు" అని స్వామి శిష్యులను హెచ్చరించును. ఇతరనియమములనుగూర్చి వచించుచు, గృహస్థుల తోడను, లౌకికులతోడను వారికి స్వేచ్ఛాసంసర్గముకూడదని స్వామి యిట్లుద్ఘోషించెను :

"మఠవ్యవహారములలో లౌకికులకు పెత్తనము ఉండరాదు. ధనికులతో సన్న్యాసి కెంతమాత్రమును సంబంధము కూడదు. సన్న్యాసికి గలబాధ్యత యంతయు, విధ్యుక్తమంతయు, దరిద్రులతో సంబంధించియున్నది. శ్రద్ధాభక్తులతో దరిద్రులను సేవింపవలయును. ధనికులకు వంగివంగి సలాములు చేయుచు వారిసాయముపై నాధారపడుటయే దేశీయమఠ సంస్థలకన్నిటికిని వేరుపురుగు. నిజముగా సన్న్యాసి ధనవంతులనుండి మనఃపూర్వకముగా తొలగి వర్తింపవలయును. ధనికులనాశ్రయించుట వేశ్యలకు తగునుగాని, సంసారపరిత్యాగ మొనర్చితిమను సన్న్యాసులకు తగదు. కామకాంచనపరిత్యాగమే ప్రధానాదర్శముగా గొనిన యమ్మహాసీయునకు కామకాంచనలోలు రెట్లు యథార్థభక్తులు కాగలరు? ప్రాపంచికులతో మాటలాడునపుడు తన పెదవులు

మంటలెత్తునని తెలుపుచు, కామకాంచనసంపర్కము లేశమైనను లేనివానిని దనతో సంభాషింప బంపుమని శ్రీరామకృష్ణుడు దివ్యమాతను ప్రార్థించి విలపించెను....లౌకికుల కేదియో స్వార్థచింత లేనిదే లోకసేవ చేయరు; చేయజాలరు. భగవంతుడే స్వయముగా గృహస్థుడై యవతరించినను నేను వానిని నమ్మజాలను. పారమార్థిక సంస్థకు గృహస్థుడు నాయకుడైనచో ఆదర్శము పేర స్వలాభమును జూచుకొన నారంభించును; అంత నాసంస్థ యడుగంటును. గృహస్థులాధిపత్యము వహించిన మతసంస్థల కన్నిటికిని ఈ గతియే పట్టినది. త్యాగరహితమగుమత మెన్నటికిని నిలువజాలదు.''

చనవుచే లౌకికులు సాధువులపడకపై బరుండరాదనియు గూర్చుండరాదనియు వారితో భోజనాదికములు సహితము సాధువులు జరుపరాదనియుం దెలుపుచు స్వామి యిట్లు వచించెను :

''లౌకికుల శరీరములందును వస్త్రములందును ఈదినములలో నాకొక విధమైన దుర్గంధము కానవచ్చుచున్నది. శాస్త్రములలో నేనట్లు చదివియున్నాను. పవిత్రులు త్యాగశీలురు నగువారు లౌకికుల సంసర్గమును, స్పర్శను ఎందులకు సహింపజాలరో నాకిపుడు బోధపడుచున్నది. స్త్రీలనుండియే కాక, స్త్రీసంసర్గము గలవారినుండి సహితము బ్రహ్మచారులు దూరముగా దొలగి వర్తింపవలయునని శాస్త్రములు దూరదృష్టితో శాసించుచున్నవి. బ్రహ్మచారులు సన్న్యాసాదర్శములందు సంస్థితులైనంతనే వారికి గృహస్థసంసర్గము వలని భయము ఉండదు.''

దీనివలన స్వామి గృహస్థులందుగాని, స్త్రీలయందుగాని నిరసనభావము గల్గియుండెనని భావింపరాదు. న్యాయ్యమార్గమున ధనమార్జించుచు, ఉదారహృదయులై పారమార్థికాదర్శములను బరిపాలించు గృహస్థులనినచో స్వామికి పరమానందము. గృహస్థజీవనము కొందఱ కుచితమార్గమైయుండుగాక, ప్రపంచమున వైరాగ్య మొక్కటియే భయరహితమైనదను పరమసత్యమును సన్న్యాసియగువాడు గమనింపవలయుననియే స్వామియభిప్రాయము. త్యాగసేవలే గృహస్థులకును పరమాదర్శములని తెలుపు మహాభారతమందలి కపోతోపాఖ్యానమును స్వామి శిష్యులకు బోధించును. మఱియుం నాయకు

డగువానియెడ విధేయత జూపనిదే యేకార్యమును గొనసాగింప జాలమని స్వామి యొకప్పు డిట్లు వక్కాణించెను : "మీదేశములో నే నేపని చేయవలయునో చెప్పుడు. ప్రతివ్యక్తికిని తానే నాయకుడను కావలయునని వాంఛ. విధేయత జూపువాడొక్కడును లేడు. నాయకుని యాజ్ఞలను శిరసావహించి ననేకాని యెట్టి ఘనకార్యమును కొనసాగనేరదు. మఠమునందలి మురుగు కాలువలను దుడుచుచు నేటినుండి నాజీవితమును గడపవలయునని నాసోదర శిష్యులు నాకు జెప్పినచో, నిక్కముగా వారియాజ్ఞను శిరసావహించెదనని గ్రహింపుడు. జనహిత మొనగూర్చునట్టి నాయకునియాజ్ఞలను మన్నించువాడే మహానాయకుడు కాగలడు." ఇయ్యది పాశ్చాత్యమఠసంస్థలలో సాధకులు పెద్దలయెడ జూపు విధేయతను, కార్యనిర్వహణమున ఆత్మార్పణ పూర్వకమగు వారి సంసిద్ధతను తలపునకు దెచ్చును. కోసుకూర (Cabbage) మొలకలను తలక్రిందుగా నాటుమనుటయో, గుట్టలకొలది రాళ్లను ఒకచోటనుండి మఱి యొకచోటికిని, తిరిగి యథాస్థానమునకును, చెప్పినన్నిసార్లు మాఱుమాటాడక మోసికొని పొమ్మనుటయో ఫ్రాన్సిస్ (Saint Francis of Assisi) మహనీయుని శిష్యశిక్షణవిధానములలో నొక్కటి. ఇట్టి విధేయతయే ముఖ్యముగా మఠసంస్థలకు పునాదియని స్వామి విశ్వసించెను.

స్వామి యిట్లు వచించెను : "వలసినంత ధనము లభించినను, లభింప కున్నను, తగినంతమంది బ్రహ్మచారులు వచ్చినను, రాకున్నను, ఆరంభించిన కార్యమును కొనసాగించుటకై ఒరులకు ధైర్యోత్సాహములు గల్గించెదను. నాకు విశ్రాంతి వలదు. కార్యరంగమున నాప్రాణములు విడిచెదను. కార్యపరాయణతయే నాయభీష్టము. జీవితము మహాయుద్ధము. కార్యశూరతయే మన ధర్మము. కార్యరంగమున నాజీవితము ఆహుతియగుగాక !" మఱియొక నాడొక శిష్యునితో నిట్లు వచించెను : "నాయనా! వినుము. శ్రీరామ కృష్ణుడు వచ్చి తనప్రాణములను ప్రపంచమునకై ధారపోసెను. నేను నట్లే యొనర్చెదను ; నీవును, మీలో ప్రతివ్యక్తియు లోకశ్రేయమునకై మీ జీవిత

ములు నర్పింపవలయును. మనము ధారపోయు రక్తధారలనుండి ప్రపంచమును మార్చివేయునట్టి వీరాధివీరులును భగవద్యోధులును వెలువడియెదరని నమ్ముడు!" మఱియు స్వామి తఱచు శిష్యుల నిట్లు హెచ్చరించును: "ప్రపంచసేవ, భగవత్సాక్షాత్కారము—ఇవియే సన్న్యాసాదర్శము లను మాట మఱవకుడు! ఈ యాదర్శములను విడువకుడు! సమస్త మార్గములందును సన్న్యాసమార్గమే అతి సన్నిహితము! సన్న్యాసికిని భగవంతునకును మధ్య నెట్టి విగ్రహములును లేవు! వేదశిరోభాగమున సన్న్యాసి ప్రతిష్ఠితుడై యుండునని వేదములే వక్కాణించుచున్నవి. అతడు స్వేచ్ఛామయచక్రవర్తి; మత సంప్రదాయములును శాస్త్రములును అతని శాసింపజాలవు. అతడే ప్రపంచమున ప్రత్యక్షదైవతము! శాంత్యానంద స్వేచ్ఛావిలసితపతాకను దాల్చి, ధీరాగ్రేసరుడవగు నోయతివరేణ్యా! యథేచ్ఛగా విహరింపుము!"

ప్రజాసేవనే పరమాదర్శముగా గ్రహించి, స్వామి, విరజానంద ప్రకాశానందులను ప్రాచ్యవంగదేశమందలి ఢాకాకు బంపదలచెను. ప్రస్తుతము శ్రీ రామకృష్ణమఠసేవాసంఘాధ్యక్షుడగు శ్రీ విరజానందస్వామి మొట్టమొదట మోక్షసాధనలచే సాక్షాత్కారమును బొందుటయే తన యభిమతమని తెలుప, స్వామి యిట్లు వక్కాణించెను: "నీ మోక్షమునకై నీవు ప్రాకులాడినచో, నరకమే గతి నీకు! ఆత్మసామ్రాజ్యము నందగోరెదవేని స్వీయమోక్షవాంఛను నిర్మూలింపుము. అదియే మహోత్తమసాధన" యని మఱల ప్రేమపూరితుడై యిట్లు వచించెను: "బిడ్డలారా! కర్మమొనర్పుడు! లోకశ్రేయమునకై మనః పూర్వకముగా కర్మమొనర్పుడు! ఇదియే వలయునది. కర్మఫలముల నాశింపకుడు. పరశ్రేయమునకై ప్రయత్నించి మీరు నరకమునకే యేగిన నేమి? స్వీయమోక్షమును గోరి స్వర్గమును బొందుటకంటె అదియే మేలు." అనంతరము స్వామి ధ్యానస్థితుడై వెలువడి, "నాయాత్మశక్తి నిదే మీయందు మూర్తీభవింపజేయుచున్నాను. భగవంతుడే మీకు ప్రాపై నిలుచుగావుత"మని వచించెను. శిష్యు లిరువురును స్వామియాజ్ఞను తలదాల్చి ఢాకాకు వెడలిరి.

ఇట్లే స్వామి తన సోదరశిష్యులగు శారదానందతురీయానందులను గుజరాతు నకును శివానందుని సింహళము (Ceylon) నకును బంపెను. రామకృష్ణానందు డీవఱకే చెన్నపట్టణమున కేగియుండెను. అచిరకాలముననే వారలయుద్యమము జయప్రదమై విలసిల్ల నారంభించెను.

శ్రీరామకృష్ణుని గృహస్థశిష్యులలో నుత్తమగణ్యుడగు నాగమహాశయుం డీసమయమున స్వామిని సందర్శింపవచ్చెను. స్వామిని గాంచినంతనే నాగ మహాశయుడు, "జయ! శంకర! సాక్షాత్ పరమశివుని సందర్శనముచే నేను ధన్యుడను!" అని వచించి స్వామికి సాష్టాంగవందన మొనర్చెను. స్వామి నాగమహాశయుని లేవనెత్తి, యాతనిగూర్చి తన శిష్యుల కిట్లు వచించెను: "చూడుడు! ఈయన యొక గృహస్థుడు. కాని నిస్పృహుడు, బాహ్యప్రపంచ స్మృతిరహితుడు! భగవద్ధ్యాననిష్ఠాగరిష్ఠుడు! పరభక్తి కీయన జీవితము ప్రత్యక్షనిదర్శనము!" నాగమహాశయుని దివ్యజీవనవిధానము తన శిష్యుల కాదర్శప్రాయమగునని మఠమున నాతని నుండుమని స్వామి కోరెను. కాని నాగమహాశయుం డిట్లు వచించెను: "సంసారమును త్యజింప ననుజ్ఞయిండని నే నొకప్పుడు గురుదేవుని గోరితిని. కాని, గురుదేవుడు సంసారము చేయుమని యాజ్ఞాపించెను. తదాజ్ఞానువర్తినై, ఆయన బిడ్డలగు మిమ్మందఱ నప్పుడప్పుడు వచ్చి దర్శించి ధన్యుడనయ్యెదను!" అనంతరము స్వామి మాతృదేశమును బున రుజ్జీవింపజేయుటయే తన యభీష్టమనియు నందులకై త న్నాశీర్వదింపుడనియుం నాగమహాశయుని గోరెను. అంత నాగమహాశయుండు, "మీ సంకల్ప మప్రతి హతము. ఆ మహనీయునియిచ్ఛయే మీయిచ్ఛ. జయ! రామకృష్ణ!" యని వచించెను. నాగమహాశయుని దివ్యప్రేమపూరితవర్తనమును గాంచి, యాతని యలౌకికమధురవాక్కులను ఆలకించి శిష్యులు ఆనందాశ్రువులు విడిచిరి.

స్వామిదివ్యత్వమునుగూర్చి నాగమహాశయుడు వచించిన వాక్యములను ఈ క్రింది వృత్తాంతము బలపఱచును:

స్వామిశిష్యుడగు శరచ్చంద్రు డొకనాడు తాను శివుని బూజించు

చున్నట్లును శివస్వరూపము క్రమముగా స్వామిమూర్తిలో లీనమైనట్లును వేకువజామున స్వప్నముగాంచెను. శరచ్చంద్రుడు స్వామికి దనస్వప్నమును దెలుప, "ఎవ్వరితోడను ఇవ్విషయమును జెప్పకు సుమీ!" యని స్వామి పల్కెను. శరచ్చంద్రు డుదయమున గంగాస్నాన మొనర్చి, స్వామిని సందర్శించి, రాత్రి తాను గాంచిన దివ్యస్వప్నమును యథార్థమొనర్పుదనియు పూజింప ననుజ్ఞ యిండనియు స్వామిని వేడుకొనెను. స్వామి యెట్లో సమ్మతించినంతనే శరచ్చంద్రుడు శివప్రీతికరములగు ధుర్తూరపుష్పములను సేకరించి, సమంత్రకముగా స్వామిని పూజింపసాగెను. సాధుసోదరులందఱును అచటికి వచ్చియుండిరి. స్వామి దివ్యధ్యాననిమగ్నుడై పూజింపబడుచుండ, సాక్షాత్ శివస్వరూపమై వెల్గొందిన యాతని దివ్యమూర్తిని గని యెల్లరును భక్తిపరవశులైరి.

అద్వైతవేదాంతప్రచారముకొఱకును అనుష్ఠానముకొఱకును స్వామి హిమాలయపర్వతభాగమున నొక యాశ్రమమును స్థాపింపనెంచెను. అచిరకాలముననే స్వామిపాశ్చాత్యశిష్యులగు సెవియరుదంపతులమూలమున హిమాలయమున 6,800 అడుగులయెత్తుననుండు మాయావతియందు అద్వైతాశ్రమము స్థాపింపబడియెను.

అద్వైతాశ్రమము శ్రీరామకృష్ణాశ్రమములలో పేరెన్నికగన్న యాశ్రమము. భారతదేశీయప్రబోధాత్మకమగు **ప్రబుద్ధభారత** మను జగద్విఖ్యాతాంగ్లమాసపత్రిక యిటనుండియే వెలువడి దినదినప్రవర్ధమానమై మానవసేవ యొనర్చుచున్నది. అద్వైతాశ్రమమునుగూర్చి స్వామి యిట్లు వచించియున్నాడు : "సమస్తమూఢవిశ్వాసములను, దుర్బలాభిప్రాయములను బోనడచి, యద్వైతమును బ్రజ్వలింపజేయుటే ఈ యాశ్రమముయొక్క ముఖ్యోద్దేశము. అద్వైతవేదాంతముమాత్రమే యిచట బోధింపబడును; అద్వైతమే యిట ననుష్ఠింపబడును. ఇతరమతములతో నెంతమాత్రము వైషమ్యములేకున్నను అద్వైతమే ఈయాశ్రమోద్దేశ్యము, పరమలక్ష్యము."

ఇచట సన్న్యాససంబంధమగు విరజాహోమముదక్క మఱియెట్టికర్మకలాపము గాని, విగ్రహారాధనముగాని జరుపబడుటలేదు; ఇతరకేంద్రములందలి ప్రధానాచారమగు శ్రీరామకృష్ణగురుపూజ సహితమిచట నిషేధింపబడియున్నది.

వంగదేశములో ఈ సమయమున మహామారి (Plague) జాడ్యము సంక్రమింప స్వామి సోదరశిష్యులతో నొనర్చిన ప్రజాసేవ నిరుపమానము. అనంతరము మఱల కాటకము సంభవింప, స్వామి తన్నివారణయత్నమున నిమగ్నుడయ్యెను. జనుల దుఃస్థితిని జూచి స్వామి తనయనుతాపము నిట్లు ప్రకటించెను: "నాదేశమున నొక కుక్కయైనను పస్తుపడియున్నంతవఱకు దాని కాహారము నిడి రక్షించుటయే నాపరమధర్మము, **ఇదియే నామతము;** తద్భిన్నమంతయు అధర్మము, కృత్రిమధర్మము." స్వామి దీనజనసానుభూతిని, నిరుపమానదేశభక్తిని గనుడు! ఈ సమయమున నొక పండితుడు వేదాంతతత్త్వ రహస్యములనుగూర్చి చర్చింపనెంచి స్వామిని సందర్శించెను. స్వామి యిట్లు పలికెను: "పండితవరేణ్యా! దేశమంతటను చెలరేగుచున్న మహా విపత్తును నివారించుటకై ప్రయత్నింపుము. 'అన్నమో రామచంద్రా!' యని నీ సోదరదేశీయులు విలపించుచున్నారు. వారి కడుపుమంట చల్లార్పయత్నించుటయే నీ ప్రథమ కర్తవ్యము. అటువెనుక వేదాంతచర్చకై నాయొద్దకు రమ్ము. నిరాహారులై మరణించు వేలకొలది జనులను రక్షించుటకై జీవాత్మలను ధారపోయుటే వేదాంతతత్త్వసారము!"

స్వామి మఱల పశ్చిమఖండమునకు వెడల నుద్యమించెను. సముద్రయానము స్వామిశరీరారోగ్యమున కనుకూలించునని వైద్యులు దెల్పిరి. తన శరీరస్థితినిగూర్చియు మనఃస్థైర్యమునుగూర్చియు స్వామి యొక పాశ్చాత్య శిష్యున కిట్లు వ్రాసియున్నాడు: "రెండేండ్ల శరీరరుగ్ణత నా యిరువదియేండ్ల జీవితమును హతమార్చినది. ఐననేమి? ఆత్మ నిర్వికారము కదా! ఒకే యాదర్శమున ఈ వెఱ్ఱిమాత్మారాము డింకను అంటిపట్టుకొనియున్నాడు. ఇది భల్లూకపు బట్టుసుమీ!"

ధ్యాననిష్ఠాసక్తుడును సోదరశిష్యుడు నగు తురీయానందుని స్వామి తనతో అమెరికాదేశమునకు దీసికొనివెడల నుద్యమించెను. కాని ప్రథమమున తురీయానందుడు సమ్మతింపలేదు. స్వామి యంత తురీయానందుని గౌగలించుకొని, యాతనివక్షముపై తన శిరస్సునుంచి బాలునివలె విలపించుచు నిట్లు వచింపసాగెను: "హరిభాయీ! * ఈ నా గురుదేవుని కార్యమును నెఱవేర్చుటకై అడుగడుగునను నాజీవితము నెట్లు ధారపోయుచున్నానో నీ వెఱుగవా? నాకార్యభారమును గొంత వహింపకుండ నీవు ఊరక చూచుచుండుట ధర్మమా!" సోదరశిష్యుని మనస్సు కరగెను. పరమేశ్వర సంకల్పమే స్వామిసంకల్పమని యాతనికి దట్టెను. స్వామి యాజ్ఞ నాతడు తలదాల్చెను.

ప్రయాణమునకుముందు శిష్యు లొక వీడ్కోలుసభ జరిపిరి. ఆసమయమున సన్న్యాసాదర్శమునుగూర్చియు అనుష్ఠానమునుగూర్చియు స్వామి శిష్యుల కిట్లు బోధించెను: "అత్యంతము అసాధ్యమైన ఆదర్శ మెవ్వరికిని తగదు. బౌద్ధజైనసంస్కర్తల దోషమిదియే. ఐనను ఎంతసేపు, సాధ్యవిషయములనే లక్షించుచుండుటయు తగదు. అత్యంతాదర్శమును అత్యంతానుభవముతో సమ్మేళన మొనర్ప యత్నింపవలయును. ఇపు డుత్తమధ్యాననిమగ్నులై ఉత్తరక్షణమున (మఠప్రదేశమునందలి మైదానములను జూపుచు) ఈ భూములను సాగుచేయుటకు సంసిద్ధులు కావలయును. ఇపుడు ధర్మశాస్త్రరహస్యములను బోధించుటకును మఱుక్షణమున బజారునకు బోయి పొలములో పండిన పంట నమ్ముటకును సంసిద్ధులు కావలయును....శీలనిర్మాణమే మీ యాదర్శము. మీరందఱును మహర్షులు కావలయును. కాని, సంఘము (శ్రీరామకృష్ణసేవా సంఘము) నం దఖండగౌరవభావము గలవారలై అత్యంతవిధేయులై వర్తింపవలయును." మఱియు శీలనిర్మాణమునుగూర్చి స్వామి యిట్లు వచించెను: 'ఎవ్వడు అఖండబలాభ్యుదయ్యును, అబలవలె నవనీతకోమలమానసుడో వాడే నిజమైన మానవుడు."

* తురియానందుని పూర్వనామము హరినాథచట్టోపాధ్యాయుడు.

శ్లో. "సంపత్సు మహతాం చిత్తం భవే దుత్పలకోమలమ్,
ఆపత్సు చ మహాశైలశిలాసఙ్ఘాతకర్కశమ్."

తే. "సంపదలు గల్గుతఱి మహాజనులహృదయ
మభినవోత్పలకోమలం బగుచు వెలయు
నాపదలు వొందునపుడు మహామహీధ
రాశ్మసంఘాతకర్కశంబై తనర్చు"

ననికదా సుభాషితవచనము !

ఇట్లుపదేశించి, వాత్సల్యవిలసితలోచనుడై సాధుపుత్రబృందము నవలోకించి యాశీర్వదించెను.

ప్రయాణనిర్ణీతదినమున శారదామాతృదేవి స్వామికిని శిష్యబృందమునకును కలకత్తాలోని తన గృహమున విందొనర్చెను.

## ముప్పదియైదవ ప్రకరణము

## అమెరికాదేశ పునఃపర్యటనము

నివేదితాతురీయానందసమేతుడై శారదామాతృదేవి యాశీర్వాదమును బడసి, 1899-వ జూన్ 20-వ తేదిని గోల్కొండ యను నోడ నెక్కి స్వామి పశ్చిమఖండమునకు బయనమయ్యెను. స్వామి యెక్కినయోడ చెన్నపురమును జేరుసరికి పూర్వస్నేహితులును శిష్యులును అచటి మఠాధ్యక్షుడగు రామకృష్ణానందునితోఁగూడి స్వామిని సందర్శించి ఫలపుష్పాదులను సమర్పించిరి. స్వామి వారితో జాలసేపు ప్రసంగించెను. కలకత్తాలోని మహామారి ననుసరించి చేయబడిన నిబంధనలమూలమున స్వామి చెన్నపురమున దిగుటకు సాధ్యముకాదయ్యె. స్వామిని సందర్శించి స్వాగత మొసగజాలమి చెన్నపురి పౌరు లెల్లరును పరితపించిరి.

చెన్నపురిని విడిచిన నాల్గవదినమున నోడ కొలంబో నగరమును జేరెను. కొలంబో పౌరులు స్వామికి అఖండస్వాగత మొసగిరి.

సముద్రయాత్రలో స్వామి యొనర్చిన ప్రసంగములను నివేదిత **గురుదేవుడు (నాకు గోచరించిన విధానము)** (The Master As I Saw Him) అను గ్రంథమున మనోహరముగా వర్ణించి యున్నది. ఇందలి ప్రవచనములను కొన్నిటి నుదాహరించుట యప్రస్తుతము కానేరదు.

''స్వామి యిట్లు వచించెను: 'నానాటికి విస్పష్టముగా నాకు గోచరించుచున్న విషయ మిది: సమస్తము ధైర్యసాహసములతోఁ గూడుకొనియున్నది. **ఇదియే నాసందేశము.** దుష్కార్యములనైనను సరియే ధీరుడవై యొనర్పుము! దుర్మార్గుడవగుట విధియైనచో అపరిమితదుర్మార్గుడవు కమ్ము!' ఇయ్యది మఱియొక విషయమును తలపునకు దెచ్చుచున్నది. భారతీయులలో దౌర్జన్యము

ఆరుదని యొకనాడు స్వామితో నేను పలుకగా స్వామి విచారగ్రస్తుడై యిట్లు వచించెను : 'వేఱువిధముగానున్నచో నెంతయో మేలై యుండెడిది ! ఇట్టి సౌజన్యము కేవలము జీవన్మరణము!'...స్వామి విశ్వమానవప్రేమము వర్ణనాతీతము.

"నరమాంసభక్షణము కొన్నిసంఘములలో నిత్యకృత్యమని కొందఱు పాశ్చాత్యులు సూచింప స్వామికి గల్గిన యాగ్రహమును నే నెన్నటికిని మఱవజాలను. సాంతముగా విని స్వామి యిట్లు పల్కెను : 'అసత్యమది ! యజ్ఞమునసనో, యుద్ధమున పగచేతనో కాని యేజాతియు నరమాంసభక్షణ మొనర్పలేదు ! అది యెన్నటికిని సాంఘికజీవులపద్ధతి కానేరదు ! ఐనచో సాంఘికజీవనమే నిర్మూలనమగును!'

" 'ఔన్నత్యము వలసినచో కష్టము లనుభవించి తీరవలయును. కొందఱు మహనీయులజీవితమును జూచినచో ఐహికసౌఖ్యము వారి కెట్లు కలలోని వార్తయయ్యెనో వెల్లడి కాగలదు.*సంసారము అసారము : జీవితము మూడు నాళ్ల ముచ్చట.'

" 'స్వార్థపరతను నిర్మూలింపవలయును. ప్రమాదమునకు నేను వశుడనైనపుడెల్ల స్వార్థచింతయే అందులకు మూలకారణమని గ్రహించితిని. ఎపుడు స్వార్థచింత లేదో అపుడు న్యాయము నాకు ప్రత్యక్షగోచరమగుచుండును.'

" 'యుద్ధము అభివృద్ధిసూచనయని భావించుట పిచ్చితనము. అభివృద్ధికి లక్షణము అన్యమతాభిప్రాయగ్రహణము, సమన్వయము. ఇదియే సనాతనధర్మ సహజలక్షణము.... ఐనను, అపుడపుడు ఆత్మసంరక్షణమునకై మేమును శత్రువులను హతమార్పగల్గినవారమే, కాని మేమెన్నడును యుద్ధమే పరమావధిగా భావింపలేదు....ఈ నూతనజాతులసన్నిటిని భారతదేశములోనికి వచ్చి చిందులు త్రొక్కనిండు, భయములేదు ! తుట్టతుదకు వీనికన్నిటికిని సనాతనధర్మము ఆపోశనము పట్టును! ' "

---

* ఇంద్రియనిగ్రహమునుగూర్చి స్వామి యొకప్పుడు బిల్వమంగళుని-

ప్రసంగవశమున పూర్వజన్మమునుగూర్చి స్వామి భగవద్గీతాశ్లోకముల నుదాహరించుచు నిట్లు వచించెను :

" 'పరిపూర్ణమనోనిగ్రహము లభింపనిదే ఏమి యొనర్చినను అడవిని గాచిన వెన్నెలవలె నిష్ప్రయోజనము. యోగభ్రష్టులు తమ వాంఛ నీడేర్చుకొనుటకై పునర్జన్మమున నొకప్పుడు కిరీటాధిపతులై జన్మింతురు. అట్టివారికి తఱచు పూర్వజన్మయోగవాసనలును స్ఫురణయు నుండును. అక్బరుచక్రవర్తి కిట్టి పూర్వజన్మస్ఫూర్తి యుండెడిది. పూర్వజన్మమున చ్యుతినొందిన యొక బ్రహ్మచారినని యాతడు భావించెను....నివేదితా! నీవేమనుకొందువుగాక. నాకును పూర్వజన్మజ్ఞానము కలదు సుమీ!*...'

" 'నానాటికి నేను అల్పవిషయములలో జూపబడు మహత్త్వమును గనుగొనవాంఛించుచున్నాను. మహాత్ముడగువా డేమి భుజించునో, ధరించునో, సేవకులతో నెట్లు సంభాషించునో, కనుగొన దలతును! సర్ ఫిలిప్ సిడ్నీమహాశయుం నౌన్నత్యమును జూడదలంతును! తమయవసానసమయమున నితరుల వప్పిని స్మరించువా రరుదుకదా.'

" 'ఉన్నతదశలో నున్నప్పుడు ప్రతివ్యక్తియు అఖండుడే! నాటకరంగమున పిఱికిపందయు భీముడే! అపుడు ప్రేక్షకు లాతని ధైర్యసాహసములను జూచి నిశ్చేష్టులగుదురు! ప్రతిదినము, ప్రతినిమేషము, నిరాడంబరముగా, ప్రశాంతముగా, తన విధ్యుక్తమును నిర్వర్తించు కీటకముయొక్క ఘనతయే నిజమైన ఘనతయని నాకు దోచుచున్నది.'

" 'తనయఖండౌన్నత్యమెట్టిదో శ్రీరామకృష్ణుడు స్వయముగా నెఱుంగడు. ఇంగ్లాండునుగూర్చికాని, ఆంగ్లేయులనుగూర్చికాని—వారు సాగరాంతరమునన్న విచిత్రవ్యక్తులనుటను మించి—యాత డెఱుంగడు. కాని యాతడు మహాద్భుతజీవితము గడపెను,—నే నాజీవితార్థమును గ్రహించి

వృత్తాంతము నుదాహరించుచు, బిల్వమంగళునివలె కన్నులను పొడిచివైచికొనుటయు ఒకానొకప్పుడు అవశ్యకమగునని వచించెను.

* అతిబాల్యముననే తనకు పూర్వజన్మజ్ఞానము కలదని స్వామి మఱి యొకప్పుడు వచించియున్నాడు.

తిని. ఆత డెవ్వరిని, ఏ మతస్థులను నిరసించి యెఱుగడు! నే నొకప్పుడు క్షుద్ర దేవతారాధకులను నిరసింప మొదలిడి మూడు గంటలసేపు కోలాహలముగా ప్రలాపించితిని. సాంతముగా విని యావృద్ధుడు ఇట్లు వచించెను: 'సరి! సరి! ప్రతిగృహమునకు నొక దొడ్డిగుమ్మము నుండవచ్చును; ఎవరెఱుంగుదురు!'

"'భోగత్యాగములు సనాతనధర్మశకటమునకు రెండు చక్రములు.

"'భార్యాపుత్రాదులయెడ మన యఖండప్రేమానురాగములను వైష్ణవమతము నిరసింపదు! బాలుని పోషించునప్పుడు మీబాలునే కృష్ణునిగా భావింపుడు' అని వైష్ణవమతము బోధించును. ఇదియే చైతన్యునిఘోష. 'ఇంద్రియములను నిగ్రహింపుడు!—నిరోధింపుడు!' అను వేదాంతబోధకు మాఱుగా 'ఇంద్రియములమూలమున భగవంతు నర్చింపుడు' అని యాతడు ఘోషించెను.'

"'నేడు మన మతమందలి సనాతనసంప్రదాయము మహాభారతయుగమందలి వైదికసంప్రదాయమునకును, ఆర్యసమాజము జైనమతమునకును, బ్రాహ్మసమాజము బౌద్ధమతమునకును సరివచ్చును.'

"'భారతదేశము దినదినాభివృద్ధి జెందుచు చేపబట్టుచున్న మొక్కయని తలంతును. ఐరోపాదేశముకూడ నిట్టిదే. ఇంకను ఈ రెంటిలో నేదియుం పరిపూర్ణవికాసము నొందకుండుటచే వీనిసంస్థలను మనము ఖండింపరాదు. మతసాంఘికాదివిషయములలో ఇవిరెండును రెండు మహాపరిశోధనలు.... ఈ పరిస్థితులను గమనింపని యుద్యమములవలన లేశమును ప్రయోజనములేదు. ఉదాహరణమునకు, ఐరోపాదేశమందలి జనులు పెండ్లియాడుటను, పెండ్లియాడకుండుటనుగూడ సమానగౌరవభావముతో నే నామోదింతును. మానవునియున్నతికిగాని, పరిపూర్ణతకుగాని గుణదోషములు రెండును సమానహేతువు లనుసంగతి నెన్నటికిని మఱవకుడు. దోషభూయిష్ఠమని ఋజువు చేయదగియున్నను, ఏజాతియొక్కయుం విలక్షణస్వభావమును మార్ప యత్నింపరాదు మనము.'

"ఎన్నియోసార్లు స్వామి నా కిట్లు తెల్పెను: 'నివేదితా! నీకు భారతదేశతత్త్వ మింకను బోధపడలేదు! భారతీయులమగు మేము మానవారాధకు

లము! మా దేవుడు మానవుడు!' ఇచట మానవుడనగా ఆత్మద్రష్టయగు బుద్ధుడు,—కృష్ణుడు,—గురువు,—మహాపురుషుడు—అని స్వామి యభిప్రాయము...."*

సమకాలికుడగు రఘునాథదాసు మహాభక్తునిగూర్చి స్వామి తెల్పిన యీ క్రిందివృత్తాంతము ఎంతయు భక్త్యావేశజనకమై యొప్పుచున్నది :

"...రఘునాథదాసు బ్రిటిష్ ప్రభుత్వసైన్యమున నొకసిపాయి. రక్షకభటుడై యాతడొకతావున కావలియుండగా నొకరాత్రి రామభజనసంఘము సంకీర్తన మొనర్చుచు ఆత డున్నవైపునకు వచ్చెను. రామసంకీర్తన మనినంతనే రఘునాథుడు భక్తిపరవశుడై ఆయుధములను దుస్తులను అవ్వల బాఱవైచి భజనసంఘమును గూడెను. ఇట్లు కొన్ని దినములు గడవ, సేనాధిపతి యీ వృత్తాంతమును విని, రఘునాథుని బిలిపించి, 'ఓయీ! నీ నేరమునకు శిక్ష తుపాకితో గాల్చి చంపుటయని యెఱుగవా? కానిమ్ము! ఈసారి కరుణించితిని. మఱల నిట్లు చేసినయెడల శిక్ష తప్పదు' అని పల్కెను."

"మఱునాడు రాత్రి మఱల రామభజనకీర్తనములను విని, వివశుడై రఘునాథుడు భజనసంఘములో నుఱికి తెల్లవారువఱకు సంకీర్తన మొనర్చెను. ఇంతలో సేనాధిపతి వెడలి, రఘునాథు డుండుతావును బరీక్షింప రఘునాథుడు తనస్థానముననే యున్నాడు. ముమ్మాఱు సేనానిపరామర్శకు రఘునాథుడు సమాధాన మొసగెను. అంత సేనాని తృప్తినొంది, నిద్రింప వెడలెను.

"మఱునాడు ఉదయము రఘునాథదాసు సేనానియొద్దకు అరిగి, తన వృత్తాంతమును దెలిపి, యుద్యోగ విముక్తిని గోరెను. కాని రాత్రి తాను ప్రత్యక్షముగా రఘునాథుని గాంచి, యాతనితో సంభాషించిన యాసేనాని యాతనిమాటలను విశ్వసింపడయ్యెను. భక్తపరిపాలకుడగు శ్రీరామచంద్రమూర్తియే తనస్థానమున పారావాడై కావలికాయు టెఱిగి రఘునాథదాసు పరులకు దాస్య మొనర్ప నంగీకరింపక యెట్లో ఉద్యోగమునుండి తప్పించుకొనెను.

---

* మనకును ఇష్టదేవతకును స్వతస్సిద్ధమగుభేదము కలదని తలపరాదని స్వామి తెలిపియున్నాడు.

"ఆతడు వైరాగియై సరస్వతీ నదీతీరమున నివసింపసాగెను. లోకు లాతడు అజ్ఞానియని తలచిరి. కాని నే నెఱుంగుదు నాతనిశక్తిని. ప్రతిదిన మాతడు వేలకొలది దరిద్రనారాయణులకు సమారాధన మొనర్చువాడు. బియ్యపువర్తకులు బాకీజాబితాలతో రఘునాథుని యొద్దకురా నాత డిట్లనును: 'ఉహుం! వేయి రూపాయిలా నీ కీయవలసినది? కానిమ్ము. సొమ్ము వచ్చి నెల యైన దనుకొందును. ఇది రేపు రావచ్చును.' సర్వదా ధన మాతని కట్లే వచ్చు చుండెడిది..." (క్షప్తము.)

ఏడెన్, సూయజులమీదుగా స్వామి 1899-వ జూలై 31-వ తేదీని లండన్‌నగరమును జేరి, యట ప్రశాంతముగా గొన్నిదినములు గడపి, సోదరశిష్యసమేతుడై అమెరికాదేశమునకు బయనించెను. *

స్వామి మొట్టమొదట న్యూయార్క్‌మహాపట్టణమున ప్రవేశించి తత్పౌరులకు అఖండానందము గొల్పెను. అచట వేదాంతసంఘాధ్యక్షుడై నిర్విఘ్నముగా బ్రచారమొనర్చుచుండిన అభేదానందుడు వచ్చి స్వామిని గలిసి కొనెను. పురప్రముఖులును పూర్వస్నేహితులును స్వామిని సందర్శించి, మహా స్వాగతము నొసగిరి.

మహాకార్యనిమగ్నుడయ్యును స్వామి తన మర్త్యలోకజీవితావధి నపుడపుడు స్మరించుచునే యుండెను. ఒక సమయమున స్వామి అభేదానందు నితో తా నిక మూడు నాలుగు సంవత్సరములకంటె నెక్కువ జీవింపనని

---

* ఈయాత్రనుగూర్చి యొకశిష్యురాలిట్లు వ్రాసెను: "...సముద్ర యానమున స్వామి సన్నిధిని గడపిన యీపదిదినములును నాజీవితములో ఎన్నటికిని మఱవరానివి. ప్రత్యుదయమునను గీతాపారాయణము....పండు వెన్నెలరాత్రులలో స్వామి యోడపై బచారుచేయుచు...ప్రకృతిసౌందర్య మునుగూర్చి మాకిట్లు వచించును: 'ఈమాయాప్రకృతియే ఇంతమనోహర ముగా నున్నచో ఆపరమాత్మసౌందర్యమెంత యద్భుతమో తలపోయుడు!... (ఆకసమును సాగరమును జూపుచు) 'కావ్యసార మచట వెల్లొందుచుండ నిక కావ్యపఠన మెందులకు?' అని పల్కెను...."

తెలుపుచు నిట్లు వచించెను: "కాళీభాయీ! నీకు తెలియదు. నే నతివిస్తృతి జెందుచున్నట్లు తలంతును. నా యంతరాత్మను ఈదేహ మిక నెంతమాత్రము భరింపజాలదు. ఈ శరీరము విచ్ఛిన్నమై పోనున్నది. ఈ రక్తమాంసకల్పితపంజరము నన్నిక కొలదిదినములకంటె విశేషము భరింపజాలదు."

న్యూయార్కునుండి స్వామి తత్పరిసరపట్టణములను దర్శించి, కాలిఫోర్నియా పరగణాకేగి యఖండ గౌరవపురస్సరమగు స్వాగతములనొందెను. అటనుండి లాస్ఏంజలిస్ న కేగెను. స్వామి యెచటికేగిన నచట నాతని యుపదేశామృతమును గ్రోలుటకై జను లువ్విళులూరుచుండిరి. లాస్ ఏంజలిస్‌లో వరుసగా గొన్ని యుపన్యాసముల నొసగుడని జనులు స్వామిని వేడిరి. 'వేదాంత తత్త్వము', 'కర్మరహస్యము', 'మనశ్శక్తులు' మున్నగు విషయములనుగూర్చి స్వామి మహాద్భుతముగా నుపన్యసించెను. అట్లే పసడెనానగరమున కేగి యచటి షేక్స్పిఎయర్ సంఘమునందును యూనివర్సలిస్ట్ చర్చి అను నొక క్రైస్తవ ప్రార్థనాలయమునందును 'విశ్వమానవమతావలంబనవిధానము', 'దేవదూతయగు క్రీస్తు', 'ప్రపంచ మహామత ప్రబోధకులు', 'రామాయణము', 'మహాభారతము' మున్నగు విషయములనుగూర్చి స్వామి వేల కొలదిజనులకు అఖండవిజయోపేతుడై యుపన్యసించెను. మఱియు లాస్ ఏంజలిస్ నగరమునందలి సత్యనిలయము (Home of Truth) అను సంఘముచే ఆహూతుడై పాఠములమూలమున వేలకొలది జనులకు వేదాంతతత్త్వమును బోధింపసాగెను. సత్యనిలయసంఘసభ్యులనేకులు స్వామి కనుచరులైరి. స్వామి సరళజీవనవిధానమును, ఆతని మహాద్భుతశక్తిని, పారమార్థికప్రతిభాతిశయమును గాంచి కాలిఫోర్నియాజనులు వివశులైరి. లాస్ ఏంజలిస్‌నగరమున స్వామి బోధోపన్యాసప్రభావమునుగూర్చి 'యూనిటి' యను పత్రిక విశేషముగా నుగ్గడించుచు నిట్లు వ్రాసెను:

"...విశ్వవిద్యాలయాధ్యక్షుని వైదుష్యమును, పాశ్చాత్యమతాచార్యుని గాంభీర్యమును, బాలుని సహజ సరళహృదయమును అత్యద్భుతముగా

వివేకానందస్వామియందు సమ్మేళనమొందియున్నవి. సత్యనిలయము (Home of Truth) న మా కాతడొసగిన యెనిమిది యుపన్యాసములును అత్యంత మనోరంజకములుగా నున్నవి. సభారంగమున నిలిచి, యప్రయత్నముగా నొక నిమేషములో ఉపన్యాసవిషయములో దిగి, సభారంజకముగా నాతడుపన్య సించును. ఖడ్గమొక చేతను, బైబిల్ మఱియొక చేతను ధరించి, యేఫిలిప్పైన్ దీవులందలిజనుల నుద్ధరించుటకో, లేక యే దక్షిణాఫ్రికాయందలి యేకభగవత్పుత్రుల నొకరినొకరు వధించుకొననిచ్చుటకో, వెడలునట్టి నేటి క్రైస్తవుల దుండగములను దలచి, వేదాంతతత్త్వనిర్గతమై స్వామి మానసము క్షోభించిపోవును. ఇచటి ఘోరకలి యట్లుండ, భారతదేశమున నిటీవల సంభవించిన మహాక్షామమున నేమి జరిగెనో,—జనులు తమపశువుల ప్రక్కనే వస్తుపడియుండియు వానిని జంపుటకు మనస్కరింపక యెట్లు తమ ప్రాణములు విడిచిరో—స్వామి మాకు విశదీకరించెను....."

లాస్ ఏన్జలిస్‌నుండి స్వామి ఓక్‌లాన్డ్ పౌరులచే ఆహూతుడై వేన వేలమంది కనేకోపన్యాసముల నొసగెను. సుప్రసిద్ధవార్తాపత్రికలు స్వామి నపరిమితముగా శ్లాఘించుట యట్లుండ, వందలకొలది మతాచార్య ప్రముఖులు స్వామిని సందర్శించి, స్వామిభావముల నామోదింపసాగిరి. పూజ్యుడగు మిల్స్‌పండితుడు స్వామిని గూర్చి, "ఈ మహనీయుని మ్రోల మన విశ్వవిద్యాలయ పండితోత్తములు కేవలము పసిబాలురు" అని వచించెను.

స్వామిప్రభావము అత్యద్భుతమై విలసిల్లెను. కాలిఫోర్నియాపరగణాలోని సుప్రసిద్ధధీమంతులలో వేదాంతసంచలన మదయించెను. శాన్‌ఫ్రాన్సిస్కో (Sanfrancisco) పుర ప్రముఖులు స్వామి నత్యంతగౌరవముతో నాహ్వానించిరి. అచటి స్వర్ణద్వారభవనము (Golden Gate Hall) న స్వామి 'విశ్వమానవమతాదర్శము'నుగూర్చి యుపన్యసింప, పౌరు లానందపరవశులైరి. అనంతరము తత్ప్రాంతమున స్వామి కొక విశాలభవనమున బసనేర్పఱచి సాధకులయుపయోగార్థమై పాఠములు జెప్పుడని స్వామిని ప్రార్థించిరి.

స్వామి రాజయోగమునుగూర్చియు అందు ముఖ్యముగా ధ్యానమును గూర్చియు బోధింప నారంభించెను. శాన్‌ఫ్రాన్సిస్‌కోనగరమున స్వామి వరుసగా ననేక భక్తియోగోపన్యాసముల నొసగెను. మఱియు నచటి సుప్రసిద్ధ సంఘము లన్నిటియందును స్వామి తన బోధామృతమును ప్రసరింపజేసెను. 'వేదాంతము భావిప్రపంచమతమా?' 'ప్రపంచమునకు బుద్ధునిసందేశము', 'క్రీస్తు సందేశము', 'మహమ్మద్ సందేశము', 'కృష్ణుని సందేశము', 'మన స్తత్త్వము: మనశ్శక్తులు', 'యోగము', 'చిత్తైకాగ్రత', 'మానవుడు: ప్రకృతి', 'జీవేశ్వరులు', 'జీవితపరమావధి', 'ఆరాధన', 'భారతదేశీయకళలు: శాస్త్రములు' మున్నగునవి శాన్ ఫ్రాన్సిస్‌కోపౌరులకు స్వామి యొసగిన యుపన్యాసరత్నములు.

అమెరికాదేశమందలి యొక నదీతీరమున నుండగా, స్వామిచిత్తైకాగ్రతను బ్రకటించు నొక విచిత్రసంఘటనము జరిగెను. అచట కొందఱు యువకు లొకవంతెనపై గూరుచుండి, ప్రవాహవేగమున గొట్టుకొనిపోవుచున్న యొక విధమైనచిప్పలను తుపాకులతో గుఱిచూచి కొట్టయత్నించుచుండిరి. కాని వారి యత్నములన్నియు విఫలములగుట స్వామి చిఱునవ్వునవ్వుచు గాంచుచుండెను. అంతట వారు రోషపూరితులై, "ఇదియంత తేలికయని తలచుచుంటిరి కాబోలును! ఏది, మీరు కొట్టుడు చూతము," అని సవాలుచేసి పలికిరి. అంత స్వామి యొక తుపాకిని గైకొని పండ్రెండుచిప్పలను వరుసగా గొట్టివైచెను! యువకులు నిశ్చేష్టులైరి. స్వామి వారలకు దా నిదివఱకెన్నడును తుపాకిని జేపట్టినవాడనుగాననియు అంతయు చిత్తైకాగ్రతతో గూడుకొని యున్నదనియు బోధించెను.

కాలిఫోర్నియాలో స్వామియుద్యమ మపరిమితముగా వ్యాప్తినొందసాగెను. శాన్‌ఫ్రాన్సిస్‌కో, ఓక్‌లాన్డ్, ఆలమేడ మున్నగునగరములలో అనేక వేదాంతసంఘములు స్థాపింపబడియెను. కాలిఫోర్నియాలో శాశ్వతాశ్రమ స్థాపనమునకై యొకశిష్యురాలు నూటయఱువదియెకరములభూమి నొసగెను.

మనోహరమగువనమధ్యమున 'శాంత్యాశ్రమము' స్థాపింపబడ, తురీయానందుడు ఆశ్రమాధ్యక్షుడయ్యెను.

స్వామికి తీఱికయనునది లేకుండెను. విశ్రాంతి యత్యావశ్యకమని వైద్యులు దెలిపిరి. అందులకై కాంప్ టేలర్ (Camp Taylor) అను తావున స్వామి నివసింపసాగెను. అచటి ప్రకృతిరమ్యప్రదేశమున శిష్యు లేర్పఱచు వనభోజనములం దపుడపుడు పాల్గొనుచు, హాస్యచమత్కృతులతో భారతీయాదర్శములను తన పాశ్చాత్యశిష్యులకు దెలుపుచు, స్వామి నిర్విచారముగా కాలము గడపుచుండెను.

ఐనను స్వామిబాల్యోల్లాస మను మెఱపుదీగల వెనుక గంభీరమనోభావము లను మేఘమండలము కల దను సంగతి మఱవరాదు. పూర్వపరివ్రాజకవైరాగ్యము మఱల ప్రదీప్తమై జ్వలింప, 1900-వ ఏప్రిల్ 18-వ తేదీని మిస్ మెక్లాడ్ (Miss MacLeod) అనుశిష్యురాలి కిట్లు వ్రాసెను:

"కర్మమొనర్చుట కష్టసాధ్యము. నావిధ్యుక్తకర్మ మిక శాశ్వతముగా అంతమొందుగాకయని, నా మానసము జగన్మాతృభావమున లీనమగు గాకయని నాకై ప్రార్థింపుము. ఆమెయుద్యమ మామెకే తెలియును....

"నాకు అఖండమనశ్శాంతి లభించినది. శరీరవిశ్రాంతికంటె ఆత్మశాంతిని నే నెక్కు డనుభవించుచున్నాను. జీవితయుద్ధములోని జయాపజయములు సమాప్తములయినవి. మూటకట్టుకొని ప్రయాణమునకు సిద్ధముగానున్నాను. ఆజగద్రక్షకుని యాజ్ఞకై నిరీక్షించుచున్నాను.

"శివా! సర్వేశ్వరా! ఈ నానౌకను అద్దరి జేర్పుము!

"దక్షిణేశ్వరవనవటవృక్షముక్రింద గూర్చుండి రామకృష్ణవచనామృతమును సమ్మోహితుడనై క్రోలు బాలుడనే కదా నేను! అదియే నాసహజస్థితి. కర్మము, ఉద్యమము, జగద్ధితము మున్నగునవన్నియు అవాంతరముగా నామీద బడినవి.

"అతని కంఠస్వరమే, నన్ను పులకితగాత్రు నొనర్చు నాతనికంఠస్వరమే, మఱల నాకిపుడు వినవచ్చుచున్నది. బంధములు సడలుచున్నవి.

ప్రేమానురాగము లింకిపోవుచున్నవి. కర్మము రసహీనముగా దోచుచున్నది. జీవితవ్యామోహము తొలగిపోయినది. అదిగో, సర్వేశ్వరవాణి వినవచ్చుచున్నది! 'వచ్చుచున్నాను. తండ్రీ! వచ్చుచున్నాను.' 'గతార్థములను దలపక న న్ననుసరింపు మనుచుంటివా?' తండ్రీ! ఇదిగో వచ్చుచున్నాను!

"...నిర్వాణము నాయెదుట దీపించుచున్నది. అనంతము, నిస్తరంగమునగు నాయనంతశాంతిసాగరమే న న్నావరించియున్న దనేక పర్యాయములు.

"జన్మించినందులకు నే నానందించెదను ; కష్టము లనుభవించినందుల కానందించెదను; మహాప్రమాదముల బడినందుల కానందించు చున్నాను; శాంతిసాగరమున లీనమగుటకు అమందానందము నొందుచున్నాను. బద్ధునిగా ఒక్క ప్రాణినైనను విడువను. బంధములు నాపై వైచుకొనను. విదేహముక్తి గల్గినను, జీవన్ముక్తియే లభించినను సరియే; ఈశరీరమందలి పూర్వపురుషుడు వెడలిపోయినాడు. మఱల రాడు!

"ఇందున్న గురువు, నాయకుడు, ఆచార్యుడు వెడలిపోయినాడు;—బాలకుడు, విద్యార్థి, సేవకుడుమాత్రమే నిలిచియున్నాడు.

"ఎవ్వనితోడను నాకు జోక్యము వలదు. నాకేల? నాయకపదవిని విడిచిపెట్టి చాలకాలమైనది. ఇక కంఠమెత్తుటకు నాకు అధికారము లేదు. కాలప్రవాహమునందు బడి కొట్టుకొనిపోవునపుడే నాకు అఖండానందము, అట్టి నిమేషములే నాజీవితమున మనోత్తమానందసమయములు...కాలప్రవాహమును నాచేయివైచి కలచి యీమహాద్భుత ప్రశాంతిని, ఇదియంతయు మహామాయయని తోపించునీయఖండప్రశాంతిని, భేదింప సాహసింపను!

"నాకర్మమునకు వెనుక వాంఛ కలదు, నాప్రేమవెనుక వ్యక్తిభావమున్నది, నా పవిత్రతవెనుక భయమున్నది, నా గురుత్వమునకు వెనుకనున్నది యధికారతృష్ణ! ఇప్పు డివియన్నియు సమసిపోవుచున్నవి. కాలప్రశాంతివాహినీ తరంగములయందు బడి కొట్టుకొనిపోవుచున్నాను. తల్లీ! వచ్చుచున్నాను. నన్ను నీయొడిలో గూర్చుండబెట్టుకొనుము! ఆ లోకాతీత లోకమున నీ యిచ్చవచ్చిన చోటికి నన్ను గొనిపొమ్ము. నేనిక కర్తనుగాను, సాక్షీభూతుడను. తల్లీ! వచ్చుచున్నాను!

"ఆహా! ఏమి ప్రశాంతిమయము! నా భావము లతిదూరమునుండి, హృదయాంతరాళమునుండి, వెలువడుచున్నట్లు తోచుచున్నది. అధ్వను లస్పష్టరహస్యములవలె వినవచ్చుచున్నవి. శాంతి—అఖండశాంతి—మధుర ప్రశాంతి—సమస్తము నావరించుచున్నది.... నాథా! నేను వచ్చుచున్నాను!

"జగము ఉన్నది, కాని మనోహరముగ నున్నదా?—లేదు. అసహ్యముగను లేదు. ఎట్టి రాగద్వేషములను గల్గింపని బాహ్యాస్పర్శమాత్రముగ నున్నది. ఆహా! ఏమి యీయానందము! సమస్తము యోగ్యమై, మనోజ్ఞమై కాన్పించుచున్నది. సుఖదుఃఖాదిద్వంద్వములు తొలగిపోవుచున్నవి; శరీర స్పృహయే తొలగిపోవుచున్నది. ఓమ్ తత్ సత్!"

ఈ సమయమున ననగా 1900-వ సంవత్సరమున ప్యారిమహాపట్టణములో సర్వమతచారిత్రికమహాసభ జరుపుటకై పాశ్చాత్యులు అఖండప్రయత్నము లొనర్చుచుండిరి. అటనుపన్యసించుటకై స్వామి నాహ్వానించిరి. స్వామి వెడలుటకుముందు తురీయానందున కిట్లు హితోపదేశ మొనర్చెను: "కాలిఫోర్నియాలో ఆశ్రమము నెలకొల్పి వేదాంతధ్వజస్థాపన మొనర్పుము. ఈక్షణము నుండియుం భారతదేశమును సంపూర్ణముగా మఱచిపొమ్ము! ముఖ్యముగా దివ్యజీవనముగడపుము; మిగిలినదంతయుం తల్లియే చూచుకొనును!"

జూలై 20-వ తేదీని స్వామి ప్యారి (Paris) పట్టణమునకు బయనమయ్యెను. స్వామితో మనము ప్యారిపట్టణమున ప్రవేశించుటకుముందు, అమెరికాలో నాతని బోధోపన్యాసప్రభావమునుగూర్చి శిష్యులలో నొకరు వ్రాసిన యీ క్రిందివాక్యములను గమనించు టుచితము:

"...స్వామిదివ్యమూర్తిని ఆతని బోధోపన్యాసనైపుణిని కలనైనను మఱవజాలము.... బ్రహ్మచర్యప్రాముఖ్యమునుగూర్చి యొకనాడుపన్యసించుచు నిచటివైద్యుల మాఢ్యమును దలచి యనిర్వాచ్యమగు నసహ్యతను వెల్లడించుచు నిట్లు ఘోషించెను: 'బ్రహ్మచర్యము ప్రకృతివిరుద్ధమని భావించు నిచటి వైద్యులారా! మీమాట లర్థరహితములు. పవిత్రతాశబ్దమునకు మీకర్థము తెలియదు. బ్రహ్మచర్యమధర్మమనియే మీయభిప్రాయమైనచో, మీరు పట్టి

పశువులు! పశువులని వక్కాణించెదను!' ఇట్లు పల్కుచు, గంభీరవదనుడై సభ్యుల నలక్ష్యముగా నవలోకించెను. ఆ దృక్కులు ప్రతిపక్షులకు బ్రహ్మాస్త్రములైనవి. సభలో అనేకవైద్యశేఖరు లున్నను, ఎవ్వరును కంఠమెత్త సాహసింపలేదు....స్వామియుపన్యాసములు వేదాంత సింహగర్జారావములు....అత్యద్భుతవ్యక్తియగు స్వామి జగద్గురువర్యేణులలో ఉత్తమ గణ్యుడు.

"సత్యగర్భితములగు హాస్యచమత్కృతులు స్వామిసొత్తు. భగవత్సాక్షాత్కారవైభవప్రకటనముతో ముగిసిన యొక యుపన్యాసమును విని, సభ్యులలో నొకరు, 'స్వామీ! మీరు భగవంతుని జూచితిరా?' యని ప్రశ్నింప స్వామి, 'ఒకవేళ చూచినను నావంటి స్థూలకాయు డట్లు కాన్పించునా?' యని మందస్మితవదనారవిందుడై పల్కెను!

"'స్వామీ! మనము భగవంతునియం దైక్యమొందునపుడు మన వ్యక్తిత్వ మేమగును?' అని యెవ్వరైనను బ్రశ్నించిన, స్వామి నవ్వి, యిట్లు హేళనచేయును : 'మీ వ్య-క్తి-త్వ-ములు ఎక్కడ పోవునోయని మీదేశీయుల కెంతభయమో! ఏల? మీ రింకను వ్యక్తులుకారు. భగవంతుని దెలిసికొనునెడ మీయోగక్షేమముల కిసుమంతయు లోపము కలుగదు....ఈదేశములో తఱచు నేను వినుచున్న మఱియొక విషయమిది: ప్రకృతితో మనము పొత్తుకలిగి నివసింపవలయునట! ప్రకృతితో పొ-త్తు! ఏల, ప్రపంచమున మానవుడు పొందిన వికాసమంతయు ప్రకృతితో పోరాడుటచేతనే, ప్రకృతిని జయించుటచేతనే, పొందగల్గె ననుసంగతి మీకు తెలియదా?...చెట్టు ప్రకృతితో పొత్తు కలిగి జీవించును. అచట అంతయు పొత్తే; ప్రతికూలమేమియు లేదు;—వికాస మంతకంటె లేదు. వికాసము నొందవలయునన్నచో, అడుగడుగునను ప్రకృతిని అడ్డుకొనితీరవలయును....'

"పారమార్థికశిక్షణమునుగూర్చి స్వామి యిట్లు పల్కును : 'మీరెంత తక్కువ చదివిన అంత మంచిది.... మఱియు విద్యావిధానమును గూర్చి యిట్లు బోధించును: 'నేటివిద్యావిధానమంతయు పెడత్రోవను ద్రొక్కుచున్నది....ఆలోచనాశక్తిని ఏకాగ్రతను అలవరుచుకొనుటకు ముందు నానావిషయములతోడను మనస్సును నింపిన ప్రయోజనమేమి?...మెకాలె వ్రాసిన

ఇంగ్లాండుదేశచరిత్రను మూడుసార్లు చదివి నేను కంఠస్థముచేసితిని, కాని మాఅమ్మ ఏమతగ్రంథమైనను ఒక్కసారి చదివినంతనే కంఠస్థముచేయగలి గెడిది....మనోనిగ్రహము లేకుండుటయే జనులు బాధపడుచుండుటకు కారణము....'

"జీసస్ అయోనిసంభవుడనుటనుగూర్చి మీయభిప్రాయ మేమి?' అని నేనడుగ స్వామి యిట్లు వచించెను: '...ప్రకృతి భగవంతుని శాసింపజాలదు. అంతయు వానిలీల' అని మఱల నిట్లు పల్కెను; 'మనము ప్రకృతిదాసులము. పరమేశ్వరుడో, ప్రకృతికి అధీశుడు, సంకల్పసిద్ధుడు....ఒకేసారిగా, ఇచ్చవచ్చినరీతిని పండ్రెండుశరీరములను దాల్చినను దాల్పగలడు....'

"...నిక్కముగా యోగియు ఆత్మరతుడునగు స్వామిని గాంచినంతనే యెవ్వరైనను భక్తిప్రేమానురాగములతో నాతని నర్చించి తీరవలయును." (క్లుప్తము.)

## ముప్పదియాఱవ ప్రకరణము

## ప్యారి (Paris) మహాసభ : ఐరోపాదేశపర్యటనము

స్వామి ప్యారి నగరమును జేరి తన శిష్యులగు లెగెట్ దంపతుల భవనమున బసచేసెను. లెగెట్ దంపతు లీసమయమున లండన్ నగరమునుండి ప్యారి నగరమునకు వచ్చి, యంతకుముందుగనే స్వామి నాహ్వానించి యుండిరి. స్వామి వచ్చెనను వార్త నలుగడలను వ్యాపించినంతనే కవులు, గాయకులు, చిత్రలేఖకులు, నటులు, నీతివిశారదులు, పండితులు, తత్త్వవేత్తలు మున్నగువారు వందలకొలది స్వామిని సందర్శించి యాతని దివ్య ప్రసంగ సుధారసమును గ్రోలసాగిరి. పాశ్చాత్య ప్రముఖులనడుమ స్వామి సందేశము దివ్యసౌరభమువలె వ్యాపింపసాగెను.

ప్యారి (Paris) నగరమున మతచారిత్రికమహాసభలో నుపన్యసించుటకై స్వామి వేంచేసెనని చెప్పియుంటిమికదా. షికాగోలో జరిగిన సర్వమత మహాసభవంటి సభయే ప్యారినగరమందును మఱల నేడు జరుప మొట్టమొదట నిశ్చయింపబడెను. కాని మఱల ప్రాచ్యమతాభిప్రాయప్రాబల్యముచే తమ సనాతనక్రైస్తవమతమున కెక్కడ ముప్పువాటిల్లునో యని రోమన్ క్యాథలిక్ మతాచార్యులు తీవ్రముగా ప్రతిఘటించి గగ్గోలు చేసిరట. చేయుట సహజముకదా! అందుచే నేమతసిద్ధాంతములనుగూర్చియు సభలో జర్చింపరాదనియు మతములనుగూర్చి చారిత్రికవిమర్శమాత్రమే జరుపదగుననియు నిర్ణయింపబడెను. 'వైదికమతము ప్రకృత్యారాధనజనితమా, కాదా?' యనువిషయమునుగూర్చి పాశ్చాత్యపండితులతో స్వామి చర్చించుటకు నిర్ణయింపబడెను.

మహాసభలో మొట్టమొదట గుస్టవ్ ఓపర్ట్ (Gustav Oppert) అను జర్మన్ పండితుడు సాలగ్రామమునకును శివలింగమునకును గుహ్యాంగార్చ

నమే మూలమని నిరూపింపయత్నించెను! స్వామి యది వట్టిదురభిప్రాయమనియుం పరమేశ్వర ప్రతీకమగు యూపస్తంభమే శివలింగమునకు మూలమనియుం అథర్వవేదసంహితాది ప్రమాణములను జూపుచు జర్మన్ పండితుని సిద్ధాంతమును ఖండించెను. మఱియు శివలింగమును సాలగ్రామమును విశేషవ్యాప్తి నొందుటకు బౌద్ధమతప్రాబల్యము కొంతవఱకు కారణమైయుండనోపుననియుం బౌద్ధస్తూపనిర్మాణ సంప్రదాయమును హిందువులు శివలింగప్రతిష్ఠారూపమున ననుసరించియుండవచ్చుననియు విశేషము, క్రైస్తవుల 'హోలీకమ్యూనియన్' * (Holy Communion) సంస్కారమునకును, నరమాంసభక్షణమునకును ఎంతసంబంధము కలదో, లింగార్చనమునకును గుహ్యాంగార్చనకును అంతియే సంబంధము కలదనియుం సయుక్తికముగ స్వామి నిరూపించెను. స్వామి తనద్వితీయోపన్యాసమున బౌద్ధాదిసంప్రదాయములకన్నిటికిని వేదములే మూలాధారమని స్పష్ట మొనర్చెను. బుద్ధునికంటె శ్రీకృష్ణుడు పూర్వుడనియుం ఒకవేళ భగవద్గీత మహాభారతాంతర్గతము కాదనుకొన్నను, భారతానంతరము వెలువడినదిమాత్రము కాదనియు ధ్రువపఱచెను. భారతీయవిజ్ఞానమును కళలును గ్రీసుదేశపువిజ్ఞానమునుండి వచ్చినవను సిద్ధాంతమును స్వామి తీవ్రముగా ఖండించి, ఆర్యులు తమ శాస్త్రములను విదేశీయ శిష్యులగు యవనులు మఱింత విశేషముగా నభ్యసింప బ్రోత్సహించు తలంపున (ఆర్యులు) వారిని ఋషులని స్తుతించిరని ప్రమాణములను జూపుచు స్వామి తన సిద్ధాంతమును బలపఱచెను. మఱియుం గ్రీకుగ్రంథములయెడ తమకుగల సమాదరణబుద్ధిని పాశ్చాత్య పండితులు సంస్కృతగ్రంథములయెడ గూడ జూపినగాని సత్యము బయల్పడదనియు అపుడే వివిధచారిత్రికయుగములలో ప్రాక్పశ్చిమదేశీయుం లొకరిభావముల నొకరెంతవఱకు గ్రహించిరో తేటతెల్ల మగుననియుం

---

* మతాచార్యునిచే నివేదనచేయబడిన మద్యమును రొట్టెను జీసస్ యొక్క రక్తమాంసము లనుభావముతో గ్రహించు రోమన్ క్యాతలిక్ మత సంస్కారము.

వక్కాణించెను. పాశ్చాత్యపండితులు స్వామి యభిప్రాయములను జాలవఱకు ఆమోదించిరి.

జగద్విఖ్యాతప్రకృతిశాస్త్రనేత్తయగు జగదీశచంద్ర (వసువు)బోసు మహాసభయందలి శాస్త్రశాఖాసమావేశమున నుపన్యసింపనాహూతుడై వచ్చియుండెను. తనయద్భుత పరిశోధనలచే జగదీశచంద్రుడు పాశ్చాత్యశాస్త్రజ్ఞులను సమ్మోహితుల నొనర్చెను. జగదీశునాధిక్యమునుగూర్చి స్వామి తనమిత్రులతో మనోహరముగా ముచ్చటించువాడు.

మహాసభానంతరము స్వామి ఓలిబుల్ సతికి అతిథిగా శిష్యసమేతుడై బ్రిటానీ యనుపరగణాలో గొలదిదినములుండెను.* ఈసమయమున సోదరి నివేదిత తనభారతబాలికాపాఠశాల నభివృద్ధిచేయుటకై ఇంగ్లాండ్ దేశమున గొంతకృషిచేయ నెంచి స్వామియనుజ్ఞను వేడెను. స్వామి యాశీర్వదించుచు నిట్లు వచించెను: "కొందఱుమహమ్మదీయులలో విచిత్రమగు నొక సంప్రదాయము కలదు. శిశువు జన్మించినంతనే యాదురభిమానగ్రస్తులు, 'నిన్ను అల్లా సృజించిన చావుము! అలీ సృజించిన బ్రదుకుము!' అని శిశువును ఆఱుబయట విడిచిపెట్టెదరట! ఆమాటలనే నేను మార్చి చెప్పెదను—'కార్యరంగ

*బౌద్ధవేదాంతమతముల నొండొంటితో బోల్చుచు స్వామి యిచట నొనర్చిన ప్రసంగము లెంతయు గమనింపదగియున్నవి. స్వామి యిట్లు వచించెను: "బౌద్ధవేదాంతమతములకు గల గొప్పవ్యత్యాసమిది; 'సర్వము మాయగా గ్రహింపుము' అని బౌద్ధమతము చెప్పుచుండ, 'మాయయందే సత్యము కలదు' అని వేదాంతము తెల్పును....బౌద్ధవిధిని పరిపాలింపవలయుననిన సన్న్యాసము ఆవశ్యకము; వేదాంతవిధినో, ఏయాశ్రమముననున్నను పరిపాలింపవచ్చును. మహోత్తమధర్మతత్త్వములను ధర్మవ్యాధుడు...సన్న్యాసియగు కౌశికునకు బోధింపలేదా?..."సనాతనధర్మము ఇతరధర్మములకే కాక బౌద్ధసందేశమునకును బుద్ధునకునుగూడ తావొసగెనని స్వామి తెలిపెను. బుద్ధునియౌదార్యమును శంకరునిధీవైభవమును ఒండొంటితో సమ్మేళనమొందుటయే మానవకోటిపరమాదర్శమని స్వామి ప్రకటించెను.

మున ప్రవేశింపుము,—అచట, నిన్ను నేను నిర్మించిన, నశింపుము! తల్లి జగజ్జనని నిర్మించిన, వర్ధిల్లుము!"

బ్రిటానీనుండి స్వామి మఱల ప్యారిపట్టణమునకు వచ్చి, మిత్రసమేతుడై, వియన్నా, కాన్‌స్టాంటినోపిల్, ఏథెన్స్, ఈజిప్టులను దర్శించి యటనుండి భారతదేశమునకు ఒంటరిగా బయనమయ్యెను.

# ముప్పదియేడవ ప్రకరణము

## స్వామి మఠజీవనము

స్వామిరాకనుగూర్చి బేలూరుమఠమున నెవ్వరికిని తెలియదు. 1900-వ డిసెంబరు 9-వ తేదీని రాత్రి యించుమించుగా తొమ్మిదిగంటలకు స్వామి మఠమున కేతెంచినంతనే సోదరశిష్యులందఱును, "స్వామిజీ వచ్చిరి! స్వామిజీ వచ్చిరి!" అని బ్రహ్మానందభరితులైరి. భోజనానంతరము స్వామి తన పశ్చిమదేశపర్యటనమునుగూర్చి ముచ్చటించుచు నిట్లు పల్కెను: "మొదటిసారి నేను పశ్చిమఖండమును జూచినపుడు పాశ్చాత్యులశక్తిసామర్థ్యములను సంఘనిర్మాణకౌశలమును జూచి యబ్బురపడితిని. ఇప్పుడో, అధికారవాంఛతో, స్వార్థపరాయణతతో, గూడిన పాశ్చాత్య వర్తకధోరణి యనిన నాకు పరమాసహ్యముగా నున్నది. వారి సంఘీభావబుద్ధి కొనియాడదగినదే. కాని తోడేళ్ల సమావేశములో అందమేమున్నది?... పాశ్చాత్యజీవనవిధానము నాకు నరకప్రాయముగా గాన్పించుచున్నది."

స్వామి భారతదేశమునకు వచ్చుటకుపూర్వము అద్వైతాశ్రమము నందలి సెవియర్ మిత్రుడు మరణించెనని దివ్యదృష్టిచే గ్రహించియుండెను. కొలదిదినములైనంతనే శిష్యసమేతుడై సెవియర్ సతి నోదార్చుటకై మాయావతి కేగి యచట కొన్నిదినములు గడపెను. సెవియర్ సేనాని తనయుద్యమమునకై రక్తము ధారవోసెనని స్వామి వచించియున్నాడు.

ఆశ్రమకార్యనిర్వహణమున శిష్యులు జూపవలసిన విధేయతనుగూర్చి ప్రసంగించుచు స్వామి యొకప్పుడిట్లు పలికెను: "విధేయతయు గౌరవమును శాసనముచే పొందదగినవికావు. ప్రేమమయస్వభావము,—మహోత్తరమైన శీలము—ఇవియే అందులకు ముఖ్యకారణము. నిజమైన ప్రేమౌన్నత్యములకు సర్వజనులును నతులొనర్తురు."

అద్వైతాశ్రమాభివృద్ధినిగూర్చి స్వామి తన కార్యక్రమమును దెలుపుచు, ధ్యానాయత్తచిత్తుడగు విరజానందస్వామితో నిట్లు వచించెను: "జపతపములమాట సరియే... కాని కఠినతపస్సుచే శరీరమును ధ్వంసముచేసికొన్న కుము...గంటలకొలది ధ్యానింపగలవా డెవడు? ఐదునిమిషములు చిత్తైకాగ్రత పొందగలిగిన, జాలును. ఐదననేల, ఒక్కనిమేషము చాలును. అందుకొరకే ఉదయసాయంసమయములందు నియమితకాలము ఆవశ్యకమైయున్నది. మిగిలినకాలము విద్యాభ్యాసముననో, లోకహితకార్యములందో వినియోగింపవలయును. ఉగ్రతపశ్చర్యలకంటె కర్మాచరణమునే నాశిష్యులెక్కుడు లక్షింపవలయును. కర్మమే వారికొక సాధనగను తపశ్చర్యగను ఉండవలయును." ఐనను ధ్యానాయత్తము, స్వేచ్ఛావిలసితమునగు పారమార్థికజీవితమునందలి ఔన్నత్యమును స్వామి గుర్తింపకపోలేదు. భిక్షాటనముచే జీవించుచు, భగవదాయత్తచిత్తుడై, బాహ్యస్మృతిరహితుడై గడపిన పరివ్రాజకదినములే తన జీవితమునందలి మహోత్తమానందదినములనియు ఆ స్వచ్ఛందజీవనము—ఏకాంతజీవనము-లభించినచో సమస్తము విడిచిపెట్టెదననియు స్వామి వక్కాణించెను.

అద్వైతాశ్రమమున శిష్యులు శ్రీరామకృష్ణపూజామందిరమును నిర్మించి, ధూపదీపనైవేద్యాదికములతో విగ్రహారాధనము చేయుచుండుట చూచి, స్వామి తీవ్రముగా ఖండించెను. ఇవ్విషయమునుగూర్చి యనంతరము స్వామియభిప్రాయమును బలపఱుచుచు శ్రీశారదామాత యిట్లు వచించెను : "శ్రీగురుదేవునితత్త్వము అద్వైతమే. శ్రీవారు అద్వైతమునే బోధించియున్నారు. మీరును అద్వైతము నెందులకు అవలంబింపరాదు ? వారి శిష్యులందఱును అద్వైతులే." శిష్యులు స్వామియభిప్రాయమును శిరసావహించిరని చెప్పనక్కఱలేదు. ఇవ్విషయమునే తలచి స్వామి బేలూరుమఠమునకు వచ్చి యిట్లు పలికెను : "శ్రీరామకృష్ణుని బాహ్యారాధనములేని కేంద్రమొక్కటియైన నుండవలయునని తలచితిని. కాని యచటను ఈ వృద్ధుడు ప్రతిష్ఠితుడైనాడు! సెబాసు!"

బేలూరుమఠమున బ్రహ్మచారులను సన్న్యాసులను తన మహాకార్య భారమును వహింప సమర్థుల నొనర్చుటొక్కటే స్వామి కిక మిగిలియున్న మహాకార్యము. బోధనకై వలయు పాఠములేమి, దృఢశరీరమున కావశ్యకమగు వ్యాయామపద్ధతులేమి, ఆధ్యాత్మికాభివృద్ధికి వలయు ధ్యానాదిసాధనలేమి, సర్వము సక్రమముగా నిర్వహింపబడుచుండెను. స్వామిసోదరశిష్యులు నూతన శిష్యులకు వలయు సుశిక్షణము గఱపుచుండిరి.

శిష్యశిక్షణాదికార్యములలో నిట్లు నిమగ్నుడైయుండ, ఢాకా, ప్రాచ్య వంగదేశములనుండి స్వామికి ఆహ్వానములు రాసాగెను. మఱియు స్వామితల్లి భువనేశ్వరీదేవి అస్సాము, ప్రాచ్యవంగదేశములలోని పుణ్యక్షేత్రములను దర్శింపవలయునని మహోత్కంఠతో నుండెను. తల్లిని, కొందఱుశిష్యులను వెంటనిడుకొని, 1901-వ మార్చి 18-వ తేదీని స్వామి కలకత్తానుండి బయలుదేఱెను. ఢాకా చేరుసరికి, స్టేషనుఅంతయు స్వామిని సందర్శింపవచ్చిన వేలకొలదిజనులతో నిండియుండెను. శ్రీరామకృష్ణవివేకానందజయజయధ్వానములు మిన్నుముట్టెను. దివ్యశకటమున స్వామి నాసీనునొనర్చి, మహోత్సాహముతో నూరేగించుచు, స్వాగతసంఘసభ్యులు జమీందారు మోహినీమోహన దాసుభవనముకడకు స్వామిని దోడ్కొని వెడలిరి. అచట స్వామిసందర్శనమునకై వేలకొలదిజనులు వేచియుండిరి.

స్వామి, 'నేనేమి తెలిసికొంటి'నను విషయమునుగూర్చి జగన్నాథకళాశాలలో రెండువేలమందిజనులకు మహోపన్యాసము * నొసగెను. 'మనమాతృ

* అందలి సారాంశమిది : "...మాతృదేశీయమతమున—మన సనాతనధర్మమున—ఇంతటిసౌందర్యవైభవములు కలవని యెఱుగక, విదేశీయాశయములను స్వధర్మముగా గైకొనిన వివిధసంప్రదాయముల నడుమ పరమార్థపిపాసతో సంచరించితిని. సర్వవిషయములందును సంతృప్తినొసగగల ధర్మము, మన సనాతనధర్మమున కెనయగుధర్మము ప్రపంచమున మఱియొకటి లేదని యనేక సంవత్సరములకు ముందే కనుగొంటిని. స్వధర్మమగు నిట్టిసనాతనధర్మమును మన

మతము' అను విషయమునుగూర్చి! మఱునాడు మూడువేలమందిసభ్యులకు స్వామి తన మాతృదేశోద్ధరణకార్యక్రమమును దెలుపుచు గంభీరముగా నుపన్య సించెను.

స్వామి ఢాకాలోనుండగా నొకనాడొక వేశ్య యమితముగా శృంగా రించుకొని తనతల్లితోగూడి స్వామిని సందర్శింపవచ్చెను. ప్రథమమున స్వామి శిష్యులు అందులకు సమ్మతింపలేదు. కాని స్వామి కీవార్త తెలిసినంతనే ఆత్మా దరముతో వారలకు దర్శనము నొసగెను.* ఇరువురును స్వామి కభివందన

దేశీయులు అలక్ష్యముచేయుచుండుట శోచనీయము!... దేశము నుద్ధరించుతలం పున మన సనాతనధర్మమును తలక్రిందుజేయజూచు సంస్కర్తలు కొందఱు; రాముని కామునిగూడ సేవింపుమనువారు మఱికొందఱు. కాని వీరు ఆత్మవంచ కులు, కడుపులో ఉన్నమాట వీరు పైకి చెప్పరు. మహాత్ములయుపదేశ మేమి?— 'రేయింబవళ్లు వీకకాలమున నుండజాలనియట్లు రాముడేలు హృదయమున కాముడును, కాముడేలు హృదయమున రాముడు నుండజాలరు' అనియే కదా!... నేను నేర్చినదేమి?

'దుర్లభం త్రయమేవైత ద్దైవానుగ్రహహైతుకమ్,
మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుషసంశ్రయః.'

"మనుష్యత్వము, ముముక్షుత్వము, మహాపురుషసంశ్రయము—అను నీ మూడును దుర్లభములు, దైవానుగ్రహముననేకాని లభింపవు."

* పూర్వము (జయపురమున) క్షేత్రీమహారాజు ఒకవేశ్య యొనర్చు చుండిన గానమును వినుటకు స్వామి నాహ్వానింప, దాను సన్న్యాసినను కారణ మున మున్ముందు స్వామి నిరాకరించియు అనంతర మామె సూరదాస విరచిత మగు నొక దివ్యకీర్తనమును బాడుచుండుట విని యచటికి వెడలెను. ఆకీర్తన మందలి భావ మిది: "పరమేశ్వరా! నాదుర్గుణములను గణింపకుము. నీవు సర్వసముడవుగదా! ఒక యినుపముక్క దేవాలయమందలి విగ్రహరూపమును బొందుచున్నది; మఱియొకటి కసాయివానిచేతిలోని కత్తి యగుచున్నది; కాని రెండును స్పర్శవేధిని దాకినంతనే బంగారమగుచున్నవికదా!" స్వామి పరివర్తితమానసుడై పిమ్మట నిట్లు వచించెను: "ఆకీర్తనమును విని యిట్లు

మొనర్చినపిమ్మట వేశ్యాయువతి తాను ఉబ్బసపు వ్యాధిచే బాధపడుచున్నానని పలికి, "ఏదైన సిద్ధౌషధమును అనుగ్రహింపుడు" అని వేడెను. ప్రేమపూర్ణుడై స్వామి యిట్లు వచించెను: "తల్లీ! నేనును ఉబ్బసపువ్యాధిచేతనే బాధపడుచున్నాను. కాని నివారణపొందజాలకున్నాను. ఏమి చేయగలనో చెప్పుము అమ్మా!" ఈమాటలను విని యందఱును ముగ్ధులైరి.

ఢాకానుండి స్వామి కామాఖ్యాచంద్రనాథము లను పుణ్యక్షేత్రములను దర్శించి, అస్సామునందలి గౌహాటి కేగి యచట మూడుపన్యాసములొసగెను. అటనుండి స్వామి షిలాంగునకు వెడలెను. భారతదేశమిత్రుడై యొప్పిన సర్ హెన్రీ కాటన్ ఈసమయమున స్వామిని సందర్శించి భారత జాతీయసమస్యలనుగూర్చి స్వామితో జర్చించెను. అతని కోరిక ననుసరించి యచటి యాంగ్లోద్యోగులకు స్వామి యొక యుపన్యాసము నొసగెను. స్వామి శరీరాస్వస్థతను గాంచి, కాటన్‌దొర స్వామికి వలయు వైద్యసాహాయ్య మొనర్చుటకై యచటి రాజవైద్యుని నియమించెను. మఱియు ప్రతిదినము స్వయముగా స్వామి యారోగ్యమునుగూర్చి విచారణ సల్పుచుండువాడు. ఉదార హృదయుడగు కాటన్‌దొర భారతదేశపరిస్థితులను భారతీయాశయములను గ్రహించి దేశక్షేమమునకై కృషియొనర్చుననియు భారతీయుల కెల్లరకును అతడు ప్రేమపాత్రుడనియు స్వామి వచించెను.

స్వామి యీ సమయమున నాగమహాశయుని గృహమునకేగి, మహాశయుని భార్య యొసగిన యాతిథ్యమును బొంది బ్రహ్మానందభరితు డయ్యెను. శిష్యుల కివ్విషయమునుగూర్చి యనంతరము స్వామి యిట్లు తెల్పెను:

---

భావించితిని: 'ఇదియా నాసన్న్యాసము! సన్న్యాసినయ్యు ఈమెకును నాకును భేదము కలదని తలంచుచుంటినే! ఏమి యవివేకము!' ఆకీర్తన నాకు జ్ఞానాంజనమైనది. సమస్తము అద్వితీయపరబ్రహ్మస్వరూపమేయని గ్రహించి నాటినుండియు ఎవ్వరియందును నిరసనభావము జూపజాలకున్నాను."

"నాగమహాశయుం డెంతటి మహనీయుండో కదా ! ఆతని జన్మస్థానము
నకు సమీపమున కొలదిమైళ్లదూరములో నుండియుం బరమపావనమగు నాతని
గృహమును దర్శింపకుందునా? అనంతశాంతినిలయము, మనోజ్ఞము నగు నాతని
గృహము ఎల్లరకును పరమపావన పుణ్యక్షేత్రము ! ఆతని సహధర్మచారిణి
స్వహస్తములతో అమృతతుల్యమగు పదార్థములను నాకు వండిపెట్టెను. అపరి
మితప్రేమతో ఆతల్లి కడుపార భుజింపుమని పట్టుపట్టెను. ఆచటనుండగా చెఱు
వులో నీదులాడి యనంతరము రెండునరగంటలవఱకును ఒడలుమఱచి నిద్రించి
తిని. నాజన్మములో అంతవఱకెన్నడును అట్టిగాఢనిద్రపోయి యెఱుగను.
మేల్కొనినవెనుక నాకామె మధురఫలాహారములతో విందొనర్చెను. నాగ
మహాశయునిభార్య నాకిచ్చినవస్త్రమును శిరసావహించి ఢాకాకు బయలుదేఱి
తిని. ఆతని ఛాయాపటము పూజింపబడుచున్నది. కాని యాతడు సమాధి
నొందినస్థానము నాతని యస్థిసంచయము నింకను విశేషశ్రద్ధతో కాపాడవలసి
యున్నది. నాగమహాశయుని జన్మముచే, అత్యద్భుతమగు నాతని జీవితముచే,
ప్రాచ్యవంగదేశమంతయుం ధన్యతచెందినది. నాగమహాశయుం డౌన్నత్యమెట్టిదో
ఆతని జన్మస్థానవాసులగు ప్రాచ్యవంగదేశీయుల కింకను బోధపడలేదు; దానిని
వారు గుర్తింతురుగాక !"

స్వామి ఢాకాలోనుండగా ఒకనాడొక యువకుడు తనగురునిఛాయా
పటమును స్వామికి జూపి, యాత డవతారపురుషుడని నమ్మెదరాయని ప్రశ్నిం
చెను. స్వామి, "నాయనా ! ఆ విషయము నాకెట్లు తెలియును?" అని
వచించెను. కాని యా ఛాందసు డూరకొనక నాలుగైదుసార్లు అదియే ప్రశ్న
వైచెను. "ఔను" అని స్వామివలన సమాధానము నొందవలయునని యాతని
యూందోళనము. విని విని, స్వామి యిట్లు బదులుచెప్పెను : "నాయనా !
నామాట విని సరియైన ఆహారవ్యాయామములచే శరీరబలము సంపాదింపుము :
నీగురువు అవతారపురుషుడగునో కాదో అపుడు నీయంతట నీవే ఆలోచించుకో
గలవు. పుష్టికరమగు నాహారములేని హేతువుచే నీమెదడు కొంచెము మెత్త
పడియున్నది." అనంతరము శిష్యుల కీవిషయమును దెలుపుచు స్వామి యిట్లు
వచించెను : "యథార్థమైన నామాటలు ఆ కుఱ్ఱవానికి అహితముగా దోచి

యుండవచ్చును. కాని యేమిచేయుట! అట్టివారిని గట్టిగా మందలింపనియెడల, ఆఘోరణి ఉన్మాదములోనికి దిగును."

స్వామి యాతని కిట్లు తెల్పెను: "నీగురుని నీవు అవతారపురుషు డను కొందువుగాక, మఱియేమనుకొందువుగాక, కాని భగవదవతారము లరుదుగా గాని సంభవింపవు. ఢాకాలోనే ఇటీవల నాలుగైదవతారములు బయలుదేఱె నని వినియున్నాను! ఈ దినములలో జనులకు నిజముగా అవ తారపు బిచ్చిపట్టినట్లు కాన్పించుచున్నది!"

మఱియొకనా డొక "నన్ను ముట్టుకొనకు మను మతస్థుడు" స్వామిని సమీపించి, స్వామిమతాచారధర్మములనుగూర్చి అడ్డదిడ్డమైన ప్రశ్నలువేయ నారంభించెను. స్వామి యిట్లు బదులు చెప్పెను: "ఓయీ! నేను యతినని గ్రహింపుము. నీజాతిమతాచారములు అత్యాశ్రమినగు నాకు వర్తింపవు. మ్లేచ్ఛునియొద్దనుండికూడ సన్న్యాసి మాధుకరము గ్రహించి జీవింపవచ్చునని శాస్త్రము విధించుటలేదా?"*

ఢాకానగరమున స్వామియారోగ్యము విశేషముగా క్షీణించెను. అతి మూత్రము, ఉబ్బసమును స్వామిని బాధింపసాగెను. తన యస్వస్థతను దలచి స్వామి యొకప్పు డిట్లు వచించెను: "ఈశరీర మేమైన నేమి? జనులకు పదు నైదువందల సంవత్సరముల పర్యంతము ఆచరించుటకు వలయు సందేశమును ఒసగియున్నాను!" నిక్కముగా భారతదేశమునకే కాక, ప్రపంచమంతటికిని వలయు సందేశమును స్వామి యొసగియున్నాడు! స్వామిసందేశము ననుస రించుటయే దేశోన్నతికిని లోకశ్రేయమునకును విధ్యుక్తమార్గము!

కొలది నెలలైనవెనుక స్వామి మఱల బేలూరుమఠమునకు అరుదెం చెను. సోదరశిష్యు లత్యంతశ్రద్ధతోడను అఖండప్రేమతోడను స్వామికి సేవ చేయుచుండిరి. చికిత్సకొఱకు సమర్థుడగు వైద్యుని నియమించిరి. తన్నారోగ్య వంతు నొనర్చుటకై వారు చూపు దీక్షను ఆత్రమును గాంచి, స్వామి తన

* "చరేన్ మధుకరీం వృత్తిం అపి మ్లేచ్ఛకులాదపి."

కార్యాలోచనములను వీడి, కొలదిమాసములు విశేషముగా విశ్రాంతినొంద సాగెను. కాని స్వామిమానసము ఆత్మవిచారసాగరముగదా. ఒకప్పు డాతడు కాపీనమాత్రధారియై మఠమున సంచరించును; మఱియొకప్పుడు కాషాయ వస్త్రములను దాల్చి మఠప్రాంతమున దీర్ఘాలోచనానిమగ్నుడై తిరుగాడును; ఒకప్పు డే గంగానదీతీరముననో, ఏ చెట్టునీడనో, ఆసీనుడై ధ్యాననిమగ్ను డగును; వేఱొకప్పుడు గ్రంథపఠనానందమున నోలలాడును; ఒక్కొకసమయ మున తన గంభీరవచనములచే శిష్యులను నూతనోత్సాహపూరితుల నొనర్చును. వేయేల? స్వామి దివ్యజీవనవిధానముచే మఠము పరమార్థనిలయమై శోభిల్లు చుండెను.

మఠాలయమున మీదియంతస్తులో ఆగ్నేయభాగమున నున్న గది స్వామి నివాసస్థానము. అయ్యది నాలుగు కిటికీలును మూడు ద్వారములును గల విశాలమైనగది. అదియే స్వామి పఠనమందిరము. అందు సింహద్వారము నకు కుడిప్రక్కన నొకమూల ఐదడుగుల యెత్తుగు నొక యద్దమును, దాని కవ్వల స్వామి కాషాయవస్త్రము లుంచుకొను చట్టమును గలవు. గదిలో మధ్యభాగ మున తీగచుట్టలతో అమర్పబడిన యొకమంచము గలదు. అయ్యది యొక పాశ్చాత్యశిష్యుడు స్వామికి సమర్పించినది. ఎన్నడో కాని స్వామి దానిని ఉప యోగించుకొనువాడు కాడు. నేలమీదనే స్వామి పక్కవైచుకొని పరుండును. ఆగదిలో పూలతో గూడిన యొకపాత్రము, లేఖకపరికరములు, పిలుచుట కుప యోగింపబడు గంటయు నొక వ్రాతబల్ల నలంకరించుచుండును. మఱియొక బల్లపై గొన్ని పింగాణి పళ్లెరములు, పాత్రలును అమర్పబడియుండును. ఒక తావున కృష్ణాజినము స్వామిధ్యానమును జ్ఞప్తికి దెచ్చుచుండును. వీనియన్నిటి కంటెను స్వామిగదిలో విశేషాకర్షణీయమైన వస్తువొకటి కలదు. అదియే శ్రీరామకృష్ణుని చిత్రపటము. ఆచిత్రమునందలి తన గురుమూర్తిని ప్రేమాను రాగములతో, అఖండభక్తితో, స్వామి యవలోకించును. ఈగదియందే తఱుచు స్వామి సోదరశిష్యబృందమునకు సదుపదేశము లొనర్చెను, స్నేహి

తులతోడను భక్తులతోడను సంభాషించెను, భుజించెను, నిద్రించెను, ధ్యాన స్థితుడై పరమేశ్వరానుసంధాన మొనర్చెను. ఇచ్చటనే స్వామి మహాసమాధి నొందెను. ఇపుడీ తావు పరమపవిత్రముగా పరిగణింపబడుచు శిష్యబృంద ముచే పరిరక్షింపబడుచున్నది. ఇందలి ప్రతివస్తువును స్వామి జీవితాంత్యదిన మున నెట్లుండెనో అట్లే నేడును అమర్చబడియున్నది. గోడమీదనున్న తిథి వారపుబట్టిక 4, "జూలై 1902" అని తెలుపుచున్నది. వ్రాతబల్ల స్వామి యిపుడే యటనుండి లేచి ప్రక్కనున్న పూజామందిరమునకు వెడలెగాబోలు నని తోపించును. స్వామిగది యిపుడు ధ్యానమునకై వినియోగింపబడుచున్నది. ఆతని జ్ఞానభక్తివైరాగ్యాదులతో స్పందించుచుండు నీ పరమపావన పుణ్యస్థల మును దినదినము వందలకొలది జనులు వచ్చి దర్శించుచుందురు; దర్శించి యాతని దివ్యభావములచే ఆవేశపరవశులగు చుందురు.

బ్రహ్మచర్యము, త్యాగము, మాతృదేశోద్ధరణమునకు ఆవశ్యకమగు శిక్షణవిధానము, భారతీయకళానైపుణ్యము, సంస్కృతవాఙ్మయము, ప్రాచ్య పాశ్చాత్య విజ్ఞానసమన్వయము, గురుకులవిధానము, జీవుని దివ్యత్వము, అస్పృ శ్యతా నిర్మూలనము, ఈశ్వరానుగ్రహము మున్నగు నుత్కృష్టవిషయములను గూర్చి స్వామి శిష్యులకు మనోరంజకముగా బోధించువాడు.

మఠమున స్వామిజీవనము ఒక దివ్యోద్యానము: అద్భుతమగు నాతని శాస్త్రకళాపాండిత్య, వినిర్మలవర్తనము, జ్ఞానభక్తివైరాగ్యములు మున్నగునవి యందలి కుసుమరాజములు. ఆదివ్యకుసుమముల పరిమళమే యాతని జగద్వ్యాప్త మగు కీర్తి. ఉల్లాసమున బాలుడు, ధైర్యసాహసములలో యువకుడు, జ్ఞాన మున వృద్ధుడు నగు నాతని వ్యక్తిత్వమున సమస్తదశలును సంపూర్ణ సమన్వయ మొంది యాతనిజీవితోద్యానమును అలౌకికశోభామయ మొనర్చెను.

వీణాగానమును మించు తన సహజకోమలకంఠస్వరమున స్వామి తఱచు సంకీర్తన మొనర్చి దివ్యభావనిమగ్నుడగును. అపుడపుడు మఠమునందలి వచన విధానమును పరీక్షించుటయే కాక, శిష్యబృందముకొఱకు స్వయముగా వధు

రాహారములను పంచుచుందును. ఇట్లు సమస్త విషయములందును శిష్యులకు స్వామి మార్గదర్శకుడై వర్తించుచుండెను: ప్రపంచమున కాతడు ప్రఖ్యాత వివేకానందుడై, దేశభక్తాగ్రగణ్యుడై, ప్రబోధకుడై వెల్గొందుచుండ, శిష్య బృందమున కాతడు శ్రీరామకృష్ణప్రియపుత్రుడై, ఆచార్యుడై, హితుడై, సన్నిహితుడై, పెన్నిధానమై దీపించుచుండెను.

స్వామికి పెంపుడు జంతువులనిన అమిత ప్రీతి. వానికి 'హంసి,' 'మాత' మొదలైన ముద్దుపేర్లనిడి వానిని అమితానురాగముతో బెంచును. అవియు స్వామియెడ విశేషప్రేమను జూపుచుండెడివి. ఒకప్పుడు హంసి యను మేకను సమీపించి, స్వామి తన తేయాకుపానీయముకోసము పాలిమ్మని బతిమాలును. మాత యను మేకపిల్లతో దూబూచులాడుచు నటునిటు పరుగు లెత్తును. నిజవేదాంతసింహగర్జారావములచే ప్రాక్పశ్చిమఖండముల నుఱ్ఱూత లూగించిన వివేకానందస్వామి పెంపుడుజంతువులతో ఆటలాడుచుండునపుడు స్వామిని సందర్శింపవచ్చినవారాతని ప్రేమమయమూర్తిని, వినిర్మలభావము లను గాంచి యబ్బురపడుచుండెడివారు.

పుష్పవనాదులను వృద్ధిచేయుట, మఠమునందలి గోవులను సంరక్షించుట మున్నగువిషయములనిన స్వామి కమితానందము. పాదులును పుష్పవనమును బ్రహ్మానందస్వామికిని ఆవులుమేయుం పొలము తనకును జెంద, వానిసరిహద్దుల నతిక్రమించుచుండెనని బాలకునివలె బ్రహ్మానందస్వామితో స్వామి జగడమాడుట శిష్యులు నేటికిని స్మరించుచుందురు.

స్వామియారోగ్యము విశేషముగా క్షీణించెను. పాదము లుబ్బుటచే నడచుట కష్టముగా నుండెను. నిద్రపట్టకుండెను. కాని, నిరంతరభగవదాయత్త చిత్తుడగు స్వామి యెప్పటివలెనే ఉత్సాహపూరితుడై యుండెను. తన్ను సందర్శింపవచ్చినవారి నాదరించి, సహజగంభీరోక్తులతో వారితో బ్రసంగించును. శిష్యుడగు శరచ్చంద్రుడు ఒకనాడు ఆరోగ్యమును గూర్చి స్వామిని బ్రశ్నింప స్వామి, మృదూక్తుల నిట్లు పల్కెను: "నాయనా! ఆరోగ్యమును

గూర్చి యిక నెందులకు ప్రశ్నించెదవు? ఒకనాటి కొకనాడు శరీరబలము క్షీణించుచున్నది.... బ్రదికిననాల్గుదినములు నేను మీకొఱకే జీవితము అర్పించి కర్మరంగమున మరణించెదను." "స్వామిజీ! కొలదిమాసములు సంపూర్ణ విశ్రాంతి నొందరాదా?" అని శరచ్చంద్రుడు విన్నవింప, స్వామి యిట్లు పల్కెను: "వెఱ్ఱివాడా! నాజీవితమునకు విశ్రాంతి లేదు. శ్రీరామకృష్ణుడు కాళియని వచించిన పరాశక్తి యాత డిక నాల్గుదినములకు గతించుననగా నాలో బ్రవేశించి నాశరీరాత్మలను స్వవశము జేసివైచికొనినది. ఆ పరాశక్తియే నాచే తీవ్రకర్మమును జేయించుచున్నది; స్వసుఖమును జూచుకొన నీయ దామె; నిముస మూరకొన నీయదు." శరచ్చంద్రు డడుగ స్వామి తన జీవితమహాసంఘటనము నిట్లు వివరించెను :

"గురుదేవుడు నిర్యాణ మొందుటకు మూడునాలుగుదినములకుపూర్వమున న న్నేకాంతమునకు బిలిచి, తనయెదుట గూర్చుండ బనిచి, ఏకాగ్రదృష్టితో న న్నవలోకించి, సమాధిస్థితుడయ్యెను. అపు డాతని శరీరమునుండి సూక్ష్మాతిసూక్ష్మమగు విద్యుచ్ఛక్తివంటి మహాద్భుతశక్తి తరంగములు నాలో బ్రవేశించుట ప్రత్యక్షముగా నాకు గోచరించెను. కొంతసేపటికి నేనును బాహ్యాస్మృతిని గోల్పోయి సమాధినిమగ్నుడనైతిని. అట్లెంత సేపుంటినో చెప్పజాలను. స్మృతి వచ్చిన పిమ్మట చూచుసరికి గురుదేవుడు విలపించుచుండెను. కారణమరయ, జాలిగొల్పు వచనముల నాత డిట్లు పల్కెను: 'నాయనా! నరేంద్రా! నే నిపుడు నా సర్వస్వము నీకు ధారపోసి పకీరునైతిని! ఈ మహాశక్తియొక్క ప్రభావముచే లోకమున నీవు ఘనకార్యము లొనర్తువు. అనంతరమే నీ నిర్యాణము!' ఆ శక్తియే నన్ను విశ్రాంతినొందనీయక తీవ్రకార్యరంగమున వర్తింపజేయుచున్నది. ఈశరీర మూరక కూర్చుండుటకు సృజింపబడలేదు."

బేలూరులో శాశ్వత శ్రీరామకృష్ణమఠస్థాపనానంతరము స్వామినవీనాశయములనుగూర్చియు మఠస్థుల స్వతంత్ర జీవనవిధానమునుగూర్చియు

శాస్త్రజ్ఞానహీనులగు సంకుచితపూర్వాచారపరాయణులు కొందఱు ఖండన లారంభించుటయేకాక, మఠస్థుల స్వభావవర్తనములనుగూర్చి దుష్ప్రచార ములు చేయసాగిరి. ఇదియంతయుం గ్రహించి స్వామి శిష్యులతో నిట్లు పల్కెను : "'కుక్కలు మొఱుగుచున్నను ఏనుగు (లెక్కచేయక) తనదారినే పోవు'ననుసామెత మీరు వినలేదా? ప్రపంచము తన్ను దూషించినను భూషిం చినను సరియే, సాధుపుంగవుడు పరిగణింపడు." అట్టి ఖండనల నెంతమాత్ర మును గమనింపవలదని మఱియొకప్పు డిట్లు వచించెను : "ఏదేశముననైనను నూతనభావములు బోధింపబడునపుడెల్ల పూర్వాచారపరాయణులు ధ్వజమెత్తు దురు. ప్రతిమతాచార్యుడును ఈపరీక్షలో ఉత్తీర్ణు డగుట విధాయకము. ప్రబోధకు లిట్టి హింసకు గుఱికానిదే సంఘములో ఉన్నతభావములు నాటు కొనజాలవు." మఱియుం స్వామి యిట్లు హెచ్చరించెను : "నిష్కామముగా మీవిధ్యుక్తకర్మము మీరొనర్చినచో, సకాలమున ఫలించితీరును. 'నహి కల్యాణ కృత్ కశ్చిత్ దుర్గతిం తాత! గచ్ఛతి'—సత్కర్మ మొనర్చినవా డెన్నటికిని దుర్గతినొందడను గీతావాక్యమును స్మరింపుడు!" క్రమముగా స్వామిజీవిత కాలముననే సనాతనులు స్వామియెడ సుముఖులు కాజొచ్చిరి.

సాంఘికవిషయములలో స్వామి యెట్టి విశాలాశయములను బ్రకటించి నను ధార్మికవిషయములలో సనాతనులకెల్ల సనాతను డనుసంగతి మఱవ రాదు. పర్వదినములలో అవలంబింపబడు సనాతనధర్మసంప్రదాయముల నన్నిటిని స్వామి యథోక్తముగా అవలంబించువాడు. వంగదేశమున ప్రామా ణికమగు రఘునందనస్మృతి ననుసరించి దుర్గాకాళీలక్ష్మీపూజలను 1901-వ సంవత్సరమున స్వామి సోదరశిష్యసమేతుడై యథోక్తముగా జరిపెను. వేల కొలది దరిద్రనారాయణుల నన్నాదికములచే అర్చించుట యీ పూజలందలి ముఖ్యవిషయము. శ్రీశారదామాతృదేవి భక్తబృందముతో దుర్గాపూజాసమయ మున మఠమునకు విచ్చేసెను. కలకత్తాలోని సుప్రసిద్ధసనాతన బ్రాహ్మణపండి తులు అనేకులు వచ్చి పూజలలో పాల్గొనిరి. పూజానంతరము విగ్రహములు గంగామాతకు అర్పింపబడియెను.

స్వామితల్లి భువనేశ్వరీదేవి స్వామికి బాల్యమున నొకప్పుడు జబ్బుచేసి ప్రాణముమీదికి వచ్చినప్పుడు కాళికాదేవియెదుట నేలమీద నాతని దొరలించెదనని మ్రొక్కుకొనియుండెను. స్వామి నిరంతరవ్యాధిపీడితు డగుచుండుటచే భువనేశ్వరీమాత యీ సంగతి నిపుడు జ్ఞప్తికి దెచ్చుకొని, తన మ్రొక్కు చెల్లింపుమని కాళీపూజానంతరము స్వామికి గబురంపెను. స్వామి యస్వస్థుడై యున్నను, తల్లి కోరిక ననుసరించి, గంగాస్నానమొనర్చి, తడిబట్టలతో కాళీఘట్టమందలి కాళికాలయమునకేగి, దేవిమ్రోల నేలమీద మూడుసారులు దొరలెను. అనంతరము దేవి నర్చించి, యేడు పర్యాయములు ఆలయప్రదక్షిణ మొనర్చి, ప్రాకారమునందు స్వయముగా హోమమాచరించెను. స్వామి మాతృభక్తిని, ఆచారపరాయణతను గాంచి, జనులు ఆశ్చర్యచకితులైరి.

## ముప్పదియొనిమిదవ ప్రకరణము

# అంత్యదశ

స్వామిగారోగ్యము విశేషముగా క్షీణించెను. కలకత్తాలోని సుప్రసిద్ధవైద్యుడగు సాన్డర్స్ వచ్చి పరిపూర్ణవిశ్రాంతి యావశ్యకమని తెల్పెను. కాని భవవైద్యశేఖరుడగు స్వామిని భౌతికవైద్యు లెవరు శాసింపగలరు? కాసంత యారోగ్యము చేకుఱినంతనే స్వామి కర్మరంగమున నుఱుకును. శిష్యు లెంత వలదన్నను, తన్ను సందర్శింపవచ్చినవారితో స్వామి దయాపూర్ణుడై నిద్రాహారములను మఱచి ప్రసంగించును. ఒక్కొక్కప్పుడు మఠప్రదేశమున పాఱతో త్రవ్వి పాదులుపెట్టును. మఱియొకప్పుడు తోటలో చక్కని పూలమొక్కలను నాటి, యవి పెరిగి పుష్పించుచుండుట బాలోత్సాహముతో గమనించును.

ఈదినములలో స్వామినిరుపమానగురుభక్తివిశ్వాసములను బ్రకటించు నొకసంఘటనము జరిగెను. స్వామి శిష్యుడగు నిర్భయానందునకు తీవ్రజ్వరము వచ్చి ప్రాణము మీదికి వచ్చెను. స్వామి కేమియుం దోపకుండెను. తుదకు అకస్మాత్తుగా దివ్యావేశపరవశుడై పూజామందిరమున కేగి గురుదేవునియస్థిసంచయమును గంగోదకములతో గడిగి స్వామి యాతీర్థమును నిర్భయానందుని నోటబోసెను. వెంటనే జ్వర ముపశమించెను. స్వామి శిష్యులవైపు తిరిగి మహానందముతో నిట్లు వచించెను : "శ్రీరామకృష్ణు నద్భుతప్రభావమును గనుడు! అఘటితఘటనాసమర్థుడు గురుదేవుడు!"

మఠాలయమున ప్రత్యక్షముగా శ్రీరామకృష్ణుడు వెలసియుండుటను నిరూపించు మఱియొకసంఘటనము. శ్రీరామకృష్ణునస్థిసంచయమును గాంచి, 'గురుదేవు డిచట వెలసియుండుట నిజమా?" యని సంశయించి, "దేవా! శ్రీరామకృష్ణప్రభూ! నిజముగా నీ విందు వెలసియున్నచో, ఇపుడు కలకత్తాను

వచ్చియున్న గాల్వియరు మహారాజు నిటకు మూడుదినములలో రప్పింపుము!" అని స్వామి ప్రార్థించెను. అద్భుతము, మఱునాడు గాల్వియరు మహారాజ సోదరుడు మహారాజురాకనుగూర్చి స్వామి కెఱుకపఱుచుటకై మఠమున కరుదెంచెను. స్వామి బ్రహ్మానందభరితుడై యాలయమున కేగి, యనేక పర్యాయములు గురుమూర్తికి ప్రణమిల్లి, శిష్యులకు తనదివ్యానుభవమును బ్రకటించెను.

ఆసంవత్సరము అఖిలభారతజాతీయమహాసభ కలకత్తాలో జరిగెను. వివిధరాష్ట్రములనుండి ప్రఖ్యాతవ్యక్తులు వందలకొలది సభ్యులచటి కరుదెంచి, భారతదేశభక్తరత్నమగు స్వామిని సందర్శించి ప్రసంగించువారు. ఆసమావేశములచే బేలూరుమఠమే నిజమైన జాతీయసభాస్థానమై మించెను. వారితో స్వామి స్వచ్ఛమగు హిందీభాషలో బ్రసంగించువాడు. వైదికమతవాఙ్మయ పునరుద్ధారణమునకై వేదకళాశాల స్థాపింపబడవలయునని సభానాయకులకు స్వామి తెల్పెను. ఎల్లరును స్వామిభావముల నామోదించిరి. వేదకళాశాలను స్థాపింపనలయునను నెడికోరిక స్వామికి జీవితాంతమువఱకు నుండెను. అందులకై స్వామి ఉద్బోధనపత్రికాముద్రణాలయమును అమ్మి కళాశాలను నెలకొల్ప సమకట్టెను. కాని యది నెఱవేఱుటకు ముందుగనే కీర్తిశేషు డయ్యెను.

1901-వ సంవత్సరాంతమున జపాన్దేశమునుండి యిరువురు ప్రఖ్యాత పురుషులు వచ్చి స్వామిని సందర్శించిరి. ఆసమయమున జపానులో జరుగనున్న మతమహాసభకు స్వామి నాహ్వానించుటకై వారు వచ్చియుండిరి. స్వామివంటి యశోధురీణుడు వచ్చి పాల్గొన్నచో, సభ జయప్రదమగుననియు జపాన్దేశమున మతప్రబోధము అత్యావశ్యకమైయున్నదనియు వారు విన్నవించిరి. స్వామి తన శరీరస్థితి యెట్లున్నను, మానవసేవనే మహోత్తమముగా నెంచి మతమహాసభకేగుట కంగీకరించెను. ఆసమయమున వారిలో నొకడు తాను బుద్ధగయ దర్శింపగోరెదనని తెలిపి, స్వామిని దనతో రావేడెను. స్వామి యంగీకరించి జపాన్యాత్రికునితో బుద్ధగయ కేగెను. అచటి

మహంతు స్వామిని విశేషముగా గారవించెను. అటనుండి స్వామి యొంటరిగా వారణాసి కరిగి, భక్తిప్రపూర్ణుడై శరీరారోగ్య మెట్లున్నను గంగాస్నాన మొనర్చి విశ్వనాథదేవాలయాదులను సందర్శించెను. అచటి మహంతులును పండితులును స్వామిని సందర్శించి విశేషగౌరవాదరములను జూపిరి. స్వామి తమవంటి పూర్వాచారపరాయణుడు కాక సముద్రయాన మొనర్చినను ఆతని యఖండదైవాంశము వారలను సమ్మోహితులనొనర్చెను. స్వామిబోధలను విని యచటివంగయువకులనేకులు కాశీక్షేత్రమును దర్శించు వేలకొలదియాత్రికుల సాయమునకై తమలో తా మొకసంఘము నేర్పఱచుకొనిరి. నిరతిశయమగు వారి త్యాగసేవలను గాంచి స్వామి మహోత్సాహపూరితుడై యిట్లు వచించెను: "యువకులారా! నిజముగా మీరు ధీరులు. సదా నేను మిమ్ము ఆశీర్వదించి ప్రేమింతును. ధైర్యోత్సాహములతో బనిచేయుడు. దారిద్ర్యమును లెక్క సేయకుడు. ధనము వచ్చితీరును. మీయాశయము లనంతముగా ఫలించును." 'రామకృష్ణసేవాసదన'మను ఆసంస్థకొరకు స్వామి జనులకొక విజ్ఞాపన వ్రాసియున్నాడు.

వలసినంతమంది బ్రహ్మచారు లింకను లభింపమి స్వామి యొక్కొక్కప్పుడు నిరుత్సాహముజెందుచుండువాడు. దేశక్షేమమునకే కాక, ఆత్మమోక్ష జగత్కల్యాణములకై జీవితము నర్పించు యువకులయందే స్వామియాశలన్నియు లగ్నమైయున్నవి. నచికేతునివంటి శ్రద్ధాయుక్తులగు యువకులు పదుగురు దొరకినచో, మాతృదేశమునంతను నూతనమార్గము ద్రొక్కింతునని స్వామి వచించెను.

తనయాశయములను శరచ్చంద్రునకు దెలుపుచు స్వామి యొకనా డిట్లు ఘోషించెను: "భారతజాతీయాదర్శము, భగవద్భక్తిసంజనితమునగు త్యాగమునే లక్ష్యముగా నిడుకొని సింహబలసాహసములతో, దూషణాద్యతీతులై, కర్మఫలకాంక్షను విసర్జించి కార్యరంగమును వరింపుడు. హనుమన్మహావీరుడే మీకు ఆదర్శపురుషుడు. జితేంద్రియచక్రవర్తియు అద్వితీయధీశాలి

యుడనగు నాతడు రామనామమందలి యఖండభక్తితో ప్రాణభీతిని విడనాడి,
యొక్కదుముకులో సాగరము నెట్లు లంఘించెనో చూడుడు! భగవత్సేవకుల
మని గుర్తించి యట్టి మహోన్నతాదర్శము ననుసరించి మీజీవితములను నియ
మించుకొనుడు....మీ రట్టిదివ్యాదర్శమున సుప్రతిష్ఠితులైనచో, ఉన్నతాశ
యములును వాని నవలంబించు విధానములును అప్రయత్నముగా మీకు అల
వడును. సమస్తసంశయములను త్రోసిపుచ్చి, సుస్థిరచిత్తులై మీగుర్వాజ్ఞను
బాలింప గంకణము గట్టుకొనుడు! **అస్ఖలితబ్రహ్మచర్యము నవలం
బింపుదు—ఇదియే పారమార్థికజీవనరహస్యము. వేఱొక
మార్గము లేదు.** హనుమంతుని గనుడు. ఆతడెట్టి భగవత్సేవకుడో!
ఆదర్శమూర్తియో! తనయఖండబాహుబలముచే, అద్వితీయపరాక్రమముచే,
రావణునిరాక్షససైన్యములను హాహాకారమెత్తింపగల్గిన మహావీరు డాతడు.
మఱియొకవైపున రామపదపంకజార్చకులలో అద్వితీయుడు నాతడే. రామ
చంద్రుని సేవించుటయే, రామాజ్ఞను బరిపాలించుటయే, ఆతని జీవితేచ్ఛ.
అందులకై యాతడు తనజీవితమును ధారపోయసమకట్టెను. బ్రహ్మపదప్రాప్తిని
సహితము లక్షింపలే దాతడు. అట్టి నిశ్చంచలభక్తియే దేశమున కిపుడు ఆవశ్య
కము. కాని మీ రేమి చేయుచున్నారు? మృదంగకరతాళములతో యేవో
పిచ్చిపిచ్చిపదములను బాడుచు, చిందులు ద్రొక్కు—శారీరమానసికబలహీనులతో
గూడుకొనియున్నది మీజాతి నేడు! బృందావనగోపికాభక్తిని,—ఆమహా
కఠినసాధనను,— కామలేశమైనను లేని మహోత్కృష్టమధురభావమును—
మీకామాదినీచప్రవృత్తు లన్నిటితో అనుకరింప యత్నించుచున్నారు! ఫలిత
మేమి? దేశమంతయు తమోంధమునబడి తల్లడిల్లుచున్నది. చిన్ననాటినుండియు
అహర్నిశ మీగీతములను జావళీలను వినివిని దేశమంతయు నిర్వీర్యమైపోవు
టలో ఆశ్చర్యమేమి? దేశమున పౌరుష మడుగంటినదే! ఇంతకంటె అధః
పతనము వేఱుండునా? మీఢక్కలు, డోలులు, కాహళలు, తూర్యభేరీలు
నేడేమైనవి? వీనిని మఱల దేశములోనికి దీసికొనిరావలరా? మీయువకులను

బిడ్డలను శౌర్యోత్తేజకములగు వాని గంభీరస్వనములను విననిండు. భారత పుత్రులారా! నేడు మనము ధైర్యోత్సాహజనకములగు బ్రహ్మరుద్రతాళము లను ధ్వనించి డమరును మోగింపవలయును. 'హర! హర! మహావీర! మహావీర! వ్యోమ! వ్యోమ!' అను నినాదములచే భూమ్యాకాశములను కం పింపజేయవలయును. ప్రస్తుతము కరుణరసాదులను బురికొల్పు గీతగానములను విరమించి, 'ధ్రుపదాది' స్వరములతో గూడిన వీరరసాన్వితగీతములను జనులు వినవలయును, పాడవలయును. వేదగంభీరఘోషచే దేశమును బునరుజ్జీవింప జేయవలయును. మనము చేయు ప్రతికార్యమునందును సుస్థిరధీరత్వమును బ్రక టింపవలయును. ఇట్టి ధీరాదర్శము నవలంబించినప్పుడే మాతృదేశక్షేమము మనకు కరతలామలకమగును. నీ వొక్కడవైన నిట్టి మహోత్తమాదర్శమును నీవర్తనమున జూపగల్గినచో, వందలకొలది నినన్ను సరించితీరుదురు. కాని క్షణమైనను ధర్మమార్గమునుండి చలింపకుము, దౌర్బల్యమును విసర్జింపుము. నీజీవితచర్యలలో నిత్యము ధైర్యసాహసములను బ్రకటింపుము. ఇదియే పరమే శ్వరీకటాక్షము లభించుమార్గము."

శిష్యుడు తా నొకొక్కసమయమున దౌర్బల్యమునకు గుఱియగు చుండునని తెలుప స్వామి యిట్లు వక్కాణించెను: "అట్టి సమయములలో నిట్లు పర్యాలోచించుకొనుము: 'నే నాతనిపుత్రుడను కానా? ఆమహనీయు ననుసరించు నే నిట్టి నీచకార్యములు చేయవచ్చునా?' దైన్యమును దుర్బల మనోభావములను బోనడచి ధీరుడవై నిలిచి, 'నేనంతశక్తిప్రపూర్ణుడను, విశుద్ధ ధీనిధిని. అఖండజ్ఞానస్వరూపుడను. సచ్చిదానందమయపరబ్రహ్మమును నేను!' అని భావింపుము. 'నే నామహనీయుని శిష్యుడను. కామకాంచనవిజేత యగు శ్రీరామకృష్ణుని దాసానుదాసుడ'నను భావమున నే నీయహంభావ మిమిడియుండవలయును. ఇట్టి యాత్మగౌరవము లేనివానిలో నెన్నడును బ్రహ్మశక్తి ప్రజ్వలింపదు. 'జగజ్జననీపరిపాలనమున, ఈజగంబున నే భయపడున దెవరికి?' యను రామప్రసాదునికీర్తనమును వినలేదా? ధీరుడవై మహావీర

నామమును స్మరించుచు 'మహామాయ'ను శరణుపొందుము. సమస్తప్రపంచమును బ్రహ్మస్వరూపముగా జూడుము,—దైన్యము, దౌర్బల్యము, పిఱికితనమునంత నిన్ను సమీపింపజాలవు."

ఇట్లు వచించి, స్వామి క్రిందికి వచ్చి, మఠప్రదేశమందలి మామిడిచెట్టునీడనున్న మంచముపై కూర్చుండి దీర్ఘాలోచనానిమగ్ను డయ్యెను. భావోద్వేగముచే ఆతని కన్నులు ప్రజ్వలించుచుండెను. అపూర్వజ్ఞానముచే శరీరము గగుర్పాటుచెంద, స్వామి తన్నుపరివేష్టించియున్న బ్రహ్మచారులను సన్న్యాసులను గాంచి యిట్లు పలికెను: "ఆత్మాన్వేషకులై మీ రెచటికి కేగెదరు? సమస్తజీవులందును బ్రహ్మ మంతరాత్మయై భాసించుచున్నది. సాక్షాత్ పరబ్రహ్మము ఇదిగో, ఇచ్చటనే వెలసియున్నది. ప్రత్యక్షబ్రహ్మమును వీడి బాహ్యవిషయములను లక్షించువా రెట్టి మతిహీనులోకదా! బ్రహ్మమిచట కరతలామలకమైయుండుట మీకు గోచరించుటలేదా? ఇదిగో, ఇచటనే, ఇచ్చటనే బ్రహ్మము వెలసియున్నది!" దివ్యావేశపూరితములును దివ్యావేశజనకములునగు స్వామివచనములు శిష్యులకు అపూర్వసత్యమును బ్రకటించిమించెను. అద్భుతప్రశాంతి భాసింప శిష్యులందఱును నిశ్చేష్టులై నిల్చిరి.

ఒక్కమాటచే, చూపుచే, స్వామి తత్త్వార్థులకు జ్ఞానదానమొసగ సమర్థుడు!

ఈసమయమున మఠప్రదేశమున బనిచేయుటకై నియమింపబడిన సంతాలులను కూలీలతో అఖండానురాగపూర్ణుడై స్వామి ప్రసంగించువాడు. దరిద్రు లన్నచో, దీనులన్నచో, స్వామిహృదయము క్షోభించిపోవును. తమ బాధలను విని స్వామి కన్నీరు గార్చుచుండుట చూచి, సంతాలురు, ఇట్లు పలుకువారు: "సామిబాబా! మీ రిక పొండు! మా యిబ్బందులనుగుఱించి మీ కిక చెప్పజాలము. చెప్పిన, మీరు దుఃఖింతురు."

స్వామి వారల కొకనాడు మనసార మంచిమంచి పిండివంటలతో విందొనర్చి, వారల సంతోషమును గాంచి యిట్లు వచించెను: "మీరందఱును

సాక్షాన్నారాయణులు. ఈనారాయణసేవచే నేను ధన్యుడను." అనంతర మొక శిష్యునితో నిట్లు పల్కెను: "వా రెట్టి యమాయకులో చూడుము. వారిని సాక్షాన్నారాయణస్వరూపులుగా గాంచితిని." మఱియొకప్పు డాదీన నారాయణులయెడ స్వామి తన యనుతాపమును వెల్లడించుచు నిట్లు వచించెను:

"సోదరులారా! ఈదీను లెంత నిష్కపటచిత్తులో చూడుడు! చదువు సంధ్య లెఱుగరు వారు! దుర్భరములగు వారికష్టములను మీరు కొంతవఱ కైనను తొలగింపగలరా? లేనిచో మీరు కాషాయమును ధరింపనేల? **పరహితార్థము మన సర్వస్వమును సమర్పించుటే నిజమైన సన్న్యాసము.** ఒక్కొక్కప్పుడు నే నిట్లు తలంతును: 'మఠాదులను నిర్మించుటవలన నేమి ప్రయోజనము? వాని నమ్మివైచి యాధనమును దరిద్రనారాయణుల కేల పంచిపెట్టరాదు?...కోట్లకొలది మన సోదరదేశీయులు అన్న వస్త్రములు లేక యల్లాడుచుండ మననోట నొకముద్ద నెట్లు పెట్టుకొనగలము? —మన సెట్లు వచ్చును?' నేను పశ్చిమఖండములో నుండగా తల్లి నిట్లు ప్రార్థించితిని అనేకపర్యాయములు: 'ఓలోకైకజననీ! ఇచ్చట నీపుత్రులు అఖండభోగైశ్వర్యముల దేలియాడుచుండ, అచట నీభారతపుత్రులు తిన దిండి లేక మాడుచున్నారు. తల్లీ! వారి కిక గతి లేదా?' నాసోదరదేశీయుల నెట్లైన నుద్ధరించు నవకాశములను గడింపజూచుటే నాపశ్చిమఖండయాత్రకు గల ముఖ్యకారణమని మీరంద ఱెఱిగినదే. వారిదుఃఖమును దారిద్ర్యమును జూచి నే నిట్లు తలతును: 'మన దేవతారాధనార్భటమునంతను అవల ద్రోసి వేయుదము. మనవిద్యాగర్వమును శాస్త్రజ్ఞానదంభమును స్వీయమోక్షమునకై మనము నేర్చిన సాధనలనన్నిటిని త్రోసిపుచ్చి, ఊరూర దిరిగి దరిద్రనారాయణసేవకై మనజీవితములను ధారవోయుదము. మననియమనిష్ఠలచే, పవిత్రవర్తనముచే, పారమార్థికజీవనముచే, ధనికులకు జనసామాన్యమునెడ గల ధర్మములను విధ్యుక్తమును దెలిపి, ధన మార్జించి, దరిద్రులను దీనులను సేవింతము.'

ఆహా! దీనులను, దరిద్రులను, ఆర్తులనుగూర్చి దేశమున నొక్కడును చింతిం పడుకదా! దేశమునకు వెన్నెముకయై, తమజీవితమును ధారపోసి మన కాహార మును గూర్చుచున్న దీనజనులకష్టసుఖములలో పాల్గొనువాడు, వారియందు సానుభూతి జూపువాడు, దేశమున నొక్కడైన నున్నాడా! ఒక్కదినము వారు సమ్మెకట్టినచో, దేశమంతయు అట్టుడికిన ట్లుడికిపోవునే! తమసోదర హిందువులు తమ్మాదరింపకుండుటచే చెన్నరాజధానిలో వేలకొలది పంచములు ఎట్లు క్రైస్తవులైపోవుచున్నారో కనుడు! కేవలము ఆకలిబాధచే, దారిద్ర్య ముచేగాదు, వారు క్రైస్తవమత మవలంబించుచుండుట. మీరు వారిని మానవ మాత్రులుగా జూడకుండుటచేత! ఎంతసేపు, 'మీరు అస్పృశ్యులు, అవా చ్యులు: నన్ను ముట్టుకొనకు, నన్ను ముట్టుకొనకు'మని యొగిరిపడుచున్నారు! గగ్గోలుచేయుచున్నారు! సోదరభావముకాని, ధర్మలేశముకాని దేశమున నేమై నను మిగిలియున్నదా? అస్పృశ్యత యొకటియే ఇపుడు నిలిచియున్నది! ఇట్టి తుచ్ఛాచారములను చెనకివేయుడు! 'ఓదీనులారా! దరిద్రులారా! అధఃపతిత సోదరులారా! రండు, మనమందఱ మా రామకృష్ణుని బిడ్డలము' అని యెలు గెత్తిచాటుచు, జనులలో ఐకమత్య మొనగూర్చుటకై అస్పృశ్యతావరణము నూడబెఱికివేయు సుదిన మెపుడు ప్రాప్తించునోకదా! అస్పృశ్యుల నుద్ధరింప నిదే మన భారతాంబ మేల్కొనదు. మనము వారికి అన్నవస్త్రములను సమ కూర్పజాలనిచో, బ్రదికియుండి ప్రయోజనమేమి? వారీమాయా ప్రపంచ ధోరణి నెఱుగని యమాయకు లగుటచే రేయింబవళ్లు యమయాతనపడియు జీవనోపాధి నార్జించుకొనలేకున్నారు. మీయావచ్ఛక్తితోడను వారల నావ రించియున్న అజ్ఞత్వమును తొలగింపుడు. కరతలామలకమై విస్పష్టముగా నాకు గాన్పించుచున్నదేమన, నాయందున్న బ్రహ్మమే, పరాశక్తియే, వారి యందును గలదు. వ్యక్తీకరణమున తారతమ్య ముండుగాక. జాతీయతానది దేశమం దంతటను ప్రవహించిననేకాని ప్రపంచములో ఏజాతియైనను అభి వృద్ధినొందినదా? పక్షవాతముచే శరీరములో నొక్కయవయవము పడిపోయి

నచో, మిగిలిన వన్నియు ఎంతపటుపుగా నున్నను ఆశరీరమువలన అంతగా ఘన కార్యములు జరుగజాలవని గ్రహింపుడు—ఇది నిశ్చయము."

స్వామిగంభీరవాక్యములను విని యొకశిష్యుడు, "స్వామిజీ! దేశములో నున్న వివిధశాఖాసంప్రదాయముల నన్నిటిని మేళవించి దేశక్షేమమునకై ప్రవర్తింపజేయుట యసాధ్య"మని పలుక స్వామి ముక్తకంఠమున నిట్లు ఘోషించెను:

"ఏకార్యమైన నసాధ్యమని తలచినచో, నేటినుండి నీ విచటికి రాకుము. భగవదనుగ్రహముచే సమస్తము సుసాధ్యమగును. జాతిమతభేదముల నవ్వలద్రోసి, దరిద్రులకు, దీనులకు సేవచేయుటే నీ కర్తవ్యము. ఫలాఫలములనుగూర్చి చింతించుటకు నీ కేమి యధికారము కలదు? ధీరుడవై నీపని నీవు చేయుటే నీ కర్తవ్యము; సకాలమున అంతయు చక్కబడితీరును. పరిస్థితులను బాగుచేయుటే నా కార్యపద్ధతి; ఉన్నదానిని ధ్వంసముచేయుట కాదు. ప్రపంచచరిత్రను చదివిచూడుము. ఒక్కొక్కశకమున దేశములో ఒక్కొక్క మహాపురుషుడు వెలువడి జాతీయాశయములను సక్రమమార్గమున నడపియున్నాడు. ఆతనిదివ్యాశయములచే ఆకృష్టులై వందలకొలది, వేలకొలది, జనులు జగత్కల్యాణమునకై జీవితముల నర్పించినారు. మీరందఱును బుద్ధిమంతులు, యువకులు; మఱి నాశిష్యులమని చెప్పికొను మీరుచేసిన ఘనకార్యమేమో చెప్పుడు. పరహితార్థము ఒక్కజీవితము నర్పింపగల్గితిరా? వేదాంతశ్రవణము, ధ్యానాదిసాధనలు మున్నగువానిని ముందుజన్మమునకు విడిచిపెట్టుడు! లోకసేవకై యీశరీరము నాహుతియొనర్పుడు! అపుడు మీరు నాయొద్దకు వచ్చుట నిరర్థకముకాలేదని తలతును!" అని క్షణమూరకుండి మఱల నిట్లు వక్కాణించెను: "తీవ్రతపస్సుచేసి నేను గ్రహించిన మహత్తర సత్య మిది: 'ప్రతిజీవియందును భగవంతుడు కలడు! దృశ్యమానమగు ఈ సమస్తజీవకోటియు ఆతనిస్వరూపమే. భగవంతు నెచట వెదకుట! **ఎవడు జీవారాధకుడో వాడే దైవారాధకుడు!'** నే నీనాడు

చెప్పినదంతయుం హృదయస్థము చేసికొని తదనుగుణముగా వర్తింపుము. శ్రీ రామకృష్ణుడు మిమ్మందఱను సన్మార్గమున నడపుగాక !"

స్వామి తన యస్వస్థతను బాధలను గణింపక, శిష్యులకై, సోదరదేశీయులకై యిట్టి మహోన్నతాశయములను గంభీరకంఠమున ఘోషించిన సమయము లనేకములు కలవు. ఇట్టిభావోద్వేగమాతనిజీవితమును అగ్గి కప్పురమును హరించునట్లు హరించివైచెనన్నచో ఆశ్చర్యమేమి? కాని స్వామి హృదయాంతరాళమునుండి పొంగిపొరలుచున్న దివ్యసందేశవాహిని నెవ్వ రరికట్టగలరు?

స్వామి కాశినుండి వచ్చిన కొలదిదినములకు శ్రీరామకృష్ణునిజన్మదినోత్సవము తటస్థించెను. ఉత్సవదినమున స్వామి తనగదినుండి కదలలేని స్థితిలో నుండెను. ఉత్సవమున బాల్గొనుటకై వచ్చిన వేలకొలదిజనులకు స్వామిశరీరస్థితి మిగుల నిరుత్సాహము గల్గించెను. తమనాయకోత్తముని సందర్శించి యాతనిసంభాషణలను విననోచుకొనవైతిమికదా యని వారు వగచిరి. స్వామిచే నాజ్ఞాపితుడై నిరంజనానందుడు ఆతని గదిగుమ్మమునొద్ద కావలి యుండెను. ఈసమయమున స్వామిని సేవించుచుండిన యొకశిష్యు డాతని యస్వస్థతను గాంచి దుఃఖింపనారంభించెను. ఆతనివిచారమును గని స్వామి యిట్లు పల్కెను: "నాయనా! నీ విట్లు దుఃఖించిన నేమి లాభము? పుట్టిన యీశరీరము నశింపక తప్పదు. నాయాశయములు కొన్నిటిని కొంచెమైనను మీహృదయస్థము చేయగల్గితినేని నాజీవితము వ్యర్థముకాలేదని, తలతును! త్యాగమే మూలమంత్రమని సర్వదా జ్ఞప్తిలో నుంచుకొనుము. ఈమంత్రోపదేశము నొందనిచో, సాక్షాత్ సృష్టికర్తయైనను ముక్తినొందజాలడు. పూర్వజన్మసంస్కారజనితమైన సమస్తవాంఛలును తుదముట్టిననేకాని త్యాగవైరాగ్యము లంకురింపవు."

అటువెనుక ఉత్సవకార్యక్రమమునుగూర్చి పల్కుచు, శ్రీరామకృష్ణుని జన్మదినోత్సవములు ఒకనాడు వేదశాస్త్రవిచారములోడను మఱియొకనాడు ఉపన్యాసములతోడను వేఱొకనాడు దరిద్రనారాయణసమారాధనము

తోడను—ఇట్లు నాలుగైదుదినములపర్యంతము జరుపబడవలయుననియుం తాత్కాలికావేశముచే ఊరక చిందులుద్రొక్కి పాటలు పాడినందువలన నంతగా ప్రయోజనము లేదనియుం స్వామి తెల్పెను.

భజనసంఘము లరుదెంచినంతనే స్వామి పాన్పునుండి మెల్లగా లేచి, క్రిందనున్న జనసమూహములను ప్రేమవిలసితలోచనుడై యవలోకించెను. భగవద్భక్తిచేతనే ముక్తి లభించుననియుం భగవదవతారపురుషుల కటాక్షముచే లక్షలకొలదిజనులు జ్ఞానవంతులై తరించుచుందురనియుం శిష్యునకు దెల్పెను. మఱియు మహాపురుషుల యనుగ్రహమునుగూర్చి ముచ్చటించుచు నిట్లు వచించెను: "ఆత్మద్రష్టలగుమహాత్ములసన్నిధిని ఆధ్యాత్మికశక్తి స్పందించుచుండును....తత్సాన్నిధ్యము లభించినవారికి తీవ్రతపస్సాధనలతో నిమిత్తము లేకయే సులభముగా సిద్ధి కలుగును. ఇదియే అనుగ్రహతత్త్వము." భగవదవతారములనుగూర్చియు భగవత్కృపనుగూర్చియు వచించుచు స్వామి యిట్లు వక్కాణించెను :

"శ్రీరామకృష్ణుని దర్శించినవారు ధన్యులు. మీకందఱకును ఆతనిదర్శనము తప్పక లభించును. ఇచటికి వచ్చిన మీ రాతని కత్యంతసన్నిహితులు. ఎవ్వడు శ్రీరామకృష్ణుడై యీలోకమున జన్మించెనో గ్రహింపగల్గినవా రెవరు? ఆతని కత్యంతప్రియభక్తులుసైత మిందలిరహస్యమును పూర్తిగా గ్రహింపలేరైరి. కొందఱకు మాత్రమే రవంత బోధపడినది. ఐన నంద ఱాతని సకాలమున దెలిసికొనగలరు."

సోదరి నివేదితయు గొందఱుపాశ్చాత్యవనితలును ఈసమయమున నిరంజనానందునిచే వర్తమానమంపి, స్వామిని సందర్శించిరి. స్వామి యస్వస్థతను గాంచి వారు సముచితముగా సంభాషించి, సెలవునైకొని వెడలిరి. పిమ్మట శిష్యునితో స్వామి యిట్లు పలికెను: "చూచితివా వా రెట్టి వివేకవతులో! అదియే మన దేశీయుండైనచో, నాకు జబ్బుగానున్నదని గ్రహించియుం అధమపక్షము అరగంటసేపైనను మాటలాడింపకుండ వెడలడు."

స్వామియారోగ్యము ప్రబలముగా క్షీణింపసాగెను. శిష్యులు భయభ్రాంతులైరి. నిరంజనానందునిప్రార్థనము నంగీకరించి స్వామి సుప్రసిద్ధాయుర్వేదవైద్యుడగు కవిరాజమహానందసేన్‌గుప్తునియొద్ద చికిత్స నారంభించెను. నీరు త్రాగవలదనియు ఉప్పులేనియాహారము తినవలయుననియు వైద్యుడు కఠిన పథ్యమును విధించెను. దృఢచిత్తుడగు స్వామి యీ నియమములను యథావిధిగ ననుసరించుచుండెను.

ఏమైనను స్వామికి విశ్రాంతియనునది లేదు. ఆయుర్వేదచికిత్స నారంభించుటకుముందు స్వామి నూతనముగా బ్రకటింపబడిన ఆంగ్లసారస్వతసర్వస్వమునందలి గ్రంథములనన్నిటిని వరుసగా జదువసాగెను. శిష్యుడగు శరచ్చంద్రుడు స్వామిని గాంచి, "ఒక్క జీవితమున నిన్నియుగ్రంథములలోని విషయములనన్నిటిని పూర్తిగా గ్రహించుట దుస్తరము" అని వచింప, స్వామి, "నే జదివిన యీపదిగ్రంథములలో నీయిచ్చ వచ్చిన చోట బ్రశ్నింపుము" అనెను. తా నడిగిన ప్రశ్నలన్నిటికిని కంఠస్థముచేసినట్లు స్వామి వెనువెంటనే సమాధానించుట చూచి నిశ్చేష్టుడగు శిష్యునకు స్వామి యిట్లు తెల్పెను: "అంతయు బ్రహ్మచర్యముతో గూడుకొని యున్నది. బ్రహ్మచర్యము నీరసించుటచేతనే మనజాతి దేహపటుత్వమునందును బుద్ధిబలమునందును క్రమముగా క్షీణించుచు మానవత్వమును గోల్పోవుచున్నది." ఇంతలో బ్రహ్మానందస్వామి యచట కరుదెంచి, యట్టిక్లిష్టవిషయములనుగూర్చి సంభాషింపజేసి స్వామి కాయాసము గల్గించుచున్నందులకై శరచ్చంద్రుని మందలింప, స్వామి యిట్లు పల్కెను: "మీ వెఱ్ఱివైద్యనియమము లెవరికి గావలయును? వారు నాబిడ్డలు. వారికి బోధించుటచే నాశరీరము శిథిలమైనచో అది నాకు తృణప్రాయము!"

శరచ్చంద్రునితో బ్రసంగించుచు, స్త్రీలకోసము కలకత్తాప్రాంతమున గంగానదీతీరమున నొకమఠమును నిర్మించు టావశ్యకమనియు బ్రహ్మచారిణులును సన్న్యాసినులును అచట సుశిక్షితురాండ్రై జాతీయపద్ధతి ననుసరించి

స్త్రీలకు విద్య గఱపవలయుననియు స్త్రీసముద్ధరణమునకై అట్టి జాతీయవిద్యాలయములు దేశమందంతటను నెలకొల్పబడవలయుననియు స్వామి తెల్పియున్నాడు.

తన్ను సందర్శింపవచ్చిన జిజ్ఞాసువులకు బోధించునెడ స్వామి తన శరీరస్థితి నెంతమాత్రము గణింపక మహోత్సాహము బ్రకటించువాడు. ఏన నొకానొకసమయమున శిష్యులు వారిని నిరోధించిరని తెలిసికొని స్వామి దయాపూర్ణుడై యిట్లు వచించువాడు: "ఈశరీరమువలన నేమి ప్రయోజనము? పరోపకారమున నిది పతనమగుగాక! జీవితాంతమువఱకు గురుదేవుడు బోధింప లేదా? నేను నట్లే ఎందులకు ఆచరింపరాదు? ఈశరీరము పతనమైన, నాకది తృణప్రాయము! ముముక్షువులను గాంచి వారితో సంభాషించుట నాకెట్టి యానందదాయకమో మీరు ఊహింపజాలరు. నాసోదర దేశీయులలో నిద్రించుచున్న ఆత్మశక్తిని మేల్కొల్పుటకై ఎన్నిపర్యాయములైనను మహానందముతో మరణింతును!"

అంత్యదినపర్యంతము స్వామి శిష్యులకు స్వయముగా పాఠములను జెప్పెను. హాస్యచమత్కారములచే శిష్యులకు అమితోత్సాహము గల్పించుచు, వారలకు ధ్యానాదిసాధనలను నేర్పుచు, వారిదైనందినచర్యలను బరిశీలించి యల్పవిషయములందుసైతము సదుపదేశము లొసగు స్వామిజీవితము తుదివఱకును దివ్యవాహినియై, జీవనదియై, ఒకేరీతిగా బ్రవహించెను.

మఠకార్యక్రమమును జక్కగా నిర్వహించుటకై స్వామి యింతకు ముందే 1898-వ సంవత్సరారంభమున విపులమైన నియమావళిని వ్రాసియున్నాడు. శ్రీరామకృష్ణమఠసంఘోద్దేశములను కార్యవిధానములను అందు సూచింపబడినరితిని నిర్వహించుటయే సభ్యుల కర్తవ్యము.

నియమానుష్ఠానవిషయములలో స్వామి చండశాసనుడు బ్రాహ్మముహూర్తమున లేచినదాది రాత్రి పండుకొనువఱకును శిష్యులచర్యలన్నియు సకాల నియమబద్ధమైయుండెను. ఉదయసాయంసమయములం దండఱును పూజామంది

రమున కేగి ధ్యానింపవలసియుండెడిరి. శరీరస్థితి యేమాత్రమనుకూలముగానున్నను స్వామియు బ్రాహ్మముహూర్తమునకుముందుగనే లేచి, కాలకృత్యములను దీర్చుకొని, పూజామందిరమున కేగి యందఱితోడనుగూడి ధ్యానించును. స్వామిజీ తనయాసనమునుండి లేచువఱకును ఎవ్వరును పూజామందిరమునుండి కదలుటకు వీలులేదు. తఱుచు స్వామిధ్యానము ముగియుసరికి రెండుగంటల కంటె నెక్కువకాల మగుచుండెడిది. స్వామి యంతట శివనామస్మరణమొనర్చుచు బ్రహ్మానందభాసురవదనారవిందుడై ఆసనమునుండి లేచి, శ్రీరామకృష్ణునకు అభివందనమొనర్చి, మెల్లగా క్రిందికి వచ్చును. అంత నాతడు మఠప్రదేశమున బచారుచేయుచు, జగన్మాతనుగూర్చియో, పరమశివునిగూర్చియో మనోహరముగ గానమొనర్చుచుండ నాతని ప్రశాంతమూర్తి యత్యంత దర్శనీయమై విరాజిల్లుచుండెడిది. పూజామందిరమున స్వామిసాన్నిధ్యము ఎల్లరకును ప్రశాంతిదాయకమైయొప్ప, బ్రహ్మానందస్వామి యివ్విషయమునుగూర్చి యొకప్పుడిట్లు వచించెను: "అహా! నరేంద్రునితో ధ్యానమునకు గూర్చున్నచో ఎవ్వనిమానసమైనను క్షణములో ధ్యేయమున లీనమగును...."

శిష్యులనేకు లొకదినమున నియమానుసారము ధ్యానింపకుండుట చూచి స్వామి వారల నానాడు, మఠమున భుజింపగాదనియు బైటి కేగి మాధుకరమెత్తుకొనుడనియు ఆజ్ఞాపించెను. తన కత్యంతప్రేమపాత్రులగు సోదరశిష్యులను సైతము స్వామి విడువలేదు. కాని, వా రట్లు బిచ్చమెత్తికొనుట చూడజాలక, స్వామి, పనియున్నదనుమిషతో కలకత్తాకేగి మఱునాడు మఠమునకు అరుదెంచెను. శిష్యులందఱును తమతమమాధుకరానుభవములను ప్రేమప్రపూర్ణుడగు స్వామికి దెలిపి స్వామితోగూడ నానందించిరి.

స్వామిసాన్నిధ్యమున శిష్యులకు ఆదినములు నిముసములై గడచినవి. స్వామి యెట్టి స్థితిలో నున్నను ఆతని సన్నిధానము వారలకు నిత్యానందసంధాయకమై, దివ్యావేశసంజనకమై, దీపించెను. ప్రబోధకుడైయున్నను ధ్యాననిమగ్నుడైయున్నను ప్రేమపూరితుడై యున్నను కోపోద్దీపితుడైనను సోదరశిష్యుల

కాత డెల్లవేళల దమ ప్రీతిపాత్రుడగు నరేంద్రుడై, శిష్యుల కాతడు తమ గురు వరేణ్యుడై విలసిల్లెను. ఈదినములలో స్వామినిగూర్చి యొక సుప్రసిద్ధప్రచారకుడు వ్రాసిన యీ క్రిందివాక్యముల నరయుందు :

"ఈసమయమున స్వామి తన జగద్ధితకార్యము పూర్తియైనదని, తన గురుదేవునిసందేశమును బ్రపంచమున కొసగితినని, విశ్వసించెను....విశాలజగ ద్వ్యాప్తమగు తన పేరుప్రతిష్ఠలను పాటింపక ప్రశాంతచిత్తుడై గంగానదీతీర మందలి మఠమున, దన్ను పరివేష్టించియున్న శిష్యబృందమునకు ఆచార్యుడై, తండ్రియై, వివేకానందస్వామి నిరాడంబరజీవనము గడపుచుండెను. దేశీయుల లను నిజమైనధీరుల నొనర్చుటయే ఇపుడు మన స్వామియాదర్శము. వేదవే దాంగములను శిష్యుల కాతడు బోధించును; ఉదయసాయంసమయములందు వారితో ధ్యానించును. దేశమందలి వివిధరాష్ట్రములనుండి వచ్చిన జిజ్ఞాసువుల నాదరించును....తన్ను జూడవచ్చినవారియెడ స్వామి దయానిధి. అతని విశ్వ మానవప్రేమ నిరుపమానము. తన్ను దర్శింపవచ్చినవారి కాతడు వినయమూర్తి. ...విద్యావిహీనులగు కోట్లకొలది భారతీయుల దుఃస్థితిని జూచి క్షోభించు తనకరుణామయహృదయముచే, విశ్వమానవప్రేమోద్దీపితములగు తన మనో భావములచే, తన నిరంతరస్వార్థత్యాగసేవలచే, యథార్థదేశభక్తిచే, దివ్యా వేశపూరితుడగు మహాపురుషు డెట్లు జగత్కల్యాణమునకై వర్తించునో, భా వించునో,—తనశిష్యులకు స్వామి ప్రకటించియున్నాడు. వాక్చాతుర్యమును కా దాతడు ప్రదర్శించినది. విశ్వమానవసౌభ్రాత్రమునకై అల్పశాఖలను నిర్మించిన వాడు కా దాతడు. ప్రత్యక్షాచరణముచే, తనయాహారవిహారము లచే, దైనందినజీవితముచే, యథార్థమగు విశ్వమానవసౌభ్రాత్రమును ప్రేమ సానుభూతులను ప్రదర్శించిన మహనీయుండు వివేకానందస్వామి. విశ్వమానవ సౌభ్రాత్రము ననుభవపూర్వకముగా గ్రహించిన కార్యదక్షుడనని శిష్యుల కాతడు నిరూపింపగల్గిన మహాపురుషుడు; నిశ్శబ్దముగా వర్షకాలమేఘము ప్రపంచమును ముంచియెత్తురీతిని ప్రశాంతిమయుండై కార్యరంగమున విహ

రించిన ధీరుడు; తనవేదాంతబోధనముచే, వేదాంతవిహితవర్తనముచే, ఉదార భావములచే, పవిత్రతమజీవితముచే, వేదాంతతత్త్వవిరాజిత శీలనిర్మాణమే మన కాదర్శమని తనశిష్యులకును అనుచరులకును మాత్రమేకాక, భారతదేశ మంతటికిని ప్రకటించిన భావిభారతభాగ్యోదయభాస్కరుడు."*

* స్వామి యిట్లు ఘోషించెను : "...హే! భారతజననీ! నీసతీత్వా దర్శము సీత—సావిత్రి—దమయంతి—యను మాట మఱవకుము;—సర్వసంగపరిత్యాగియు యతీశ్వరుడు నగు శంకరుడు—ఉమామహేశ్వరుడు—నీకు ఆరాధ్యుడనుమాట మఱవకుము;—నీ యైశ్వర్యమునకు, నీ వివాహమునకు, నీజీవితమునకు, పరమార్థము తుచ్ఛవిషయసుఖము గాదను మాట, స్వీయానుభవము గాదనుమాట, మఱవకుము;—యజ్ఞనారాయణునకు ఆహుతియగునిమిత్తము జన్మించితివనుమాట మఱవకుము;—నీ సాంఘికవ్యవస్థ యనంతజగన్మాతృత్వమునకు ప్రతిబింబమనుమాట మఱవకుము;—అస్పృశ్యులనబడు, అవాచ్యులనబడు, మాలమాదిగలు—నిమ్నజాతులు, దీనులు, దరిద్రులు, అజ్ఞానులు, నిరక్షరాస్యులును నీ తనూభవులనుమాట మఱవకుము. ఓ వీరభారతమాతా! ధైర్యము విడనాడకుము! ఓ వీరభారతపుత్రా! ధైర్యము వీడకుము! 'నేను భారతీయుండను' అని గర్వింపుము! 'నేను భారతీయుండను, ప్రతి భారతీయుండును నా సహోదరుడు' అని సగర్వముగా ప్రకటింపుము! అజ్ఞభారతీయుండు, దీనభారతీయుండు, బ్రాహ్మణభారతీయుండు, చండాల భారతీయుండు నా సహోదరుడు' అని ప్రకటింపుము. జీర్ణవస్త్రధారి వగు—కౌపీనమాత్రధారివగు—నీవును సగర్వముగా ఎలుగెత్తి యిట్లు ఘోషింపుము: 'భారతీయుండు నాసోదరుడు; నాప్రాణములకు ప్రాణము' భారతీయదేవతలే నాదైవతము; భారతసంఘము నాబాల్యడోలిక, యౌవన నందనవనము, వార్ధకవారణాసి....' అహర్నిశము ఇట్లు ప్రార్థింపుము: 'ఓమహేశ్వరా! ఓలోకేశ్వరీ! నాకు పౌరుషమును ప్రసాదింపుడు, నా దౌర్బల్యమును దొలగింపుడు, నన్ను ధీరు నొనర్పుడు!' "—నవీన భారతదేశము.

# ముప్పదితొమ్మిదవ ప్రకరణము

## మహాసమాధి

ప్రాక్పశ్చిమములపై వేదవేదాంతతేజమును బఱపి తన దివ్యసందేశకర సహస్రములచే ముముక్షుహృదయసరోజసహస్రములను వికసింప జేసిన వివేకానందభాస్కరుడు అస్తమించుసమయము ఆసన్నమైనది. స్వామి మర్త్యలోకమున గడపిన తుదిరెండుసెలలును అవసానసమయసూచనలతో నిండియుండెను. కాని యాసమయమున నెవ్వరును వాని గంభీరార్థమును గ్రహింపరైరి. స్వామి వారణాసి కేగి తిరిగివచ్చిన పిమ్మట తన సన్న్యాస శిష్యుల నందఱను జూడ నభిలషించి వారలకు ఉత్తరములు వ్రాసియుండెను. క్రమముగా మఠవ్యవహారములనుండి తా నొత్తిగిలి శిష్యులను సర్వస్వతంత్రులను జేయుట యావశ్యకమని స్వామి భావింపసాగెను. అత డిట్లు వచించెను: "శిష్యుల నెన్నడును విడువక వారి నంటిపట్టుకొనియుండుటచేతనే గురువు తఱుచు వారిని పాడుచేయుచుండును! అనుచరులు సుశిక్షితులైనంతనే నాయకుడు వారిని విడువవలయును. లేనిచో వా రభివృద్ధినొందజాలరు!" సోదర బృందమున కీపలుకులు ములుకులై తోచినవి. స్వామి లేనిచో, తమయుద్యమ మేమగునోయని వా రాందోళనమొందసాగిరి. కాని స్వామి కిక ప్రపంచముతో సంబంధము తీరిపోయినది. కర్మబంధములు విచ్ఛిన్నములైనవి. రామకృష్ణు డొక్కడే యాతని హృదయము నాక్రమించెను. జపతపములు స్వామి నావరించెను. నరేంద్రుడు తన కార్యము సమాప్తమైనంతనే స్వస్వరూపజ్ఞానవంతుడై శరీరమున నిలువనిచ్ఛగింపడనియు నిర్వికల్పసమాధిస్థితిలో లీనమగుననియు శ్రీరామకృష్ణుడు పల్కినవచనములను దలచి శిష్యులును సోదరశిష్యులును ఆందోళనమొందసాగిరి. ప్రసంగవశమున నొకసోదరశిష్యుడు, "స్వామిజీ! మీ రెవ్వరో మీ కెఱుకపడినదా?" యని ప్రశ్నింప, స్వామి వెంటనే,

"ఆహా ! నా కిపుడు తెలిసినది" అని ప్రత్యుత్తరమిచ్చెను. శిష్యులందఱును నిశ్చేష్టులై యిక ప్రశ్నింపవెఱచిరి.

వారముదినములకు గతించుననగా స్వామి, శుద్ధానందునిచే బంచాంగమును దెప్పించి, పుటలను ద్రిప్పి యొక తిథికెదుట నొకగుర్తు నుంచెను. స్వామి మహాసమాధినొందిన వెనుకమాత్రమే శిష్యు లాత డా దినమున శరీరమును జాలింప నిశ్చయించెననియు అయ్యది పంచాంగమున నాతడు గుర్తువెట్టిన శుభకృన్నామసంవత్సర జ్యేష్ఠబహుళచతుర్దశీ శుక్రవారము (4-7-1902) అనియు గ్రహించిరి !

ఇక మూడుదినములకు గతించుననగా స్వామి, తన సోదరశిష్యుడగు ప్రేమానందునితోగూడి మఠప్రదేశమున బచారుచేయుచు గంగానదీతీరమున నొకస్థలమును సూచించి, "నేను శరీరము చాలించునపు డచట దహనము చేయుడు!" అని గంభీరముగా బల్కెను. నే డాస్థలముననే వివేకానందస్మారకచిహ్నమై యొకయాలయము వెలసియున్నది.

తా నెప్పు డీలోకమును వీడునో స్వామి తెలిసికొనియేయుండెనని తెలుపుచు సోదరి నివేదిత యిట్లు వ్రాసియున్నది :

"ఏమైనను వైశాఖమాస మంతమగుసరికి స్వామి తన యవసానసమయము సమీపించుచున్నదని బాగుగా దెలిసికొనియే యుండెను. మహాసమాధికి పూర్వము బుధవారమున స్వామి తనయొద్దనున్న యొక (శిష్యు)నితో నిట్లు పల్కెను : 'ప్రయాణమునకు సంసిద్ధుడనగుచున్నాను ! మహాతపస్సు, ధ్యానమును న న్నావరించుచున్నవి ; ప్రయాణమునకు సంసిద్ధుడ నగుచున్నాను !'

"...ఆమాటలు యథార్థములని కలనైనను మే మెఱుగమైతిమి.... వానలు కురియకున్నవని ఎంతయో ఆత్రముతో జెప్పిన మాటనైనను స్వామి యాలకించువాడుకాడు. అట్టిమాట లాతనికి స్వప్నతుల్యముగా దోచునట్లు కాన్పించెడిది. అప్పటిపరిస్థితులనుగూర్చి స్వామియభిప్రాయము నరయగోరి ప్రశ్నించుట వట్టి నిష్ప్రయోజనము. అట్టియెడ (ఒకనాడు) స్వామి మెల్లగా

నిట్లు వచించెను : 'నీయభిప్రాయమే సరియై యుండవచ్చును. కాని నే నీవిష యములలో ఇక ప్రవేశింపజాలను. మరణమునకు సంసిద్ధుడనగుచున్నాను!'

"...'ఇదిగో, నీమామిడిపండు! దీనిని నాపెట్టెలో బెట్టి తాళము వేయుచున్నాను. నీవు చేయవలయు కార్యము ముగిసినంతనే మఱల దీనిని రుచి చూడగలవు!' అని యాతని గురుదేవుడు వచించియుండెను గదా!

"...మహాసమాధికి ముందటియాదివారమున స్వామి తన శిష్యులలో నొకరితో నిట్లు వచించెను: 'నాయుద్యమమునకు నేను వశ్యుడనని నీ వెఱుగుదువుకదా! అయ్యది కొనసాగదేమోయని తలచునపుడు నాకెంతయో పరితాపము కలుగును!'

"ఆవారముననే ఏకాదశినాడు స్వయముగా అత్యంతనిష్ఠతో ఉపవాసముండియు ఆశిష్యునకు ఉదయము స్వామి స్వయముగా ఆహారపదార్థములను వడ్డించెను. ఉడుకబెట్టిన పనసగింజలు, బంగాళదుంపలు, అన్నము, మంచువలె చల్లనైన పాలు—వీనిని వడ్డించుచు స్వామి మధురసల్లాపముల నొనర్చెను. తుదకు భోజనాంతమున స్వయముగా స్వామియే శిష్యుని చేతులపై నీరువోసి యంగవస్త్రముతో నొత్తెను.

"'స్వామిజీ! ఈపనులుచేయవలసినది మీకు నేనుగాని నాకు మీరు కాదు!' అని సహజముగా శిష్యుడు వారింపయత్నింప, 'జీసస్ తనశిష్యుల పాదములను గడిగెను!' అనుగంభీరమగు స్వామిసమాధానము శిష్యుని చకితు నొనర్చెను."

"'కాని యది కడసారి!' యనుమాటలు శిష్యుని నాలుక చివరకు వచ్చినవి, కాని యేదియో ఆసమాధానమును నిరోధించెను; శిష్యుడు మాటాడ లేదు. అది సరి. ఏలన, నిచటను కడసారియే కదా."

* * * * *

మహాసమాధిదినమున స్వామి పూజామందిరమున కేగి తలుపులువైచుకొని, మూడుగంటలసేపు ధ్యానించెను. అనంతరము క్రిందికి వచ్చి, పచారుచేయుచు తనలో తా నిట్లనుకొనుచుండుట ప్రేమానందుడు దిగ్భ్రాంతుడై వినెను : "వివేకానందు డేమి యొనర్చెనో మఱియొక వివేకానందు డుండిన.

గ్రహించియుండెడివాడు ! ఐనను—కాలగర్భమున నెందఱు వివేకానందు లుద్భవింపనున్నారో ! !" అతీంద్రియజ్ఞానపారవశ్యముననగాని స్వామి యి ట్లెన్నడును వచించినవాడుకాడు.

నాడు శుక్రవారము. మఠమున మఱునాడు స్వామి కాళీమాతృపూజ నొనర్పదలచి, శుద్ధానందుని, బోధానందుని బిలిచి పూజాద్రవ్యములను సేక రింప నియోగించెను. అటువెనుక శుద్ధానందునిచే పుస్తకభాండాగారమునందలి శుక్లయజుర్వేదమును దెప్పించి, యందు వాజసనేయీసంహితలోనున్న యీ క్రిందిమంత్రమును సవ్యాఖ్యానముగా జదువుమనెను :

"సుషుమ్నః సూర్యరశ్మి శ్చన్ద్రమా గన్ధర్వ స్తస్య
నక్షత్రాణ్యప్సరసో భేకురయోనామ,
స న ఇదం బ్రహ్మ క్షత్రం పాతు తస్మై స్వాహా
వాట్ తాభ్యః స్వాహా."

వ్యాఖ్యానమును* గొంతవఱకు విని స్వామి యిట్లు వచించెను: "ఈ మంత్రవ్యాఖ్యానము నామనస్సునకు సమ్మతముగాలేదు. 'సుషుమ్న' యనుపద మునకు వ్యాఖ్యానకర్తయొక్క అభిప్రాయ మేమైనను, కాలక్రమమున తంత్ర శాస్త్రములో యోగులచే బేర్కొనబడిన సుషుమ్నానాడియే ఈవైదికమంత్ర మున సూచింపబడియున్నది. నాశిష్యులగు మీరు ఈశ్లోకములకు సరియైన తాత్పర్యమును గనుగొని శాస్త్రములకు స్వతంత్రమైన భాష్యములను వ్యాఖ్యా నములను వ్రాయ యత్నింపవలయును."

---

* గంధర్వస్వరూపుడును సుషుమ్నాస్వరూపుడు ననగా యాజ్ఞికులకు పరమానందము నొసగువాడును సూర్యకిరణముల బోలు కిరణములుగలవాడు నైన యాచంద్రుడు బ్రహ్మక్షత్రియులమగు మమ్ము రక్షించుగాక ! ఆతనికి మా హవిస్సుల నర్పించుచున్నారము. ప్రకాశకములగు నక్షత్రములే ఆతని యప్సరసలు : వారికి మా హవిస్సులను అర్పించుచున్నారము.

(మహీధరుని వ్యాఖ్యానము.)

భోజనానంతరము స్వామి యొంటిగంటకు బ్రహ్మచారుల గది కేగి, వ్యాకరణపాఠము జెప్పెను. ఆపాఠమును వినిన యొకబ్రహ్మచారి యిట్లు వ్రాసి యున్నాడు :

"ఇంచుమించుగా జాము సేపు స్వామిజీ పాఠము చెప్పెను. కాని మా కెంతమాత్రము విసువు జనింపలేదు. ఏలన, పాఠము సులభముగా బోధపడు టకై స్వామిజీ హాస్యచమత్కారములతోగూడిన యొక కథను జెప్పును.... స్వామిజీ కిది వాడుక. శిష్యులు సూత్రమును సులభముగా జ్ఞప్తిలో నుంచు కొనుటకనువగునని స్వామిజీ యొకొక్కప్పుడు సూత్రపదసరణినిగూర్చి చమ త్కరించును. ఇట్టి విధానమునే అనుసరించి పూర్వము కళాశాలలో తన మిత్రుడగు దాశరథీ సన్యాల్ అనునాతని దా నెట్లు ఒక్కరాత్రిలో ఆంగ్ల దేశ చరిత్రమున పరీక్షకు సంసిద్ధుని జేసెనో స్వామిజీ మాకు దెల్పెను. ఏమైనను వ్యాకరణపాఠము ముగియుసరికి స్వామిజీ కొంచెము అలసినట్లు కాన్పించెను...."

నాటిసాయంకాలము ప్రేమానందునితో స్వామి చాలదూరము వాహ్యా ళికి వెడలి దారిలో అనేక ముఖ్యవిషయములనుగూర్చి ప్రసంగించెను. ముఖ్య ముగా మఠమున వేదకళాశాల నిర్మించు టావశ్యకమనియు వేదవిద్యాభ్యాసము మూఢవిశ్వాసములకు వజ్రాయుధమనియు వచించెను.

సంధ్యాసమయ మైనది. శ్రీరామకృష్ణాలయమున శంఖఘంటారవము లతో ఆరాత్రికము ప్రారంభమైనది. స్వామి తన మందిరమున కేగి గంగానది కభిముఖుడై ధ్యానస్థితుడయ్యెను.

చిరస్మరణీయమగు నాటిసంఘటనమునుగూర్చి ఉద్బోధనపత్రికలో నొకసోదరశిష్యు డిట్లు వ్రాసియున్నాడు :

"...అనంతరము పూజామందిరమున స్వామి ఉదయము ఎనిమిది మొదలుకొని పదునొకండుగంటలవఱకును ధ్యానించెను. ఇతరదినములలో ఆత డొక్కసారిగా అంతసేపు ధ్యానించినదిలేదు. మఱియు తలుపులను గిటికీలను మూసికొని, గాలి చొరనిగదిలో ఆత డట్లు ధ్యానింపగల్గినదియు లేదు; కాని

యీదినమున పూజామందిరపుదలుపులను గిటికీలను అన్నిటిని బంధించి మఱి ధ్యానించెను.

"ధ్యానానంతరము స్వామి కాళీమాతనుగూర్చి మనోహరమగు నొక కీర్తనమును పాడెను....అదివ్యగానమును క్రిందనున్న సన్న్యాసులు సమ్మోహితులై వినిరి....

"నాడు మధ్యాహ్నభోజనమును విశేషతృప్తితో నొనర్చెను. అనంతర మించుమించు జాముసేపు శిష్యులకు 'లఘుకౌముది' పాఠముచెప్పెను.... సాయంకాలము ఒకసోదరునితో రెండుమైళ్లదూరము వాహ్యాళికి వెడలెను. చాలదినములనుండియు స్వామి యట్లు నడవగల్గినది లేదు. నాడు శరీరము చాల తేలికగా నున్నదని పల్కెను....అనంతరము సోదరశిష్యులతో గొంత సేపు ప్రసంగించి, తనగదికేగి, శిష్యుని బిలిచి తనజపమాలను దీసికొనిరమ్మనెను. పిమ్మట శిష్యుని బయట వేచియుండుమని చెప్పి, తాను గదిలో నేకాంతముగా జప మొనర్చుటకై కూరుచుండెను.

"...అటు లొక గంటయైన వెనుక, నేలమీదనున్న పడకపై బండుకొని, బయటనున్న శిష్యుని బిలిచి శిరోభాగమున గొంచెము విసరు మనెను. జపమాల యింకను హస్తముననే యున్నది. శిష్యుడు స్వామికి నిద్రపట్టినదను కొనెను. ఒకగంటయైనవెనుక చేయి కొంచెము వణకినది. పిమ్మట రెండుదీర్ఘ నిశ్వాసములు——. స్వామి సమాధినిమగ్నుడయ్యెనని శిష్యుడు తలచెను. అంత నతడు క్రిందికేగి యొకసన్న్యాసిని బిలుచుకొనిరా నతడు పరీక్షించి, శ్వాసలేదనియు నాడి నిలిచిపోయినదనియు దెల్పెను. ఇంతలో మఱి యొక సన్న్యాసి వచ్చి, సమాధిస్థితియే యని తలచి బిగ్గఱగా శ్రీరామకృష్ణ నామోచ్చారణ మారంభించెను. కాని చలనము గలుగదే! ఆరాత్రి సుప్రసిద్ధుడగు నొకవైద్యుని బిలుచుకొని వచ్చిరి. వైద్యుడు శరీరమును చాలసేపు పరీక్షించి ప్రాణోత్క్రమణమైనదని చెప్పివైచెను.

"మఱునాడు ఉదయమున జూచుసరికి నేత్రగోళము లుబికి యెఱ్ఱబాఱియుండెను: నోటినుండియు నాసాపుటములనుండియు గొంచెము రక్తము స్రవించియుండెను. ఇతరవైద్యు లిందులకు కారణము మెదడులోనుండలి యొక రక్తనాళము పగులుటయని పలికిరి. జపధ్యానములతో స్వామి బ్రహ్మరంధ్రము

నుండి ప్రాణోత్క్రమణ మొనర్చెనని దీనివలన స్పష్టముగా దేలుచున్నది! అనంతర మనేక వైద్యులు వచ్చి స్వామి శరీరము నతిజాగ్రత్తగా బరీక్షించిరి. ప్రజ్ఞ గల్గించుటకు తమ యావచ్ఛక్తిని వినియోగించిరి; కాని వారియత్నము లన్నియు విఫలములైనవి. యథార్థముగా వా రాతని మరణహేతువును గనుగొనలేకపోయిరి. నిజముగా నాతడు స్వేచ్ఛామరణము నొందెను. యోగియై పుట్టి యోగియై యాతడు శరీరమును జాలించెను!"

మఱియొక రిట్లు వ్రాసిరి :

"...ఇక నొక నెలకు గతించుననగా స్వామి తనవాడుకకు అదనముగా ధ్యానించుచుండుటయు నాతని కేవ్యాధియు లేనట్లు మాకు దోచెడిది....నాటిసాయంకాలము...ప్రేమానందునితో స్వామి...యనేకసల్లాపము లొనర్చెను. పిమ్మట ధ్యానార్థము సంధ్యాసమయమున తనగది కేగెను. అనంతర మొకశిష్యుని బిలిచి, తనకు ఉక్క పెట్టుచుండుటచే గదికిటికీల నన్నిటిని దెఱచి కొంచెము విసరుమనెను....కొంతసేపైనంతనే స్వామి నిదురించుచున్నట్లు తోచెను. ఒకగంట గడచెను : శిష్యుడు పాదము లొత్తుచుండెను; పిమ్మట కుడివైపున కొత్తిగిలి స్వామి పసిబిడ్డలు స్వప్నమున రోదించునట్లు ఒక విధమైన రోదనధ్వని నొనర్చెను. పిమ్మట నొకదీర్ఘ నిశ్వాసము,—తలగడనుండి తల జారినది. మఱియొక దీర్ఘనిశ్వాసము,—ఇక నంతయు మరణప్రాయమైన గభీరనిశ్శబ్దత, శాంతి! అలసటచెందిన యాశిశువు అల జగజ్జననియొడిలో పవ్వళించెను !...

" '...నలుబదియేండ్లు నిండుట నే నెన్నడును జూడ'నని తఱచుగా నాతడు వచించువాడు. ఇందుల కనుగుణముగా ముప్పదితొమ్మిదివత్సరముల ఐదునెలల ఇరువదినాలుగుదినముల ప్రాయమున స్వామి తన శరీరమును జాలించెను."

వివేకానందయోగిపుంగవుడు, వివేకానందఋషీశ్వరుడు, శ్రీరామకృష్ణ ప్రియపుత్రుడు పరబ్రహ్మైక్యము నొందెను! జగద్గురువరేణ్యుడు, సనాతన ధర్మపునః ప్రతిష్ఠాపనార్థ మవతరించిన యాచార్యశేఖరుడు, వేదాంతభాస్కరుడు వేదాంతసాగరమున విలీనమయ్యెను! నరోత్తము డానరేంద్రుడు నారాయణునియం దైక్యమునొందెను! ఓం తత్ సత్!

తమ నాయకోత్తముడు గతించెననువార్త జనుల మానసములను పిడుగుపాటై కలచివైచెను. బేలూరుమఠమున శిష్యులు దిగ్భ్రమచెందిరి. "స్వామి మరణించుట నిజమా ? సాధ్యమా ?" యని వారు తత్తఱిల్లసాగిరి. అది వారి కొకదుస్స్వప్నమై తోచెను. కాని స్వామిశరీరము తమకట్టెదుట మృత్యుబద్ధమై పడియున్నదే ! తమకు సంభవించిన ఘోరవిపత్తును దలచి కొందఱు మూర్ఛిల్లిరి. తమ దురదృష్టము నెంచి కొందఱు ఘోరన విలపింపసాగిరి. కొందఱు భయాన్వితులై నిశ్చేష్టులైరి. కొందఱు ఆందోళితమానసులై అటునిటు తిరుగాడజొచ్చిరి. మఠమంతయు దుఃఖసాగర నిమగ్నమయ్యెను.

స్వామి గతించెననువార్త పట్టణమంతయు గార్చిచ్చువలె వ్యాపించెను. ఐరోపా, అమెరికాఖండములపర్యంతము తంతివార్తలు బర్వెను. స్వామియకాల మరణమును దలచి, "ఇది సాధ్యమా? నిజమా ?" యని జనులు దిగ్భ్రాంతులైరి. స్వామి నెఱింగిన, స్వామిని జూచిన, ప్రతివ్యక్తియు దుర్భరవిషాదముచే స్తంభించిపోయెను. తెల్లవాఱకమును పే గుంపులుగుంపులుగా వచ్చుచుండిన జారులతో మఠమంతయు నిండిపోయెను. దుఃఖ మెల్లయెడల రాజ్యమేలుచుండెను. స్వామిశరీరమును గని, "సనాతనధర్మసందేశమును దేశదేశాంతరములలో మాఱుమోగించిన వివేకానందమధురగంభీరవాణి నిక విననోచుకొనమైతిమే !" యని వారు విలపించిరి. "స్వామి మరణించుట నిజమేనా ? ఇక భారతమాతృపునరుద్ధరణసందేశము నొసగువా రెవ్వరు ? మార్గము చూపువారెవ్వరు?" ఇట్టి భావతరంగములు వారల దుఃఖసాగరమున పొంగిపొరలెను.

శ్రీరామకృష్ణనిర్యాణము మొదలుకొని శిష్యు లెన్నడిట్టి మహాపద నెఱుగరు. తనయవసానకాలమున గురుదేవుడు తమ్ము నరేంద్రున కొప్పగించి చనెను. అట్టి నరేంద్రుడు, కన్నతల్లిదండ్రులకంటె తమపై నెక్కుడు ప్రేమానురాగములను జూపిన ప్రియతమసోదరుడు, తమ సంశయములను బాపు సద్గురువరేణ్యుడు, తమ పెన్నిధానము, తమ్ము వీడిపోవ, "నిక మాకు దిక్కెవ్వ" రని వారు శోకింపసాగిరి. తన యవసానసమయమున స్వామి తమ్ము ఉద్దేశించి,

"వీరు నాబిడ్డలు; వీరికి బోధించుటచే నాశరీరము శిథిలమైనచో, అది నాకు తృణప్రాయము!" అని వచించెనే! ఇక తమ్మటు లాదరించి ప్రేమించువా రెవ్వరు? తమ యోగక్షేమములను అరయువా రెవ్వరు? ఈవిధముగా నిరుప మానమగు స్వామిహృదయమును వచనములను చేష్టలను దలచుకొని వారు పొందిన పరితాపము వర్ణనాతీతము.

వైద్యశేఖరులు వచ్చి స్వామి గతించెనని నిర్ణయించినను ఇంకను బహిః ప్రజ్ఞను బొందునేమో యను వెఱ్ఱియాస శిష్యబృందమును విడువలేదు. "కాశీ పురవనమున స్వామి నిర్వికల్పసమాధిస్థితి నొంది మఱల దేహస్మృతి నొందలేదా?" శిష్యు లిట్లు తలపోసి ప్రార్థింపసాగిరి. కాని వారి యాశలన్నియు నిరాశలైనవి. స్వామి తన శరీరమును త్యజించి పరంజ్యోతియం దైక్యమొందె నని శిష్యులందఱకును విస్పష్టమైనది.

మఠప్రదేశమంతయు నాడు వేలకొలది జనులతో నిండిపోయెను. అప రాహ్ణ మగుసరికి స్వామిశరీరమును క్రిందికి దెచ్చి కాషాయాంబరములచే గప్పి, యొకతల్పముపైనుంచిరి. స్వామి పాదములకు లత్తుక నలది శుభ్రవస్త్రములపై పాదపద్మముద్రలను దీసి పూజార్థమై భద్రపఱిచిరి. అనంతరము శంఖఘంటా రవములతో సమంత్రకముగా ఆరాత్రికము జరిపి యెల్లరును సాష్టాంగవందన మాచరించిరి. శిష్యులందఱును స్వామిపాదములను శిరములకద్దుకొనిరి. శ్రీరామ కృష్ణుని సన్న్యాసపుత్రులు స్వామిశరీరమును తమ భుజములపై నిడికొని, "శ్రీగురుమహారాజునకు జయ! శ్రీస్వామిజీమహారాజునకు జయ!" అను జయ జయధ్వానములతో వేలకొలది జనులు తమ్ము వెంబడింప, మఠప్రదేశమందలి బిల్వవృక్షముకడ కేగిరి. అచట స్వామి నిర్దేశించియుండిన స్థలముననే చితి పేర్పబడియెను. వందలకొలదిజనులతో గూడి సన్న్యాసులు చితికి అగ్ని ముట్టించిరి. చందనకర్పూరాదికములు పరమపవిత్రమగు స్వామిశరీరమును తమ కడుపున నిడుకొని ప్రజ్వలించెను. దహనకర్మము పూర్తియైనది. సంధ్యాసమయ

మైనది.* అద్భుతప్రశాంతి వారలహృదయమున భాసించెను. "సర్వేశ్వరా! జగద్రక్షకా! నీవే యెల్లరకును శరణ్యుడవు! నీయిచ్ఛయే నెఱవేఱుగాక" యను ప్రార్థనలు వారల హృదయాంతరాళమునుండి వెలువడియెను.

చితినుండి యస్థులను ఏరి భద్రపఱిచిరి. నేడీ తావుననే శ్రీవివేకానందాలయము వెలసియున్నది. ఇందు క్రింది భాగమున చలువఱాతితో నిర్మితమైన శ్రీవివేకానంద విగ్రహమును పైయంతస్తున పరమేశ్వరచిహ్నమగు నోంకారమును స్థాపితమై యలరారుచున్నవి.

వివేకానందస్వామి తన భౌతికశరీరమును జాలించెను. ఐన నేమి? స్వామిదివ్యభావములు సజీవములై నేడు యావద్భారతదేశమును బునరుజ్జీవింప జేయుచుండుట లేదా? ఆతడిట్లనేకపర్యాయములు వక్కాణించెను: "జీర్ణవస్త్రమువలె ఈ శరీరమును విడిచి యశరీరుడనై యుండుటయే మంచిదని భావింతునుగాక. కాని నాయుద్యమమునుమాత్రము విడువను. సమస్తప్రపంచము తాను భగవంతునికంటె వేఱుకాదని గ్రహించుపర్యంతము మానవులను బునరుజ్జీవింపజేసెదను." ఏమి నిర్హేతుకకటాక్షము! ఆహా! ప్రపంచమందలి సమస్తజీవులను దనతో మోక్షసౌధమునకు గొనిపోవనిదే తనకు ఆత్మశాంతి లేదనియెనే! పాఠకులారా! వివేకానందునివంటి మహనీయుం లుద్భవించిన భారతదేశమున జన్మించినందులకు మనము ధన్యులము! సనాతనధర్మసందేశము, భారతజాతీయాదర్శము, శ్రీరామకృష్ణవివేకానందప్రోక్తము నగు నాత్మమోక్ష జగత్కల్యాణములనే మనమందఱము పరమాదర్శములుగా గ్రహింతముగాక!

**జయ! శ్రీరామకృష్ణగురుమహారాజునకు జయ!**
**జయ! శ్రీవివేకానందస్వామిజీ మహారాజునకు జయ!**
**జయ! శ్రీసనాతనధర్మమునకు జయ!**

* నాటిరాత్రి చెన్ననగరమందలి శ్రీరామకృష్ణమఠమున రామకృష్ణానందస్వామి, "శశీ! శశీ! శరీరమును ఉమ్మివైచితిని!" అను స్వామి వచనములను విని నిద్రనుండి మేల్కాంచెను!

అను నాజయజయధ్వానములందు నూతనోజ్జీవితమై, ఆత్మోత్తేజకమై మ్రోగి నది భారతమాతృవాణి! ఆదివ్యవాణి యుగయుగములపర్యంతము ప్రతిధ్వనించుగాక! సనాతనధర్మ తేజము నూతనవికాసము నొందినది. సాక్షాత్ పరతత్త్వమే, పరమేశ్వరుడే, విశ్వమానవకల్యాణమునకై శ్రీరామకృష్ణవివేకానందస్వరూపమును దాల్చెను. మతధర్మముల కెల్ల తల్లి యగు సనాతనధర్మమును బునరుద్ధరింప నామహనీయు లవతరించిరి. తమ మహోద్యమము నెఱవేఱినంతనే, తమసందేశమును జనుల కొసగినంతనే, మఱల పరబ్రహ్మైక్యము నొందిరి. దేశదేశాంతరము లన్యోన్యసమావేశము నొందినవి. యుగసందేశము దశదిశలందును ప్రతిధ్వనించినది. ధర్మవ్యాప్తికై, ధర్మస్థాపనార్థమై, ప్రవర్తయుం మూలపురుషుడునై యాదివ్యపురుషు లుదయించిరి; ప్రతియుగమునం దుదయింతురు; అజ్ఞాననిద్రనుండి లోకులను మేల్కొల్పుదురు.

"ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్య వరాన్నిబోధత!" లెండు, మేల్కొనుడు; పరమపదప్రాప్తిపర్యంతము ఆగవలదు—ఇదియే శ్రీరామకృష్ణ వివేకానంద సందేశము!

హరిః ఓం తత్ సత్!

శ్రీరామకృష్ణార్పణ మస్తు.

## అనుబంధము

# శ్రీ వివేకానందస్వామి జాతకము

దుందుభినామసంవత్సర పుష్య బహుళ సప్తమీ సోమవారము (1863-వ సం॥ జనవరి 12-వ తేది) ఉదయము హస్తానక్షత్రయుక్త ధనుర్లగ్నమున ఇంచుమించుగా 6 గంటల 34 నిమిషములకు (సూర్యోదయాత్పూర్వము 6 నిమిషములకు) కలకత్తాలో స్వామి జననమొందెను.* జననకాల చంద్రమహాదశాశేషము 4 సం॥ 2 నెలల 12 దినములు.

| | | | |
|---|---|---|---|
| | కుజ | కేతు | |
| | నిరయన రాశి | | |
| రవి బుధ శుక్ర | | | |
| లగ్న | రాహు | గురు | శని చంద్ర |

| | | | |
|---|---|---|---|
| శుక్ర | బుధ | శని కుజ | చంద్ర |
| | నిరయన నవాంశము | | కేతు |
| రవి రాహు | | | |
| | లగ్న గురు | | |

* **శ్రీ రామకృష్ణపరమహంస జననకాలము :** వివేకానంద స్వామి గురుదేవుడగునీయన మన్మథనామ సం॥ ఫాల్గున శుక్ల ద్వితీయా బుధవారమున పూర్వాభద్రనక్షత్రయుక్త కుంభలగ్న శుక్రనవాంశమందు (1836-వ సం॥ ఫిబ్రవరి 18-వ తేది ఉదయము ఇంచుమించుగా గం. 5 ని. 15 లకు) వంగదేశమందలి కామార్పుకూరను గ్రామములో జన్మించెను.

| | | | |
|---|---|---|---|
| | కుజ | | కేతు |
| బుధ | సాయనరాశి | | |
| లగ్న రవి శుక్ర | | | |
| రాహు | | శని గురు చంద్ర | |

| | | కల వికల |
|---|---|---|
| లగ్నము | మకరము | 18— 0 |
| రవి | మకరము | 22— 0 |
| చంద్రుడు | తుల | 9—30 |
| బుధుడు | కుంభము | 4— 0 |
| శుక్రుడు | మకరము | 29— 0 |
| కుజుడు | మేషము | 28— 0 |
| గురుడు | తుల | 26— 0 |
| శని | తుల | 5—30 |

(అయనాంశము ఇంచుమించు 21° 57′.)

సుప్రసిద్ధపాశ్చాత్యజ్యోతిషికుడగు ఏలెన్ లియో (Alan Leo) తన జ్యోతిషగ్రంథమాలలో 11-వ గ్రంథమున 47-వ పుటలో 380-వ సంఖ్య కెదుట జూపిన వివేకానందస్వామిజాతకము ఈ జాతకచక్రములను బలపఱుచు చున్నది.

స్వామిజాతకమున లగ్నాధిపతియైన గురుడు జ్ఞానప్రదాత. ఆ గురుడు తులారాశియందును మిత్రనవాంశమందును ఉండుట మోక్షజాతకలక్షణము. కామాదిప్రవృత్తికారకుడైన కుజునియొక్కయు లగ్నాధిపతియైన గురుని యొక్కయు స్థితి స్వామి యఖండవైరాగ్యమును వెల్లడించును. విద్యాకారకుడైన బుధునకు వాక్స్థానమైన మకరమున సూర్యసంబంధమును శనిబుధులకు పరివర్తనయోగమును స్వామినిరుపమానవక్తృత్వమును దెలుపుచున్నవి. రవిబుధశుక్రులసంయోగము స్వామియద్వితీయశక్తిని, అఖండఖ్యాతిని, లోకపూజ్య

తను ప్రకటించును. గురుశుక్రులస్థితి గురుదశాశుక్రభుక్తియందు స్వామిపర ప్రఖ్యాతిని సూచించుచున్నది.

(ఇయ్యది కీర్తిశేషులగు శ్రీ కంచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే గణింపబడినది. చెన్నపట్టణమున మైలాపూరునందలి అభిరామపురనివాసులగు శ్రీ టి. వి. రాధాకృష్ణశాస్త్రి, ఎమ్. ఏ., ఎల్. ఐ. ఎమ్. గారును సుప్రసిద్ధజ్యోతిషకులగు శ్రీ నూకల కృష్ణశాస్త్రిగారికుమారులును శిష్యులును గుంటూరు ఇంపీరియల్ బ్యాంక్‌న క్యాషియర్‌ను మదీయాప్తులును అగు శ్రీ నూకల సూర్యభగవానులు, బి. కామ్. గారును మా కిందు తోడ్పడియున్నారు.)

---

ఈయన గ్రహసంయోగమును సూచించుచు అట్టియోగమున బుట్టినవ్యక్తి నూతన సంప్రదాయప్రవర్తకుడును, ధర్మజ్ఞుడును, మాననీయుండును, సదా పుణ్యకర్మనిరతుడును, మహాపురుషసంజ్ఞితుడును, నారాయణాంశ సంభవుడునై సర్వజన పూజ్యుడగుటెంతయు నిశ్చయమని భృగుసంహితలో వ్రాయబడియున్నది.

# అనుక్రమణిక

# శ్రీరామకృష్ణమఠ ప్రచురణములు.

## శ్రీ వివేకానంద ప్రవచనములు

## కర్మయోగము

గృహస్థసన్న్యాసాదర్శముల సామరస్యము, కర్మయోగరహస్యము. మున్నగువిషయము లిందు అత్యద్భుతముగా వివరింపబడియున్నవి.

మృదుమధురమై, సర్వజనసుబోధమై, మూలమున కెనయగు శ్రీ చిరంతనానందస్వామివారి యనువాదము నిజముగా శ్రీ వివేకానందస్వామి తెనుగున మాటలాడుచున్నాడా యనిపించుచుండును. ముద్రణము ముద్దు లొలుకుచున్నది.... గృహలక్ష్మి.

మూలగ్రంథ మెంత ఉచ్చమో అనువాదము అంత మేలై రాణించుచున్నది అని భారతియు ఈ గ్రంథము కర్మయోగతత్త్వమును అరటిపండొలిచినరీతిని విశదీకరించుచున్నదని ఆంధ్రపత్రికయు కర్మయోగతత్త్వమును తెలియగోరువా రీగ్రంథమును జదివితీరవలయునని త్రిలిఙ్గయు గొనియాడియున్నవి.

175 పుటలు, చక్కని పటములు. రూ. 1-0-0.

## శ్రీ వివేకానంద సందేశామృతము

## (షికాగో ఉపన్యాసములు.)

వివేకానందనామమును దిగ్దిగంతములు మాఱుమ్రోగించిన మహోపన్యాసము లివియే. శ్రీ వివేకానందజీవితగ్రంథకర్తవలన అనువదింపబడియున్నవి. ముచ్చటగు ముద్రణము. అ. 6

## ప్రబోధరత్నాకరము

ప్రాచ్యపాశ్చాత్యధర్మతత్త్వములను సమన్వయించుచు శ్రీ వివేకానందస్వామి పాశ్చాత్యశిష్యుల కొనరించిన దివ్యబోధలు. అనువాదకుడు శ్రీ చిరంతనానందస్వామి. అచ్చులోనున్నది.

## నా గురుదేవుడు

స్వామి తనగురుదేవునిగూర్చి యొసగినమహోపన్యాస మిది యొక్కటియే యనినచో ఈగ్రంథప్రాశస్త్యము ఎట్టిదో తెలియగలదు. చక్కనికూర్పు. అ. 6.

## నా యుద్యమ పద్ధతి

సంస్కరణవిధానమునుగూర్చి శ్రీవివేకానందస్వామి చెన్నపురిలో నొసగిన గంభీరోపన్యాసము. మాతృదేశభక్తులెల్లరును చదివితీరవలసినది. అ. 3

**సర్వం విష్ణుమయం జగత్ (తెలుగు)** అ. 2

శ్రీవివేకానందస్వామిసందేశము మధురగంభీరవాక్కులలో ఈక్రింది రెండుచిన్నపుస్తకములలోను ఇమిడియున్నది:

**శ్రీవివేకానంద సింహగర్జనము** అ. $\frac{1}{2}$. 12 **ప్రతులు** అ. 5
**భారతదేశ పునరుద్ధారణ** అ. $\frac{1}{2}$. " "

## శ్రీ వివేకానందస్వామి యతిగీతము

మహాకవి శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారిచే అనువదింపబడినది. అ. 1

## శ్రీరామకృష్ణ బోధామృతము

(శ్రీ రామకృష్ణ వాక్యావళి) సంగ్రహ జీవితసహితము
పరిశోధితమగు 1121 మహోపదేశములతో విరాజిల్లుచున్నది.

...ఇందు సుమారు 80 నీతికథారత్నములు కలవు.... ముఖ్యమగు తావులందు వేదశాస్త్రప్రమాణవచనములు క్రోడీకరింపబడి గ్రంథప్రాశస్త్యమును ద్విగుణీకృతమొనర్చుచున్నవి. ముద్రణము ముద్దులొలుకుచున్నది.

—కృష్ణాపత్రిక.

...శ్రీమాధవచైతన్యబ్రహ్మచారిగారిట్టిగ్రంథముల యాంధ్రీకరణమున సిద్ధహస్తులు.... —త్రిలిఙ్గ.

శ్రీరామకృష్ణపరమహంస కత్తిఅంచులాగా తీక్ష్ణమై, దుర్గమమైన విషయాలను ఎంత ద్రాక్షాపాకంలో చెప్పారో, శ్రీమాధవచైతన్యబ్రహ్మచారులూ (శ్రీచిరంతనానందస్వామి) అంత సులభసుందరమైన ద్రాక్షాపాకంలో తెలివిడి చేశారు. —ఆంధ్రపత్రిక.

...శ్రీరామకృష్ణునియుపదేశములను జదువునప్పుడు పాఠకునికి అనివార్యమగు చిత్తసంస్కారము గలుగుచుండును....—**గాంధిమహాత్ముడు.**

మూడవకూర్పు త్వరలో వెలువడుచున్నది.

## గురూపదేశములు

### (శ్రీరామకృష్ణుని ఉపదేశరత్నములు)

శ్రీరామకృష్ణునిమానసపుత్రు డనబఱగిన శ్రీ శ్రీ బ్రహ్మానందస్వామిచే గూర్పబడి శ్రీ చిరంతనానందస్వామిచే అనువదింపబడినవి. పాకెట్ సైజు, ముచ్చటగు ముద్రణము, నాల్గవకూర్పు, 175 పుటలు. అ. 8

శ్రీరామకృష్ణపరమహంస నీతికథా రత్నములు అ. 3

శ్రీరామకృష్ణపరమహంస జీవితోపదేశ సంగ్రహము అ. 4

ముక్తిమార్గము అ. 2

## శ్రీ మ ద్భ గ వ ద్గీ త

నిత్యపారాయణకు ఉపయోగపడునట్లు పేజీకి రెండుచొప్పున శ్లోకములు పెద్ద బొద్దు అక్షరములలో ముద్రింపబడినవి. శ్రీశంకరభాష్యానుసారము సరళమగు ప్రతిపదార్థము. శ్రీధరస్వామివారి టీకాసారముతో గూడిన వచనానువాదము, అవసరమైన తావులందెల్ల బహుశాస్త్రగ్రంథములనుండి యేర్చి కూర్పబడిన విశేషాంశములతో గూడిన పాదటీకలు (Foot Notes) వేదశాస్త్రాదిప్రమాణములను గ్రంథప్రాశస్త్యము నినుమడించుచున్నవి. మఱియు 'గీతాతత్త్వము' అను విపులమైనపీఠిక, గీతలకు సంబంధించిన వేదాంతసూత్రసూచిక, ఉపనిషద్వాక్యసూచికయు జేర్పబడినవి. ఇవిగాక, సానువాదములగు గీతామాహాత్మ్యపాఠవిధులును, టీకాతాత్పర్యసహితమగు గీతాధ్యానమును, విశదమగు విషయసూచిక, శబ్దానుక్రమణికలును అనుబంధింపబడినవి.

గీతారహస్యము దీనివలన ఎల్లరకును కరతలామలకము కాగలదని మా ఆశయము. ముఖపత్రము శ్రీకృష్ణుని దివ్యచిత్రముతో విరాజిల్లుచున్నది.

500 పుటలు, చక్కని అట్టబైండు. రూ. 2-8-0

## శ్రీ నాగమహాశయుని జీవితచరిత్ర

శ్రీరామకృష్ణుని గృహస్థశిష్యులలో ఉత్తమగణ్యుడగు మహనీయుని చరిత్రము. అ. 12

## శ్రీశారదాదేవి చరిత్ర

### (చిరంతనానంద విరచితము)

శ్రీరామకృష్ణుని సహధర్మచారిణియు ఆదర్శసతి, ఆదర్శసన్న్యాసిని ఆదర్శమాతయునగు మహనీయురాలి సమగ్రజీవితచరిత్ర.

సరిగా మీవివేకానందజీవితచరిత్రవలెనే మీశారదాదేవి చరిత్రయు ఎంతయో చక్కగానున్నది. అదే రచనాప్రావీణ్యము, అదే విషయప్రాశస్త్యము.

(సం.) కట్టమంచి రామలింగారెడ్డి.

...అర్థమునేకాక భాషనుగూడ మీయీరచన అమృతధారా వాహిని....మీగ్రంథము వాఙ్మయమున చిరస్థాయి!

(సం.) వేటూరి ప్రభాకరశాస్త్రి.

...శ్రీశారదామాతవంటి సహధర్మిణీతిలకముల చరిత్రకు శ్రీచిరంతనానందస్వామివంటి రచయితలు లభించుట సువర్ణసౌరభసంయోగము....

(సం.) రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ.

...శ్రీశారదాదేవిచరిత్రము ఒక్కగుక్కలో చదివితిని.

(సం.) వేలూరి శివరామశాస్త్రి.

...జీవితచరిత్రలు వ్రాయుటలో ఈగ్రంథకర్తది సిద్ధహస్తమని శ్రీశారదాదేవిచరిత్ర చాటుతూవుంది. —ప్రజాబంధు.

...అమృతకలశము...పాలవంటిశైలి.... —ఆంధ్రప్రభ.

256 పుటలు, చక్కనికూర్పు. రూ. 1-14-0

ఇవిగాక శ్రీరామకృష్ణ శారదాదేవి వివేకానందాదుల చిత్రపటములును, ఆంధ్ర, ఆంగ్ల, తమిళ, కన్నడ భాషలలో అనేక వేదాంతగ్రంథములును గలవు. పోస్టుఖర్చులు ప్రత్యేకము. కేటలాగులు ఉచితము. ఈక్రింది అడ్రసుకు వ్రాయుడు:

**మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు.**